# కొత్త కథ

(డైరెక్ట్ కథల మొదటి సంపుటి)

సంకలనకర్త

**వేదగిరి రాంబాబు**

శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్
1-8-59/1/7 చిక్కడపల్లి,
హైదరాబాద్ - 500 020.
ఫోన్ : 6 6 7 6 6 5

# KOTTA KATHA

First Volume

Compiled by

**VEDAGIRI RAMBABU**





First Edition :

November 1994

Cover Page :

**BAPU**



Price :

**Rs. 50/-**

Cover Page Printing :

**PLANOGRAPHERS**

Chirag Ali lane,

Hyderabad.

Inside Pages Printing :

**Padmavathi Art Printers,**

1-1-517/B/1, New Bakaram,

Gandhi Nagar,

Hyderabad - 500 380.

Phones : 611413, 600547.

# కథాంజలి



ప్రముఖ రచయిత, గౌరవనీయులు
**కాళీపట్నం రామారావు** మాస్టారు గారికి
డెబ్బయ్యొకటవ జన్మదిన సందర్భంగా
ఈ 'కొత్త కథ'ల పుస్తకం ప్రేమతో అంకితం

**వేదగిరి రాంబాబు**
**9-11-94**

# ముందుగా మూడు ముక్కలు

కథకులు అతి తరచుగా కలుసుకుంటూ కాసేపయినా కథ గురించి చ్చటించుకుంటే తెలుగు కథకి తప్పక కొంతైనా మేలు జరుగుతుందనే శతో కథా సదస్సుల్ని రాష్ట్రంలో అనేక ప్రాంతాల్లో నిర్వహించాం. ఈ యజ్ఞ ర్వహణలో శ్రీయుతులు విహారి, రచన 'శాయి', సాధన 'నరసింహాచారి' ంతగానో సహకరించారు; సహకరిస్తున్నారు.

కథా సదస్సుల నిర్వహణతోపాటు కథకుల చేత కొన్ని కథల్ని యించి డైరెక్ట్ కథా సంపుటాల్ని ప్రతీ మూడు నెలలకు ఒకదానిని తీసుకొస్తే వుంటుందనిపించింది. రాసీ రాసీ ఇప్పుడు రాయక మిన్నకున్న భాస్కరుల్ని, స్తున్న కథకుల్ని, మంచి కథలు రాయాలని ప్రయత్నిస్తున్న కొత్త కథకుల్ని- ందర్నీ కథలు రాయమని కోరాం. కొత్త కథల సంపుటాల పరంపరలో ఇది దటిది. మరికొన్ని త్వరలో రాబోతున్నాయి....

ఎంత బిజీగా వున్నా కోరగానే కవర్ పేజీని గీసివ్వడమేకాకుండా తమ భాకాంక్షల్ని పంపి ఆశీర్వదించిన గౌరవనీయులు బాపుగారికి, అడగగానే త్త కథని రాసి పంపిన రచయిత(త్రు)లకు, ఈ కొత్త కథని ఆవిష్కరిస్తున్న సపాటి కృష్ణంరాజు గారికి, స్వీకరిస్తున్న కథల మాస్టారు కాళీపట్నం రామా వుగారికి, ఈ సంపుటం తీసుకురావడానికి సహకరించిన శర్మాజీ, బ్నింలాంటి త్రులకు, హైదరాబాద్ ఆకాశవాణి ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్ చలపతిరావు గారికి, న్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ శ్రీనివాస్ గారికి, చదువుతున్న మీ అందరికీ తజ్ఞతలు తెలుపుకుంటూ శలవు తీసుకుంటున్నాను.

మీ

వేదగిరి రాంబాబు

14-10-94

# ఈ సంపుటిలోని


| కొత్త కథలు | పాత కథకులు | | పేజీలు |
|---|---|---|---|
| 1. నది | - పురాణం సుబ్రహ్మణ్య శర్మ | .... | 7 |
| 2. ఆటకట్టు | - వీరాజీ | .... | 14 |
| 3. చెప్పుల జత | - పెద్దిభొట్ల సుబ్బరామయ్య | ... | 23 |
| 4. కోరిక | - ఇచ్ఛాపురపు జగన్నాథరావు | ... | 31 |
| 5. గెలుపూ - ఓటమీ | - పోలాప్రగడ సత్యనారాయణమూర్తి | .... | 48 |
| 6. దీపం కొడిగట్టింది | - ఘండికోట బ్రహ్మాజీరావు | .... | 55 |
| 7. బహు బహు బహుమతి ప్రధానము | - స్వామి చిత్రానంద | .... | 61 |
| 8. బండబారిన గుండె | - సత్యవోలు సుందరసాయి | .... | 73 |
| 9. ఒక కోరిక - ఒకే తీర్పు | - శ్రీసుభా | .... | 83 |
| 10. పెళ్ళి ఆపి చూడు | - తమిటిపాటి రామగోపాలం | .... | 96 |
| 11. చుక్కలముడి | - పి. ఎస్. నారాయణ | .... | 106 |
| 12. యోగి | - వై. రాంబాబు & శాయి | .... | 120 |
| 13. జోషికాదు ఋషి | - అరిగే రామారావు | .... | 129 |
| 14. మనిషి - మమత | - పవని నిర్మల ప్రభావతి | .... | 142 |
| 15. చితికిన కల | - శీలా సుభద్రాదేవి | .... | 149 |
| 16. జారిన మల్లెలు | - శారదా అశోకవర్ధన్ | .... | 155 |
| 17. ఓ మంచి మనిషి కథ | - రాజ్యలక్ష్మి పోలాప్రగడ | .... | 165 |
| 18. గుడ్‌బై టు మెర్విన్ | - కె. ఆర్. కె. మోహన్ | .... | 171 |
| 19. గుమస్తాగారి కోపం | - నవులూరి వెంకటేశ్వరరావు | .... | 183 |
| 20. అనివార్యం | - విహారి | .... | 191 |

| | | | |
|---|---|---|---|
| 21. | విడియో ఫాషన్ | - బీనాదేవి | .... 200 |
| 22. | చెత్తకుండీ | - రావులపాటి సీతారాంరావు | .... 209 |
| 23. | కేసు | - శ్రీరాగి | .... 215 |
| 24. | తిరుగబడిన యువతి | - కె. పి. బాబు | .... 227 |
| 25. | చేనేత చిత్రం | - మునిపల్లెరాజు | .... 236 |
| 26. | పాటకు తగిన రోలు | - రావూరి భరద్వాజ | .... 243 |
| 27. | అ - భయం | - వాకాటి పాండురంగారావు | .... 246 |
| 28. | తను - అతను | - మంజుశ్రీ | .... 269 |
| 29. | అమ్మ | - పోతుకూచి సాంబశివరావు | .... 266 |


* మరిన్ని కథలు వచ్చే 'కొత్త కథ'ల సంపుటిలో

# నబీ

—పురాణం సుబ్రహ్మణ్యశర్మ

'నబీనబయ్యా నబీనబయ్యా' - అదొక దేవు చేసిన ప్రార్థన గీతం. కవాలీలా వుంటుంది. లేకపోతే రెండర్థాల ఏదో సరదా సినిమా తెలుగు పాట. ఆ వెంటనే రామదాసు కీర్తనో మరోటో.... మరోటో....

ఎదురుగుండా అనేక అంతస్తుల మహాభవనం ఆకాశంలోకి లేచిపోతోంది. కూలీల ఘర్మజలానికి ధర్మజలానికి ఖరీదుకట్టే షరాబు లేడోయ్!

ఈ ప్రపంచంలో కూలీలు మిద్దెలు మేడలు మహాభవనాల దగ్గర వేసుకున్న చిన్న చిన్న పాకల్లో వుంటూ, ఇంకా దరిద్రంలోకి దిగజారిపోతూ సరైన తిండి బట్టా - జీవితానికి భద్రత లేక (అమెరికా ప్రెసిడెంటుకే లేదు భద్రత) అణగారిపోతూ వుంటారు. వారి కూలి డబ్బుల్లో వాటాకి పెద్ద పెద్ద సాతాకాంట్రాక్టర్లూ, అదుకునే కాబూలీవాలాలూ, వడ్డీలకు అప్పులిచ్చే షావుకార్లూ, ఆ కూలి డబ్బుల మీద బతికే పెద్ద పెద్ద సినిమా హీరోలూ - కారుల్లో, విమానాల్లో, రైళ్ళలో, షోగ్గా తిరుగుతూనే వుంటారు. ఆ కూలివాడి ఓటు కోసం కులాల వారీ బడానాయకులు కుమ్ములాడుకుంటూ వుంటారు.

నబీ కొట్టు ముందు ఓ చిన్న పందిరి, నాలుగు బల్లలు, సపోర్టుగా రాళ్లూ, నీళ్ళకుండీ, రెండు బాల్చీలు, టీకప్పులు, సాసర్లూ, చింతామణి నాటకంలో సుబ్బిశెట్టికాబోలు వేశ్యమాతను అడుగుతాడు మీ యింట్లో కప్పులులేవా అని వెకిలిగా. వెకిలితనం వ్యాపారాల్లో వుంటుంది. వెకిలిగా సంపాదించి వెకిలిగా కర్చు పెట్టే వ్యవస్థ మనది అని కాళ్ళకూరి నారాయణరావు గారు సుబ్బిశెట్టి చేత చెప్పించారు.

నబీకొట్టు చిన్న డబ్బారేకులది. దానికి సరైన తాళాలూ తలుపులూ లేవు. ఆస్పత్రి నైట్‌వాచ్‌మేన్‌లే నబీ కొట్టుకి కూడా కావలా. ఆశ్చర్యం అంత ఓపెన్‌గా వున్నా నబీ కొట్లో దొంగతనం జరగదు. సమాజంలో దొంగలున్నారంటే దోచుకోబడే ఆస్తులు డబ్బు కూడా ఎక్కడో వున్నాయన్నమాట. సీక్రెటు!

కిళ్లీకొట్టు ఆంధ్రదేశానికి గర్వించదగ్గ సింబల్. రాజూ - మహిషి అనే నవలలో రావిశాస్త్రిగారు వర్ణించిన విశాఖపట్నం కిళ్లీకొట్టు వర్ణన చదువుము. మృచ్ఛకటికం పూర్వజన్మలో రావిశాస్త్రిగారు రాశారేమో!

ఆంధ్రదేశంలో ఆడవాళ్ళు గుమ్మాల్లో కూర్చుని కుదుమట్టంగా చక్కగా మధ్యాహ్నాలు, సాయంత్రాలు సోడాలు తాగుతారు. తెలుగువాడు సోడాబుడ్డిని తన సింబల్‌గా ఎన్నికలలో ఎందుకు వాడుకోలేదో?

నబీ దుకాణం బడ్డీకొట్టేగాని ఆంధ్రదేశంలో కిళ్లీ దుకాణం వంటిదికాదు. అతను దుకాణాన్ని స్థాపించిన ప్రదేశం అంతా రాళ్ళసీమ. నివాసయోగ్యమైన భవనాలు కట్టడానికి చదును చేయవలసిన వర్జిన్ సాయిల్. ఎర్రమన్ను విస్తారం. పిచ్చి మొక్కలు. అనవసరపు గడ్డి.

తిరిపెమున కిద్దరాండ్రా,పరమేశా గంగవిడుము పార్వతిచాలున్ అన్నాడు శ్రీనాథుడు. ఇక్కడ గంగలేదు. ఈ రాళ్ళసీమలో నబీ బడ్డీ దుకాణం, టీకొట్టు జనానికి (పాంథులకు, పనివారికి) ఎండలో చలివేంద్రంలాటిది. ఇక్కడ ఏదీ మంచినీళ్ళప్రాయం అనడానికి వీల్లేదు. ఈ హైదరాబాదులో మంచీలేదు, నీళ్లూ లేవు. తల్వారులు, చురకత్తుల సంస్కృతి, గూండాయిజం నిండా వున్నది. గూండాలుకూడా పొడుచుకుంటే దెబ్బలు తగిలితే ఎంతవారైనా ఆస్పత్రికి రావల్సిందే, వస్తారు. ఆస్పత్రుల్లో గూండాల్ని జాగ్రత్తగా చూడాలి.

నబీ బడ్డీకొట్టు దగ్గర ముఖం కడుక్కోడానికి, కాళ్ళు కడుక్కోడానికి, పుక్కిలి జిమ్మటానికి, ఆ తరవాత ఏదో టీ తాగి ఓ సిగరెట్టు ముట్టించడానికి ఏర్పాట్లున్నాయి. వేయిపడగలు నవలలో విశ్వనాథవారి పాత్ర ధర్మారావుకి రూపాయి రెండూ అప్పిస్తూ వుంటాడు ఓ కిళ్లీకొట్టువాడు. అలాటి పాత్ర నబీ.

నబీ తన కొట్టు ముందర జాగా తనే వూడ్చుకుని కళ్ళాపు జల్లి శుభ్రం చేసుకుంటాడు. ఓకొత్త టార్పాలిన్‌కొని బడ్డీ దుకాణాన్నికప్పుతాడు. ఆ చోటు ఎల్లాటిదంటే ఉదయం, సాయంత్రం, మధ్యాహ్నం ఎప్పుడూ ఎండ రాధ.

అంత మంచివాడన్నమాట నబీ. అతను అందరికీ తలలోనాలుక. ఆ కట్టడం భవన నిర్మాణం సాగుతున్నపుడు కూలీలంతా యిక్కడే టీ తాగి ఏదో కాస్త నాస్తాచేసి మళ్ళీ పనుల్లోకి పోతూ వుండేవారు. అంతా నబీకి పరిచయస్తులే. 'నబీనభయ్యా-నబీనభయ్యా' మోగుతూనే వుంటుంది. గ్రాహకులకు టీతోబాటు ఆధ్యాత్మిక సంగీతం కూడా అందివ్వాలన్న వ్యాపార రహస్యం నబీకి తెలుసు. నిర్మాణంలో వున్న పనివారికి నబీ కొట్టు ఆశ్రయం, చల్లనినీడ.

నబీ ఉర్దూ, హిందీ, తెలుగు, మరాఠీ అన్నీ మాట్లాడుతాడు. వచ్చగా, ఓ మాదిరి వెన్నెలలా మెరుస్తాడు. ఆ మెరుపు స్వతహాగా వ్యక్తిలోని మంచితనం వల్ల వచ్చినది. కొంతమందికి చిన చిన్న అప్పులిస్తూ వుంటాడు, అతను నవ్వితే ఎవరో దేవుని స్నేహితుడు మన క్షేమం కోరి నవ్వినట్లేవుంటుంది. అతను ఠంచనుగా ఏడు గంటలకు కొట్టు మూసేస్తాడు. ఆదివారాలు తెరవడు. అంతా గవర్మెంటు పద్ధతులు.

అతనికి సహజంగా హైదరాబాద్‌లో అందరికిమల్లే యిద్దరు భార్యలు. వాళ్ళు పరదాలో వుంటారు. ఎప్పుడూ యీ బడ్డీవైపుకి రానేరారు. జీవన విధానానికీ, వ్యాపారానికీ లింకు పెట్టుకోలేదు. అతను టీ బడ్డీ వ్యాపారాన్ని 'సెక్యులర్'గానే నడుపుతున్నాడు.

అతని కళ్ళ ముందు ఆ కాలనీ బ్రహ్మాండంగా లేచింది. తాటిచెట్టు కింద పాలుతాగే వాడిలా అతను అలాగే వున్నాడు. అక్కడ కడుతున్న ఆస్పత్రి కూడా లేచింది. ఎలా లేచిందంటే, వామనుడి మూడో పాదంలా లేచింది. అంత భవనాన్ని మేస్త్రీలు, కూలీలు, ఇంజనీర్లూ కట్టారు. హైదరాబాదుకి మీసంలాటి ఆసుపత్రి.

అక్కడ కాల్లో ముల్లు గుచ్చుకుందంటే పది ఎక్సురేలు, బ్లడ్ టెస్టులు' గుండె పరీక్ష అన్నీ చూసి ఓ పదివేలు సుమారుగా బిల్లు చేస్తారు. అన్నిటికీ అక్కడ మందు ఉన్నాయి గాని, ధనదాహానికి వైద్యం లేదు. ఒక రోగి తను బాధితుడినని ఫీలవకుండా ఒక నిత్య భోగిలా చూడబడతాడు. భిషగ్ రత్నాలు రత్నాలు తీసుకునే వైద్యం చేస్తారు. కూలీలు మాత్రం రాళ్ళతోనే భవనాలు నిర్మిస్తారు. అదీ తేడా.

ఆ బృహత్తర భవన నిర్మాణ కార్యక్రమంలో 'నబీ' కూడా నేను సైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను, చూడండి, యీ ఒక పనికని సమిధలు ఆహుతి అంటూ బ్రామిన్ కల్చర్ని విషంలా నరనరాల్లోకి ఎక్కిస్తున్నాడు! నబీ కార్మికులకి టీ పోశాడు. నబీ దగ్గర అరువులు పెట్టేవాళ్ళు, ఇస్తే యిస్తారు, ఎగేస్తే ఎగేస్తారు. 'సిరిదా వచ్చిన వచ్చును సలలితముగ నారికేళ సలిలము భంగిన్' పోయినప్పుడు కరిమింగిన వెలగపండులా పోతుందట. ఈ మధ్యన కొందరు శాస్త్రజ్ఞులు అసలు ఏనుగు ఎలగపండు తినదనీ, తిన్నా లోపల గుజ్జు మాయం కాదనీ పరిశోధనలు చేసి, సుమతీ శతకం వాడికి సైన్స్ రాదని తేల్చారట. ఇప్పటివాళ్ళు వెనకవాళ్ళు శుద్ధ చవటలనీ వారికి ఏమీ రాదనీ తేల్చడానికి రిసర్చి దిబ్బా దిరుగుండం వాళ్ళ బొందా చేస్తూవుంటారు.

ఆస్పత్రి కుతుబ్‌మీనర్‌లా పైకి లేచాక, దానికి గేట్లూ, వాచ్‌మన్‌లూ, కాపలా పోలీసులూ, మందీ మార్బలమూ పెరిగిపోయి 'నబీ బడ్డీ దుకాణం' గుమ్మం వద్ద ఒక న్యూసెన్సులా, రాణీగారి పట్టుచీర మీద బల్లి మూత్రం పోసినట్లుగా అయింది. మేడ కట్టాక కూలీవాళ్ళ గుడిసెలు 'న్యూసెన్సు'లాగా కనిపించినట్లు అయింది. అవస్థా భేదం. రామ! రామ!

నబీ జీవనధారం ఆ బడ్డీకొట్టే. ఎక్కడైనా కొట్టుగాని పొట్టమీద కొట్టగూడదని మన వాళ్ళకో రూలుంది. ఈ ఆధునిక యుగంలో అటువంటి వాటికి అట్టే ఖాతరీలేదు, ఇంగ్లీషు వాళ్ళ స్కూళ్ళలో తెలుగుకు అట్టే ఖాతిరీలేదని గిరీశం అన్నట్లు. ఆ ఆసుపత్రి పెద్ద డాక్టరుగారు వైద్యం తక్కువా బిజినెస్సు ఎక్కువా చేస్తారు. మన దేశంలో అంతా అంతే. చిన్నప్పుడు శాస్త్రజ్ఞులుగా అఖండ ప్రతిభ కనబరిచి పెద్దయాక గుమాస్తాలవుతారు. ఆసుపత్రుల్లో పెద్ద పెద్ద డాక్టర్లంతా పరిపాలనా వ్యవహారాలు ఎక్కువ, వైద్యం తక్కువ చేస్తారు. ఇంకా వైద్యం చేయడం నామర్దా.

'నబీ' యింకా టీ కొట్టువాడుగా టీ అమ్ముతూ బాల్చీలతో నీళ్ళు మోస్తూ తనే వూడుచుకుంటూ, కడుక్కుంటూ తాపత్రయపడుతున్నాడు. నబీనభయ్యా రికార్డు దేవు యింకా అరగలేదు. అతని బడ్డీకొట్టులో సిగరెట్లు అమ్ముతారు కాని అది పాక దుకాణం కాదు. ఇదివరకు ఓసారి ఇడ్లీల్లు, ఉప్మా లాంటివి ప్రవేశ పెట్టడానికి కొంత తాపత్రయపడ్డాడు కాని, నబీ కొట్లో అవి అమ్ముడుపోలేదు,

సినిమా హాల్లో సంధ్యావందనం పనికిరానట్లు. ఆ వ్యాపారాన్ని పెంచడానికి వనికి రాదు. అంటే నబీ ధనలక్ష్మి టీ కప్పులో కూరుకుపోయి వుంది.

కృష్ణా జిల్లానుంచి పెళ్ళాం చనిపోయి విధురుడులా జీవితం గడుపుతున్న ఓ ముసలాయన అక్కడకు వచ్చి ఒక రేకుల షెడ్డు వేశాడు. పిండి రుబ్బడం, ఇడ్లీలు వడలు వెయ్యడం. ఆ ఆసామీ కొడుకు ఎర్రగా బుర్రగా సినిమా హీరోలా ఐ. ఏ. ఎస్. ఆఫీసరులా న్యూస్‌పేపరు ఎడిటర్‌కి చదువురాని బావ మరిదిలా వుంటాడు. చదువుకున్నవాళ్ళు జిడ్డోడుతూను చదువురానివాళ్ళు నవ మన్మథుల్లానూ మన దేశంలో వుంటారు. అందమైన వస్తువు ఆనంద మందిరంబు అన్నాడు షెల్లీ.

అందంగా వుండటానికీ జ్ఞానానికీ సంబంధం లేనట్లే, డబ్బు సంపాదించే తత్వానికీ ఉద్యోగంకీ ఏమీ సంబంధం లేదు. ఆ పెళ్ళాం చనిపోయిన ముస లాయన నబీకి పోటీగా ఒక షాపు అమెరికాలో యీటింగ్ ప్లేసు అంటారు- అలాటిది తెరిచాడు. వెర్రివానికి దేనిమీదో లోకం అన్నట్లు ముసలాడికి పెళ్ళాం చనిపోయాక డబ్బు యావ లావయింది. డబ్బున్న వాళ్ళని అంతా తిడతారుగాని ఎంత కష్టపడితే డబ్బు వస్తుంది? కొందరు భార్య వియోగాన్ని భక్తివైపూ ఆధ్యాత్మికం వైపు మళ్ళిస్తే యీాయన ధనసముపార్జన వైపు తన మనోవాక్కాయ కర్మల్ను మళ్ళించాడు.

ఆయన తెల్లారకుండా యింట్లోనే ఒకటి రెండు వాయల పిండి రుబ్బించి పొద్దునే వడివడిగా యిడ్డెన్లు వేసి ఆసుపత్రి రోగుల కోసం వచ్చేవారికి సప్లయి చేస్తాడు. సేవాధర్మం మీద ముసిలాయనకు గురి వుంది. ఆయన కేన్టీనులో ఫల హారాలు డాక్టర్లకి ఆసుపత్రి సిబ్బందికీ సప్లయి చేసి చాలా 'గుడ్‌విల్' సంపా దించాడు.

ఈ దేశంలో ఎంత అవిద్య వుందో అంతకుమించిన అజ్ఞానం వుంది. ప్రభుత్వం అక్షరాస్యతను కలిగించి అవిద్యను పోగొట్టాలని చూస్తోంది కాని ప్రజల అజ్ఞానాన్ని తొలగించాలని చూడడం లేదు. అజ్ఞానం తొలగిస్తే వాళ్ళు అధికారంలో వుండరు. అదీ కిటుకు. రోగంతో రొష్టులతో బాధలతో అనేకమంది మన పల్లెటూళ్ళనుండి పెద్దాసుపత్రి నరకానికి వైద్యానికి వస్తారు. యముని అసిస్టెంట్లు ఆసుపత్రి డాక్టర్లు. ఆ పల్లెటూరివాళ్ళు (రైతులు) మన కృష్ణాజిల్లా

షావుకారి కొట్లో యిడ్లీలు వగైరా తిని తమ కష్టసుఖాలు చెప్పుకుంటారు అప్పుడు కేన్‌టీన్ ప్రాబల్యంతో డాక్టర్లను తెలిసిన ముసలాయన తన పలుకు బడిని వినియోగించి యీ రోగులను ఆ డాక్టర్ల దగ్గర చేర్చి, వారితో మాట్లాడి పన్లు జరిపిస్తాడు. ఇదంతా కమీషన్ల వ్యాపారం, పుణ్యంకోసం కాదు.

కృష్ణాజిల్లావారికి కొందరికి లాండ్ గ్రాబింగ్ మీద సరదా హెచ్చు. ఈ ముసలాయన, ఈయన కొడుకు, యీయన అల్లుడు- వీరంతా ఒక ముఠా. ఆ అల్లుడే మామచేత యీ బిజినెస్సు చేయిస్తున్నాడని ఓ పుకారు. డబ్బు వచ్చే దారిలో నిలబడితే తప్పేవిటి అంటారు. స్థలాలు మీద నష్టాలు పోగేశారు. శాస్త్రి గారు అన్నట్లు డబ్బుతల్లికి జాతిభేదం లేదు.

ఉపకారాలు చేసినపుడు పెద్దవాళ్ళు రంగంలోకి దిగి ఆ కీర్తిని కాస్తా పట్టుకు పోతారు. చిన్న చిన్న దుష్ట ప్రయత్నాలను క్రింది ఉద్యోగులచేత చేయిస్తారు. అలాటి వాళ్ళని ముద్దుగా పి. ఆర్. వో. లంటారు.

గుమ్మం అంటే కార్లు వచ్చిపోయే గేటు ద్వారం వద్ద ఓ నబీ సీ టీ కొట్టు దిష్టిబొమ్మలా వుంది. అది అక్కడ్నుంచి తీసెయ్యమని గురువాజ్ఞ అని చెప్పాడు. తక్కువ తరగతి మనుష్యులకు సదుపాయంగా వుండేవన్నీ తొలగిస్తే ధనవంతుల సామ్రాజ్యం సుస్థాపితమవుతుంది. కాబోయే శ్రీమంతుడు శ్రీమంతుడి బూట్లు నాకుతాడు. ముసలివాడి షాపునిండా ధనవంతుల పిల్లలకు కావలసిన చాక్లెట్లు బొమ్మ బిస్కట్లతో యింకా రకరకాల ఖరీదైన అనేక వస్తువులతో ధన లక్ష్మి సాగరంలా వుంటుంది. బీద పిల్లవాడు ఒక రూపాయి పుచ్చుకు అక్కడికి వెళ్తే పో పొమ్మంటాడు. చిల్లర శివాలక్ష్మి అని ఎవడో అన్నాడు కాని, చిల్ల రకు ముసలాయన షాపులో చాకిలెట్ తినిపారేసిన పేపరు కూడా దొరకదు.

నబీ కొట్టుదగ్గర ఓ పళ్ళ దుకాణం వాడు కమలాలు, బత్తాయిలు, అరటి పళ్ళు అమ్మే షాపును తెరవడానికి ప్రయత్నం చేసి, కొంచెం దూరంగా తన సరంజామాను ఏర్పాటు చేసుకున్నాడు. అక్కడ పళ్లు కొనేవాళ్లలేక ఆ కొట్టు వాడే నలుచుకుని తినడం ఆరంభించాడు ఎండవేళలో. పండ్లు ఎవరైనా తినవచ్చు రోగులే కాదు.

ఒక డాక్టరుగారు ఆ అరటి తొక్క మీదవేసి కాలుజారిపడ్డాడు. అతడు పి.ఆర్. ఓ ను పిలిపించి ఈ దుకాణాలన్నీ తీయించి వేయనున్నాడు అర్జంటుగా. బీదవాళ్ళంటే ఆ డాక్టరుకి పెద్దకోపం.

నబీ దుకాణాన్ని పీకేసుకుని దూరంగా గేటు దర్వాజు లోపం రానివిధంగా కష్టమర్సు ఎవరు రానిచోట వేసుకున్నాడు. అక్కడ్నుంచి నబీనబియ్యా రికార్డు వేసినా ఎవ్వరూ రావటం లేదు. అన్నట్లు ఆసుపత్రిలో కాన్‌టీన్ తెరిచారు. అక్కడ కాఫీ అయిదు రూపాయలు. నబీ కొట్లో రూపాయి. ముసలాయన పట్టుబట్టి ఆసుపత్రి కాంటీన్‌ను దివాలా తీయించాడు.

ఓ రోజు ముఖ్యమంత్రిగారు ఆస్పత్రిలో ఒక ముఖ్యమైన రోగిని చూడ్డానికి ఆసుపత్రికి వస్తున్నారు. వారి మార్గంలో వున్న 'నబీ' అనే చిన్నవాడి దుకాణాన్ని బందోబస్తు పోలీసులు గాల్లోకి లేపేసి అన్నీపీకి దక్షయజ్ఞంలా చేశారు. పోలీసులకి ఆడపిల్లల్ని బాధించే తుంటరులను పట్టుకోడానికి గాని, రైళ్ళలో, గుంపులు గుంపులుగా బస్సులలో తిరిగే జులాయి పురుషుల్ని మందలించడానికి కాని టైము వుండదు. ఈ నూటొక్క తొంభై తొమ్మిది మంది మంత్రులకు బందోబస్తుతోనే పోలీసు యంత్రాంగం సమసిపోతున్నది. ఇక సామాన్య ప్రజల కష్టసుఖాలు చూడ్డానికి పోలీసువారికి తీరిక లేదు. బందోబస్తు డ్యూటీలో నబీ టీ దుకాణం లేచిపోయింది.

బీదవాళ్ళచేత బీదవాళ్ళ కన్ను పొడవడం అంటే యిదే. నబీ చిందర వందర చేసిన దుకాణపు సామాగ్రిని జాగ్రత్తగా ఏరుకుంటున్నాడు. *

# ఆటుకట్టు

—వీరాజీ

గెడ్డం మాసింది.

వార్తాపత్రికలతోబాటు ఓ వారపత్రిక కూడా అర్జెంటుగా కొనుక్కొని వస్తున్నాను. వార్తలు, వారపత్రికలలో పచ్చళ్ళు, కూరలూ, శీర్షికలతోసహా బొమ్మలూ, ప్రకటనలూ చదివేయడం....'కాఫీ కఫే'లు-అవీ తప్పితే సినీమాలు. వీటితో ఆత్మీయత, యీ మధ్య చక్రవడ్డీలాగా పెరిగిపోయింది. ఇటీవల దైనందిన కార్యక్రమం తృప్తినివ్వదు గాని మహా అర్జంటుగా దాన్ని నెరవేర్చుకోడంలోనే ఉంది అంత శ్రద్ధా. సమాధానం రాని అప్లికేషన్‌మీద ఆశా, అక్కర్లేని సినీమా చూసి సంతోషపడ్డంలో గొప్పా అలవాటైపోయింది.

విద్యార్థి నిష్క్రమించి ఉద్యోగి ప్రవేశించలేదు ఎదనింకా. అయినా యింత వెలితి ఎందుకనో....

పాఠాలు వెళ్ళిపోయాయి. పరీక్షలు ఏడాదికి మూడు మార్లు. అదో మాదిరి మలేరియాలా దాపురించేవి యికరావు. గతానేక సంఘటనల్లో కలిసిపోయాయి. అయితే వెలితి మిగిలింది. ఎందుకు చెప్మా! సిలబస్‌లనేవే పరిమితంగా ఉంటాయి! అందులోనించి కాంపోజిషనులు రాసుకుని అనక వాటినే ఇంపోజిషను రాసుకుని పరీక్ష రాసేసి (పారేస్తే) అమ్మయ్య అనుకుంటాం. మూడోవంతు మార్కులకోసం మనమూ, అవి యిద్దామనే వాళ్ళూ తాపత్రయ పడతారు. ఈ మూడోవంతు వ్యవహారం అతిరహస్యమేం కాదుగనక, మేష్టార్లు యింతకి మించి చెప్పరు. సరే.... పేపరు తీసి చూద్దామా? అనుకున్నాను. హెడ్‌లైన్లు చదువుదా మనుకున్నాను.

కాని దాందుంపతెగిరి ఎక్కడో తిరుగుబాటు సైన్యంచేత ప్రభుత్వ కైవసం, ఆఫ్రికాలోనో, ఆశియాలోనో కాబోలు, సోషల్‌స్టడీస్‌లో లేని రాజ్యంలో తిరుగుబాటూగట్రా ఉంటుంది. దానికోసరం యిప్పు'డట్లాసు' వెతుక్కోవాలి, అంచేతనే తిన్నగా రెండో పేజీ చూస్తే చాలునులే అనుకున్నాను.

కాని, ఉద్యోగాల కాలమ్ చూడ్డానికి ధైర్యం ఉండాలి. అలవాటుండాలి. తెల్లార్లూ 'టీ' తాగుతూ తూలుతూ పరీక్షలకి చదివినప్పుడే నా మెదలు పీకలేదుగాని యీ ఉద్యోగాల (కలి)కాలమ్ చూసేసరికి దాహం వేస్తుంది. బ్రతుకు భయం కాలేజీగేటు దాటగానే వస్తుందని బళ్లో చెప్పని పాఠం. నిజమే గాని, అది అంచనాకు మించి వచ్చింది. అయితే, యీ ఉద్యోగపర్వంలో అదో ఆశ. తృప్తి లేకపోయినా రేపటిమీద మమకారముంది. ఎండమావులైతేనేం? దాహంవేసే వాడు పంగెత్తాలంటే అవైనా అగుపించాలి గదా?

మా పోస్ట్‌మ్యాన్‌తో ఎంతో 'దోస్తీ' అయిపోయింది నాకు మూడు బిందెలు ఒకదానిమీద ఒకటి పెట్టుకుని, వాటిని నెత్తిన పెట్టుకుని, ఐనా ఒయార్యరంలో లోపం రాకుండా పంపునుంచి నీళ్ళు పట్టుకుపోయే ఆడపిల్లలు కూడా నన్నంత ఆకర్షించడం లేదీ మధ్య. అందమైన వస్తువు కనిపిస్తే కళ్ళు పూర్వం నాలుగూ, ఆరూ అయ్యేవిగాని యీ మధ్య గెడ్డం తడుముకుంటే బాగుణ్ణు అనిపిస్తోంది.

వెనుక (అబ్బ! అప్పుడే కాలేజీ బ్రతుకు గతం అయిపోయింది.) పోస్టు మేన్ ఉత్తరాలివ్వడం, అందుకోవడం అలవాటు లేదు, ఎప్పుడూ మనియార్డర్లను సంతకం చేయడం తప్ప, ఆపోస్ట్‌మాన్‌లు ఒక్కడైనా జ్ఞాపకం లేదు నాకు.

కాని, యిప్పుడో ... మా పేపరు అప్పారావు తలలో తెల్లవెంట్రుకలున్నాయని, మా పోస్టుమాన్ శామ్యూల్ పిల్లలవాడని (పేరు కూడా ఎంతో జ్ఞాపకం) అతని మొహాన కందికాయ వుందని - యివన్నీ తెలుసు.

చిన్నప్పుడు మాష్టారు ట్రియాంగిల్ అంటే 'త్రిభుజము' అని కంఠో పాఠం చేయమన్నారు. చూస్తే తెలియదూ? దాందుంపతెగ త్రిభుజానికి ఎన్ని భుజాలో! కానీ పాఠాలు శ్రద్ధగా చదవాలని మాష్టార్లు అలా చెప్తారుట(!)

అప్పారావు పేపరందిస్తూ నవ్వుతాడు.

అందుకుంటూ నేను నవ్వుతాను. పోస్టుమానూ అంతే. మా వ్యవహారం నవ్వులూ, యివన్నీ - రైలు రావడం, రెక్క వాలడం, రైలు వెళ్ళడం, రెక్క లేచిపోవడం లాంటివి.

ఇవాళ శామ్యూల్ యింకా రాలేదు. అతగాడి కొడుకు మెట్రిక్యులేషన్ ఒక్క మార్కులో పోయిందట. 'ఒక్కమార్కుకాదు, ఒక్క సంవత్సరం!' అంటాడు శామ్యూల్. నా మాటలు విని 'చదివించు ప్యాసవుతాడు' అంటే 'నువ్వేం చేస్తున్నావు ప్యాసై' అన్నాడు నా అంతవాణ్ణి శ్యాములు. 'ఫేలైతే ఏ పనేనా చేసుకుంటాడు. ప్యాసైతే అదీ నామర్దాయే' - ఇది శామ్యూల్ బ్రతుకు గురించి చెప్పే వేదాంతం. శామ్యూల్ చెప్పు తెగిందట. 'అందుకాలస్యం గంట న్నరా? అడిగాను నేను. 'అబ్బే! మెయిలు గంటప్పావు లేటు మామూల్లేగా. నాజోడు కుట్టించుకోడం మరో పావుగంటా!' శామ్యూల్‌కి లెక్కలు వచ్చును. ఆల్జీబ్రా తెలిసిన నాకు మెయిలు అసలు టైము తెలియదు. దసరాకట్నం అడగ డమే కాని క్రిస్టమస్ బక్షీస్ అడగడం శామ్యూల్‌కి రాదు. క్రిస్టమస్ ఎందుకో తెలిసినా్నకు, దసరా సంగతి సందర్భాలు తెలియవు.

నేను అనుకున్నట్లే గవర్నమెంటు ముద్దర్లు లేని ఉత్తరాలే యిచ్చాడు శామ్యూల్. బహుశా మిత్రకోటిలోని ముఖ్యరత్నాలై యుంటారు. ఐనా, ఆశ చెడ్డది. ఎవరేనా రాశారేమో ఫలానా దగ్గర ఫలానా ఖాళీ వుంది, ఫలానవాణ్ణి పట్టుకో దూర్చేస్తాడూ అని.

అలాగే పేపరులోనూ అంతే. నా నోరు తిరగని పేరుగల ఆఫ్రికాదేశంలో విప్లవం. మొత్తానికి సైనిక, స్వామికం ఎక్కడో అక్కడ రోజూనూ! ప్రజా స్వామ్యం తరువాతది. ఈ మధ్య అదే?

"తస్మాత్! యీ విప్లవ జాడ్యం మనకు రాకుండుగాక!" అని రావాలనే బోలెడు కోర్కెతో ఓ ప్రతిపక్ష నాయకుని ప్రకటన. "అది రావడానికి ప్రతి పక్షులే నాంది కాగలరు" అని అధికార శిరోమణి ఒకడు ప్రతి ప్రకటన.

సరే, పేపరు రెండో పేజీ తాపీగా చూడాలని వాయిదా వేసి ఉత్తరాల్లో ఉద్యోగం, కుశల ప్రశ్నలు, పెళ్ళి సంబంధం యీ మూడూ తప్ప నాలుగోది ఏమి ఉండగలదా? అని పోస్టుముద్రలు పరిశీలిస్తూ యింటి గుమ్మం ఎక్కుతూ వుండే స్కూటర్ హార్న్ 'కికిక్ కికిక్'మని.

"ఏంరా! బావగారూ! లవ్ లెటర్సా" మా స్కూటర్ బావ ప్రశ్న. "మరే! నా గెడ్డం చూడు" అన్నాను. వాడు "సెంటిమెంటల్ ఫూల్" అంటూ వెళ్ళి పోయాడు. 'డామిట్! వీడిలాగే నేనుకూడా ప్రేమలేఖలు రాస్తే ఎవడి చెల్లెలి మెళ్లోనో పుస్తెకట్టి వాళ్ళబాబు జేబులోనుంచి స్కూటర్ కొనుక్కొని కికిక్ మను కుంటూ ముప్ఫైయ్యేయేట "ఎమ్.బి" చదవాలి అనుకొన్నాను.

ఔను మరి! ఈ స్కూటర్ బావ అంటే మా పెద్ద చెల్లాయి భర్త.

మరో పంచె బావ వున్నాడు. అక్కయ్య మొగుడు. ఇద్దరి పేర్లూ కోటీశ్వరరావులే గనుక యీ సంకేతాల అవసరం వచ్చింది. ఈ స్కూటర్ బావ. మా చెల్లాయికి ప్రేమలేఖలు రాసి అనక ఉద్యోగం మాని, మా నాన్న భుజాల కష్టంమీద ఎం.బీకి వెళ్తున్నాడు.

సరే! ఉత్తరాలనూ, పేపర్లనూ, ఆశగా చూసుకుంటూ లోపలికి వెళ్ళాను.

"ఏమే రాణీ! మీ ఆయన ఐళ్ళోకి వెళ్ళాడా? వీడేడీ విశ్వం?" అంటూ అమ్మ నా కోసరమే కాఫీ పట్టుకొస్తోంది.

"ఆ! ఆ! వెళ్ళారు. స్కూటర్ లేదుగా" అంటూ అమ్మకి చెపుతూ చెల్లాయ్ వచ్చింది. "అదుగో అన్నయ్య" అంది. వారపత్రిక తీసుకుంది. అందులో అది "అప్పడాలు వత్తుట'' మీద ఎవరో రాసిన వ్యాసం మీద వచ్చిన అభిప్రాయం మీద తన ఖండన రాసింది. అందుకు.... దాని ఆదుర్దా దానిది.

"ఊరు తెల్లారకుండా ఎక్కడికిరా బయల్దేరావు? కాఫీ పట్టుకు గంటైంది. కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నా" అమ్మ మూర్తీభవించిన అమృత మూర్తిలా నిల్చునుంది నా గది గుమ్మంలో.

''మరే! ఉద్యోగం వెతుక్కుందికి వెళ్ళానమ్మా!'' నవ్వుతూ (నవ్వు అద్దంలో చూసుకుని ప్రాక్టీసు చేశానులెండి) కాఫీ అందుకున్నాను.

"అలాగేం? మా అన్నయ్యవి కదూ! అక్కడ మన కాలవలో వలేస్తే ఉద్యోగాలు పడ్తాయి కదురా అన్నాయ్?" చిన్న చెల్లాయి శాంతి నవ్వుతూ వచ్చింది. అంతలో అక్కయ్య "అదే, పోనిండిగానీ, ముందు టిఫిను తిను, అనక స్నానం చేద్దువుగాని" అంటూ ఇడ్లెన్ను ప్లేటులో పెట్టుకుని వచ్చిరంది.

ఇంట్లో టిఫిన్లు తంతు అక్కయ్యది. పైపెత్తనం శాంతిది.

"చూడవోయ్! అబద్ధం కాదు."

పేపరు ఫట్‌మని పేజీలు విడేటట్లు మలిపి "యివన్నీ ఉద్యోగాలే" నన్నాను నేను శాంతి నుద్దేశించి.

"బావుందర్రా మీ వరస! యివందుకోండి. నా కవతల పన్లున్నాయ్!" అని 'అవి' యిచ్చి అక్కయ్య వెళ్ళిపోయింది.

అమ్మ నవ్వుతూ కప్పునందుకొని "ఓరినీ! అన్ని ఉద్యోగాలెందుకురా నాన్నా మనకి? నీకేది ప్రాప్తముందో అదే వస్తుంది. ఉద్యోగమూ రాక, యీడొచ్చాక పెళ్ళిమూ రాక ఏమవుతుంది? రోజూ తెల్లారకుండా యీ పేపరు సేవ మానేసేయ్ ' అని వెళ్ళిపోయింది.

అమ్మకు భయం - అయింతా నేను చిక్కిపోతే ఆడపిల్లల తండ్రులు యీ యింటిమీద కాకులై వాలరని!

"శాంతీ! సురేష్‌ని పోయి నాలుగు పొడుగు కవర్లూ, ఒక ఉత్తకవరూ, స్టాంపులూ అవీ అన్నీ తెమ్మనవూ?"

"ఎందుకండీ! దొరగారూ! ఎవరికి ఉత్తరాలు రాస్తారేంటి?" కొంటెపిల్ల శాంతి. రోజూ మామూలే అయినా ఆశగా ఆడుతోంది.

"చెబుతాగా.... మీ ఆయన్ని వెతకాలి. త్వరగా రా పో!'

"ఛీ! పో! నే చెప్పను. ముందివాళ వచ్చిన ఉత్తరాలు చూపించు."

పిచ్చిపిల్ల-దీనికి మాధవి రాసే ఉత్తరాల్లో ప్రేమ ఉంటుందని నమ్మకం అనుమానం. కాని మాధవికి పెళ్ళయిపోయిందని, మొగుడికి ఉద్యోగం కూడా అయిపోయిందనీ తెలియదు. అన్నయ్యలంటే నవమన్మధులనో గోపీలోలురనో అనుకునే చెల్లెమ్మల్లో మా శాంతిది ఫస్టుమార్కు.

ఉత్తరాలు బల్లమీద పడేసి కుర్చీలో కూలబడి బల్లమీద కాళ్ళు పారేశాను.

శాంతి నవ్వుతూ "ఐతే దాచుకో" మని వెళ్ళిపోయింది. ఆడపిల్ల కదా! బల్లమీద పడేసి చూసుకోమంటే దాచుకోమంది. దాచుకోమంటే చూస్తానని రక్కుతుంది.

తొలి ఉత్తరం చింపేను. "నీతో గడిపిన రోజులు ఎలా మరిచిపోను డియర్!" నవ్వొచ్చింది నాకు.... మా శంకరం రూర్కెలాలో ఉద్యోగం అయింది వీడికి. అయినా విచారిస్తున్నాడట! నాకే ఆ ఉద్యోగం అయితే పీణ్ణి, వీడితో గడిపిన రోజులూ కూడా కలిపి మరిచిపోదును.... ఏమో.... కాని వాడు రాసిన ఉత్తరం అంతా చదివేసరికి నిజమే. "వాడు నన్ను ఎంతో ప్రేమించాడు" అనుకొన్నాను. దూరాభారం కూడానా?.... రైలులోకి వెళ్ళి చూడాలి. రూర్కెలా వెళ్ళిపోతున్న వాణ్ణి ధైర్యం చెప్పి పంపాలి. "అది నా తక్షణ కర్తవ్యం".

"ఇదిగో కవర్లు... త్వరగా స్నానానికి రమ్మని పెద్దక్కయ్య చెప్పింది" సురేష్ వచ్చాడు. వాడెప్పుడూ పరిగెడుతూనే వస్తాడు. నడక అలవాటు లేదు.

"చేస్తాను గాని, అమ్మావాళ్ళు ఏం చేస్తున్నార్రా?" అని అడిగాను.ఇంకా మా శంకరం గురించే ఆలోచిస్తున్నాను.

సురేష్ కుర్రవెధవ ఐనా అదోలా నవ్వి "నీ గురించే మాట్లాడుకుంటున్నారు" అన్నాడు.

"చచ్చేమ్! ఉద్యోగం సద్యోగం లేదని కాదుగదా?" సరిగా అటెంషన్‌లో కూచున్నాను.

"ఊహు ... మామయ్య వచ్చారుగా! బ్రహ్మచారి ముదిరినా, బెండకాయ ముదిరినా.... అని ..." అంటూ వాడు చేతికందకుండా తుర్రుమన్నాడు.

"హే భగవాన్! మావయ్యల నెందుకురా పుట్టించావ్?" తల తాటించి కుర్చీలో వెనక్కి చేరబడిపోయాను. నేను ఆటల్లాడుతున్నా నంటాడు అతగాడు. పైగా నా ఆట కట్టిస్తానంటాడు. దుంపతెగ.... ఇంత పిసరు సానుభూతి లేదు. పైగా, మా రోజుల్లో ఇంకా తిప్పలు పడ్డాం ... పెద్దవాళ్ళ కాళ్ళు పట్టి, వీపు గోకి బ్రతికి బాగుపడ్డాం.... ధక్కామొక్కీలు తినాలిరా.... ఓ కాయితం ముక్క తేవడం, దానికి ఫ్రేము బిగించడం, అనక 'డిగ్రీ' అంటూ కబుర్లూ! అయితే, ఇంతవాళ్ళ మవుదుమురా?" అంటాడు. ఆ కాయితం ముక్కకై ఎన్ని అహర్నిశలు ఆఘోరించామో తెలీదుకదా ఆయనకి! ఉత్త పాతకాలం మనిషి మరి, ఏం చేస్తాం?

ఎక్కడో "సమ్మంధాలున్నా"యంటాడు. "ఎవడ్నో పట్టుకుంటే ఉద్యోగం వస్తుం"దంటాడు దగాకోర్ బడాకోర్ మామయ్య.

''హతవిధీ! నాకు పెళ్ళాం అవసరమో కాదో నాకు తెలియదా?'' ఇంత నా మీదున్నదే వీళ్ళకి, వీళ్ళకి ఏం చేయాలి? ఆ పిల్లదెవరో దానికూడా ఈనమ్మకం నామీద వుండొద్దా?దానికి ఆలోచనే ఉండరాదు కాబోలు!! ఈ మాటే బయటికన్నానో, బాబోయ్? ఒక్కసారి కంచు గంటల్లాంటి మూడు కంఠాలు నా మీద దాడి చేస్తాయి. మామయ్య క్రౌర్యం దానికి గుణక మవుతుంది.ఉద్యోగం ఐతేగాని పెళ్ళి యేమిటి? అంటే చాలు.

''మీ ఆవిణ్ణి ఒంటిస్తంభం మేడలో కూచోబెట్టి పారాయిస్తో వుంటావా? లేక కృష్ణపరమాత్మలా పాదతాడనం చేయించుకుంటావా?'' అంటుంది కొంటెగా అక్కయ్య.

బావ ఏం చేస్తాడో మనకి తెలియదు మరి. పోన్లే పెద్దదాని రహస్యాలు మనకెందుకని గాని లేకపోతేనా?....

అంతలో అమ్మ నా అభ్యుదయ భావాలన్నీ 'నేరాలు' క్రిందే జమకడుతుంది.

"నీకు ఉద్యోగం వచ్చేక పెళ్లాం కావాలా? అంటే ఉద్యోగం, పెళ్ళి-రెండూ చంక నెత్తుకుని నువ్వు చక్కాపోతానంటావ్? అంతేనా? చూశావురా అన్నయ్యా! వీడి తంతు. ఇక నాకు వీడు 'ఆలి' వచ్చాక కూడేం పెడతాడ్రా?" అని వాళ్ళన్నయ్యకి (పైన మనవి చేసిన విలన్‌కి) ఫిర్యాదు కూడా చేస్తుంది వెర్రి బాగుల అమ్మ.

అమ్మకి వాళ్ళన్నయ్య నూటపదహారు వన్నెల బంగారం—

ఆ మామయ్య వెంటనే "అంతవాడే వీడు" అంటూ అందుకుంటాడు.— పైగా "ఆ మూడు ముళ్ళూ వేశాకగాని వీడికి ఉద్యోగం రానివ్వకూడదు - అలా ఐతేగానీ వీడి ఆటలు కట్టవ్" అంటాడు కూడాను.

నా అభ్యుదయ భావాల మీద అమ్మకు కలిగే అపోహలను తొలగించడం బ్రహ్మాతరం కూడా కాదు. ఈ ఒక్క మామయ్యకు తప్ప - ఈ ఆడ అమ్మలు, అక్కలు, చెల్లెలూ మొదలైన వాళ్ళతో వాదించగల తర్కజ్ఞానం గాని వాదనా

పటిమగాని ఏ టెక్ట్సు పుస్తకంలోనైనాగాని రాసినా బాగుణ్ణు! మొత్తానికి నా నోరు కుట్టుబడిపోయిన గంటదాకా వాళ్ళంతా నామీద దండయాత్రను ఉపసంహరించు కోరు. పేపర్లో 'వాంటెడ్ కాలమ్స్' చూస్తూ ప్రాణం విసిగి 'మాట్రిమోనియల్' కాలమ్స్‌కేసి కన్ను తిప్పుతానో లేదా, కాలేజీలో ఇంటర్ మీడియట్ వెలగబెట్టిన నేరాన ఇట్టే పసిగట్టేస్తుంది ఆ విషయం చెల్లి.

"ఒరే! దాచినా దాగదురా.... నీకెందుకురా ఆ శ్రమ? రంభలాంటి పెళ్ళాన్ని...." అంటుందది. దాని మాటలను సగంలోనే అందుకుంటాడు మామయ్య.... "వాళ్ళ నాన్న- అనగా 'రంభ' నాన్న వేయించే ఉద్యోగాన్ని కూడా తెస్తాం" అంటూ పూర్తి చేస్తాడు.

"మీకు జీవితమంటే ఆటగా వుందన్నమాట?" అభిమన్యుడంత కోపం ప్రదర్శిస్తాను.

అంతా నవ్వేస్తారు.

"మాకు కాదు జీవితం ఆటగా ఉంట- అది నీకే. అది కట్టించాలనే వెళ్లారు మీ నాన్నగారు." అంతా ఏకగ్రీవ తీర్మానం చేస్తారు.

"నేను....నేను....పార్వతీశం గారింటికి వెళ్తాను చదరంగం ఆడుకుందికి."

లేచి వెనుదిరగకుండా వెళ్ళిపోతున్నాను—ఆడియన్స్ అల్లరి ప్రారంభిస్తే స్టేజిమీదనుంచి వింగ్‌లోకి పారిపోయే నటుడిలాగా!

గుమ్మంలో అసలు సూత్రధారి ప్రత్యక్షం.

"ఏరా....విశ్వం! ఉండు నీతో మాట్లాడాలి"అంటూ నాన్న ఎదురయ్యాడు.

తిరిగి మేకపిల్లలా వచ్చి కుర్చీలో కూలబడ్డాను.

"కాయా? పండా?" నాన్న అంటే బొత్తిగా (ఆయన బొద్దు మీసాలంటే కూడా) భయంలేని అమ్మ ప్రశ్న.

"పండున్నర!" నాన్న జవాబు.

"ఆటకట్టు!" విలన్ మావయ్య ఆనందం. చివరికి కథ అంతా టూకీగా ఏమిటయ్యా అంటే.... తాంబూలాలు పుచ్చుకుంటే నేను కోరిన ఉద్యోగం అనక కన్యాదానం చేస్తాట్ట ఓ మోతుబరిగారు. పేరెందెకులెండి పెద్దమనిషి కదా....

పార్వతీశంగారితో చదరంగం ఆడుతున్నాను. ఐనా, మూడేళ్ళ క్రితం జూలై లోనే, పదిహేనో తేదీనాడు రాత్రి ఆవతల వాన కురుస్తో ఉంటే కిటికీలో నించి మీదపడే 'జల్లు' ననుభవిస్తో డైరీలో రాసుకున్న మాటలు....'నేను ప్రేమించి పెళ్ళి చేసుకుంటాను. అదీ ఉద్యోగం వచ్చాకా పెళ్ళి చేసుకుంటాను. పైసా కట్నం అడగను' అని రాసిన కవిత్వమే జ్ఞాపకం వస్తోంది నాకు.

''ఇదుగో, నా గుర్రం గెంతింది.... నీ ఆటకట్టు!'' పార్వతీశంగారికి చెస్సాటలో గెలిస్తే హిట్లరంత శరీరమైపోతుంది.

''ఆటకట్టు!'' అన్న మాట ఫెడీలుమని తగిలింది నా కర్ణపుటాలకు.

''విలన్ మామయ్య ప్రవేశించాడుగా! లేకపోతే ప్రేమించే పెళ్ళిచేసుకుందును'' అన్నాను పిక్కలు కలిపేస్తూ నేను.

''ఇంకా చెప్పావు కాదు....? ఉద్యోగం ఇచ్చే మామగారేనా?" అంటూ పార్వతీశంగారు తనకే మరో పెళ్ళి కాబోతున్నంత సంతోషంగా నా వీపు మీద 'ఛెళ్లున' ఒక్క చరుపు చరిచాడు.

''అదీ సంగతి....అందుకే అబ్బాయిగారి ఆటకట్టింది!'' అన్నాడు మళ్ళీ పరమ రహస్యం కనిపెట్టినట్లు. *

# చెప్పులజత

—పెద్దిభొట్ల సుబ్బరామయ్య

'సార్! కల్కటాలో ఇలాటిగాలి దొరకదనుకుంటాను.'

నేను పక్కకు తిరిగి చూడకుండానే జవాబు చెప్పాను. 'తల్లకిందులుగా తపస్సు చేసినా దొరకదు.'

స్థలం....కృష్ణాతీరం....

సమయం.... సాయంకాలం అయిదున్నర గంటలకు....

ఎదురుగా పెద్ద జలరాశి....దూరంగా బ్రిడ్జిమీద రైలు పోతున్నది. ఆకాశంలో సరేసరి. ..రంగురంగుల మబ్బులు....

ఆయన అప్పుడు నా పక్కనే వొచ్చి కూర్చున్నాడు. అప్పుడు చూశాను పరిశీలనగా....ఆయన పక్కనే ఆరేడేళ్ళ పిల్లకూడా వొచ్చి కూర్చున్నది.

రెండు రోజులనుంచి ఇదే వరస. ఈయన, ఈయనతోపాటు ఈ పసిపిల్ల నన్ను వదలడం లేదు.

కృష్ణానది కట్టక్రింద సత్రంలో నాల్గయిదు రోజులనుంచీ కర్మాంతరాలు జరుగుతున్నాయి. సత్రం పెద్దది....అయినా, అంతటా బంధుజన కోలాహలం విపరీతంగా ఉంది. చనిపోయిన వ్యక్తి మాకు జ్ఞాతి. దూరపు బంధువు. యాభై ఏళ్ళవాడు. చివరి క్షణం వరకూ నాలుగు చేతులా సంపాయిస్తూనే వున్నాట్ట. ఇళ్లూ వాకిళ్లూ స్థలాలు వగైరాలే కాక షేర్లూ చట్టుబండలు అంటూ రకరకాలుగా సంపాయించి ఉన్నట్టుండి పోయాడు. భోజనం చేసి కూర్చున్నాట్ట. కూర్చుని పెళ్ళాంతో ఏదో చెప్పబోయాట్ట. చెప్పనేలేదు. చిలకెగిరి పోయింది.

ఆయన అంటే నాకాట్టె సదభిప్రాయం లేదు. కాని, ఇలాటి సందర్భంలో హాజరు వేయించుకోకపోతే పాపం అని గోలచేసి మా ఆవిడ ఇంత దూరం లాక్కొని వచ్చింది. పోయినవాడు సంపన్నుడు కూడా కావడంచేత ఎక్కడెక్కడి బీరకాయ పీచు సంబంధాల వారూ ఎక్కడెక్కడి నుంచో దిగారు. అందులో కొందరితో నాకు అసలు ముఖ పరిచయం కూడాలేదు. మా ఆవిడ మాత్రం దిగీ దిగగానే అందరినీ పలుకరించి హడావిడిగా వాళ్ళతో కలిసిపోయింది. అంత పెద్ద సత్రమూ పిల్లలతో పెట్టెలు బెడ్డింగులతో నిండిపోయింది. పెద్ద హాల్లో, వరండాల్లో, గదులలో ఎక్కడ పడితే అక్కడ సామాన్లు సర్దుకుని ఎవరి పాటికి వారు కాలక్షేపం చేస్తున్నారు. ఎక్కడెక్కడి వారో ఎప్పెప్పటి వారో కలుసుకోవడం కనుక అంతా గోలగోలగా ఉంది. మా ఆవిడ నిలిచినచోట నిలవకుండా వంటగది దగ్గరనుంచి స్నానాల గదుల వరకు తానే అయి పర్యవేక్షిస్తూ అందరికీ తోడుపడుతున్నది. ఎప్పుడో స్నాన సమయంలోనూ, కాఫీ వేళకు తప్ప నన్ను గురించి పట్టించుకోవడమేలేదు. అందరి మధ్య పరాయివాడిలా కాలం గడుపుతున్నాను. రామేశం ఉన్నాడు. కాని, అతనికి నాతో మాట్లాడేందుకు తీరిక ఎక్కడ? బజారుపనులు, కొనుగోళ్ళు, కర్మలు చేసేవారి వెంట వెళ్ళడం వంటి పనులలో అతను తలమునకలుగా ఉన్నాడు.

ఈయన మాత్రం ఇందరిలో నన్నే ఎన్నుకున్నట్టు? వచ్చిన రోజునే నా దగ్గరికి వచ్చి నా వివరాలన్నీ తెలుసుకుని ఆప్యాయంగా మాట్లాడుతున్నాడు. వెంట వెంటనే ఉంటున్నాడు. భోజనాలవేళ బంతిలో నా పక్కనే కూర్చుంటున్నాడు. ఆయన వెంటనే ఆ పిల్ల.

ఇప్పుడు నది మెట్లమీద నా పక్కనే కూర్చున్న ఆ వ్యక్తిని పరిశీలనగా చూశాను. ఆయన ఎదురుగా విస్తరించుకుని ఉన్న మహాజలరాశిని చూస్తున్నాడు ఆ పిల్ల ఎప్పటివలెనే బిక్కుబిక్కుమంటూ కూర్చునివుంది.

ఆయన కాళ్ళకున్న చెప్పులే సగం అరిగిపోయి ఆయన దారిద్రాన్ని చాటి చెబుతున్నాయి. యాభై పైబడిన వయస్సు, తెల్లబడిన పలుచని జుట్టు. కుష్కించిన దవడలు, కొద్దిగా పెరిగిన తెల్లని గడ్డం, మందమైన అద్దాల కళ్ళజోడు. ఎదురుగా అస్తమిస్తున్న ఎర్రని సూర్యబింబం ఆ అద్దాలలో మెరుస్తున్నది.

నేను నాలుక చివరిదాకా వచ్చిన ప్రశ్నను అణిచిపెట్టాను. 'మీరు చనిపోయిన ఆయనకు ఏమవుతారు?' అని అడగబోయాను. కాని, అడగలేదు, ఆయన తిరిగి అదే ప్రశ్న వేస్తే వివరించలేక బాధపడాలి. ఆ బాంధవ్యం ఎక్కడ గుర్తునాకు?

ఆయన ఉన్నట్టుండి ఎందుకో నిట్టూర్చాడు, పక్కనున్న పసిపిల్ల జుట్టు పైకి తోసుకుంటూ 'నాన్నా! పోదాం' అంటున్నది.

'పోదాం పోదాం' అన్నాడాయన.

రేపు పదమూడోరోజు. ఆనాడు భోజనాల తర్వాత ఎక్కడెక్కడి బంధువులూ వెళ్ళిపోతారు. వెళ్ళితీరాలి. తమ తమ ఊళ్ళకు, తమ ఇళ్లకు నేరుగా వెళ్లిపోవాలి. వెళ్లేటప్పుడు 'వెళ్తున్నామ'ని చెప్పకుండా వెళ్ళిపోవాలి.

ఆయన పిల్ల అల్లరి భరించలేక లేచి 'మీరు కాస్సేపు కూర్చుంటారా ఇక్కడ?' అని అడిగాడు.

ఆయన పిల్లరెక్కపట్టుకుని నెమ్మదిగా మెట్లెక్కి కట్టదిగి సత్రంలోకి వెళ్ళిపోయాడు.

ఈ మూడు రోజులలోనూ నేను గమనించిన తమాషా ఏమిటంటే ఇంత మంది సత్రం నిండా బంధుజనం కోలాహలంగా ఉన్నారా, ఎవ్వరూ ఈయనతోటి ముఖావంగా తప్ప మామూలుగా మాటాడిన పాపాన పోలేదు. అదేమిటో, ఆయన ఎవరినైనా పలకరించబోయినా 'ఊఁ-ఆఁ' అని తప్ప కలివిడిగా సమాధానం చెప్పినవాళే లేరు. నాకేమీ అంతుబట్టలేదుకాని మొత్తానికి ఏదో రహస్యం ఉందని మాత్రం అనిపించింది. సత్రంలో ఒక గదిలో మూలగా కొద్దిపాటి బట్టలున్న చేతిసంచి మాత్రం ఉంది. అవసరం వొచ్చినప్పుడు దానిముందు కూర్చుని సర్దుకుంటాడు. అక్కడే కూర్చుంటాడు. రాత్రివేళ పిల్లను పక్కన పడుకోబెట్టుకుని ఆ సంచినే తలగడగా చేసుకుని పడుకుంటాడు. ఆయనను భోజనాల వేళగాని, కాఫీల వేళగాని ఎవరూ ప్రత్యేకించి పిలవడం నేను గమనించలేదు.

పొద్దుగూకుతున్నది. ఇక 'లేద్దామా' అనుకుంటున్నాను.

అంతలో రామేశం వచ్చాడు. నా కోసమే వెదుక్కుంటూ వొచ్చాడు. నా పక్కనే కూర్చున్నాడు.

'ఊఁ! ఏమిటి సంగతులు?' అని అడిగాను.

అతడు నిట్టూర్చి పైపంచెతో ముఖం తుడుచుకుని అలిగిపోయినవాడిలా మాట్లాడాడు.

'ఇప్పుడే బజారునుంచి వొచ్చాము. మీతో తీరిగ్గా మాట్లాడటమే కుదర లేదు. ఇవ్వాళ ధర్మోదకాల కార్యక్రమం అయిపోయింది. ఇహ రేపు ఎవరిదోవ వాళ్ళది....మీరు అమ్మణ్ణితో కలిసి వీలుచూసుకుని మా ఊరికి రారాదూ?'

'ఎందుకు రాకూడదూ? నిక్షేపంగా రావచ్చు. సెలవు దొరకాలి, డబ్బు సమకూరాలి- అంతే' అన్నాను నేను నవ్వుతూ.

'రాదల్చుకోవాలిగాని మీకు సెలవు, డబ్బు సమస్యలా?' అన్నాడతడు. నేను కొద్దిక్షణాలాగి సంశయిస్తూనే 'రామేశం! ఇప్పుడే క్రిందికి దిగి వెళ్తూ నీకు ఎదురు పడి ఉంటాడే ఆయన ఎవరు?' అని అడిగాను.

రామేశం ఒకరకంగా ముఖంపెట్టి అంతలో నవ్వుతూ 'ఎవరూ? వెంక ట్రావా? ఆయన ఊసెందుకు వొచ్చిందిప్పుడు?' అన్నాడు.

తర్వాత నెమ్మదిగా 'అదొక వింత పాత్ర' అన్నాడు.

'ఏమిటి సంగతి?' అని అడిగాను నేను.

'ఆయన మనందరికీ కావలసినవాడే. నెల్లూరు జిల్లా మారుమూల ఎక్కడో పల్లెపట్టున ఏదో ఉద్యోగం వెలగబెడుతున్నాడు' అన్నాడు ముందు.

'ఉద్యోగం వెలగబెడుతున్నాడు' అనడంలో వ్యంగ్యం అంతా కురిపిం చాడు. బహుశా ఏదో చిన్న ఉద్యోగం కాబోలు....

నేను 'ఊఁ' అన్నాను, ఇంకా చెప్పమన్నట్టు.

'ఏముందీ? ఇట్లా పెళ్ళిళ్ళకూ చావులకూ తప్పకుండా వొస్తూ వుంటాడు. ఈసారి పెళ్ళాన్ని తీసుకు రాలేదు. పిల్లను మాత్రమే వెంటబెట్టుకొచ్చాడు. మొత్తం ముగ్గురు ఆడపిల్ల లనుకుంటాను. పెద్ద పిల్ల పెళ్ళి చేశాడా మధ్య ఎప్పుడో, ఏదో తూతూ మంత్రంగా. ఆ పిల్ల కాపురం కూడా అంతంత మాత్రం గానే ఉందని విన్నాను అల్లుడు పరమ లోపరట. ఇక ఇద్దరాడ పిల్లలు. ఈ పిల్ల అందరి కంటె చిన్నదయి వుంటుంది!'

'ఇవన్నీ మామూలు విషయాలే. అంతమాత్రంలో అతను వింత పాత్ర ఎందుకైనాడు?' అని ఆలోచిస్తున్నాను.

రామేశం నా మనసు గ్రహించినట్టు మొదలుపెట్టాడు:

'వొట్టిదొంగ....నలుగురు చేరినచోటికి పెళ్ళిళ్ళకూ చావులకూ వస్తాడా, ఏదో ఒకటి కాజేసుకు పోతుంటాడు. ఈయన వొచ్చాడంటే ఎవరి జేబులోనో డబ్బు మాయమైపోతుంది. లేదా ఏ వెండి గిన్నో గొలుసో మాయమవుతాయి ఇది అందరికీ తెలుసు అందుకే ఆయన వొచ్చాడంటే ఎక్కడి వారక్కడ జాగ్రత్త పడతారు.'

నాకు విచిత్రమనిపించింది.

'ఇలాటి మనుషులుంటారా?' అన్నాను.

'ఉంటారా అని అడుగుతారేమిటి? ఉన్నారు' అన్నాడు రామేశం గట్టిగానే.

ఆ రాత్రి పొద్దుపోయాక మా ఆవిడ వచ్చి నా పక్కనే నడుం వాల్చింది.

ఈ నాలుగు రోజుల హడావిడితో నీరసపడ్డట్టు కనిపించింది.

ఆవిడతో నెమ్మదిగా, లోగొంతుకతో, ఈ విషయమే కదిపాను.

ఆమె కూడా గుసగుసలుగా రామేశం చెప్పినదాన్నే ఖరారు చేసింది. పైగా, బోలెడు ఉదాహరణలు కూడా చెప్పింది.

మరునాడు అంతా హడావిడి....భోజనాలు ముగించి ఎవరి త్రోవన వారు వెళ్ళిపోవాలి. అందువల్ల కొద్దిమంది తప్ప మిగిలిన వాళ్ళందరూ తమ తమ సామాన్లు సర్దుకునే హడావిడిలో ఉన్నారు. నేనప్పుడు గమనించాను. నా చెప్పులు మాయమైపోయాయి. కొత్త చెప్పులు....రెండు వందలుపోసి కొని పదిరోజులైనా కాలేదు.

ఈ మాట నానోటి వెంట జారిందో లేదో అతి చిత్రంగా అమిత వేగంగా పాకిపోయింది. అయితే ఎవరూ పెద్దగా ఏ మాటా అనలేదు. కాని గుసగుసలు పోయారు. మొత్తానికి కొద్ది నిముషాల్లోనే విషయం అందరికీ నెమ్మదినెమ్మదిగా తెలిసిపోయింది.

రామేశం 'ఏమిటి? నేను విన్నది నిజమేనా?' అంటూ వొచ్చాడు.

నేను తల ఊపి 'ఇందాకే గుమ్మం ముందు వొదిలి పెట్టాను. స్నానానికి వెళ్ళొచ్చి చూస్తే జతలేదు' అన్నాను.

'ఉండండుండండి....తమాషాచేస్తాను' అంటూ రామేశం వెళ్ళిపోయాడు.

వెంకట్రావుగారు స్నానం చేసి బట్టలు మార్చుకుని వచ్చారు. సంచి ముందు కూర్చుని బిక్కమొహంతో నిలబడి ఉన్న కూతురితో నెమ్మదిగా 'వెళ్దాం తల్లీ.... వెళ్దాం.... భోజనాలయ్యాక బయల్దేరిపోదాం.... బస్సెక్కి పోదాం ... ఓపికపట్టు....'' అంటున్నాడు.

సంచి సర్ది జిప్‌లాగి చిన్న తాళం తగిలించాడు. తర్వాత దాన్ని లాగి చూశాడు. ఆ తర్వాత ఆ పక్కనే కూర్చున్నాడు. కళ్ళజోడు తీసి పంచె చివరతో తుడుచుకుని మొహానికి తగిలించుకున్నాడు.

అంతలో రామేశం అన్నగారు హడావిడిగా వచ్చాడు. వచ్చీ రావడం తోనే వెంకట్రావు నుద్దేశించి 'మీరు కాస్త తోడురావాలి నాకు. దగ్గరే బజార్లో చిన్నపని.... ఒక వస్తువుకొని ఇస్తాను. తీసుకుని రిక్షా ఎక్కి వచ్చేయండి.... పావుగంట పని.... నేను వేరే పనిమీద స్టేషనుకు అర్జెంటుగా వెళ్ళాలి" అంటూ తొందర పెట్టాడు.

తన అవసరం వచ్చినందుకు, తనను గుర్తించినందుకు ఆనందిస్తున్న వాడిలా వెంకట్రావుగారు లేచారు.

'ఇప్పుడే వస్తా - ఇలా కూర్చో' అంటే వినకుండా ఆ పిల్ల ఏడవటం మొదలుపెట్టింది.

'పిల్లను కూడా తీసుకురండి.... ఆటో సిద్ధంగా ఉంది'' అంటూ రామేశం అన్నగారు ఇద్దర్నీ వెంట తీసుకుపోయాడు.

బయట ఆటో కదిలి వెళ్ళిన ధ్వని వినబడింది.

మరుక్షణంలో రామేశం, అతని వెంబడి కొందరు ఆడవాళ్ళు, మగవాళ్ళు బిలబిల మంటూ గదిలోకి వచ్చారు.

రామేశం ఆ సంచిని ఇవతలికి లాగి అందరి ముందు దాన్ని తెరిచేందుకు సంసిద్ధుడైనాడు. నా మనస్సు వికలమయింది. అయినా ఊరుకుండిపోయాను.

'తాళం కూడా వేశాడు పెద్దమనిషి' అన్నారెవరో ఎగతాళిగా.

'ఈ తాళం ఎంత? దీని బతుకెంత? క్షణంలో వొచ్చేస్తుంది' అంటూ రామేశం నిజంగానే మరో తాళం చెవితో దాన్ని తీశాడు. జిప్ లాగాడు.

అందరూ ఉత్కంఠతో చుట్టూ చేరి చూస్తున్నారు. మా ఆవిడ ముందు వరుసలో ఉండి కళ్ళు విప్పార్చి చూస్తున్నది.

సంచిలో పైన పంచెలు, తువ్వాళ్ళు వంటివి ఉన్నాయి. క్రింద పెద్ద పెద్ద పేపరులో కొన్ని లడ్డూలు గారెలవంటి తినుబండారాలున్నాయి.

ఆ క్రింద.... కళ్ళు తిరిగినట్టయింది. పేపరులో చుట్టబడి నిజంగానే చెప్పులజత, నాదే, ఉంది।

రామేశం విజయ గర్వంతో అందరి వంకా చూశాడు తర్వాత చెప్పుల జత మా ఆవిడకు అందించాడు. తినుబండారాలు కూడా తీసేయబోయాడు కాని, ఎవరో పెద్దాయన! పోన్లెపాపం, వాటిని ఉంచెయ్. పేదవాడు - పిల్లలకు పెట్టు కుంటాడు. అనగానే ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. మళ్ళీ క్షణాల్లో యధా విధిగా ఏ అనుమానమూ రాకుండా సంచి సర్దేసి తాళంవేసి, యధాస్థానంలో పదిలంగా ఉంచి రామేశం లేచాడు మా ఆవిడ చెప్పుల జతను పేపరు సహి తంగా మా పెద్ద సూట్‌కేసు అడుగున దాచి తాళం వేసి మరీ కదిలింది. తర్వాత ఎవరిపాటికి వారు ఇవతలికి వచ్చి ఏమీ ఎరగనట్టే, ఏమీ జరగనట్టే ఎవరి పనులలో వారు మునిగిపోయారు. తర్వాత వెంకట్రావుగారు వచ్చాడు. తాపీగా సంచి పక్కనే కూర్చున్నాడు. మారాం చేస్తున్న పసిపిల్లతో 'ఉండమ్మా! అల్లరి చెయ్యకు. భోజనాలయ్యాక బస్సెక్కి ఊరెళ్లిపోదాం....! అంటున్నాడు. పన్నెండు గంటలవేళ అందర్నీ భోజనాలకు లెమ్మన్నారు. బంతిలో మామూలు గానే వెంకట్రావు నాపక్కనే వచ్చి కూర్చున్నాడు.' అదీ యిదీ మాట్లాడుతూ భోజనం చేశాడు. పిల్లమొరాయిస్తూ వుంటే, తినమ్మా! బస్సెక్కిన తర్వాత మధ్యలో 'ఆకలి ఆకలి' అంటావు. అని బతిమాలి మరీ తినిపించాడు.

ఇక ఆనాటికి అక్కడ నిద్ర చెయ్యరాదు కాబట్టి ముఖ్యులెవరో కొద్ది మంది తప్ప అందరూ పిల్లా పాపలతో సామాన్లతో ప్రయాణ సన్నాహాల్లో పడ్డారు. సత్రం బయట రిక్షాలు, ఆటోలు, కిరాయి మాట్లాడటాలు, అంతా గందరగోళం.

నేను వరండాలో కూర్చుని ఉండగా వెంకట్రావు చేతి సంచితో వచ్చి 'మీ ప్రయాణం ఎప్పుడు?' అని అడిగాడు.

'సాయంకాలం బండికి, రిజర్వేషన్లు కూడా మొన్ననే చేయించారు' అన్నాను నేను.

ఆయన ఆదోకరకంగా 'వస్తాను. మళ్ళీ ఎప్పుడో! మీతో బాగా కాలక్షేపం అయింది' అన్నాడు.

తర్వాత పిల్లను నడిపించుకుని చేతి సంచి మోసుకుని నడిచిపోయాడు.

ఆయన వీధి మలుపు తిరిగి కనుమరుగయ్యేంతవరకు చూస్తూనే ఉన్నాను.

ఎందుకో మనసంతా ఆలజడితో నిండిపోయింది.

మా ఆవిడ వచ్చింది.

'వెళ్ళిపోయాడు పెద్ద మనిషి, ఇవిగో మీ చెప్పులు', అంటూ చెప్పుల జతను అపురూపంగా పట్టుకుని వచ్చి నా కాళ్ళ దగ్గర పడేసింది. నేను కొన్ని క్షణాలు కళ్ళు మూసుకుని నిలబడిపోయాను. కళ్ళముందు అదే దీనాకృతి; నెమ్మదిగా నడిచిపోతూ.

*

# కోరిక

## —ఇచ్ఛాపురపు జగన్నాథరావు

హోటల్‌కి చేరుతూనే చుట్టూ చూసి ఈ లాబీలో మరొకరోజు గడవ నక్కరలేకుండా ఈ రాత్రి ఇంటికి చేరుకునే అదృష్టాన్ని తలుచుకుని రెండు రోజుల తరవాత మనసులోనించి గిరిధర్ ఒక చిరునవ్వుని అనుభవించగలిగాడు. హోటల్‌కి ఏమీ తక్కువని కాదు. ఢిల్లీలో ఉన్న నాలుగైదు మంచి హోటల్స్‌లో ఇది ఒకటి. అలాటి విషయాలలో డబ్బు మిగుల్చుకునే అలవాటు తన కంపెనీకి లేదు. ఈ రెండు సంవత్సరాల సర్వీసులో తనని ఎంతో అభిమానంగా చూస్తోన్న కంపెనీకి తానూ చాలా చెయ్యగలిగాడు.

గిరిధర్ రూములోకి అడుగు పెడుతూనే ఆ చల్లదనానికి వశమైపోయాడు. ఇరవై నిమిషాలు రోడ్డుమీద ప్రయాణం చేసి వొచ్చేసరికి ఆ వేడీ దూళీ పొగా తనని చాలా బాధ పెట్టాయి. ఎడారిలో ప్రయాణం ఇంతకన్న నయం అనిపించింది.

సోఫాలో జారపడి కళ్లు మూసుకున్నాడు గిరిధర్. రాత్రి వాళ్లు ఇచ్చిన డిన్నర్ తన నిద్రని చెడగొట్టింది. తిరిగి వొచ్చేసరికి రెండు అయింది. అయితే, అక్కడ చాలా చర్చలు జరిగాయి. ప్రశాంతంగా ఉన్న చక్కని గార్డెన్‌లో చాలా విశ్రాంతి దొరికింది. ఆ పరిసరాలలో తన కంపెనీ ఆశపడినకన్న మంచి షరతులతో ఒప్పందం అయినంత పని అయింది. కాని, పెద్దాయన కపూర్ నవ్వుతూనే తన కొడుకు కరచాలనం చెయ్యకుండా ఆపేశాడు. రక్తంలో ఒక్క బొట్టు ఆల్కహాల్ ఉన్నా వ్యాపారంలో ఏ నిర్ణయమూ తీసుకోకూడదు అని మృదువుగా వారించాడు. ''గిరీసాబ్! రేపు నిద్రలేచి ఏమనుకుంటారు? విస్కీ ఇచ్చి అతని చేత మాట అనిపించాం అనుకుంటారు. మన ఆఫీసులో రేపు విషయాలు ముగించుదాం.'' అన్నాడు. ఒక విధంగా ఆయన చెప్పినది నిజమే. ప్రేమిస్తే

సమయంలో చేసే వాగ్దానాలు ఆ ప్రేమ వేడి తగ్గగానే మరుపులోకి వెడతాయి. ఆల్కహాలూ అంతే. అది రక్తంలో ఉండగా వొచ్చిన మంచి ఆలోచనలు అది దిగిపోగానే మాయం అయిపోతాయి.

రాత్రి సరీగా నిద్రలేదు. రోజంతా అక్కడ వాళ్ళతో గడిచింది. రూముకి వొచ్చాక తెల్లవారిన తరవాత వాళ్ళు మనసు మార్చుకుంటారేమోననని చిన్న భయం. ఈ కంట్రాక్టు ఎలాగైనా జేబులో పెట్టుకుని రమ్మని శ్రీనివాసన్ మరీ మరీ చెప్పేడు. ఈ వేళ లంచికి ముందు కరచాలనంతో ఆ పని సంతృప్తికరంగా పూర్తి అయింది. రేపు సెలవు. అంచేత కంట్రాక్టు తయారు చెయ్యడం ఎల్లుండికి గాని అవదు. అందుకే ఈ సాయంత్రం ఫ్లయిట్‌లో తిరిగి వెళ్ళడానికి నిర్ణయించు కున్నాడు కపూరుకూడా ఈ రాత్రి ఏదో పెళ్ళికి అని కురుక్షేత్రం వెడు తున్నారు. వాళ్ళు రేపు రాత్రి ఆలస్యంగా వొస్తారు. తనని ఉండమని మరీ మరీ చెప్పేరు. ఆలోచిస్తాను....అని మాత్రం జవాబు ఇచ్చాడు. కాని, కారులో కూర్చో గానే ఈ రాత్రి తిరిగి వెళ్ళిపోడానికే నిర్ణయించుకున్నాడు. కంట్రాక్టు ఎల్లుండి వొస్తుంది. కాని, ఈ రాత్రి అర్చనతో తన ఇంట్లో గడపాలి.

క్షణ మాత్రం అతనికి అర్చన పూర్తిగా జ్ఞాపకం వొచ్చింది. అతని ఆలో చనలూ కోరికలూ గుండెలూ ఆమెతోనే పూర్తిగా నిండిపోయాయి. ఆమెనించి దూరంగా ఉండడం అతనికి కష్టం. ఇలాగ వూళ్ళు తిరగాల్సినప్పుడు అతనికి తనలో ఒక భాగం లేనట్టు అనిపించి ఆ అసంపూర్ణతతో బాధపడతాడు.

అర్చన జ్ఞాపకం రావడంతో గిరిధర్ అలసట అంతా పోయింది. మరొక అరగంటలో బయలుదేరితే ఎయిర్‌పోర్టు చేరుకోడానికి కావలసినంత సమయం ఉంటుంది.

షవర్ చేసుకుని సూట్‌కేస్ పేక్ చేసుకున్నాడు గిరిధర్. అప్పుడు అతనికి శ్రీనివాసన్ చివరి ఆదేశం జ్ఞాపకం వొచ్చింది. ఆ కంట్రాక్టు జేబులో పెట్టుకొని రావాలి అని.

సందిగ్ధావస్థలో పడి చివరికి శ్రీనివాసన్‌కి ఫోను చెయ్యడం మంచిది అను కున్నాడు అతను. శ్రీనివాసన్ ఫోను మీద దొరక్కపోతే మెసేజిపెట్టి బయలు దేరవొచ్చును.

కాని, అతని అదృష్టం నిలవలేదు. శ్రీనివాసన్ ఆఫీసులోనే కూర్చుని ఉన్నాడు. ఒక్కొక్కరోజు తొమ్మిదీ పదీదాకా అతను ఆఫీసులో కూర్చుంటాడు. ఇది అలాటిరోజు.

గిరిధర్ వీలైనంత క్లుప్తంగా జరిగినదంతా చెప్పి "రేపు ఇక్కడ అనవసరంగా కూర్చోడం ఎందుకు? ఈ రాత్రి చేరుతున్నాను. రేపు మీకు వివరాలు అందిస్తాను. ఎల్లుండి కంట్రాక్టు పంపుతారు'' అన్నాడు ధైర్యంగా.

''వెరీగుడ్....'' అన్నాడు శ్రీనివాసన్. గిరిధర్ ఒక్క క్షణం అర్చన చేతుల్లో మెత్తగా వెచ్చగా అనుభవించే సుఖంలో మునిగిపోయాడు. కాని, శ్రీనివాసన్ ''నో కమింగ్.... నాట్ టుడే.... వెయిట్ చేసి కంట్రాక్టు తేవాలి. రేపు ఎంజాయ్ చెయ్యి. రిలాక్స్ అవు. ఎల్లుండి కంట్రాక్టు చేతిలో పెట్టుకొని ప్లెయినెక్కు.... వెల్‌డన్'' అని సంభాషణ కత్తిరించాడు.

హతాశుడయాడు గిరిధర్.

ఈ రాత్రి కనబోయే కలలన్నీ కనకుండానే కరిగిపోయాయి. ఇంటికి ఫోను చేశాడు. అర్చనతో తన బాధ చెప్పుకుంటే కొంత ఉపశమనం. కాని రిప్లై లేదు. ఆమె తన అన్నగారి ఇంటికి వెళ్ళిపోయి ఉంటుంది.

అతనికి శ్రీనివాసన్ మీద చాలా కోపం వొచ్చింది. కంట్రాక్టు విషయం ఫరవాలేదు అని తాను చెప్తోంటే వినడేం? అతను ఇల్లు వొదిలి ఎక్కడికీ వెళ్ళడు. విదేశాలకి కూడా ఎగ్జిక్యూటివ్‌లనే పంపుతాడు. రెండేళ్ళ కిందట పెళ్ళి అయిన వాడి బాధలు అతనికి తెలియవు. ఎప్పుడో మరిచిపోయి ఉంటాడు.

నిద్రపోతోన్న టి.వి. లోని పది ఛానెల్సు చూసి ఏదీ నచ్చక ఆఫ్‌చేసి ప్రస్తుత కర్తవ్యం గురించి ఆలోచించాడు. తాను ఢిల్లీలో ఐదారు సంవత్సరాలు చదువు కోసం ఉన్నాడు. వృత్తిరీత్యా కొంతమంది పరిచయాలు ఇక్కడే అయాయి. ఎవరైనా దొరికితే కనీసం కబుర్లు చెప్పుకుంటూ కొంత రాత్రి గడపవొచ్చును.

సూట్‌కేసు తెరిచి టెలిఫోన్ నెంబర్ల పుస్తకంలోని పేర్లు కొంతసేపు వెతికాడు. ముగ్గురు మిత్రుల పేర్లు కొంత ఆశాజనకంగా కనిపించాయి. వాళ్ళెవరైనా దొరికితే చాలా బాగుంటుంది.

గడియారం చూసుకున్నాడు. ఏడున్నర.

ఈ సరికి తాను ఎక్కాల్సిన విమానం టేకాఫ్‌లో ఉంటుంది! తాను నిద్రించుదామనుకున్న తన బెడ్ ఎడారిలో వెన్నెల లాగ ఏమీ అనుభవం అనుభవించకుండా అలాగే ఉండిపోతుంది.

అర్చన వాళ్ళన్నగారి చిన్న కొడుకుతో ఆడుకుంటూ ఉంటుంది.

అక్కడికి ఫోన్ చేసి అర్చనతో మాటలాడడం గిరిధర్‌కి నచ్చలేదు. అసలే మాటలలో విచ్చలవిడి లేదు ఆమెకి. నలుగురూ ఉంటే మరీ పొడిగా 'అవును.... ఊఁ.... అలాగా? అలాగా? సరే!' లాటి మాటలకన్న ఆమెనించి రావు.

సంతోష్ ముఖర్జీ నంబరు డయల్ చేశాడు. ఏమీ జరగలేదు. మళ్ళీ మళ్ళీ డయల్ చేశాడు. రాంగ్ నంబర్లూ లేకపోతే ఎంగేజ్డ్ శబ్దమూ లేకపోతే నిశ్శబ్దం.

కాలేజీలో ముఖర్జీ తనకి సీనియరు. చాలా సరదాగా ఉండేవాడు. కాని, లెక్చర్లు చాలా జాగ్రత్తగా వినేవాడు. ఫస్ట్‌క్లాస్ రావడమే గొప్ప విషయం అని అతను ప్రతిపాదించి వాదించడమే కాదు - మనసారా నమ్మేవాడు. చిన్న వయసు లోనే అతనికి కళ్ళ అద్దాలు వొచ్చేయి. దానితో కొంత ఎక్కువ వయసు ఉన్న వాడిగా కనిపించేవాడు. ఆ పరిస్థితిని కూడా అతను బాగా వినియోగించు కున్నాడు. ఉండీ ఉండీ గీతోపదేశంలో కృష్ణుడి ఫోజు పెట్టి, ఉపదేశాలు ఇచ్చే వాడు. అతనిది మధ్య తరగతి కుటుంబం. ఏమి బాధలు ఉండేవో కాని, అతను మాత్రం ఎప్పుడూ అల్లరి చేసే చిరునవ్వుతోనే కనిపించే వాడు. "నేను గవర్న మెంటు సర్వీసుకి తప్ప పనికిరాను గిరీ!.... మీ రందరూ మంచి మంచి మల్టీ నేషనల్ ఫరమ్స్‌లో చేరి లక్షల్లో జీతాలు తీసుకుని, పని పురుగులలాగా బత కండి! నేను అలసట లేని ఉద్యోగం చేస్తూ మీ అందరినీ బాధలు పెట్టి సంతృ ప్తిగా తిని నిద్రపోతాను'' అనేవాడు.

గిరిధర్‌కి ఆ రోజులూ, ఆ మనిషీ జ్ఞాపకం వొచ్చి, అతన్ని ఎలాగ అయినా కలుసుకోవాలనే కోరిక ద్విగుణీకృతం అయింది. ఆ నంబరు వెతికి పట్టుకునే పని ఆపరేటరుకి వొప్పగించాడు. ఢిల్లీలో కూడా టెలిఫోను నంబర్లు తరచుగా మారిపోతున్నాయి. డైరెక్టరీ కేవలం డిపార్టుమెంటు వారు ఆదాయం

చేసుకోడానికి మాత్రమే అని ఒకసారి అనుకుని రెండో నంబరుతీసి డయల్ చేశాడు.

అవతల ఫోనులో రింగు వినిపించడం గిరిధర్‌కి సంతోషం కలిగించింది. కాని, పది పన్నెండు రింగులదాకా టెలిఫోన్ ఎవరూ ఎత్తక పోవడం అతని ఆనందాన్ని పది పన్నెండు మెట్లు కిందికి దింపింది.

ఇంక లాభంలేదు అనుకుంటూంటే ఎవరో ఎత్తేరు. అది ఎవరో కాని, తనకి కావలసిన మనిషి కాదు.

"హల్లో! .... హల్లో!"

నౌకరులాగా ఉన్నాడు. నెంబరు చెప్పి ఆ నెంబరేనా అని అడిగాడు గిరిధర్. అవతలి వాడికి బోధపడినట్టు లేదు. క్యాహై? హల్లో హల్లో అంటున్నాడు బాధగా. ఈసారి నంబరు అంకెలు హిందీలో చెప్పాక ఆ మనిషి మాలుమ్ నహీ అన్నాడు.

అప్పుడు జ్ఞానోదయం అయి చంద్రకుమార్ గుప్తాగారి ఇల్లేనా అని అడిగాక అవును అని సమాధానం ఇచ్చేడు. తన పేరు గోపాల్ కిషన్ తివారీ అనీ తాను అక్కడ నౌకరు అనీ తన జీవిత వివరాలు చెప్పి, గుప్తాసాబ్ కుటుంబంతో కలిసి సిమ్లా వెళ్లేరని చెప్పేడు. ఎప్పుడొస్తారు? నహీ మాలుమ్. ఎప్పుడు వెళ్లేడు? నహీ మాలుమ్. తివారీకి తన అజ్ఞానం మీద అసహ్యం కలిగిందో ఏమో గిరిదర్ వివరాలు అడిగాడు. ఆ వివరాలు గుప్తాకి చేరుతాయి అనే నమ్మిక లేకుండావే ఇచ్చాడు అతను. పేరూ వూరూ ఇక్కడ చిరునామా ఒక్కొక్క అక్షరమే చెప్పి అలిసిపోయి సంభాషణ ముగించాడు గిరిధర్.

కొంత నిరాశతో కిద్వాయ్ నంబరు డయల్ చేసి రింగు రావడంతో ఆశగా ఎదురు చూశాడు గిరిధర్, చిన్న పాప ఎవరో ఎత్తినట్టు ఉంది ఏమిటో చెప్పింది. చివరికి కిద్వాయ్ భార్య టెలిఫోను తీసుకుంది. తనని తాను పరిచయం చేసుకుని కిద్వాయ్‌ని గురించి అడిగేడు. ఆయన పనిమీద రాజస్థాన్ వెళ్ళేడట. ఎప్పుడు తిరిగి వొస్తాడో తెలియదు. ఆమెకి తన వివరాలు ఇచ్చి ధన్యవాదాలు చెప్పి ఫోను పెట్టేశాడు గిరిధర్.

కిద్వాయ్ తనకన్న వయసులో పదేళ్ళు పెద్ద అయినా చాలా సరదా అయిన మనిషి. ఆ రోజుల్లో అతను ఒక కాలేజీలో ఇంగ్లీషు లెక్చరర్‌గా ఉండే

వాడు. గిరిధర్ ఒకసారి ఒక మిత్రుడితో కలిసి ముషైరాకి వెళ్ళాడు. అక్కడ కిద్వాయ్ వినిపించిన షెర్లు అతనికి చాలా వచ్చాయి. వెళ్ళి పరిచయం చేసుకున్నాడు. ఆ తరవాత కిద్వాయ్ ఇంటికి చాలాసార్లు వెళ్ళేడు. ఏడెనమండుగురిని పిలిచి మర్యాదలు చేసి రెండు మూడు గంటలసేపు కవిత్వం వినిపించడమూ ఘాలిబ్ రాసిన కవితలని ప్రేమగా మరీ మరీ వొప్పజెప్పడమూ జరిగేది. గిరిధర్‌కి ఆ ప్రతీ మెహఫిల్ ఒక అనుభంగా ఉండేది. ఆ తరవాత కిద్వాయ్ ఒక సంవత్సరం విదేశాలకి వెళ్ళడమూ గిరిధర్ ఈ ఉద్యోగంలో చేరి ఢిల్లీ వొదలడమూ జరిగింది. ఇప్పుడు కిద్వాయ్ ప్రొఫెసర్ అయాడు. అతన్ని కలుసుకోలేనందుకు చాలా విచారించాడు గిరిధర్. ఈ రోజు తనదికాదు అనుకున్నాడు. చూద్దామనీ, కలుసుకోవాలనీ ఉన్న ఎవరినీ కలవలేకపోయాడు.

టీ.వీ. పెట్టి చాలాసేపు ప్రోగ్రాంలు మార్చి మార్చి చూస్తూ గడిపేడు. మినీబార్‌లో రకరకాల డ్రింకులు ఉన్నాయి. బ్లాక్‌లేబెల్ తీసి ఒక డ్రింకు చేసుకున్నాడు. కాజూ తింటూ టీ.వీ. చూస్తూ కొంతసేపు ఆ సాయంత్రపు ఆశాభంగాలనీ, అర్చననీ మరిచిపోగలిగాడు.

పది దాటేక ఆపరేటరు ముఖర్జీ నంబరు చెప్పి కాల్ ఇచ్చింది. ముఖర్జీ కలకత్తా వెళ్లేడనీ ఎల్లుండి రావొచ్చుననీ అతని తమ్ముడుట చెప్పేడు. ఫోన్ బుక్‌లో నెంబరు రాసుకుని రెండో డ్రింకు తయారు చేసుకుని వెనక్కివాలేడు గిరిధర్. అతనికి శ్రీనివాసన్ మీద మరొకసారి కోపం వొచ్చింది. అతను ఆపకపోతే ఈపాటి ఇంటికి చేరి అర్చనతో కబుర్లు చెప్తూ ఉండేవాడు. అది కానిచ్చేడు కాదు ఆ దుర్మార్గుడు!

విసుగ్గా ఛానెల్స్‌మార్చి మరో పది నిమిషాలు టీ.వీ. చూస్తోన్న గిరిధర్ కరెంటు షాకు కొట్టినవాడిలాగ లేచి కూర్చుని టీ.వీ. మీద దృష్టి కేంద్రీకరించాడు. ఆ చానెల్లో ఏదో సినిమా వొస్తోంది. ఆ సీనులో స్త్రీ పురుషులిద్దరూ ఒక శృంగార దృశ్యంలో ఉన్నారు. నటనలాగ లేదు అది. కాని ఆ యువతి- ఆమె గిరిధర్ మనసులోకి చాలా బలంగా ఇద్దరు స్త్రీలని తెచ్చింది. ఎలాగో ఆమెలో ఆ ఇద్దరి పోలికలు ఉన్నాయి. ఎలాగో ఏమిటో అతనికి తెలీదు. కాని ఒకేసారి ఆ ఇద్దరూ అతనికి జ్ఞాపకం వొచ్చారు.

అర్చన!

ఆమె అంటే తనకి ప్రేమ. అలా చెప్తే చాలదు గాని అంతకన్న మంచి మాటలతో ఆ భావనని గుండెల్లో నించి మాటల్లోకి తేవటం అతనికి చేతకాదు. అవసరమూ లేదు. ఆ భావన మాటల రూపంలోకి రాకుండా అతని గుండెల్లోంచి మనసులోకి అక్కడినించి గుండెలలోకీ వెడుతుంది. ఆమె తన భార్య. తన ప్రియురాలు. తన అర్చన. తన కళ్ళలో అంతకన్న సుందరి లేదు. అందమైన ముఖమూ వొళ్ళూ మాత్రమే కాదు ఆమె. ఆ కనిపించే అందాలు ఆమెలో ఒక చిన్న భాగం మాత్రమే. ఆమె తనకి దగ్గరగా ఉంటే గంటల కొద్దీ మాటలు లేకుండానే సంభాషణ జరిగే అంత ప్రేమ తనకి. ప్రేమ అంటే ఇవ్వడం. ఇచ్చి, ఆ ఆనందంలో పాలు పంచుకుని ఆనందించడం - సూర్యరశ్మి చంద్రుడి మీద పడి వొచ్చే వెన్నెల లాగా. ఆ ప్రేమ తనకీ అర్చనకీ మధ్య ఉంది. ఇద్దరిదీ వెన్నెలే. అతనికి ఎప్పుడూ ఒకటే కోరిక....ఆమెకి బాధ కలిగించే పని ఏదీ ఎప్పుడూ చెయ్యకూడదు అని. ఆమె మీద ఎంత కోరిక అతనికి ఉందో ఈ కోరిక కూడా అంత ఉంది. గిరిధర్‌కి తన దౌర్బల్యమూ దాని బలమూ తెలుసును. అందుకని_

కోరిక బలమూ తెలుసును.

టీ వీ.లో సినిమా సాగుతోంది. ఆ వేడి వేడి సీను ముగిసింది. ఆ అమ్మాయి బట్టలు వేసుకుని మరో సీనులో ఉంది. కాని, ఆమె అందం ఏమీ తగ్గలేదు. ఏదో కవ్వింపు ఆమెలోనూ, ఆమె ప్రతీ కదలికలోనూ ఉన్నాయి. ఆ అందంలోని సారం అర్చనని గుర్తు చేస్తే దానిలోని ఆ వేడీ పెంకెతనమూ పూజని జ్ఞాపకం తెచ్చాయి. ఆమెని కిందటిసారి కలుసుకుని రెండు సంవత్సరాలు అయింది. ఆ తరవాత ఆమెని తననించి దూరం చేసుకున్నాడు. పూర్తిగా. కాని ఆమె జ్ఞాపకాలు అతన్ని వెంటాడుతూనే ఉన్నాయి. వాటితో పెనుగులాడి వాటిని తెరల తెరల వెనక్కి నెట్టడం అతను నేర్చుకోగలిగాడు. కాని ఈ వొంటరితనంలో పూజ ఆ తెరలన్నీ తొలగించి తన ఆలోచనల నిండా అలుముకుని నిలబడింది. అదే చిరునవ్వు. అదే ఆప్యాయత. నవ్వుతూ కవ్వించే కళ్లూ సమ్మోహనాస్త్రంలా ఆమె కదలికలు....అన్నీ అవే. కళ్ళు మూసుకున్నా ఆమె మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

మరొక్క క్షణం ఆ నటిని పరిశీలనగా చూసి గిరిధర్ టీ వీ. కట్టేశాడు. మినీబార్ నుంచి మరొక మినియేచర్ విస్కీ తీసి డ్రింక్ తయారుచేసుకున్నాడు.

ఐసు ముక్కలు వెయ్యడం మీదా సోడా పొయ్యడం మీదా దృష్టిని కేంద్రీక రించాడు. సోఫా వొదిలి బెడ్‌మీద దిండ్లు పేర్చి జారపడ్డాడు. తాను ఓకే. చేసిన కంట్రాక్టు గురించి ఆలోచించాడు. మంచి వ్యాపారం అంటే ఇరుపక్షాలూ తమకే లాభసాటిగా ఉంది అని సంతోషించేదే అన్న సూత్రం జ్ఞాపకానికి తెచ్చు కున్నాడు.

ఆ సూత్రం మొదట చెప్పినది వాసుదేవయ్య. మేనేజిమెంట్ ఇన్‌స్టిట్యూట్ బెంగుళూరులో ప్రొఫెసరు.

బెంగుళూరు. తాను పేయింగ్ గెస్టుగా ఉన్న ఇల్లు, ఇండిపెండెంట్‌గా ఉన్న రూము. ఖరీదు ఎక్కువ అయినా చాలా సౌకర్యంగా ఉండేది. బ్రెక్‌ఫాస్టూ డిన్నరూ ఇంటివాళ్ళు ఇచ్చేవారు.

అక్కడ కలిసింది పూజ. ఆమె ఇంటి వారికి ఏదో దూరపుచుట్టం. గ్రాడ్యు వేషన్ అయాక సెక్రెటరీకోర్సు చేసి అక్కడ ఉద్యోగం చెయ్యడానికి వొచ్చింది. ఆమె కొద్దిరోజులు వాళ్ళ అతిథిగా ఉండి పేయింగ్ గెస్టుగా మారింది.

ఆ మొదటి రోజులు అతనికి చూచాయగా మాత్రమే జ్ఞాపకం ఉన్నాయి. పూజని చూడగానే గిరిధర్ ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు. ఆమెలో ఉన్న విపరీతమైన ఆకర్షణ అతన్ని ఊపిరి తీసుకోనిచ్చేది కాదు. వాళ్ళ పలకరింపులు హల్లోకే గుడ్‌మానింగ్‌కే పరిమితం ఆయిఉండేవి. గిరిధర్‌కి అంతకన్న ఎక్కువ మాటలాడడానికి మానసికంగా శక్తి ఉండేది కాదు.

ఆమె అతన్ని చూడగానే చిరునవ్వుతో పలకరించేది. ఆ చిరునవ్వులో అనిర్వచనీయమైన ఇంద్రజాలం ఉండేది. అతను ఉక్కిరిబిక్కిరి అయిపోయే వాడు. ఆ వయస్సులో ఆరోగ్యంగా ఉన్నవాడికి ఆ రకం ఆకర్షణ సహజం అని గిరిధర్‌కి తెలుసును. కాని దానికన్న ఏదో గొప్ప శక్తి విద్యుత్ ప్రవాహంలాగ తనని ఆక్రమించుకుంటూన్నదని అతనికి అనిపించేది.

అలాగ రెండు మూడు నెలలు గడిచిపోయాక గిరిధర్ ఆమె ఉనికికి కొంత అలవాటు పడ్డాడు. బహుశా అతని ఆరాధన ఇంకా నెలలూ సంవత్స రాలూ అలాగే దూరం నించి గమనించే స్థితిలో ఉండిపోయేదేమో! కాని ఒకనాడు పూజ ''నేను నా ఫ్లాట్‌కి మారుతున్నాను'' అంది నవ్వుతూ.

"అంటే?"

"నన్ను పెర్మనెంట్ చేశారు.... వాళ్లు నాకు ఫ్లాటు ఇచ్చారు. రెండు రోజుల్లో అక్కడికి వెళ్ళిపోతాను" అంది చిరునవ్వు చెరగని ముఖంతో.

"మిమ్మల్ని మిస్ అవుతాను...."అన్నాడు గిరిధర్ తనలో పేలిన ఆశాభంగాన్ని దాచుకుంటూ.

"అవును. నాకు తెలుసును.... నిజానికి నా ఫ్లాట్‌కి నేను వెళ్ళడం సంతోషంగా ఉన్నా ఇక్కడినించి వెళ్ళడం నన్ను బాధపెడుతోంది...." అంది.

రెండు రోజుల్లో ఆమె వెళ్ళిపోయింది. కొత్తఫ్లాటు అడ్రసూ టెలిఫోన్ నంబరూ చిన్న కాగితం మీద వ్రైపుచేసి చిన్న కవర్‌లో పెట్టి తలుపుకిందనించి అతని గదిలోకి వొదిలి వెళ్ళింది పూజ. కవరుమీద "?" అనే ప్రశ్నార్థకం మాత్రం ఉంది.

ఆ ప్రశ్న ఏమిటో గిరిధర్‌కి బోధపడలేదు. కాని ఆమె అక్కడినించి వెళ్ళిపోవడం అతనికి పెద్ద లోటుగా కనిపించింది. రెండు రోజులు అతనికి ఏమీ తోచలేదు. కాని, ఆమెకి ఫోన్ చేసే ధైర్యం అతనికి లేకపోయింది. ఆమె తన మిత్రులందరికీ అలాటి చిన్న కవర్లు ఇచ్చే ఉంటుంది. ఆమె దృష్టిలో తనకి ఏదో ప్రత్యేకత ఉంది అనుకోవడమూ దానిని ఆధారంగా తీసుకుని ఆమెతో పరిచయం కొనసాగించడమూ అతనికి నచ్చలేదు. తనలో ఆమెకి ప్రత్యేకమైన స్థానం ఉండవచ్చును. తన దృష్టి అనే అద్దంలో ఆమె నీడ. నీడలకి వేరే భావాలు ఉంటాయా?

ముఖ్యమైన పరీక్షలు దగ్గరపడడాన్ని గిరిధర్ అదృష్టంగా భావించుకుని చదువుమీద దృష్టి కేంద్రీకరించాడు. పరీక్షలు బాగా రాశాడు. ఇంక ఒక్క సంవత్సరం ఉంది. ఒక వారం సెలవు ఇస్తే సొంతవూరికి బయలుదేరేడు. అన్ననీ, పిల్లలనీ చూడడం అతనికి సరదా. వాళ్ళకి తాను దూరంగా ఉండే ఒక మనిషికన్న ఏమీకాదు. ఆస్తులు న్యాయంగా పంచి ఇచ్చేశాక అన్నకీ అతకీ మధ్య నామమాత్రపు సంబంధం మాత్రమే మిగిలింది. అంతే. కాని, ఎక్కడో స్థిరపడేదాకా ఆ వూరువొచ్చి వారం, పది రోజులు ఉండి నలుగురినీ వలకరించి వెళ్ళడం గిరిధర్‌కి ఒక వ్యాపకం అయింది. బాగా అజమాయిషీ చేసి అర్జన

చేస్తూన్న అన్న అతన్ని దగ్గరగా రానివ్వడు. దూరంగా ఉంచే ప్రయత్నమూ చెయ్యేడు.

ఈసారి రెండు రోజులు అక్కడ గడపడం కష్టం అయింది గిరిధర్‌కి. కారణం అతనికి తెలుసును. బెంగుళూరు నించి పరీక్షలవగానే వొచ్చెయ్యడం ఈ వూరుమీద ఆకర్షణ కాదు. అది తిరోగమనం. ఆ మాట అతనికి హటాత్తుగా తట్టింది. పూజ అతని ఆలోచనలని పూర్తిగా ఆక్రమించింది. ఆ విషయాన్ని అతను దాచుకునే ప్రయత్నం చేసి చేసి విఫలమయాడు.

వెంటనే తిరుగుప్రయాణం కట్టేడు. అన్న వారించలేదు. వొదినా పిల్లలు కూడా అడ్డుపడలేదు.

ఆ మరునాడు గది శుభ్రం చేయించుకుని పుస్తకాలు సర్దుకుని చాలా సేపు ఏదో పనులు కల్పించుకుని సాయంత్రం దాకా గడిపేడు. పూజది పెద్ద మల్టీ నేషనల్ కంపెనీ. ఆమె ఆరుదాటేదాకా ఇంటికి రాదు.

ఆమె ఆరోజు ఆరుకి ఏడుకి కూడా రాలేదు. తొమ్మిదికీ పదికీ కూడా రాలేదు. గిరిధర్‌కి భోజనం సహించలేదు. నిద్రరాలేదు. సౌందర్యం లేని ఆలోచనలతోనూ శాంతి కలిగించని కలలతోనూ అతను నిద్రపోయాడు.

మర్నాడు ఉదయం బ్రెక్‌ఫాస్టు దగ్గర ఇంటివారు చెప్పేరు. పూజ ఆదివారం వొచ్చి వాళ్ళని చూసిందిట. గిరిధర్‌ని గురించి రెండు మూడుసార్లు అడిగిందిట. వాళ్ళ బాస్‌తో ఢిల్లీ వెళ్ళిందిట. నేడో రేపో వొస్తుందిట.

అతనికి శాంతి కలగలేదు. అంత సేపు ఎలాగ ఎదురు చూడాలి?

ఆమె ఆ మర్నాడు వొచ్చింది. ఆ సాయంత్రం గిరిధర్ టెలిఫోన్ చెయ్యలేదు. ఎనిమిది అవుతోంటే వెళ్ళాడు. ఆమె తలుపుతీసి ఏ మాత్రమూ ఆశ్చర్యం వ్యక్తపరచకుండా "రా గిరిధర్! చాలా ఆలస్యం చేశావు!" అంది.

మిగిలిన కథ అంతా చరిత్ర. ఆమె ఏమీ దాచుకోలేదు. గిరిధర్ అంటే ఆమెకి ఎంత ఆకర్షణ అన్నమాట కూడా దాచలేదు. అతనూ అంతే.

ఎంత ఆప్యాయతా అనురాగమూ ఇచ్చింది పూజ తనకి! శారీరకంగా వాళ్ళేదో తప్పు చేస్తున్నారని అతనికి అనిపించలేదు. ఎందుకంటే, ఆమెమీద అతనికి శరీరాన్నీ మాటలనీ సుఖాన్నీ అధిగమించిన మమత ఉంది. దానినే ప్రేమ అంటే అనవొచ్చును ఆమె తనది. తాను ఆమెవాడు.

ఆ మలయమారుతాలకీ సుడిగాలులకీ మధ్య పూజ తనని చాలా బాధలు పెట్టేది. అతను తన చదువు విషయంలో ఏమీ అశ్రద్ధ చెయ్యకుండా ఎన్నో ఆంక్షలు పెట్టేది. అతను ఫోనుచేసిగాని ఆమె ఇంటికి రాకూడదు. ఫోన్‌లో అతని చదువూ టెస్టులూ ప్రాజెక్టులూ అన్నిటి గురించీ తెలుసుకుని అవుననో కాదు అనో అనేది

ఆ రోజుల్లో గిరిధర్‌కి చదువూ కాలేజీ మిత్రులూ అన్నీ పూర్తిగా నిరుపయోగంగా కనిపించేవి. అవన్నీ మిథ్య- నిజం ఆమె మాత్రం. జీవితం అంటే ఆమెతో గడిపే ఆ గంటలు- అంతే.

అతని చదువు పూర్తి అవగానే శ్రీనివాసన్ ఆఫరు వొచ్చింది. తనకి తెలియకుండానే తనని అంత జాగ్రత్తగా గమనిస్తోన్న వాళ్లు ఉంటారని గిరిధర్ అనుకోలేదు. శ్రీనివాసన్ ఒక పెద్ద కంపెనీ తరఫున చాలా మంచి ఆఫర్ ఇచ్చాడు. నిజానికి అలాటి ఆఫరు తనకీ మరో ఇద్దరికీ మాత్రమే వొచ్చింది. కాని అతను బెంగుళూరు విడిచి వెళ్ళడం అనే మాట ఆలోచనలోకి రానివ్వలేదు. అంతమంచిది కాకపోయినా అక్కడా ఏదో ఒక ఉద్యోగం అతనికి దొరికి తీరుతుంది. ఉద్యోగం చూసుకుని పూజని పెళ్ళి చేసుకుని శాశ్వతంగా ఒక ఆనందమయ ప్రపంచంలో నివసించడానికి అతను నిర్ణయించుకున్నాడు.

కాని తన అన్ని అంచనాలకి విరుద్ధంగా పూజ అతన్ని ఆ ఆఫర్ ఒప్పుకొనేలాగ చేసింది.

''నిన్ను వొదిలి నేను వెళ్ళలేను పూజా!'' అన్నాడు గిరిధర్.

''వెళ్ళగలవు గిరీ! వెళ్ళాలి....'' అంది పూజ దృఢంగా.

''నిన్ను పెళ్ళి చేసుకుని ఇక్కడే ఉండిపోతాను. ఇంక ఎక్కడా నాకు శాంతి ఉండదు'' అన్నాడు గిరిధర్.

''మనకు పెళ్ళి అవదు గిరీ! మరిచిపో. కారణం అడక్కు'' అంది పూజ. గిరిధర్ చాలా ప్రయత్నించాడు. పూజ పీస మెత్తు కూడా స్పందించలేదు. అతనికి అల్టిమేటమ్ ఇచ్చి, మద్రాసు పంపింది.

ఒడ్డున పడిన చేపలాగ అయింది అతని మద్రాసు జీవితం. అతను పూజని మరచిపోలేక పోయాడు. కాని, పూజ అతనికి దూరంగా ఉండడం అల

వాటు చేసుకుంది. ఆదివారాలలో బెంగుళూరు వెడితే, ఆమెని కలవడం కష్టం అయిపోయింది. ఆ పరిస్థితికి ఆమె బాధ పడుతూన్నట్టు కనిపించలేదు. రోజులో పది, ఇరవై నిమిషాలకన్న ఆమెతో ఏకాంతం దొరికేదికాదు. ఆమె లాలనగా, ఆప్యాయంగా మాటలాడేది. ఎప్పుడోకాని మాటలకన్నా దగ్గరగా అవడం కుదిరేది కాదు. దానికి గిరిధర్ అంత బాధ పడలేదు. పూజకీ, తనకీ మధ్య అగాధం ఎందుకు వొచ్చింది? ఎన్నిసార్లు అడిగినా ఆమె పెళ్ళి విషయం నిష్కర్షగా ఎందుకు తిరస్కరిస్తుంది? ఆ ప్రశ్నలు చాలాసార్లు అడిగితే ఆమె చిరునవ్వుతో ''నువ్వంటే నా కిష్టం గిరీ! అందుకే!'' అనేది- అంతే.

అలాగ రెండేళ్ళు గడిచాక పూజకి ఢిల్లీకి ట్రాన్స్ఫర్ అయిపోయింది. ఆమెకి ప్రమోషన్ వొచ్చింది. అదే సమయంలో గిరిధర్‌కీ, అర్చనకీ పెళ్ళి జరిగింది. పెళ్ళికి నాలుగు రోజుల ముందు బెంగుళూరు వెళ్ళి, పూజని కలిసి అర్చన మాట చెప్పేడు.

''నాకు చాలా ఆనందంగా ఉంది గిరీ! నీకు అన్ని శుభాలూ కలగాలని నా ప్రార్థన!'' అంగి పూజ. ఆ మాటలు మనసారా అడినవని అతనికి తెలుసును.

''నా కొక వాగ్దానం కావాలి!'' అంది పూజ.

''ఏమిటి?'' అన్నాడు గిరిధర్.

"మన మధ్య జరిగిన దాని ఛాయ అర్చనమీద పడనివ్వకు! మళ్ళీ ఎప్పుడూ నన్ను కలుసుకోకు....నీ జీవితం నువ్వు హాయిగా జీవించు- అదే నాకు ఆనందం!" అంది.

ఆమెతో వాదన చేసి లాభంలేదు. గిరిధర్ ఏమీ అనలేదు.

అదే చివరి సమాగమం. న్యూ యియర్ కార్డ్స్ తప్పితే.

టేబిల్‌మీద గ్లాసులో విస్కీ అలాగే ఉంది. టైము చూసుకున్నాడు. పదిన్నర.

తెగిన ఆనకట్టలోనించి తోసుకుకొచ్చిన నీరు లాగ పూజ జ్ఞాపకాలు అతన్ని ఉక్కిరి బిక్కిరి చేశాయి. మొన్నటి న్యూ ఇయర్ కార్డులో ఆమె నంబరు దొరికితే భద్రపరుచుకున్నాడు. ఏ ఆలోచనా తనని ఆపేలోపున ఆమె నంబరు డయల్ చేశాడు.

ఆమే ఎత్తింది. "నువ్వా గిరీ!" అంది.

"ఎలా ఉన్నావు?"

"చాలా హేపీగా. నువ్వు? పిల్లలా?"

"నేనూ హాయిగా ఉన్నాను పూజా! ఇంకా పిల్లలు లేరు.... ఎప్పుడైనా ఆ రోజుల జ్ఞాపకాలు వొస్తూ ఉంటాయి...."

పూజ చిన్న నవ్వు నవ్వి" జీవితంలో అన్నీ చివరికి జ్ఞాపకాలే కదా గిరీ! నిన్న తిన్న డిన్నర్ కూడా!.... ఎందుకు ఫోన్ చేశావు?" అంది.

బేక్‌గ్రౌండ్‌లో మాటలు వినిపిస్తున్నాయి అతనికి. ఇంట్లో ఏదో పార్టీ అన్నమాట.

"ఒంటరితనం భరించలేక చేశాను పూజా! ఒక్కసారి నిన్ను చూడాలని ఉంది...."

రెండు నిమిషాలు పూజ మాట్లాడలేదు. ఉత్కంఠతో అతను రిసీవర్‌ని చెవికి నొక్కి పెట్టుకున్నాడు.

'గిరీ! మన స్నేహం జ్ఞాపకాలలో కలిసిపోయిందనుకున్నాను. కానీ, నీలాగే నేనూ పూర్తిగా మరిచిపోలేకుండా ఉన్నాను. రేపు ఉదయం మా సిస్టర్ ఎవరెవరినో బ్రేక్ ఫాస్టుకి పిలిచింది.... రెండు గంటలకి వొస్తాను సరేనా!' అంది.

"ఎక్సలెంట్" అన్నాడు గిరిధర్. "గుడ్‌నైట్!"

అతను గ్లాసులో మిగిలిన విస్కీ త్వరగా తాగి రెస్టారెంట్‌కి వెళ్ళి డిన్నర్ తినివొచ్చి నిద్రపోయాడు.

ఉదయం టెలిఫోన్ రింగు విని గిరిధర్ నిద్రలేచాడు. టైము చూసుకున్నాడు. పది దాటింది.

ఫోనులో పూజ! అతనికి ఒక్కసారి వొళ్ళు పులకించింది.

ఎప్పటిలాగే అనవసర ప్రసంగం లేకుండా ఆమె విషయానికి వొచ్చింది. ఆమె తన బాస్‌ని కలుసుకోవాలిట. అది ముగించి రెండున్నరకి వొస్తాను అన్నది. కాని, గిరిధర్ హోటల్ లాబీలో ఉండాలి.

"తప్పకుండాను .... ఎదురు చూస్తాను. బాస్‌ని త్వరగా పంపెయ్యి" అన్నాడు గిరిధర్.

"బాస్‌లని పంపడం జరగదు, వాళ్ళు వెడతారు" అంది పూజ నవ్వుతూ.

"నీ కోసం అప్పటిలాగే ఎదురు చూస్తాను...." అన్నాడు గిరిధర్.

"ఒంటరిగా....అప్పటిలాగే....ఏం?" అంది పూజ ఫోన్ పెట్టేస్తూ.

గిరిధర్ జిమ్‌కి వెళ్ళి గంటసేపు గడిపాడు. ఆ తరవాత స్విమింగ్ పూల్‌లో ఒంటిగంటన్నర దాకా ఉండి, షవర్‌చేసి రూముకి వొచ్చి బట్టలు వేసుకున్నాడు. అప్పటికి టైము రెండు అయింది.

డోర్‌బెల్ విని తలుపు తీశాడు.

సంతోష్ ముఖర్జీ గిరిధర్‌ని చూస్తోనే ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు. గిరిధర్ చాలా సంతోషంగా అతన్ని ఆహ్వానించాడు. అతను నిన్నరాత్రి వొచ్చాడుట. మళ్ళీ ఫోన్ ఎందుకు అని తిన్నగా గిరిధర్‌ని చూడడానికి వొచ్చేశాడు.

చాలా సంతోషం ప్రకటించి గిరిధర్ అతని వివరాలు అడిగేడు. అతను ఇండస్ట్రీస్ మినిస్ట్రీలో డైరెక్టరుగా ఉన్నాడట. తన వివరాలన్నీ చెప్పి గిరిధర్ వివరాలన్నీ అడిగి ఎంతో ఆనందంగా "నేను చెప్పినట్టే గవర్నమెంటు సర్వీసులో చేరేను. నేను అనుకున్నట్టే నువ్వు మేనేజిమెంటులో చేరేవు. ఎప్పుడు నీకు పనివున్నా నా దగ్గరకిరా పాత మిత్రుడిని కలుసుకోవడం నాకు సంతోషం ....అందులోనూ నువ్వు!" అంటూ సంభాషణ సాగించాడు.

"టీ తెప్పించేదా?" అన్నాడు గిరిధర్.

"గవర్నమెంటు ఆఫీసరులాగ మాట్లాడకు. నేను లంచి నీతో చేస్తానని శ్రీమతికి చెప్పి వొచ్చాను" అన్నాడు ముఖర్జీ.

రెస్టారెంటుకి వెళ్ళడం వేరు వేరు కారణాలవలన ఇద్దరికీ ఇష్టం లేదు. గిరిధర్ అటు తిరిగి వాచీ చూసుకున్నాడు. రెండున్నర దాటింది.

ముఖర్జీ సలహా ప్రకారం లంచి ఆర్డర్ చేస్తోంటే కాల్‌బెల్ మళ్ళీ మోగింది. చంద్రకుమార్ గుప్తా. అతను గూడా చాలా సంతోషంగా పలకరించాడు. అతనికి స్వాగతం చెప్పి క్షేమ సమాచారాలు అడిగి చెప్పి ముఖర్జీని

పరిచయం చేసే గిరిధర్ కిందామీదా అయిపోయాడు. ఈ సరికి పూజ లాబీలో కూర్చుని అంటుంది....తనకోసం ఆత్రంగా ఎదురు చూస్తూ. కోపం వచ్చిందేమో!

గుప్తా, ముఖర్జీ కలిసి "తినేది తరవాత - తాగేది ముందు" అని బీరు తెప్పించమన్నారు.

గిరిధర్ ఆర్డరు చేసి దానితో అనుపానాలు కూడా చెప్పేడు. గుప్తా అతన్ని పరిశీలనగా చూసి "ఏమిటి నీ టెన్షను? ఫ్లయిట్ ఎన్నింటికి?" అన్నాడు.

"ఏడున్నరకి.... రేపు...."

"ఇంకా చాలా టైము ఉందిలే - నేను నిన్ను డ్రాప్ చేస్తాను" అని భరోసా ఇచ్చాడు గుప్తా.

"థేంక్స్.... కాని.... మీకు శ్రమ...." అన్నాడు గిరిధర్.

"దోస్తీలో శ్రమలూ క్షమలూ ఉండవు' అన్నాడు గుప్తా బీరు తాగుతూ. అదే సమయంలో మళ్ళీ ఎవరో వొచ్చారు. రూమ్ సర్వీస్‌వాడూ కిద్వాయీ కలిసి వొచ్చారు.

మళ్ళీ మనసారా కిద్వాయికి స్వాగతం చెప్పి అందరికీ పరిచయాలు చేయగానే కిద్వాయి అనుకోకుండా కలిసిన ఆ సభికులని నక్షత్రాలతోనూ గిరిధర్‌ని చందమామతోనూ పోలుస్తూ ఒక కవిత చెప్పాడు. వహ్వా! వహ్వా అంటూ అందరూ మెచ్చుకున్నారు. మరికొంత బీరు, తినడానికి అల్పాహారాలూ ఆర్డర్ చేసి గిరిధర్ ఒక్కసారి బయటికి వెళ్ళాలని ప్రయత్నించాడు.

కిద్వాయ్ అదే సమయంలో మరో షయర్ సెలవిచ్చాడు.

చివరకి టాయిలెట్‌కి వెళ్ళి అక్కడినించి తలుపు తీసుకుని బయట పడ్డాడు గిరిధర్. టైము ఆరు దగ్గర. అతనికి చాలా నీరసంగానూ భయంగానూ నిరాశగానూ ఉంది.

లాబీలో ఒకసారి రెండుసార్లు చుట్టూ చూశాడు. పూజ జాడ లేదు. ఆమె రెండింటికి వొచ్చి చూసి చూసి వెళ్ళిపోయిందన్నమాట - చేతికి చిక్కిన స్వర్గం వేళ్ళమధ్యనించి జారిపోయింది!

ఆమెకి ఫోన్ చేద్దామని వెళ్ళేడు. కాని ఆమె నంబరు గుర్తుకి రాలేదు. అది తన నోట్‌బుక్‌లో ఉంది.

మళ్ళీ రూముకి వొచ్చేరు. కవిత్వమూ కథలూ సంగీతమూ కలిసి సాగుతూనే ఉన్నాయి. వాళ్ళు తన నిష్క్రమణాన్ని గమనించినట్టే లేదు.

ఆ రాత్రి పదకొండున్నరకి వాళ్ళు వెళ్ళేరు ఆనందంగా.

ఆ సమయంలో పూజకి ఫోన్ చెయ్యడం మంచి పనిగా తోచలేదు. చాలా సేపు టీ.వి. చూస్తూ గడిపి మగత నిద్రలోకి దిగజారాడు అతను. ఉదయం ఫోను చెయ్యవచ్చులే అనుకున్నాడు.

ఉదయం అతను ఆలస్యంగానే లేచాడు. త్వరగా తయారు అయి బయలు దేరాడు. ప్రతీ నిమిషమూ పూజ అతనికి జ్ఞాపకం వొస్తోంది. కాని .... ఆమెతో మాటలాడే అవకాశం ఇంక రాదేమో!

కారులో కూర్చోగానే అతని ఆలోచనలు తాను చెయ్యాల్సిన పనుల మీదకి పోయాయి. ఆఫీసులో కాలు పెట్టగానే కపూర్లు ఇద్దరూ స్వాగతం చెప్పేరు. టీ తాగడం అయాక కంట్రాక్టు ముసాయిదా తయారు అవడానికి రెండు గంటలు పట్టింది. లంచికి బయలుదేరి తిరిగి వొచ్చేసరికి మధ్యాహ్నం మూడు అవబోయింది. వాళ్ళు రాహుకాలమో మరేదో అని ఐదుగంటలకి సంతకాలు చేశారు.

హోటల్‌కి చేరేసరికి ఆరు అవుతోంది. చెకౌట్ చేసి వెళ్ళాలి. తాళం తీసుకుంటూ ఆ మాట చెప్పేడు. తాళంతోపాటు చిన్న కవరు కూడా ఇచ్చింది రిసెప్షనిస్టు. రూముకి చేరి సూట్‌కేస్ పేక్ చేసుకుని ఎయిర్‌పోర్టుకి చేరేసరికి చాలా ఆలస్యం అయింది. బోర్డింగు అవుతోంది.

గిరిధర్ తన సీటులో కూర్చుని రెండు మూడు నిమిషాలు కళ్ళుమూసుకున్నాడు. అతను చాలా అలిసిపోయాడు. ఆ అలసట శరీరానికే కాదు- మనసుకి కూడా.

టేకాఫ్ అయి విమానం క్రమంగా మీదకి ఎక్కుతోంది. అప్పుడు గిరిధర్‌కి రిసెప్షన్‌లో ఇచ్చిన ఆ చిన్న కవరు జ్ఞాపకం వొచ్చింది. జాగ్రతగా విప్పి లోపలి చిన్న కాగితం చదివేడు.

'గిరీ!'

ఏ సినిమా ముగిసినా తెల్లటితెర మాత్రమే మిగులుతుంది.

అన్ని అనుభవాలు జ్ఞాపకాలు అయిపోతాయి. అవి సజీవంగా ఉండా లంటే వాటిని అలాగే ఉండనివ్వాలి.

ఉండనీ.

'P'

ఉత్తరం మళ్ళీ జాగ్రత్తగా మడిచి కవరులో పెట్టి జేబులో భద్రపరి చాడు గిరిధర్. విమానం దిగాక దానిని గౌరవంగా నాశనం చెయ్యాలి.

పదివేల మీటర్ల ఎత్తున విమానం ఎగురుతోంది.

డిన్నర్ సర్విస్ ప్రారంభం అవుతుందని అనౌన్స్ చేశారు.

గిరిధర్ తన ప్రయాణం గురించి ఆలోచించాడు. ఈ రోజు తాను అక్కడ ఉండకపోతే కంట్రాక్టు ఇంత త్వరగానూ సంతృప్తిగానూ వొచ్చేది కాదు.

కాని వ్యక్తిగతంగా తన కోరిక తీరలేదు. ఒక్కసారి పూజని కలిసి ఉంటే మరో జ్ఞాపకం ఉండేది. కాని ఆ కోరిక తీరలేదు.

అతనికి అర్చన జ్ఞాపకం వొచ్చింది. నిన్ననంతా ఆమె గుర్తుకి రాలేదు. కాని ఈ రాత్రి ఆమెతో ఉండబోవడం అతనికి ఎంతో ఉత్సాహం కలిగిస్తోంది. అతని మనసు రెండు మూడు గంటలు ముందుకి వెళ్ళిపోయింది.

ఆ ఆలోచనల మధ్య అతను మళ్ళీ ప్రస్తుతానికి వొచ్చాడు.

అర్చనకి బాధ కలిగించే ఏ పనీ చెయ్యకూడదు అనే తన కోరిక అతనికి జ్ఞాపకం వొచ్చింది ఆ కోరిక నిజంగానూ సంతృప్తికరంగానూ తీరింది. దానికి ముఖర్జీ గుప్తా కిద్వాయీ సహాయపడ్డాడు. గిరిధర్ వాళ్ళకి మనసులోనే ధన్య వాదాలు చెప్పుకుని సీటులో వెనక్కి జారబడి డిన్నర్ కోసం ఎదురు చూశాడు. *

# గెలుపూ - ఓటమీ

## —పోలాప్రగడ సత్యనారాయణమూర్తి

అతని అసలు పేరు శేషాద్రి అనే సంగతి బహుశా అతని భార్యా బిడ్డలకీ బంధువులకీ మాత్రమే తెలుసు. నెలనెలా జీతాలిచ్చే ఎస్టాబ్లిష్‌మెంట్ క్లర్కుకి కూడా తెలిస్తే తెలియొచ్చు. ఏమంటే, డిగ్రీలో ఉన్న ప్రకారం, అతని పేరు ఆఫీసులో అలాగే నమోదయి ఉంటుంది కనుకా, జీతం అతనికి ఆ పేరు మీదే ఇయ్యాలి కనుకాను.

తక్కిన వాళ్ళందరికీ, ఆబాల గోపాలానికీ- ఆ మాటకొస్తే యావదాంధ్ర దేశానికి, అతను దయానిధే! ఆంధ్రదేశం అంతా అని ఎందుకన్నానంటే, ప్రతి వారం ఏదో ఒక పత్రికలో అతని కథో వ్యాసమో ఏదో ఒకటి ఉంటూ ఉంటుంది. ఏ రెండు మూడు నెలలకో రేడియోలోనూ, కనీసం నాలుగైదు నెలలకోసారి టీ వీ. లోనూ అతని గొంతు వినిపించడం, అతని మొహం కనిపించడం మామూలు సంగతి.

అందువల్ల దయానిధి అనగానే, కథలూ, గట్రా చదివే ప్రతి తెలుగు వాడూ 'ఓహో! ఆయనా? కథలు రాస్తారు కదూ?' అంటూ మాటకలుపుతాడు. శేషాద్రి అంటే మాత్రం ఎవరికీ తెలియదు.

ప్రముఖ రచయితా ప్రసిద్ధ కథకుడూ కావడం వల్ల, ఆ రంగంలో ఆసక్తి ఉన్న యువకులూ యువతులూ, రచయితగా పేరు తెచ్చుకోవాలని ఉవ్విళ్ళూరే పడుచు వాళ్ళందరూ ఆయన పరిచయం సంపాదించాలనీ, ఆయనకి తాము రాస్తూన్న కథలూ గట్రా చూపించి, సరిదిద్దించుకొని పైకిరావాలని కోరుకుంటారు. అందుకని ఒకళ్ళో ఇద్దరో రోజూ దయానిధి ఇంటికి వస్తూనే ఉంటారు.

అలా వచ్చే వాళ్ళలో రాంబాబు ఒకడు.

రాంబాబుకి దయానిధి అంటే వల్లమాలిన భక్తి.

తన గుండెల్లో ఆయనకి ఒక గురుస్థానమే ఏర్పాటు చేశాడు.

ఒక ఆదర్శమూర్తిగా మనస్సులో నిలుపుకున్నాడు.

దయానిధికి కూడా రాంబాబు పట్ల అంతటి వాత్సల్యమూ ఉంది. తన మనస్సు విప్పి చెప్పేది ఒక్క రాంబాబుకి మాత్రమే!

'నేను రాసిన ఈ కథ బాగుందాండీ? - కథకీ కథనానికీ, తూకం కుదిరిందాండీ - వాతావరణం సరిపోయిందా? ఎత్తుగడ ఎలా ఉందంటారు? ముగింపో?' ఇలాంటి ప్రశ్నలు రాంబాబు వేస్తూ ఉండడం, దయానిధి చిరునవ్వులు చిందిస్తూ 'బాగానే ఉంది కాని, ఇక్కడ కాస్త సన్నివేశాన్ని నిలబెట్టాలి ఈ పాత్ర ఉంది చూశావ్! ఇది కాస్త తేజోవంతం కావాలి. ఈ వాక్యం ఇక్కడ అవసరం లేదు' అంటూ తగిన సూచనలు ఇస్తూ ఉండడం, తరుచు జరిగే కార్యక్రమం.

తను రాసిన ప్రతి కథా రాంబాబు దయానిధికి చదివి వినిపిస్తాడు. ఆయన ఇచ్చిన సలహాలు తీసుకుంటాడు. ఆయన చెప్పిన పత్రిక్కి పంపిస్తాడు. అవి అచ్చు అయితే, దయానిధిగారి చలవ అని సంబరపడతాడు. తిరిగివస్తే, తన రచనలోనే ఏదో లోపం ఉందని బాధపడతాడు.

నాలుగైదురోజులకి ఒక మారైనా దయానిధిని చూడకపోతే రాంబాబుకి తోచదు.

దయానిధికి అంతే!

రాంబాబు రావడం రెండు మూడు రోజులు ఆలస్యం అయితే ఆయన కాలుగాలిన పిల్లిలా తిరుగుతాడు. 'నాకోసం రాంబాబుగాని వచ్చాడా?' అని అడిగిందే అడుగుతూ ఉంటాడు ఇంట్లో.

ఒకర్ని విడిచి ఒకరు ఉండలేని అనుబంధం వాళ్ళిద్దరిదీను.

అలాంటిది రాంబాబు కనిపించి పదిహేను రోజులైంది - ఒకటా, రెండా? పదిహేను రోజులు!

ఆ పదిహేను రోజులూ పదిహేను యుగాలుగా అనిపించింది దయానిధికి,

ఏమైపోయాడూ?

ఊళ్ళోలేడా?

వంట్లో బాగోలేదా?

అర్జంటు పని ఏదైనా వచ్చి ఊళ్ళో తిరుగుతున్నాడా? ఏం పాలుపోలేదు. వాళ్ళ ఇల్లు తనకి తెలుసు. వెళ్ళి కనుక్కుంటే తేలిపోతుంది. కాని, అతను తనింటికి రావడమే కాని, తను వాళ్ళ ఇంటికి వెళ్ళడం అలవాటు లేదు. అయినా వెళదాం అంటే ఏదో ఇబ్బంది - బెట్టు - నామర్దా - పెద్దరికం అడ్డు వస్తాయి.

తనంతటివాడు, కుర్రాడిలా అతనింటికి వెళ్ళడం ఏమిటి? రెండ్రోజులు పోతే అతనే వస్తాడు.

ఇలా గుంజాటనకోపడి ఆగిపోయాడు దయానిధి. అయినా, రాంబాబు రాలేదు.

ఇంక ఉండబట్టలేక దర్జానీ, ఠీవినీ, పెద్దరికాన్నీ పక్కనిబెట్టి దయానిధి చెప్పులేసుకున్నాడు రాంబాబు ఇంటికి వెళ్దాం అని. రెండు మూడు చీడీలు దిగాడో లేదో, రాంబాబు ఎదురు వచ్చాడు 'నమస్కారం గురువుగారూ!' అంటూ నవ్వుతూ.

అతణ్ణి చూడగానే దయానిధికి విపరీతమైన కోపం వచ్చింది.

విసుక్కుంటూ ''ఎక్కడికి వెళ్ళిపోయావు ఇన్నాళ్ళూ?'' అన్నాడు.

''కొంచెం అర్జంటు పని ఉంటేనూ....'' పెదిమలు విడీ విడకుండా నవ్వుతూ అన్నాడు రాంబాబు.

''నేనూ ఒక అర్జంటు విషయం నీతో మాట్లాడదాం అని. సరే....రా.... రా....'' అంటూ వెనక్కి తిరిగాడు దయానిధి. తిరిగి, తను ఏకాంతంగా కూర్చొని రాసుకొనే గదిలోకి దారితీశాడు. తీసికెళ్ళి రాంబాబుని ఓ కుర్చీలో కూర్చోమని తనో కుర్చీలో కూర్చున్నాడు.

దయానిధి కుర్చీకి బాగా వెనక్కి జేర్లాబడి, చేతులు రెండూ వెనక్కి వేసుకుని, తలపైకెత్తి, కళ్ళుమూసుకుని కూర్చున్నాడు.

అలా దీర్ఘంగా ఆలోచిస్తూన్న దయానిధి కేసీ రెప్పలార్పకుండా చూస్తున్నాడు రాంబాబు.

నిముషాలు గాడుస్తున్నాయి. సెకండ్లముల్లు సరే - నిముషాలముల్లు కూడా ఓ అంకెమీంచి మరో అంకెమీదకి మారింది.

దయానిధి ఇంకా ఆలోచిస్తూనే ఉన్నాడు.

రాంబాబు అతని కేసీ చూస్తూనే ఉన్నాడు.

కొంచెం సేపయాక "ఏవిటి ఆలోచిస్తున్నారు. అర్జంటు విషయం అన్నారు. ఏవిటది?" అనడిగాడు రాంబాబు.

దయానిధి తలదించకుండా, కళ్ళు తెరవకుండా, ఏదో ఆలోచిస్తూన్న స్థితిలో అలాగేఉండి, ''నీతో ఓ అర్జంటు విషయం మాట్లాడాలి'' అన్నాడు.

''చెప్పండి'' అన్నట్లు కొంచెం ముందుకి వంగాడు రాంబాబు, అతను చెప్పేది శ్రద్ధగా వినే తలంపుతో.

దయానిధి తల ఇంకా సీలింగ్‌వైపే ఉంది.

కళ్ళు కూడా మూసుకొనే ఉన్నాయి.

దీర్ఘంగా ఆలోచిస్తూన్న అతని రూపంలో మార్పేంలేదు.

అయితే పెదిమలు విడివడ్డాయి.

తాపీగా చెప్పసాగాడు:

''ఫలానా పత్రిక కథల పోటీ పెట్టింది. ఫస్ట్ ప్రైజు అయిదువేలు. ఎల్లుండే ఆఖరు తేదీ....''

రాంబాబు ఉత్సాహంగా ''అవునండి'' అన్నాడు.

దయానిధి సర్దుకుని కుర్చీలో సరిగా కూర్చుంటూ, కళ్ళుతెరిచి రాంబాబు కేసిచూసి ''ఉండు, నన్ను చెప్పనీ, మధ్యలో మాట్లాడకు. ఆ కథల పోటీకి నేనో కథ రాశాను...."

''మీరా మేష్టారూ....?''

రాంబాబు తెరిచిన నోరు తెరిచినట్లే ఉండిపోయింది

'ఆగు....నువ్వు అనబోయేది నాకు తెలుసు. మీరెందుకు రాయడం అని- అవునా? ఇంత వయస్సూ ఇంత పేరూ వచ్చాక నాలాంటివాడు పోటీకి రాయ కూడదు. ప్రైజు వచ్చినా బాగుండదు. రాకపోతే అసలు బాగుండదు. ఎవరికేనా తెలిస్తే, 'మీకు కుర్రాళ్ళతో పోటీ ఏమిటీ మేష్టారూ?' అంటారు- నిజమే!''

''నేనూ అదే అనబోతున్నానండి!'' అన్నాడు రాంబాబు ఉత్తి నోటినే, గుటకవేసి మింగుతూ.

''కాని.... అమ్మాయి పురిటికి వచ్చే సమయం. నాలుగైదువేలు కావాలి. డబ్బు చాలా అవసరం ... అందుకనీ... ''

రాంబాబు నిస్సహాయంగా వింటున్నాడు.

''అందుకనీ ఓ కథ రాశాను పోటీకి....''

''రాశారా?'' గట్టిగా అరిచినట్లు నెమ్మదిగా అన్నాడు రాంబాబు.

''రాయడమే కాదు.... పోస్టు చేశాను కూడా.''

పిడుగుపడ్డట్టు తెల్లబోయాడు రాంబాబు.

చేష్టలు దక్కి దయానిధివైపు చూస్తూ ఉండిపోయాడు. కాస్సేపటికి తేరుకుని "ఎంత పని చేశారు?' అన్నాడు.

''కంగారుపడకు, పదిమందిలోనూ నవ్వులపాలవుతానని భయపడకు. జాగ్రత్త పడ్డానులే- ఓ చిన్న తమాషా చేశాను....''

రాంబాబు బొమ్మలా కూర్చుండి పోయాడు. దయానిధి చెబుతూన్న మాటలేవీ అతని చెవిలో పడడం లేదు.

''పోటీకి నేను కథ పంపానంటే బాగుండదు. ఎవరేనా వింటే పత్రికల వాళ్ళు కూడా ఇబ్బంది పడతారు అందుకని ఆ కథ నీ పేర పంపాను. నువ్వు రాసినట్లు ఎడ్రస్ కూడా నీదే ఇచ్చాను. తొంభై పాళ్ళు ఫస్ట్ ప్రైజ్ రావచ్చు. లేదా సెకండ్ ప్రైజ్ ఖాయం....ప్రైజు నీ పేర వస్తుంది. నీకు పేరు వస్తుంది. ఈ వయసులో నీకది అవసరం పైకి రావాలంటే. కాని, ప్రైజు మనీ ఉంది చూశావ్ ..." వాక్యం పూర్తి చెయ్యకుండా నవ్వాడు దయానిధి.

"మేష్టారూ!" రాంబాబు కళ్ళలో కన్నీళ్ళు.

"ఛ....ఛ.... అలా బాధ పడకు....అంత మంచి కథ నా పేరవ్రాసి నాకు పేరు రప్పించి మీరు త్యాగం చేస్తున్నారా అంటూ కృతజ్ఞతా భారంతో అలా కన్నీళ్ళు పెట్టుకోకు. నేను చేస్తున్నది పెద్ద త్యాగం కూడా కాదు. నాకు ఇప్పటికే పెద్ద పేరుంది. ఈ కథకి ప్రైజు వచ్చి కొత్తగా నాకు వచ్చే పేరు ఏం లేదు. పైగా, ఇందులో నా స్వార్థం కూడా ఉంది. ప్రైజు మనీ నాకు ఎలాగా ఇస్తావు. నా అవసరం తీరుతుంది....అందుకనీ... "

"అదికాదు మేష్టారూ!...." డగ్గుత్తికతో ఏదో చెప్పబోయాడు రాంబాబు.

"ఇంకేం నాకు చెప్పకు....ఇలా చేసేశాను అంతే....ఈ సంగతి చెబ్దాం అని బయలుదేరుతూంటేనే, నువ్వు ఎదురయ్యావు....ఈ రహస్యం మనిద్దరి మధ్యనే ఉండాలి సుమా - తెలిసిందా?" నవ్వుతూ భుజం తట్టాడు దయానిధి. రాంబాబు ఇంకేం మాట్లాడలేకపోయాడు.

బరువుగా అడుగులు వేసుకుంటూ బయలుదేరిన రాంబాబుని వీధి గుమ్మం దాకా దిగబెట్టి, నెమ్మదిగా ఇంటిముఖం పెట్టి వెళుతూన్న అతనిని ఉద్దేశించి చెయ్యి వూపుతూ, "వచ్చేనెల అయిదో తారీకుకే వస్తాయి రిజల్ట్సు. రెడీగా ఉండు" అని చెప్పి పంపించి, లోపలికి వచ్చి రాకింగ్ చైర్‌లో నవ్వుతూ, ఊగసాగాడు ప్రఖ్యాత కథకుడు దయానిధి.

అయిదో తారీఖు రానే వచ్చింది. దాంతోబాటు రిజల్ట్సూ వచ్చాయి.

అయితే, రిజల్ట్సు చూడ్డంతో, దయానిధి కూర్చున్న రాకింగ్ చైర్ మాత్రం ఊగడం ఆగింది.

ఫస్ట్‌ప్రైజ్ ఎదురుగా రాంబాబు పేరుకి బదులు తన పేరు ఉండడంతో, ఆయన ముఖం మీద అప్పటి వరకూ వెలుగుతూన్న చిరునవ్వూ ఆగిపోయింది.

ఏవిటిది? తన పేరు ఎలా వచ్చింది? ఈ కథ తను రాయలేదే!

తన పేరు పెట్టి ఎవరు రాశారు చెప్మా? ఒక్క క్షణం అర్థం కాలేదు. తర్వాత అర్థం అయింది.

ఆశ్చర్యంకావడంతో, అప్పటివరకూ ఐదు వేలు అందబోతున్నాయన్న సంతోషం కాస్తా పోయి దాని స్థానంలో భరించలేని ఉక్రోషం, చిన్నతనం, అవమానం చోటు చేసుకున్నాయి. పెదిమలు బిగిశాయి. పళ్ళు పటపటలాడాయి.

ఎంత పని చేశాడు రాంబాబు?

తన పేరు ఉపయోగించుకుంటాడా?

దయానిధిలో ఉన్న శేషాద్రి మేల్కొన్నాడు. పళ్ళు పటపటా కొరికాడు- కళ్ళు చింతనిప్పు లయ్యాయి. సంతోషంతో ప్రైజు కబురు చెప్పడానికి వచ్చిన రాంబాబుని చూస్తూనే "గెటవుట్ - నీ మొహం నా కింకెప్పుడూ చూపించకు" అంటూ అరిచాడు- లాల్చీ జేబులు రెండింటిలోనూ, ఓ దాంట్లో పేరూ, మరో దాంట్లో డబ్బూ నింపుకుని నిలబడ్డ అదృష్ట జాతకుడూ, రాంబాబుకి కూడా శేషాద్రిగా అనాదు తెలియవచ్చిన ప్రసిద్ధ కథకుడూ అయిన దయానిధి. ఓడిన రాంబాబు ఠీవిగా నడిచి వెళ్ళిపోయాడు. నెగ్గిన దయానిధి కుర్చీలో కుంచించుకుపోయాడు.

*

# దీపం కొడిగట్టింది

—ఘండికోట బ్రహ్మాజీరావు

సీతమ్మకు సేయిస్తి
సింతాకు పతాకము - రామసెంద్రా!

పాడుతున్న వాళ్ళిద్దరిలో పెద్దవాడి వయసు పది సంవత్సరాలకు మించదు. వాడు కట్టుకున్న నిక్కరు చాలవరకు చిరిగిపోయింది.

వాడికన్న చిన్నవాడు రెండోవాడు - వాడు తంబురా మీటుతున్నాడు. పొడుగాటి బనీను తొడుక్కున్నాడు. బనీను నిక్కరు పెద్దవాడివే. చిన్నవాడికి ఏమీ లేవు.

సంత అప్పుడే కూడుతోంది. గోపాలపట్నం సమీపంలో ప్రతి శనివారం ఉదయం సంత కూడుతుంది. చుట్టుపట్ల గ్రామాలనుంచి కూరగాయలు తెచ్చి అక్కడ అమ్ముతారు. పట్నంలోని మారు వర్తకులు వాటిని కొనుక్కుంటారు.

చిన్నవాడు పాడడం లేదు - కాని, తంబురా మీటుతూ ఒకొక్కసారి గెంతుతున్నాడు.

ఉల్లిపాయలు, ములగకాడలు, పచ్చిమిరపకాయలు, తోటకూర - వీటి నన్నిటినీ చంద్రమ్మ సంతలో అమ్ముతుంది. వాటన్నిటినీ సర్దడంలో ఆమె నిమగ్నమై ఉంది.

అయిదు నిమిషాలయింది. ఆమె వీళ్ళను గుర్తించినట్లు కూడా లేదు. తన పనే తాను చేస్తోంది. పెద్దవాడు పాడడం మానలేదు. ఆవిడ దృష్టిపడితే జోలిలో కొన్ని కూరలు పడతాయి. కాని, ఇంకా బోణీ కాలేదని వాళ్ళకేం తెలుసు?

పెద్దవాడు పాడడం ఆపేడు. ఆమెకు కోపం వస్తే ఏమీ దొరకవని భయపడ్డాడు. చిన్నవాడు మాత్రం, ఆమె ఎటువేపు తిరిగితే అటువేపే తిరిగి, గెంతుతూ, తంబురా జోరుగా మీటుతున్నాడు.

"చూసిన్నానా, సినింద్రీగా! బోణీలేందే ఏటీయియ్యన్నా! - నువ్వు గెంతు, కాళ్ళిరసుకో!" అంది చంద్రమ్మ. ఆమె పలుకులలో కోపం ఏమాత్రమూ లేదు.

"సిన్నోడా! సాలూరుకో!" పెద్దవాడు గద్దించాడు.

చిన్నవాడు అన్నమాటను జవదాటనివాడిలా, వెంటనే బుద్ధిమంతుడిగా నిలబడ్డాడు.

ఇంతలో ఎవరో వచ్చి సరుకులు కొనుక్కున్నారు. కొన్నవాళ్లు వెళ్ళిపోయారు కాని చంద్రమ్మ మాత్రం తన మాట నిలబెట్టుకోలేదు. పక్కనే దుకాణం సర్దుతున్న నీలమ్మతో మాటలు మొదలుపెట్టింది.

చిన్నాడికి కోపం వచ్చిందో ఏమో, తంబురా మళ్ళీ వాయించడంతో చాలించకుండా, పాడడంకూడా మొదలెట్టాడు:

"నాయిడోరింటికాడ
నల్లతుమ్మసెట్టుకాడ
నాయిడేమన్నాడే పిల్లా?"

చిన్నవాడి గొంతులో తీయదనముంది. పాటకి, తంబురా వాయించడానికి ఎక్కడో అనునయం కుదిరినట్లనిపించింది. చంద్రమ్మ మాటలు మానేసి, పాటనే వినడం మొదలు పెట్టింది. నీలమ్మకూడా అటువేపే తిరిగింది. సంతకొచ్చిన మరికొందరు కూడా చేరారు. చంద్రమ్మ చిన్నవాడి పాటను వద్దనలేదు. పది నిమిషాల తరువాత వాడు పాట ముగించాడు.

"చంద్రమ్మా! నేను సెప్పనేదా? రామలచ్చన్లే!" నీలమ్మ సంతోషం వెలిబుచ్చింది. రెండు వంకాయలు, ముల్లంగి ఒకటి పెద్దవాడు పట్టిన జోలెలో వేసింది.

"ఏటోనమ్మ! ఈ వొయసుకో ఏం పేరజ్జమో! ఈల్లపాలిటికి మునిల్దోర్తి." అంది చంద్రమ్మ, నాలుగు రకాల కూరలు జోలెలో వేస్తూ.

"ఓరి పెద్దోడా! సంకురేతిరికి నీకో జత బట్టలు కుట్టిస్తారా!" అంది నీలమ్మ.

"ఓరి నినింద్రీగా! నీకు నిక్కరు, సొక్కా కొనిపెడతాలే" అంది చంద్రమ్మ.

పెద్దవాడు వంగి యిద్దరికీ దండం పెట్టాడు. కొండంత బరువు భుజాల మీద పెట్టుకున్నట్లు కనిపించాడు.

చిన్నాడి పెదవులు మీద చిరునవ్వు తోచింది. పనయిపోయినా వాళ్ళు మాత్రం అక్కడి నుంచి కదల్లేదు.

''పొండర్రా, పొండి! పండుగ ముందు సంతలో బట్టలు తీస్తాలే!" అంది చంద్రమ్మ.

పెద్దాడు తలగోక్కుంటూ నీలమ్మ దుకాణంముందు నిలబడ్డాడు.

''నీ గోలేమిటో సెప్పు!'' అంది నీలమ్మ.

"నీలమ్మ తల్లీ! నాకిస్కూలు డ్రస్సు కుట్టించు, బడికి పోతా!" అన్నాడు పెద్దవాడు.

''ఏటేటి! మళ్ళా సెప్పు?" నీలమ్మ ప్రశ్నించింది.

''సదువుకుంటా! మా యింటికాడ యిస్కూలుంది. అందులో కుర్రాళ్ళు నీలి నిక్కర్లూ, తెల్ల సొక్కాలు ఏసుకుంటారు. అయి తొడుక్కుంటే బడికి రానిస్తారంట!''

"ఓరోరి పెద్దోడా! నీ మాటింటుంటే నవ్వాలో ఏడవాలో తెలీదం లేదురా!"

"కాదు తల్లీ! ఎందరో కుర్రాళ్ళు సదువు కుంటున్నారు."

"అవున్రా! అళ్ళంతా ఏటయ్యో, వందో కట్టి సదువుతున్నార్రా!"

పెద్దవాడు పరమ సత్యమేదో తెలిసినట్లు మాటలు లేకుండా ఉండి పోయాడు. ముఖం దించుకున్నాడు. చిన్నాడు, అన్నముఖం ఉదాసీనంగా ఉండడం చూసి, దగ్గిరగా వచ్చి అన్నచేతిలో చేయిచేర్చి ముందుకు నడిపించుకు పోయాడు.

సంతలో కొంతసేపు, మరికొంతసేపు బజార్లో, బేకరీసాయిబు దగ్గిర, వాళ్ళు పాటలు పాడారు. అప్పటికే యెండ మళ్ళింది. వాళ్ళిద్దరూ యాచన చాలించి ఇంటివైపు తిరిగిపోయారు.

కైలాసపురం పోయే డెబ్భైఅడుగుల రోడ్డుకి, ఇటుపక్క, అటుపక్క కాలనీలు కాస్తున్నాయి. వాటిలో కొత్త కొత్త యిళ్ళున్నాయి. ఆవరణలు, పూల మొక్కలు, రంగు రంగుల గోడలు అందంగా కనిపిస్తున్నాయి.

ఒక యింటిముందు కారాగింది. కాన్వెంటు బట్టలు తొడుక్కున్న యిద్దరు కుర్రాళ్ళు దానిలో ఉన్నారు. గేటు వెలుపల నిలబడి తంబురా మీటుతున్న పెద్దవాడు కొంచెం వెనక్కెళ్ళి, ఆ కుర్రాళ్ళు తొడుక్కున్న బట్టలు, వాళ్ళ చేతుల్లో పుస్తకాల బాగులు చూస్తూ ఉండిపోయాడు. నౌకరొకడు గేటు తలుపులు తీశాడు. కారు లోపలికి వెళ్ళిపోయింది. కుర్రాళ్ళు కారులోంచి దిగారు. పోర్టికోలోనున్న పెంపుడు కుక్క వాళ్ళనిచూసి తోకాడిస్తూ అభిమానం వెల్లడించింది. వాళ్ళలో చిన్నవాడు గొలుసు విప్పి కుక్కను విడిచిపెట్టాడు. వెంటనే అది సింహంలా గేటువైపు పరుగుతీసింది. ఆ బడిపిల్లలు దానిని ఆపడానికి వెనకాలే పరుగెత్తారు. చిన్నోడు గేటుకి సమీపంలో ఉన్నాడు. కుక్క అరుస్తూ మీదపడబోతుంటే ఒక్క గెంతు గెంతి వెనక్కు పరుగెత్తాడు. కాలికడ్డమున్న సిమెంటు పావంచాను తొందరలో తన్నుకొని, కంకర నేలమీద పడ్డాడు. జోలెలో బియ్యం, కూరలు అన్నీ నేలమీద పడిపోయాయి. వాడి మొణుకు బాగా చెక్కుకుపోయి నెత్తురు కారింది. ఇంటివాళ్ళు కుక్కను లోపలికి తీసుకుపోయారు.

అసలే చిన్నవాడు లక్ష్మణుడాయెను.

"నూడి కుక్కనేటిసేత్తానో!" అంటూ రాయి తీసుకొని, లోపలికి లాక్కెళ్తున్న కుక్క మీదికి విసరాలని ప్రయత్నించాడు. పెద్దవాడు వారించాడు. మట్టిలో కలిసిన బియ్యం, నేలను దొర్లిన కూరలు వీలైనంతమేరకు పెద్దవాడు జోలిలోకి ఎత్తుకున్నాడు. తమ్ముడి చేతిని పట్టుకొని, బలవంతంగా నడిపించుకుపోయాడు.

ఆ రోడ్డంట వెళ్ళగా, వెళ్ళగా కైలాసపురం వస్తుంది. ఎడంచేతివేపు కొండలున్నాయి. ఆ కొండల్ని మెట్లుగా చెక్కి కొందరు యిళ్ళు కట్టుకున్నారు.

వాటిలో పైఅంతస్తులో ఒక చిన్న పాక ఉంది ఆ పాకలో ఓ కుక్కి మంచ ముంది. దానిమీద ఓ ముసిలిది పడుకుంది. దానికి కళ్ళు కనిపించవు. వయసు ముదిరినా, కష్టాలు తినేస్తున్నా ఆ ముసిలిది మాత్రం మృత్యువును జయించి బతుకుతోంది. దానికూతురు వెళ్ళిపోతూ ఇద్దరు పిల్లల్ని విడిచిపెట్టింది. బహుశా ఆమెకు తెలుసునేమో, తల్లి బతకాలంటే పిల్లల్ని వదిలి పెట్టాలని. వాళ్ళే రామలక్ష్మణులు - పెద్దోడు, సిన్నోడు - వాళ్ళే ఆ ముసిలిదానికి దిక్కు. పొద్దున్నే ఏదో గంజి కాచి, జోలెపట్టుకు వెళ్తారు. మధ్యాహ్నం ఎండ చల్లబడు తుంటే వచ్చి, ఏదో వండి, ముసలిదానికింత పెట్టి వాళ్ళు తింటారు.

ఆ మధ్యాహ్నం ఆకాశం మీద నల్లటి మేఘమొకటి తోచింది. క్రమంగా అది వ్యాపించింది. గాలి వీచడం మొదలుపెట్టింది; వేగాన్ని పుంజుకుంది. పెద్ద వాడు జోలె భుజానికి తగిలించుకున్నాడు ఒక చేతితో తంబురా పట్టుకున్నాడు. రెండో చేత్తో తమ్ముడి బరువు కొంత తీసుకున్నాడు. వాళ్ళిల్లు ఇంకో మైలు దూరముంది. ముందుకి పోనీయకుండా గాలి తోసేస్తోంది. వర్షం మొదలయింది. ఎడతెరపి లేకుండా కురవడం జరిగింది. కనుచూపుమేరలో ఇల్లేదీ కనిపించ లేదు వాళ్ళకి. పెద్దాడు నడుస్తున్నాడు - చిన్నవాడు కుంటుతున్నాడు. గాలి యిద్దరినీ వెనక్కి నెట్టుతోంది. వర్షం నిర్దాక్షిణ్యంగా మోదుతోంది.

ఏవో ఆలోచనలు పెట్టుకొని పెద్దవాడు, బాధతో ఆలమటిస్తున్న చిన్న వాడు యిల్లు చేరేసరికి బాగా చీకటి పడింది. చిన్నవాడు మీద కెక్కలేక పోయాడు. ముందు జోలె, తంబురా పాకలో పెట్టి, పెద్దవాడు కిందకొచ్చి చిన్న వాడిని మోసుకుపోయాడు. చిన్నవాడిని మంచం మీద కూర్చోబెట్టి పాకంతా కలయజూశాడు.

వర్షం వెలిసింది. కొండమీద కురిసిన వాన కాలువలై ప్రవహించింది. ఒక కాలువ గుడిసెలోంచి పోయింది. పెద్దవాడు వంటకని జతపెట్టిన ఎండు పుడకలన్నీ దానితో కొట్టుకుపోయాయి- నేలంతా చిత్తడిగా ఉంది. మధ్యాహ్నం సంతనుండి బైటికొచ్చేసరికి కొన్ని కూరగాయలు దొరికాయి. సెట్టిగారి దుకాణం మీద కొంచెం పెసరపప్పు లభించింది. అన్నం, పులుసు వండుకొని తిందామని అన్నదమ్ములనుకొన్నారు. కాని, దొరికిన బియ్యం నిండా మట్టి; పెసరపప్పుకి కూడా అదే గతి పట్టింది. అన్నిటికీ ముఖ్యమైన ఎండు పుడకలలో

ఒకటి కూడా పాకలో లేదు. బేకరీ సాయిబు రెండు బన్నురొట్టె లిచ్చాడు. ప్లాస్టిక్ సంచులలో ఉండడం చేత అవిమాత్రం పాడవలేదు. మరొక అమ్మ యిచ్చిన జామకాయ స్వచ్ఛంగా కనిపించింది.

గాలికి రెండుకమ్మలెగిరి, పైనున్న చందమామ లోపలికి తొంగిచూస్తున్నాడు.

పెద్దవాడు తపస్సులోనున్న ఋషిలా నిలుచున్నాడు. ఒక బన్ను అవ్వకిచ్చాడు; రెండోది తమ్ముడికిచ్చాడు. వేడి వేడి అన్నంలో పులుసుపోసుకు తిని, చంద్రమ్మా, నీలమ్మా కొని పెట్టే బట్టల గురించి, చదువు గురించి, చక్కగా ఆలోచించాలని అనుకున్నాడు. చివరకి తనకు మిగిలిన జామకాయను నములుతూ మూలనున్న కర్ర పెట్టెమీద కూర్చున్నాడు.

పైన వెన్నెల మసకబారింది.

"పెద్దోడా! బుడ్డీ ఎలిగించినావా?'' రోజూ అడిగినట్లే ఈ రోజూ అవ్వ ప్రశ్నించింది.

పెద్దవాడు జవాబు చెప్పలేదు.

చిన్నవాడు నిద్రలో ఉన్నాడు.

''సీకట్లో తినకురా, పెద్దోడా!'' అవ్వ మళ్ళీ అంది.

"కానవ్వా, దీపం కొడిగట్టింది!" అన్నాడు పెద్దవాడు పదేళ్ళకే వేదాంతమంతా జీర్ణించుకొని.

*

# బహూ బహూ బహూమతి ప్రధానము

—స్వామి చిత్రానంద

''ఆలిండియా మనీ మినీ సభల ఫెడరేషన్ సౌజన్యంతో జరుగుతున్న ఈ సభకు విచ్చేసిన మీకు మా స్వాగతం—''

సభలో కరతాళ ధ్వనులు.

ఓ కార్యకర్త వచ్చి ఆ వక్త చెవిలో ఏదో చెప్పాడు. ఆ వక్త తన తప్పు తెల్సుకుని - "క్షమించాలి 'ఆలిండియా మనీ మినీ సభల ఫెడరేషన్ కాదట - ఆలిండియా మెనీ మినీ సభల ఫెడరేషన్' అంటున్నారు. ఈ తప్పుకు క్షంతవ్యుడను—"

"ఆదిలోనే హంసపాదా?" అన్నారు ప్రేక్షకుల్లో ఒకరు.

వక్త వుపన్యాసం ప్రారంభించాడు.

"మహాశయులారా, బహూ.... బహూ...."

జనం ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు

"నాకు నత్తిలేదు. 'బహూ' అనే పదాన్ని కావాలనే రెండుసార్లు వాడాను. చాలా చాలా బహూమతులు వున్నాయి గదా! అందుకని- 'బహూ బహూ బహూమతులు' అని వాడాను."

సభలో కరతాళధ్వనులు - కాని, ఒక మూలనించే వినబడ్డాయి!

"ఇహపోతే - కార్యకర్తల్లో ముఖ్యుడిగా నేను మరో విషయం కూడా తమకు మనవి చేయాలి. 'ప్రధానం' అనే మాటలో 'దా'కి ఒత్తు వుందదని ఒక

శ్రేయోభిలాషి అన్నారు. కాని- ఆ మాటకు ఒత్తు వుండాలా? వుండకూడదా అని నిర్ణయించాల్సింది ఎవరు? మా కార్యవర్గం. కార్యవర్గాన్ని సమావేశపరచడానికి వ్యవధి లేదు. అంచేత, ఈ గ్రామంలో నిఘంటువు కోసం వెదికాం- కానీ దొరక లేదు. అంచేత 'జాకబ్'గారనే తెలుగు మేస్టారిని సంప్రదించగా- 'ఒత్తువుంటేనే బెటర్' అన్నారు. 'పెళ్ళి ప్రధానం' లోనూ, 'భారత ప్రధాని' లోనూ కూడా ఒత్తు వుంది. అంచేత ఒత్తువుంటేనే ఫోర్సు వుంటుందన్నారు. అంచేత మేం రాయించిన బేనర్సుగానీ, పోస్టర్సుగానీ అలాగే వుంటాయి. ప్రాత్రికేయుల్ని ఈ విషయంపై రభస చేయొద్దనీ, రాయొద్దనీ కోరుతున్నాను.

ఇహపోతే - ఈనాడు (మీ) మా సభ, నాటి నేటి మేటి నటీమణులకూ మరియూ, సాంకేతిక నిపుణులకూ బహుమతులు ప్రకటిస్తున్నది. త్వరలోనే అంచే జ్ఞాపికలు తయారైన వెంటనే వారి వారి ఇళ్ళకు అవి జేర్చబడతాయి. నేను మీకు ముందుగానే విన్నవించినట్టు బహుమతులు చాలా చాలా వున్నాయి. కార్యక్రమం చాలా చాలా సుదీర్ఘంగా వుంటుంది. మధ్యలో కాస్సేపు అంత రాయం వుంటుంది - అదే ఇంటర్వల్. ఆ ఇంటర్వల్లోనే ఆహూతులకు స్వల్పంగా అల్పాహారం వుంటుంది. ఆ ఇంటర్వల్ తర్వాత సభ యథాతథంగా పునఃప్రారంభం అవుతుంది. మేం పిలిచిందే తడవుగా మీరు విచ్చేసి ఈ సభను జయప్రదంగా ప్రారంభించడానికి తోడ్పడ్డారు. అదే విధంగా చివరవరకూ వుండి, సభను దిగ్విజయంగా అంతం చేయాలని మళ్ళీ మళ్ళీ మిమ్మల్ని మరీ మరీ కోరుతున్నాను—''

సభలో చప్పట్లు - 'సుత్తి.. .సుత్తి....' అనే ధ్వని వుంది ఆ తాళంలో,

వక్త మళ్ళీ వుపన్యాసం ప్రారంభించాడు:

''ఇహపోతే - బహు బహు బహుమతుల ప్రకటన-

''ఒత్తులు పలికిన నటి బహుమతి ప్రకటన-''

సభలో కరతాళ ధ్వనులు నిజంగానే మిన్నుముట్టాయి.

''నటనతోపాటు వాక్శుద్ధి కలిగి, 'అమ్మబాబోయ్!' చిత్రంలో ఒకటి కన్న ఎక్కువ శాతం ఒత్తులు పలికిన నటి కుమారి శర్వాణి - ఈమెకు ఈ బహుమతిని సమర్పిస్తున్నవారు తెలుగు భాషాభివర్ధనీ సమాజం, బెంగుళూరు.''

సభలో కరతాళ ధ్వనులు, ఆ ధ్వనుల మధ్య వేదికపైనించి కిందకు ఒక తెల్లని స్వచ్ఛమైన బానరులాంటి గుడ్డ జారి వచ్చింది. అది వేదిక మీద వున్న వారి తలను తన్నుతున్నట్టువుంది. దానిమీద చక్కగా 'తెలుగు భాషాభివర్ధనీ సమాజం, బెంగుళూరు' అని రాసివుంది,

సభలో మళ్ళీ చప్పట్లు.

వక్త మైకును దగ్గరకు లాక్కున్నాడు.

"సభాసదులారా! మీరు మరీ ఇంతింతసేపు కరతాళధ్వనులు చేస్తే మీకే నష్టం. అమూల్యమైన మీ కాలమే వృథా అయిపోతుంది. అంచేత నేను కుడిచేయి చూపించినపుడు చప్పట్లు ప్రారంభించి - ఎడంచేయి చూపించగానే ఆపుచేయండి. మీరు మాతో సహకరిస్తే సభ చాలా తొందరగా దిగ్విజయంగా అంతమవుతుంది. నమస్తే! ఇహపోతే - కుమారి శర్వాణి గురించి - ఈమె 'అమ్మబాబోయ్!' చిత్రంలో రెండువందల వత్తులు పలకాలి. కాని, మిగతా నటీమణుల కంటె అత్యధిక వత్తులు పలికింది. ఈమె నాలుగు వత్తులు - అక్షరాలా నాలుగు వత్తులు పలికింది. కాని, వీటిలో రెండు వత్తులు పలకరాని చోట పలికింది. అంచేత ఆమె సరిగా రెండు వత్తులు పలికింది - అని న్యాయ నిర్ణయ సంఘం తీర్మానించింది."

"ఆమె పలకరాని వత్తులు ఏవిటి? అవి కాస్త వివరించండి" అన్నాడు ఓ అభిమాన సంఘ కార్యదర్శి.

వక్త న్యాయనిర్ణేతల వైపు ప్రశ్నార్థకంగా చూశారు. వారు 'చెప్పు' అన్నట్లు తల పంకించారు. వక్త వుపన్యాసం ప్రారంభించాడు:

" "నా తల భారంగా వుంది' అనే డైలాగును ఆమె 'నా తల భారంఘా వుంధి' అని చెప్పింది. ఈమెకు ఎవరు గాత్రదానం చేయలేదు అందుకే ఈమెకు ఈ బహుమతి."

వక్త కుడిచేతినీ, తర్వాత ఎడంచేతినీ చూపించాడు. అతని సూచన ప్రకారం చప్పట్లు ప్రారంభమై, ఆగిపోయాయి.

"ఇహపోతే - అత్యధికంగా దుస్తులువాడిన నటి కుమారి పాంచాలి."

కరతాళధ్వనులు వక్త సూచన మేరకు మిన్నుముట్టాయి.

వెంటనే 'తెలుగు భాషాభివర్ధనీ సమాజం, బెంగుళూరు' అనే బానరు అదృశ్యమయింది. వెనువెంటనే 'శారీ సాగర్ - హైదరాబాద్' అనే జాలరు ప్రత్యక్షమయింది

ఆ 'శారీ సాగర్'కు సంబంధించిన సిబ్బంది, బంధువులు, మిత్రులూ, అంతా చప్పట్లు కొట్టారు. వక్త రెండు చేతులతో చప్పట్లు ఆపమని - ఉపన్యాసం ప్రారంభించాడు:

''మహాశయులారా! ఈ కుమారి పాంచాలి ఈ సంవత్సరం 22 చిత్రాల్లో నటించింది. అందులో 'పేదపిల్ల' చిత్రం అతి ముఖ్యమైనది. ఆ చిత్రంలో వాడినన్ని దుస్తులు మరే చిత్రంలో ఆమెగానీ, మరే నటిగాని వాడలేదు. అది ఆల్ టైమ్ ఆంధ్రా రికార్డ్! ఈమె ఏభై ఆరు రెడీమేడ్ దుస్తులను, నూట ఏభై ఆరు చీరలు వాడింది. ఈమెకు బహుమతిగా 'శారీ సాగర్, హైదరబాదు' వారు నేటి నుండి ఒక సంవత్సరం వరకూ ఈమెకు, ఈమె తలిదండ్రులకూ—"

"తండ్రులెంత మందేమిటి?" అని గొణుక్కున్నాడు ఓ ప్రేక్షకుడు.

"అక్కలకు చెల్లెళ్ళకూ, పని మనుషులకు మూడు వేల రూపాయలు విలువచేసే దుస్తులు ఇస్తామని ప్రకటించారు."

చప్పట్లు వక్త 'హస్తానుసారంగా' మారుమోగాయి.

"ఇహ పోతే - చిత్రంలో అత్యధిక టేకులు తిన్న నటి - అంత ఎక్కువ ముడి ఫిలింను వుపయోగించిన నటీమణీ—" అని చెప్పబోతూ ఆగాడు.

పైనించి 'పిక్చర్ అండ్ సౌండ్" అనే పేరున్న బానరు కిందకు జారింది. 'శారీ సాగర్' బానరు పైకి పోయింది.

వక్త ఉపన్యాసం ప్రారంభించాడు:

"ఈ బహుమతిని సమర్పిస్తున్నవారు 'పిక్చర్ అండ్ సౌండ్ లిమిటెడ్ ఉదక మండలం, తమిళనాడు' వారు. ప్రఖ్యాత నటీమణి శ్రీమతి సంధ్యారాణి. 'సూదిబెజ్జం అంత నోరు - ఆకాశమంత ఆకలి' అనే చిత్రంలో ఒక దృశ్యంలో ఒక షాటును 26వ టేకుకి ఓకే చేసింది. కాని, ఈమె సోదరి అరుణారాణి కూడ మరో చిత్రంలో 28వ టేకుకు ఒకే చేసిందట! కాని, ఆమె టేకుల లెక్క ఒకటి నుండికాక, 50 నుండి ప్రారంభమై 50,49.48,47,46 ఇలా అవరోహణ అవుతూ

28వ చేకుకు ఓకే చేసింది. కాని, ఇది న్యాయనిర్ణేతలు అంగీకరించలేదు. ఆమెకు ఒకటో నంబరు చేకును ఓకే చేయించుకోవాలనే చిరకాల వాంఛ నెరవేర్చుకుందుకు ఆమె ఆ పద్ధతి అవలంభించిందని న్యాయనిర్ణేతల సంఘం ఏకాభిప్రాయం. అంచేత ఆమెకు బహుమతి లభించలేదు.

శ్రీమతి సంధ్యారాణి బహుమతిని పిక్చర్ అండ్ సౌండ్ లిమిటెడ్ ఉదకమండలం వారు ఇస్తున్నారు. వెంటనే ప్రారంభమయ్యే ఆమె చిత్రానికి ఆ కంపెనీ 26 వేల అడుగుల ముడి ఫిలింను అసలు ధరకు అప్పుగా ఇస్తుంది. ఒక వేళ ఆ చిత్రం మధ్యలో ఆగిపోతే తర్వాత ప్రారంభమయ్యే చిత్రానికి ఇస్తుంది. ఇది రెండు చిత్రాలకే పరిమితం—"

జనం చప్పట్లు కొట్టారు.

వక్త ఉపన్యాసం పునః ప్రారంభించాడు.

''ఇహపోతే - అత్యంత పొడవు పేరు గల చిత్రం - ఈ బహుమతిని అందిస్తున్న వారు 'తెలుగు లిథోగ్రాఫర్స్, విజయవాడ' వారు—''

వెంటనే ఆ పేరు గల బానరు పైనించి వచ్చింది.

చిత్రం పేరు - 'మనం పోతేనేం - ప్రాణం దక్కింది - అదే పదివేలు.'

కరతాళధ్వనులు యథాప్రకారం.

"ఈ చిత్ర నిర్మాతలకు లిథోప్రింటర్స్ యిచ్చే కానుక - చిత్రం శత దినోత్సవానికి వేయి పోస్టర్లు సగం ఖరీదుకూ - వాటిని అంటించడానికి అవసరమయ్యే -"

''అగ్గిపెట్టెలు - '' ఓ కొంటె కోణంగి అరిచాడు.

''కాదు - కాదు - వాటిని అతికించడానికి అవసరమయ్యే మైదాపిండిని ఉచితంగా సమర్పిస్తారు. తెలుగు లిథోగ్రాఫర్స్ అధినేత శ్రీ ప్రసాద్ గారిని వేదిక మీదకు వచ్చి వారి అసనాన్ని అలంకరించవలసిందిగా కోరుతున్నాను''

శ్రీ ప్రసాద్‌గారు ఠీవిగా వేదిక మీదకు వచ్చి ఆసీనులయ్యారు.

వక్త ఉపన్యాసం ప్రారంభించాడు.

''ఇహపోతే - అత్యధిక అన్య భాషా చిత్రాల ఆధారంగా నిర్మించబడిన తెలుగు చిత్రం.... ఈ బహుమతిని ఇస్తున్నవారు 'విశ్వ వీడియో కవున్సిల్. వెంటనే ఆ పేరుతో బానరు పైనించి వచ్చింది.

జనంలో చప్పట్లు.

"చిత్రం పేరు - 'తెలుగు వెలుగు - ' ఈ చిత్ర నిర్మాతకు కానుకగా ఈ విశ్వ వీడియో కవున్సిల్ వారు విదేశాల్లో విడుదలైన వీడియో కేసట్లను ఆరు మాసాలవరకూ ఉచితంగా అందజేస్తారు. ఆ తర్వాతనే వాటిని మార్కెట్‌లో డిస్ట్రిబ్యూట్ చేస్తారు. వారి ప్రతినిధి రాలేదు.

"ఇహపోతే - 'అత్యధిక గ్రామాల్లో నటించిన నటుడు-వీరికి బహుమతిని ఇస్తున్నవారు - ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ.''

యథాప్రకారం జాలరు వచ్చింది. వెనుక బస్సు హారనూ, ఇంజను మోత-జనం గోల కూడా వినబడ్డాయి.

"నటుడు మీ అందరి ఆదరాభిమానాల పాత్రుడు - శ్రీ హాస్య నారద -''

సభలో విపరీతమైన చప్పట్లు.

"వారి సౌకర్యం కోసమే ఈ వేడుక పండుగని ఈ గ్రామంలో ఏర్పాటు చేశాము కాని - వారు నటిస్తున్న చిత్రం - హీరోయిన్ అంతఃకారణాలవల్ల అర్ధాంతరంగా ఆగిపోయింది. తమ మనశ్శాంతికోసం వారు తమిళనాడులో ఓ మారుమూల గ్రామంలో విశ్రాంతి తీసుకుంటున్నారని తెల్సింది. వారి ఆత్మకు శాంతి ప్రసాదించమని నేను ఆ భగవంతుణ్ణి ఈ సభాముఖంగా వేడుకుంటున్నాను.

ఇకపోతే - ఆ బహుమతి వివరాలు: రోడ్డు రవాణా సంస్థవారు - ఓ ఏడాది పాటు వారికీ వారి శ్రీమతికీ, వారి కుటుంబ సభ్యులకూ ఉచితంగా బస్సు సౌకర్యం కల్పిస్తారు-"

సభలో చప్పట్లు అంతగా లేవు.

"ఎంత ఫ్రీ పాసులిస్తే మాత్రం - బస్సులో ఎవరెక్కారండీ? అసలే రోజులు బాగా లేవు" అన్నారు ఓ మూలనించి ఓ కుటుంబరావు గారు.

"ఇహపోతే - అత్యధిక తప్పులతో వచ్చిన చిత్ర సమీక్ష -"

జనం ఆత్రుతగా చూస్తున్నారు. కాస్సేపు వారిని అలా సస్పెన్సులో వుంచి - వక్త చెప్పడం మొదలెట్టాడు;

"ముఖస్తుతి పత్రికలో ప్రియబాంధవి 'సత్యంవధ' చిత్రంపై రాసిన సమీక్ష. దీనికి బహుమతిని 'తెలుగు రైటర్స్ అండ్ పబ్లిషర్స్ కంబైన్స్' సమర్పిస్తుంది. బహుమతి వివరాలు ఇంకా ధృవపడలేదు కాని, 'ముఖస్తుతి' పత్రికను ఆ చిత్ర నిర్మాతకూ, దర్శకుడికీ నటీనటులకూ, సాంకేతిక నిపుణులకూ ఒక ఏడాదిపాటు వుచితంగా పంపుతారని వూహాగానం."

అప్పటికే ఆ పత్రిక తాజా సంచికను ప్రేక్షకుల్లోకి విసురుతూ పత్రిక సర్క్యులేషన్‌ను పెంచడానికి యథాశక్తి కృషిచేశారు కొందరు.

"మహాశయులారా! ఇహపోతే - ఇప్పుడు ఓ అరగంట 'అంతరాయం'. ఆ ఇంటర్వెల్ తర్వాత సభ ప్రారంభం అవుతుంది. సభా ప్రారంభమవుతున్నదని సూచనప్రాయంగా ఓ గంట మోగుతుంది. వెంటనే మీరు లోనికి దయచేసి మీ మీ ఆసనాలు అలంకరించాల్సిందిగా కోరుతున్నాను."

అప్పటికే జనం హడావిడికి బయటకు వెళ్ళిపోయారు.

"మీ తిండి మీదే" అన్న బోర్డు దగ్గర గుమిగూడారు - రకరకాల తినుబండారాలున్నాయి. ఎవరికి కావలసింది వారికి దొరకలేదు - ఎవరికి దొరికింది వారు తీసుకుని అలా చాటుకు వెళ్ళిపోతున్నారు. టిఫిన్లు తినేవారు తింటున్నారు. కాఫీ తాగేవాళ్ల తాగుతున్నారు.

"హమ్మయ్య! వచ్చిన పనై పోయింది. ఇహ పోదామా - ఇళ్ళకూ - మనిళ్ళకూ" అని పాట పాడారు ఓ ముసలాయన. ఆయన మాజీ బాలానంద సభ్యుడో ఏమో - పాపం!

అలా టిఫిన్లు తినేసి కొంతమంది జారుకున్నారు.

"విందాం - మిగతా బహుమతులు కూడా వినేసిపోదాం"అన్నాడొకాయన-

"ఆ- ఎందుకండీ - టైంవేస్టూ - రేపు ఎలాగు పేపర్లో చూస్తాంగా-" అని మరో పెద్దమనిషి అన్నాడు.

ఏమైతేనేం చాలామంది ఇళ్ళకు వెళ్ళిపోయారు.

'అంతరాయం' పూర్తయినట్టు - గంటమోగింది.

బయట వున్నవారు మెల్లి మెల్లిగా లోపలకు వస్తున్నారు.

హాలు సగం ఖాళీగానే వుంది, అలా అంటే బావుండదు - హాలులో సగం వరకూ జనం వున్నారు అంటేనే బాగుంటుంది.

సభ ప్రారంభమైంది.

వక్త మైకు దగ్గరకు వచ్చాడు. మైకును టెస్ట్ చేశాడు. బాగా వుందని ధృవపర్చుకుని - తృప్తిగా ప్రేక్షకులవైపు తిరిగి-

"ఇహపోతే - అతి తక్కువ దుస్తులు ధరించిన నటి బహుమతి" అనగానే 'న్యూ దేవతా వస్త్ర పేలస్' అనే బానరూ వచ్చింది.

"అతి తక్కువ దుస్తులు ధరించిన నటీమణి - కుమారి సహజ సుందరి - ఈమె 'నన్నుచూడు - నా అందంచూడు' చిత్రంలో ధరించిన వస్త్రం వైశాల్యం మొత్తం 216 - అక్షరాలా రెండువందల పదహారు అంగుళాలు. ఆమెకు న్యూదేవతా వస్త్ర పేలస్‌వారు అయిదువేల రూపాయల విలువ చేసే చీరలూ - లంగాలూ - జాకట్లు (అన్నీ 7 గజాలవే) బహూకరిస్తారు.

వీరుగాక - పేరు తెలుపగోరని ఓ వజ్రాల వ్యాపారి ఆమెకు రెండు తులాల బంగారు సిగ్గుబిళ్ళనూ - ఆరు తులాల బరువుగల వెండి మొలతాడునూ ఇస్తారు."

సభలో చప్పట్లు.

"ఇహపోతే - అత్యంత పొట్టి పేరుగల చిత్రం—ఛీ!"

"ఛీ ... ఛి.... ఛీ" అని జనంలో అరుపులు.

"నాకు తెలుసు - ఈ చిత్రం మీకు ఎంత నచ్చిందో - పేరు ఎంత నచ్చిందో కూడా తెలుసు అందుకే చిత్రాన్ని మీరంత విజయవంతం చేశారు."

సభలో చప్పట్లు.

"ఇహపోతే - ఈసారి ఒక ప్రత్యేక బహుమతి - ఒక ప్రశంసాపత్రం. అది 'థియేటర్ సౌఖ్యమహల్' భాగ్యనగర్‌కు దక్కుతుంది."

చప్పట్లు-

"దానికి కారణం....ఆ థియేటర్లో కుర్చీలూ, బెంచీలు తీసేసి. చాపలూ, రుపులూ, మంచాలూ ఏర్పాటు చేశారు. ప్రతి ప్రేక్షకుడూ పడుకుని చిత్రం

చూడొచ్చు, లేదా నిద్రపోవచ్చు. కొందరు ప్రేక్షకులకు అదనపు చెల్లింపుతో రిమోట్ కంట్రోల్ స్విచ్ ఇస్తారు. వారికి అనవసరమైన దృశ్యాన్ని 'ఫాస్ట్ ఫార్వర్డ్' చేయమని బటన్ నొక్కితే - కాబిన్‌లో ఓ లైటు వెలుగుతుంది. దాని కింద ప్రేక్షకాభిప్రాయాన్ని తెలిపే 'నంబర్ ఇండెక్సు' వుంటుంది. ఎంతమంది ప్రేక్షకులు బటన్ నొక్కితే - ఆ సంఖ్య ఇక్కడ తెలుస్తుంది. ఆ సంఖ్య పదిహేను దాటితే - (15 మంది ప్రేక్షకులు కోరితే) ఆ దృశ్యాన్ని ఆపరేటర్ ఫాస్ట్ ఫార్వర్డ్ చేస్తాడు. ఈ విధంగా మూడు గంటల చిత్రం ఒకోసారి ఒక్క గంటలోనే పూర్తయిపోతుంది. కాని, వెంటనే ప్రేక్షకుల్ని బయటకు పంపరు. వారు అద్దె చెల్లించిన మూడు గంటలూ పూర్తయిన తర్వాతనే బయటకు వెళ్ళవచ్చు. 'ఇంటికన్న గుడి పదిలం అన్నట్టు' ఈ థియేటర్ బాగుందని జనం విరగబడుతున్నారు. ఈ సౌకర్యాన్ని కనిపెట్టి, మొదటిసారిగా అమలు పరిచిన ఆ థియేటర్ యజమానులు ధన్యులు - వారికి నా అభినందనలు. వారు ఇటువంటి థియేటర్ల నిర్మాణంలో నిమగ్నులై వుండటం చేత ఈ సభకు రాలేకపోయారు.

"ఇహపోతే - ఇప్పుడు. నాటి నేటి మేటి నటుడు శ్రీ భీష్మారావుగారికి సన్మానం, ఆ తర్వాత వారి సమాధానం వుంటాయి మీరంతా చివరవరకూ వుండి సభను దిగ్విజయంగా అంతమొందించి మరీ మీరు మీమీ ఇళ్ళకు వెళ్ళవలసిందని ప్రార్థన."

సభలో చప్పట్లు.

వేద పండితులు - పూర్ణకుంభంతో శ్రీ భీష్మారావుగారికి స్వాగతం చెప్పగా-

అయన్ని ఒక చక్రాల కుర్చీలో తోసుకుంటూ వేదిక మీదకు తీసుకు వచ్చారు. వారి గురించి ఎవరూ మాట్లాడలేదు. ఎందుకంటే, వారి గురించి ఈతరం వారికి ఎవరికీ తెలియదు. వారి సహాధ్యాయి ఒకరు దొరగ్గా వారిని మాట్లాడమన్నారు. వారు మైకు దగ్గరకు వచ్చారు.

"మహాశయులారా! నేనూ, శ్రీ భీష్మారావు సహాధ్యాయులం. నిజమే - కాని - ఈ విషయం మా ఇద్దరకే తప్ప మూడోకంటి వారికి తెలియదు. ఈ రహస్యాన్ని కనిపెట్టి మమ్మల్ని ఇక్కడకు రప్పించి - ఈ సన్మానం తలపెట్టిన - శ్రీ...." అని ఆగిపోయి పక్కనేవున్న వారికేసి చూశాడు.

"సభాసామ్రాట్ శ్రీ ఉదయాస్తమయరావు" అన్నారు ఒకరు.

"అదే- శ్రీ ఉదయాస్తమయరావుగారికి నా ధన్యవాదాలు. భీష్మారావుగారి గురించి నేను చెప్పడం కంటే - వారి గురించి వారే చెబితే - అత్యంత ఆసక్తికరంగా వుంటుంది. సెలవ్-" అని వెళ్ళిపోయాడు. ఆయన నిజంగానే ఇంటికి వెళ్ళిపోయాడు.

భీష్మారావుగారు మైకును రెండు చేతులతో పట్టుకున్నాడు. ముద్దుపెట్టుకున్నారు. నోటమాట రావడంలేదు. కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి.

కార్యకర్త ఒకరు వెళ్ళి ఆయనకు కప్పిన శాలువతోనే ఆ కన్నీరు తుడిచాడు. అయన్ని చూస్తున్న ఆయన శ్రీమతికీ కన్నీళ్ళు తిరిగాయి. ఆమె ఆ దృశ్యాన్ని చూడలేక వారి పెద్దబ్బాయి, పెద్దకోడలు, మనవలతో వెళ్ళిపోయింది. ఈ హృదయ విదారక దృశ్యాన్ని చూడలేక కొందరు ఎవరిపాటుకు వారు వెళ్ళిపోతున్నారు. కొందరు ఆసక్తికరంగా ముందు వరసల్లోకి వచ్చి కూచుంటున్నారు.

భీష్మారావుగారు మెల్లిగా తేరుకున్నారు. మాట్లాడాలని ప్రయత్నం -

"మహాశయులారా! ఈ రోజు, ఈ దినం - ఈ రాత్రి - నా జీవితంలో మరపురాని రోజు. మర్చిపోలేని దినం - మరవరాని రాత్రి - నా జీవిత హిస్టరీలో బంగారు బాల్ పెన్‌తో రాసుకోవాలి. అది తర్వాత సంగతి అనుకోండి. ఇప్పుడిదంతా చూస్తుంటే - నా మనసు సుమారు అరవైఏళ్ళు వెనక్కి పరుగెత్తింది. అప్పట్నుంచి ఇప్పటివరకూ నా జీవితచరిత్ర మీతో చెప్పుకోవలసిన బాధ్యత నాకుంది. వినవలసిన ధర్మం మీకుంది-"

"ధర్మం కాదు - ఖర్మం" అన్నాడు ఒకాయన బయటకు జారుకుంటూ.

భీష్మారావుగారు ఆయన స్వీయ చరిత్ర ప్రారంభించారు:

"నాకు బాగా జ్ఞాపకం. ఆరోజు జూన్ 13 తా॥ నేను మెడ్రాసు సెంట్రల్లో దిగాను. జేబులో రూపాయి, చేతిలో ప్లాట్‌ఫారం టిక్కెట్టూ వున్నాయి - సినీమా కంపెనీల చుట్టూ తిరిగాను. వేషాలు అడిగాను. పద్యాలు పాడాను. నటించి చూపించాను. అంతా నా పద్యాలు బాగున్నాయన్నారు- నా నటన మెచ్చు

కున్నారు. కాని వేషం వెంటనే ఇవ్వలేదు. చివరకు ఓ చిన్న వేషం దొరికింది. భోజనంపెట్టి మూడు రూపాయలిచ్చారు. భోజనం మాత్రం నేను మూడ్రోజులకు సరిపడా తిన్నాను. ఆ మూడు రూపాయల్లో ఓ రూపాయి నా స్నేహితుడికి మని ఆర్డరు చేశాను. అతను చాలా సంతోషించాడు. అతని కల ఫలించినందుకు గర్వంగా వుందంటూ వుత్తరం రాశాడు కూడా.

ఆనాడు నేను ఏ పద్యాలు చదివి వేషం సంపాదించి నటుణ్ణి అయ్యానో ఆ పద్యాలు మీకు వినిపించాలని నా మనసు ఉబలాటపడుతోంది."

"మా మనసులేం పట్టంలేదు" అంది ఓ గొంతు.

"అదిగో ద్వారక-" పద్యం చదివారు.

ఓ కార్యకర్తవచ్చి ఆయన చెవిలో ఏదో చెప్పాడు. ఆయనేం వినిపించుకోలేదు.

"చెల్లియో చెల్లకో" చదివారు.

మరో కార్యకర్త వచ్చి చెవిలో చెప్పాడు-ఏం లాభంలేదు. అసలు వినడం లేదు.

"అలుగుటయే ఎరుంగని" పాడారు.

ఇంకో కార్యకర్త వచ్చాడు.

ఎవ్వరి మాటా వినడంలేదు. ఆయన మటుకు ఆయన పద్యం తర్వాత పద్యం పాడుతూనే వున్నారు.

"ఆహా! ఏవిటండీ! ఈయన జ్ఞాపక శక్తి!" అన్నారెవరో.

"ఆ శక్తి ఆయన జ్ఞాపకానిది కాదండీ.ఆ పద్యాలది" అన్నారు మరొకరు.

ఆయన అలా చదువుతూనే వున్నారు. మధ్యమధ్య ఆయన తన సినిమా అనుభవాలు చెబుతున్నారు. కార్యకర్తలు వచ్చినవారు రాకుండా ఆయన చెవిలో ఏదో చెబుతునే వున్నారు.

ఆయన అసలు ఈ లోకంలో లేరు. ఆ పద్యాలు చదవడం - ఆ అనుభవాలు చెప్పడం - ఆయన లోకమే వేరు.

పద్యాలు పాడి పాడి అలసిపోయిన ఆయన 'మంచినీళ్ళు' అన్నట్లు చేత్తో సైగ చేశారు.

వాచ్ మేన్ నీళ్ళకుండ వంచి ఓ గ్లాసుడు నీళ్ళుపట్టి ఆయనకు ఇచ్చాడు ఆయన తృప్తిగా తాగారు - వాచ్ మేన్ వంక కృతజ్ఞతగా చూశారు. వాచ్ మేన్ "సార్! మీటింగయి అంతాఎల్లిపోయారు. నేను - మీరూ-మీ డ్రైవరేమిగిలం-మీరెళ్ళిపోతే - నేను కూడా తాళం ఏసుకువెళ్ళి పడుకుంటా" అన్నాడు.

" అంతా వెళ్ళిపోయారా! భలేవాడివ్ - హాలు కిటకిటలాడి పోతోంది. చూడు" అన్నాడు భీష్మారావుగారు - హాలువంక చూస్తూ.

"లేస్సారు - అదంతా మీ బెమ' అన్నాడు వాచ్ మేన్.

అప్పుడు భీష్మారావు ఆ మత్తులోంచి దిగి హాలువంక చూశారు. నిజంగానే హాలు ఖాళీగావుంది - ఆయన ఈ లోకంలోకి వచ్చారు

"అవును, భ్రమే! ఇదంతా సినీమాలాగ భ్రమే!" అనుకున్నారు.

"రండిసార్! మీ డ్రైవర్ని లేపుతా" అని కుర్చీ పక్కకి తిప్పితోస్తున్నాడు వాచ్ మేన్.

పక్కనున్న సినిమా హాల్లోంచి-

'జనగణమన' వినబడింది. *

# బండబారిన గుండె

—సత్యవోలు సుందరసాయి

కృష్ణాతీరం. అందునా విజయవాడ. వేసవికాలం. ఆ మండు టెండల ప్రభావానికి పచ్చి మామిడికాయలుకూడా పండి కమిలిపోతాయి. అలాగే యవ్వనంలో ఉన్నవారూ ఆ ఎండ దెబ్బకు తాళలేదు. శరీరంమీద చమటధారలు నిరంతరమై, వేడి గాడ్పులకు అవి శరీరంమీదే ఆవిరయి మంట పుట్టించే మండు కాలం. 'అదిగో కృష్ణలంక అంటుకొంది'— అని వినిపించకపోతే అది విజయ వాడకు వేసవికాదు. రోజూ ఆ కృష్ణాతీరాన ఎన్నో గుడిసెలు అగ్నిప్రమాదాలకు ఆహుతి కావడం సర్వసాధారణ విషయం.

ఎక్కడ ఎలాంటి ప్రమాదం జరిగినా వెంటనే స్పందించి ఆ వివరాలను సేకరించి కేంద్ర కార్యాలయానికి పంపాల్సిన బాధ్యతను ఉద్యోగంగా స్వీకరిం చాడు శ్రీహర్ష. హత్యలు, దొమ్మీలు, అనేక రకాల దారుణ మానవకాండలు నిత్యం జరుగుతున్నా పోలీసుల కథనాలకే ప్రాముఖ్యం ఇవ్వాల్సిన కాలం అని అతనికి తెలుసు. విజయవాడ పరిసర ప్రాంతాలకు అలాంటివన్నీ మామూలే అనే స్థితికి వచ్చారు సాధారణ జనం. అందుకే వేసవికాలంలో ప్రత్యేకంగా అగ్ని ప్రమాదాలను అన్ని కోణాల్లో పరిశీలించి వివరంగా వార్తలందించడం ప్రస్తుతం శ్రీహర్ష బాధ్యత అయింది.

విజయవాడ అంటేనే భయపడే శ్రీహర్షకి అక్కడే ఉద్యోగం దొరికింది. రాజకీయాలు ఏ రంగంలో అయినా వాడిగా ఉంటాయి. వాటిని తట్టుకోవడానికి పిడికెడు గుండెలో కొండంత ధైర్యం ఉండాలి. అర జానెడు మెదడులో భూదేవంత ఓపిక, సముద్రమంత ఆలోచన అవసరం. ఉదయం నుంచి. మెదడు చురుగ్గా పని చెయ్యాలి. అది అలాగే మర్నాటివరకూ కొనసాగాలి. అలా రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు, బ్రతికున్నంత కాలం తప్పదు.

శ్రీహర్షకి అన్ని సౌకర్యాలు ఉన్నాయి. ఓ ఇల్లు, కూలరు అది ఎన్ని నీళ్ళు పోసినా వేసవి కాలమంతా చిర్రుబుర్రులాడుతూ వేడి తుంపర్లతో వేడి గాలినే వ్యాపిస్తూంటుంది. అది ఫేను కంటె నయం అని సరిపెట్టుకోక కుదరదు. ఎస్.టి.డి. ఫోను, ఫాక్సు, టెలిప్రింటరు. పాతిక మంది సహ ఉద్యోగులు. ఆ పాతిక మందికీ రెండు వందల రాజకీయాలు. అవన్నిటినీ భరిస్తూ ఆ వార్తాసంస్థ పురోభివృద్ధికి కృషి చెయ్యాల్సిన కర్తవ్యం శ్రీహర్ష మీద ఉంది. ప్యూను మొదలుకొని ఎకౌంటెంట్ ఆఫీసరువరకూ అందర్నీ రోజూ పలకరించాలి. వాళ్ళు చెప్పింది వింటూ వాళ్ళదే కరెక్ట్ అంటూ నడవాలి. ఎన్ని హద్దులూ....ఇబ్బందులున్నా పని చేయించాలి. పేరుకి వాళ్ళ బాసు కానీ అందరూ తన బాసులే అన్నట్లుగా వ్యవహరించాలి. అలా సర్దుకోకపోతే తన ఉనికినే ఊదేస్తారు. రకరకాల ఆరోపణల పర్వాలను ప్రచారం చేసి పైవాళ్ళకు ఆకాశరామన్న ఫిర్యాదుల పరంపరను సంధిస్తారు. గాంభీర్యం నటిస్తూ క్షణక్షణం అనుమానాస్పదంగా జీవించే ఓ ప్రమాదభరిత బాసు యోగం అది. పైకి ఆధిపత్యం అనిపించినా లోలోపల కృంగిపోయే దారుణ పరిస్థితి ఆ కుర్చీకున్న శాపం.

ఏది ఎలా అయితే పోనీ - అనుకొనే స్వభావం కాదు. శ్రీహర్ష ఎక్కడో చిత్తుగా తాగేసి మత్తుగా పడుకొనే మనిషి కాదు లోకం తెలిసినవాడు. సమాజాన్ని ఎన్నో కోణాల్లోంచి అర్థం చేసుకొనే ప్రయత్నం చేస్తున్నవాడు. పైవారి నోటి మాటలే ఆచరణయోగ్య శాసనాలుగా, క్రిందివారి సలహాలే వేదాలుగా నమ్ముతున్నాడని అనిపించుకోగల మానసిక స్థైర్యం ఉన్నవాడు. అది ఉద్యోగధర్మం అని మనసుకి నచ్చచెప్పుకొంటాడు. మానవత్వం నిండిన ఆ మనసు అతన్ని నిలదీస్తుంది. పోరాడుతుంది, తిరుగుబాటు చేసి అతన్ని అల్లాడిస్తుంది. కానీ రాజీకి రాకతప్పదు. ఎందుకంటే, శ్రీహర్ష వ్యక్తిగతంగా మంచివాడు.

ఇపుడా మనసే ఆరని అగ్నిజ్వాలగా మారింది. కృష్ణానది పొంగి వచ్చినా అది ఆరదు. బడబాగ్నులు చెలరేగి సముద్రాలు సైతం మీదపడినా ఆ జ్వాల ఆరేలా లేదు. శ్రీహర్ష మనసులో ప్రజ్వరిల్లే ఆ మంటముందు వేసవికాలమే దిగదుడుపు. ఆనాటి ఆ సంఘటన అతని మండే గుండెమీద చలనచిత్రంలా తిరుగాడుతోంది.

వేడిగాలులు.... అధికమయిన కాలుష్యపు తెరలు.... వాటి మధ్య ఇరుక్కొన్న మంచు పొరలు - తెల్లవారుతోందనగా నాలుగు గంటలకు కూడా వీడని వేడి. రాత్రి ఒంటిగంట వరకూ చల్లని బీరు తాగి గుంటూరు సమీపంలోని ఓ పల్లెలో పెళ్ళికి హాజరై తిరిగి వస్తున్నారు ఇద్దరు. మత్తు - అలసిన శరీరాలు- ఓ మోటారు సైకిలుమీద వీలయినంత స్పీడుగా వస్తున్నారు. కనకదుర్గ వారధి మీద చల్లని గాలి సోకడంతో మత్తు కొంచెం ముదిరింది. వారధి దిగింది ఆ మోటారు సైకిలు. మళ్ళీ వేడిసెగల వలయంలోకి వచ్చారు. ఏలూరు బైపాస్ రోడ్డులో ఆగివున్న ఓ లారీని ఓవర్ టేక్ చేస్తూ 'టీ బడ్డీ' నుంచి బయటకు వచ్చిన వృద్ధుడ్ని 'ఢీ' కొట్టారు. ఆ వృద్ధుడు అల్లంత దూరాన ఎగిరి పడ్డాడు. మోటారు సైకిలు మీద ఉన్నవాళ్ళూ పడిపోయారు. వెంటనే వాళ్ళు లేచి మోటారు సైకిలు స్టార్టు చేసి ఉడాయించబోయారు. ఈలోగా ఆ 'టీ' బడ్డీలోనివాళ్ళు ఆ పక్కనే కాలకృత్యాలకోసం వచ్చినవాళ్ళు అరచి గోలచేసి వాళ్ళని నిలదీశారు. పడిపోయిన ఆ వ్యక్తిని ఆసుపత్రికి తీసుకువెళ్ళడం కనీస బాధ్యత అని వాదించారు. ఆ బాధ్యతను నెత్తిన పెట్టుకోక తప్పలేదు.

"మనకే దెబ్బలు తగిలి ఏడుస్తోంటే ఈ ముసలాడేంటిరా....శనినాకొడుకు ఇంత పొద్దున్నే రోడ్డు మీద తగలబడాలా?" స్వామి విసుక్కొన్నాడు.

''ఏదో దగ్గర్లోని క్లినిక్‌కి తీసుకుపోదాం. ఏదో ఒకటి చేయించి పంపాలి తప్పదు. వాడి కింకా స్పృహ రాలేదు. మనల్ని గుర్తుపట్టలేదు. ఎక్కడో అక్కడ వాణ్ణి పారేసిపోతే గొడవ వుండదు లేకపోతే ఎవడో ఒకడు గుర్తుపడితే ఛస్తాం.'' రంగారావు తన ప్లాను వివరించాడు.

ఆ ముసలి శాల్తీని దగ్గర్లోని ఆసుపత్రికి రిక్షాలో తీసుకు వెళ్ళారు. అదో ప్రైవేటు ఆసుపత్రి. రంగారావుకి, స్వామికి తగిలిన చిన్న దెబ్బలకు వాళ్ళు మందులు రాసి కట్లు కట్టారు. ఓ వంద రూపాయల మెడిసన్స్ రాసి చీటీ ఇచ్చారు. ఖర్చుల నిమిత్తం అరవై వసూలు చేశారు. ఆ దెబ్బకే తల తిరిగిన వాళ్ళకి మరో విషయం షాక్‌లా తగిలి మాన్పడిపోయారు. 'ఆ ముసలాడికి వైద్యం అనవసరం. ఇది పోలీసుకేసు కావాలి. వాడు చచ్చిపోయాడు. ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకువెళ్ళండి' అని నిదానంగా చల్లగా చెప్పేశాడు ఆ ప్రయివేటు ఆసుపత్రి డ్యూటీ డాక్టర్.

రంగారావు, స్వామి కలవరపడిపోయారు, రిక్షా అతనికి ఏభై రూపాయలు ఇచ్చేశారు. ఆ శవాన్ని ప్రభుత్వం ఆసుపత్రికి చేర్చారు. గుండెపోటు రోగిగా రాయించి ఎమర్జెన్సీ హాలుకి తీసుకువెళ్ళారు. డాక్టరు ఆ రోగిని పరీక్షిస్తూండగా (శవాన్ని పరికిస్తుండగా) ఇద్దరూ జారుకొన్నారు.

శవం అని తేలగానే డాక్టర్ నర్సులమీద విరుచుకు పడ్డాడు. ఆ శవాన్ని తీసుకువచ్చిన కుర్రాళ్ళు ఏమయ్యారని చిందులు తొక్కాడు. పోలీసులకు వెంటనే తెలియజేయమని కేకలు వేశారు. ఈ హడావిడిని గమనించిన రిక్షా అతను వెంటనే అక్కడ నుంచి తప్పుకొన్నాడు. పోలీసులు ఆలస్యంగా రంగ ప్రవేశం చేశారు. ఆ శవం ఎవరిది? ఆచూకీ తెలియరాలేదు. హిట్ అండ్ రన్ కింద కేసు నమోదు చేశారు. వివరాలన్నీ తెలియవు .. డిటో....అని రాసుకొన్నారు. ఆ శవాన్ని మార్చురీకి తరలించారు.

పోలీసులు ఆ కేసుని తేలిగ్గా రాసుకొన్నా వారి కళ్ళు, చెవులూ చాలా పకడ్బందీగా పనిచేస్తాయి. ఆ ఉదయం ముసలివాడ్ని మోటారు సైకిలు మీద వచ్చిన కుర్రాళ్ళు గుద్దడం దగ్గర్నుంచి రిక్షా అతనితో సహా వివరాలు పట్టేశారు. సాయంత్రానికి ఆ కుర్రాళ్ళ గురించి కూపీ లాగేశారు. ఆ కుర్రాళ్ళు శ్రీహర్ష ఆధ్వర్యంలో నడిచే వార్తాసంస్థ ఉద్యోగులని పసిగట్టారు. ఎస్.ఐ. చురుగ్గా కదిలాడు. ఆ కుర్రాళ్ళని వెంటనే పోలీస్‌స్టేషన్‌కి పంపమని శ్రీహర్షకి ఫోను చేశాడు. వాళ్ళు శెలవులో ఉన్నారు. అదే ఎస్.ఐ.కి శ్రీహర్ష చెప్పాడు. 'ఇళ్ళకి మనుషుల్ని పంపించి తీసుకు రావాలనీ, లేకుంటే పోలీసులు వాళ్ళని గాలిస్తారని' ఎస్. ఐ. తన సాధారణ అదిలింపుగా అన్నాడు.

ఆ వార్తాసంస్థ నిర్వహణా బాధ్యత చేపట్టిన తర్వాత అలాంటి వ్యవహారం శ్రీహర్షకి తొలిసారిగా కంగారు పుట్టించింది. రకరకాల రాజకీయాలు, స్వార్థపు ఎత్తులు ఉన్నా ప్రస్తుత పరిస్థితి వాటికి భిన్నంగా కలవరంగా ఉంది. ఒక పక్క తన సహచర ఉద్యోగులు, మరోపక్క పోలీసులు. అసలు విషయం అర్థం చేసుకొనేసరికి శ్రీ హర్షకి రెండు, మూడు గంటలు పట్టింది. ఈ లోగా సెంట్రల్ ఆఫీసు నుంచి ఫోను వచ్చింది. ఆ వార్తాసంస్థ చీఫ్ మాట్లాడారు.

"ఎలాంటి పరిస్థితుల్లోనూ మన ఉద్యోగులు అరెస్ట్ కాకూడదు. అది సంస్థకి చెడ్డ పేరు వస్తుంది. అదీకాక అందులో రంగారావు అనే ఉద్యోగి

ప్రొఫెసర్ గారికి దగ్గర బంధువు. ఎలాగో ఆ విషయాన్ని సద్దుమణిగించాలి. ఆ బాధ్యత నీదే.'' చీఫ్ కంఠం మార్మ్రోగింది. శ్రీహర్షకి అది తప్పనిసరి వని.

'ఈ వెధవలు యాక్సిడెంట్ చేసి ఓ ముసలాడ్ని చంపింది కాకుండా - దొరికిపోయారు. పైగా సెంట్రల్ ఆఫీసు నుంచి ఫోనుకూడా చేయించారు!' ఎంత తమాయించుకొందామన్నా శ్రీహర్షకు కోపం తగ్గడం లేదు. ఆ యిద్దర్నీ పిలుచుకురమ్మని కారుకూడా యిచ్చి డ్రైవర్‌ని పంపించాడు.

తెలుసున్న ఓ పోలీసు అధికారిని సహాయం కోసం అర్థించాడు. ఆ అధికారి ఎస్.ఐ.తో మాట్లాడాడు. ఆ ఎస్.ఐ. శ్రీహర్ష దగ్గరకు వచ్చాడు. మూడు, నాలుగు గంటలు ఆ విషయాన్ని చర్చించారు. ఈలోగా రంగారావు, స్వామి అక్కడకు వచ్చారు. స్వామి తన తరపున ఇద్దర్ని తెచ్చుకొన్నాడు. శ్రీహర్ష పరోక్షంలో వాళ్ళంతా ఎస్.ఐ.తో మాట్లాడుకొన్నారు. ఆ తర్వాత ఎస్.ఐ. వెళ్ళి పోయాడు. ఆయన కూడా వచ్చి ఒక హెడ్ కానిస్టేబుల్, మరొక కానిస్టేబుల్ ఆ కుర్రాళ్ళతో చాలా సేపు మాట్లాడారు. ఆపైన వెళ్ళిపోయారు. పోలీసులు వెళ్ళంతర్వాత ఆ కుర్రాళ్ళ ముఖాల్లో ప్రశాంతత కనిపించింది.

ఆ వ్యవహారం సర్దుకోవడానికి వారం రోజులు పట్టింది. సెంట్రల్ ఆఫీసు నుంచి ఫోన్లు, పోలీసుల తాకిడి, కుర్రాళ్ళ వివరణలు, ఇతర సిబ్బంది సలహాలూ, సూచనలూ సాగాయి. పదిహేను వేలు ఖర్చయిందని కుర్రాళ్ళు చెప్పుకొన్నారు.

ఇక సాధారణ జీవితం మళ్ళీ మొదలైంది ఆ శవాన్ని ఎవరూ గుర్తించ లేదు. మార్చురీలో ఉంచి ఆ తర్వాత ఖననం చేసేశారని శ్రీహర్షకి తెలిసింది. ఆ ఇద్దరు కుర్రాళ్ళు, శ్రీహర్ష కూడా ఊపిరి పీల్చుకొన్నారు. సెంట్రల్ ఆఫీసు వాళ్ళు శ్రీహర్ష సమర్థతను కొద్దిగా మెచ్చుకొన్నారు. ఆ చిరుపొగడ్తకే శ్రీహర్ష పొంగిపోయాడు. పలుకుబడి, అధికారసహకారం, డబ్బూ, అన్నిటినీ సంధించ గల నేర్పూ ఏ పనికైనా ఎంతో అవసరం అనుకొన్నాడు. అదొక వింత అనుభవం. చాలా విలువైన విషయం. ఆ వ్యవహారాన్ని చక్కబరచిన విధానం మరువరానిది. శ్రీహర్ష దానిని పదిలంగా గుర్తుంచుకొన్నాడు.

* * *

రోజులు దొర్లిపోతున్నాయి. నెలలు గడిచిపోతున్నాయి తన ఆఫీసు గదిలో కూర్చొని దినపత్రిక తిరగవేస్తున్న శ్రీహర్ష ఓ ప్రకటన చూసి ఆశ్చర్య పోయాడు.

ది రామనారాయణ - వయసు 65 సంవత్సరాలు. ఆ పేరూ, వయసూ పైన ఒక చిరపరిచితమైన ఫోటో. నాన్నా, నీ సిద్ధాంతాన్ని వ్యతిరేకించినందుకు బాధపడుతున్నాం. నువ్వు ఆనాడు అన్నట్లుగానే మేమే ఓడిపోయాం. నీ పాదాలు పట్టుకొని వేడుకొంటున్నాం. ఎక్కడున్నా వెంటనే ఇంటికి రావలెను. నీ రాకకై ఎదురుచూస్తున్నాం.

ఇట్లు
దివాకర్, సుశీల, ఉదయ్, శాంతి.

'దివాకర్....ఉదయ్' - కొంచెం పైకి అన్నాడు శ్రీహర్ష.

"ఏం సార్ - ఏమైందీ?" ఎదురుగా ఉన్న స్వామి అడిగాడు.

'ఏం లేదయ్యా -- ఈయన మా మాస్టారు, మా ఊరే. కలవచర్ల. కొత్తూరు హైస్కూల్లో పని చేసేవారు. చాలాకాలం నాకు ట్యూషన్ చెప్పారు." శ్రీహరి అగాడు.

"ఆయనకు ఏమైంది సార్" - స్వామి కుతూహలం చూపాడు.

"ఏం లేదయ్యా— ఆయన మానవత్వ విలువల్ని దృష్టిలో పెట్టుకొని ఏ పనైనా చెయ్యాలంటారు. ఇపుడు తరాలు మారిపోయినా - ఎలాగైనా పనులు జరగాలి కానీ, ఆయన విధానాలు చాదస్తాలు అని కొట్టి పారేస్తాంగా - మనలాగే వాళ్ళ పిల్లలు కూడా అనుకొని ఉంటారు. అది ఆయనకు నచ్చి ఉండదు. ఇల్లు విడిచి వచ్చేశారన్న మాట! ఆయన సర్వీసులో ఉన్నంతకాలం ఆయన విధానం సాగింది. ఆయన రిటైర్ అయింతర్వాత ఆయనది చాదస్తం అంటూ కొట్టిపారేసి ఉంటారు. పాపం ఆయన ఎక్కడున్నారో'—శ్రీహర్ష జాలిపడ్డాడు.

"ఎవరూ సార్ ఆయన....?"— స్వామి మళ్ళీ అడిగాడు.

"రామనారాయణగారు - చూడు ఈయనే" - ఆ ఫోటో స్వామికి చూపించాడు శ్రీహర్ష.

ఆ ఫోటో చూసి కంగారు పడ్డాడు స్వామి.

"సార్.... ఈయన.... ఈయన మీకు తెలుసా ...?" స్వామి కంఠం కలవరపడింది.

"అలా అయిపోయావేమిటయ్యా.... ఆయన మా మాస్టారని చెప్పానుగా - మా ఊరే-" శ్రీహర్ష నిబ్బరంగా అన్నాడు.

"సార్ ఈయనే....సా....ర్. ఆ రోజు మా మోటారు సైకిలు కింద.... అదే....ఆ....యాక్సిడెంట్ లో చనిపోయిన ముసలాయన" స్వామి దాదాపుగా భయ పడుతూ నిజం చెప్పాడు.

శ్రీహర్ష నోట మాటరాలేదు. ఎటో చూస్తూమతిలేనివాడిలా అయిపోయాడు. స్వామి ఆ పరిస్థితిని అర్థం చేసుకొన్నాడు.

"సార్.... నేను చెబుతూనే ఉన్నాను సార్! అంత స్పీడుగా పోనివ్వద్దని.. ఆ.... రంగారావే సార్ స్పీడుగా బండి నడిపాడు. మీకు తెలుసుగా సార్.... నాకు డ్రైవింగ్ రాదు. వాడు చాలా రాంగ్ సార్!" చాలా వినయంగా ఆ మాటలు చెప్పి జారుకొన్నాడు సామి.

* * *

ఆ మంట చల్లారుతుందా?

ఎంత? ఎన్ని లక్షలు పోయాలి? ఆ మంట చల్లారడానికి ఏ చన్నీరు కావాలి? హిమాలయమంత ఎత్తయిన మంచు కురవాలా....సముద్రాలే పొంగివచ్చి ముంచెత్తి ఆ అగ్నిజ్వాలల్ని ఆర్పివేయాలా?

భౌతికంగా ఏర్పడే దారుణ దురదృష్ట పరిణామాలు మనిషిని కృంగ దీస్తాయి. మానసికంగా ఎదురయ్యే ఇలాంటి దారుణ సంఘటనను ఏరకంగా ఎదుర్కోవాలి? మనిషిని నిలువెల్లా దహించి వేసే ఈ మానసిక క్షోభకి పరిష్కారం....?

జీవితం ముఖ్యమా? జీవితాధారం ముఖ్యమా? బ్రతుకులో ఏది ముఖ్యం?

బ్రతుకంటే ఏమిటి....?

సమర్థత అనే పదానికి అర్థం....?

సమాజంలో ఏ పనినైనా ఎలాగోలా చెయ్యడమే సమర్థత అయితే ఇక సమాజపువిలువ ఏమిటి? జీవిత విధానం దారుణాల నిలయమైతే ఆ బ్రతుకులో మానసిక ఆనందానికి తావేది?

అంతా రాజీ....అన్నీ రాజీ.... ఎవరికోసం? ఎవడో చేసిన తప్పు – ఎందుకయిందో తెలీదు. ఆ తప్పుతో తనకి సంబంధం లేదు. ఆ వ్యక్తులతో తనకి ఏ బంధమూలేదు. కానీ తానో సంస్థ నిర్వాహకుడు. ఆ బాధ్యత తాను సమర్థవంతంగా నిర్వహిస్తున్నాడు. అనిపించుకోవడానికి ఒక తప్పును-పైగా ప్రాణాన్ని హరించిన ఆ ప్రమాదాన్ని కప్పిపుచ్చాడు

ఆ ముసలాడు ఎవడో అయితే.... ఎవడిక్కావాలి? చచ్చిన వాడితో గొడవా.... మరీ సంబంధం ఏమిటి? కానీ ఆనాడు చచ్చిన ముసలాడు, నేడు తన ప్రియగురువుగా కన్నులు మూసినా తెరచినా విశ్వరూపంగా హృదయ ఫలకం మీద చెరగని ముద్రలా ఆక్రమించాడు.

చదువుకి ఎగనామం పెట్టి ఆకతాయిలతో చేరి చిల్లర వ్యవహారాలు తలకి ఎక్కించుకొని జీవితంపట్ల నిర్లక్ష్యభావాల్ని పెంచుకొన్న తనలాంటి ఎందరికో ఆదర్శగురువుగా.... మానవత్వ విలువల్ని హృదయాలకు హత్తుకొనే విధంగా జీవిత సత్యాలను స్నేహపూర్వకంగా చెప్పిన సిసలైన గురువు రామనారాయణ మాస్టారు.

శ్రీహర్ష ఉన్నత పాఠశాలలో చదివేరోజుల్లో పేరొందిన అల్లరి విద్యార్థి. ఒక మాస్టార్ని కొట్టి భయపెట్టిన శ్రీహర్ష మీద పోలీసు రిపోర్టు నమోదయింది. మాస్టార్ని కొట్టినపుడున్న ధైర్యం పోలీసులు స్టేషన్‌కి రమ్మన్నప్పుడు పూర్తిగా జావకారిపోయింది. ఆ ధైర్యం అంతా భయంగా మారింది. జీవితంపట్ల తొలిసారిగా అవగాహన అంకురించింది. ఆనాడు ప్రోత్సహించిన మిత్రులు పోలీస్ స్టేషన్ అనేసరికి జారుకోవడంతో శ్రీహర్ష గుండె జారిపోయింది.

ఎవరూ ఏరకంగానూ ఆదుకోలేని ఆవేదనాభరిత పరిస్థితిలో భుజం మీద ప్రేమగా చెయ్యివేసి ఆ గండం నుంచి బయటకు లాగి జీవిత సత్యాలను మానవతా విలువల సాక్షిగా బోధించిన తన ఆదిగురువు రామనారాయణ మాస్టారు. ఈనాటి శ్రీహర్ష హోదా, తిండి, బట్ట, సమాజంలో పలుకుబడి, అన్నింటిలోనూ రామనారాయణగారి ఊపిరి ఉంది. మాట, ప్రవర్తన, సంస్కారం అన్నీ ఆయన ప్రసాదాలే. తానొక మనిషిని అని శ్రీహర్ష తనన్తాను గుర్తించిన క్షణం నుంచి అణువణువూ రామానారాయణగారే మార్గదర్శి.

కానీ ఆ మానవత్వ విలువలకు అర్థం?

ఆ హోదాకు విలువ....

ఆ తిండికి పరమార్థం?

ఆ బ్రతుకు అలాగే సాగాలా?

ఇదేనా సమాజపు చట్టం. ఇదేనా విషవలయాల జీవిత సంవిధానం?

మనసుని మభ్యపెడితే నిజం చచ్చిపోతుందా? సమాజంలో జీవితాన్ని నిలుపుకోవడానికి ఇది తప్పదా? ఎన్నో విషయాల్లో ఎందర్నో అతిస్వల్ప విషయాలకే దారుణంగా విమర్శించే అధికార బలం నిజాన్ని కప్పిపుచ్చడానికే వినియోగ పడుతుందా?

గుండెలోంచి ఎగసి వచ్చే ఆవేశపు అరుపు గొంతులోనే అణగారిపోతోంది. అది నిజాన్ని వెల్లడించగల ఆక్రోశం. మానవత్వాన్ని కాపాడే ఎగశ్వాస. ఆ శ్వాస ఎందుకు ఆగిపోతోంది. ఈ విషయాన్ని ఎలాగైనా మరచి పోవాలని మెదడు ఎందుకు విశ్వప్రయత్నం చేస్తోంది?

'నేనేం చెయ్యాలి?' - శ్రీహర్ష హృదయాగ్నిలో నిజాలు నిప్పురవ్వల్లా ప్రజ్వరిల్లుతున్నాయి.

చనిపోయిన వ్యక్తి జీవిత సంవిధాన ప్రదాత.

చేస్తున్న ఉద్యోగం సమాజానికి విలువైన నిజాలు అందించి ప్రజాస్వామ్య పరిరక్షణా సంవిధాన మనబడే కార్యక్రమం. బ్రతుకుతున్న బ్రతుకు నిత్యం మానవత్వ విలువల్ని కాపాడాలంటూ ఆనాటి రామనారాయణ మాస్టారి సందేశ సారాంశ ప్రచార ప్రసంగం - ఆ మాటలకు ప్రముఖుల ప్రశంసలు కూడా.

సమాజంలో స్థానం. వ్యవహారాల్లో సమర్థవంతం.

జీవితంలో సుఖం ...సౌఖ్యం.

అధికారం....దానికున్న బలం.

శ్రీహర్ష హృదయాన అన్ని అంశాలు శరవేగంతో తలఎత్తుతున్నాయి. వాటికి అర్థాలు అర్థం కావడంలేదు. జీవితమే గొప్ప అబద్ధం. అబద్ధాలపుట్ట.

అన్నీ అనుకోవడమేగానీ నిజాలు ఉండవు. నిజాలు తెలిసినా అవి చచ్చిపోతాయి. అవి చావకపోతే తనలాంటివాళ్ళు బ్రతకలేరు. ఇదో పెద్ద చావు బ్రతుకు. అయినా బ్రతకక తప్పదు. మరింకేం చెయ్యాలి? బ్రతకాలి, ఈ సమాజాన్ని ఎవడు.... ఎవరు....ఏ శక్తి....ఏ దారుణం ఇలా మార్చిందో మరి? నేనొక అల్పుడ్ని. ఈ సమాజంలో బ్రతుకీడ్చాల్సినవాణ్ణి. నేనేమీ చెయ్యలేను మాస్టారూ - నన్ను క్షమించండి. నా గుండె బండబారింది. అది బండబారకపోతే ఈ సమాజం నన్ను బ్రతకనివ్వదు. నా బ్రతుకునే వెలేస్తుంది. నన్నూ.... నా జీవితాన్ని నాశనం చేస్తుంది.

ఈ బండబారిన గుండెలో మీ మానవత్వ సందేశం సజీవంగా సమాధైంది మాస్టారూ! శ్రీహర్ష హృదయాన రేగిన ఆలోచనల పోరాటాలవి. కానీ అవి బయటకు రావు. ఎందుకంటే అతని గుండెను సమాజమే బండబారించిందట. *

# ఒక కోరిక - ఒకే తీర్పు

—శ్రీ సుభా

ఈ విశాల విశ్వం ఒక వేదిక అయితే - ఆ ఊరు, అదే పాండిచ్చేరి. ఆ వేదికమీద ఒక చుక్కలాంటిది....ఆ చుక్కలాంటి ప్రదేశాన్ని ఆనుకుని పక్కనే సూక్ష్మ బిందువులా సముద్రం....సముద్రాన్ని ఆనుకుని శ్రీ అరబిందో ఆశ్రమం. సృష్టికర్త తన నైపుణ్యాన్నంతా ధారపోసి ఆ ప్రదేశాన్ని గొప్ప సౌందర్యంతో, అతిలోక నిశ్శబ్దంతో, పరిపూర్ణ ప్రభావంతో నిర్మించాడనిపిస్తుంది. ఎన్నో పూలచెట్లు .. అవి తమ పేర్లనే కాకుండా, తమ గుణగణాలకు పుష్టి నిస్తూ సృష్టిలో అందానికి ప్రారంభ వాక్యం ఇక్కడేగాని మొదలయిందా అనే ఆశ్చర్యం కలగజేస్తాయి.

రమణి రోజూలాగే సమాధి దగ్గరకు వెళ్ళింది. అది శ్రీ అరబిందుల, మాతల సమాధి. సమాధి మీద రంగు రంగుల పూలతో చిత్ర విచిత్రంగా అలంకరణ చేసిన విధానం తిలకించింది. ఆ పూలద్వారా వచ్చే చల్లదనం హృదయాన్ని తాకిన అనుభవం కల్గుతోంది. ఆమె ఒక్కసారి కళ్ళు మూసుకుంది. అప్పుడు సమాధి మీద పువ్వులు సర్వం మరిచి మెడిటేషన్ చేస్తూన్న భక్తుల్లా అన్పించాయి సమాధి ముందు అమర్చిన అరల్లోంచి భక్తులు వెలిగించిన అగరు వత్తులు తమలోని అరిషడ్వర్గాల్ని కాల్చుకుంటూన్న సాధకుల్లా కన్పించాయి. ఆ అగరవత్తుల పొగ సుతారంగా వంకీలు తిరుగుతూ, వలయాలుగా మారు తోంది. ఆపైన పొడుగూ, వెడల్పూ, ఎత్తులాంటి కొలమానాలకు అందకుండా, అనంతాకాశాల నుంచి విన్పిస్తున్న ఆహ్వానాలను అందుకుందుకు ప్రయాణిస్తూన్న అదృష్టవంతుల్లా అదృశ్యమయిపోతోంది.

ఎందరో భక్తులు, జిజ్ఞాసువులు, సాధకులు, ఏమీ తెలియనివాళ్లు సమాధి ముందు తలవాల్చి మైమరుస్తున్నారు. ఆత్మ- చక్కని ఓ స్పర్శ కోసం, తనను

బంధించిన శరీరాన్ని, హృదయాన్ని, ఆలోచనా సరళిని ఛేదించుకుంటూ బయటకు వెళ్లగల్గే మార్గాంతరాలను అన్వేషించుకుంటూన్న సమయం అది! నిశ్శబ్ద లోకాలనుంచి, ఇంకా ఇంకా ఉన్నత శ్రేణుల నుంచి ఒక చక్కని సందేశం కోసం, ఆపైన తన ఒడిలోకి చేర్చుకుందుకు ముందుకు సాగివచ్చే అదృశ్య హస్తం కోసం ఆత్మ ఎదురుతెన్నులు చూసే అమృత ఘడియలవి!!

రమణి సమాధి ముందు తలవాల్చినప్పుడు ఎప్పుడూ ఏవేవో చక్కని దృశ్యాలు లీలగా కన్పిస్తాయి. చిన్నచిన్న గుసగుసల్లాంటి శబ్దతరంగాలై మెదడులోనికి చొచ్చుకుని పోయినట్టు అన్పిస్తుంది! శక్తివంతమైన కోరికలతో చేదైన అనుభవాలతో శరీరం బరువై పోతుందనీ - తన చిన్న హృదయం, ఆ బరువును మోయలేక పోతోందనీ ఎన్నోసార్లు విన్నవించుకుంది. ఆమెకు తెలుసు. భగవంతుడు తన వంతుగా ప్రతి ప్రాణి కష్టాల్నీ ఛాలామటుకు తనే భరిస్తూ వుంటాడని! కానీ ఒక వంతు కష్టాలతో భయాలతో తీరీతీరని ఆశల మధ్య ఆకుగా మారి వణుకుతూ ఆ మాత్రం బరువును మోయడానికే తను తలక్రిందులయి పోతున్నానని ఎన్నోసార్లు కన్నీళ్లు పెట్టుకుంది.... మనిషి అలసట చెందుతున్నాడంటే ఆయాసపడుతున్నాడంటే - భగవంతుడిని మరిచిన మనసు పరిపక్వానికి రానప్పుడు జరిగే తంతు ఇదా?! లేక పరిపక్వానికి కావల్సిన ముడిసరుకులు - నిర్మలత్వం, ఉన్నతాదర్శం, పరిపూర్ణ సత్యం వీటి ఉనికిని మనిషి గుర్తించలేనప్పుడు జరిగే ప్రక్రియా ఇది?!

ఆమె శరీరం దూదె పింజె అయ్యింది. ఇంతలో పిల్లగాలి రూపంలో స్పృహ మెల్లగా చెవి దగ్గరకు వెళ్ళి గుసగుసలాడింది. రమణికి తన ఉనికి గుర్తొచ్చింది. నిశ్శబ్దంగా సమాధి ముందు నుంచి లేచింది. అలాగే సర్వీస్ట్రీ వైపోసారి చూసి బయటకు అడుగులు వేసింది. అంతలో పక్కన ఎవరో మనిషి కదిలినట్టయింది. చూసింది.... రాజగోపాలంగారు. ఇద్దరూ నిశ్శబ్దంగా లైబ్రరీ హాలు వైపు వెళ్ళారు.... రమణి సేల్స్ సెక్షన్‌లోకి వెళ్ళి కుర్చీలో కూర్చుని ఒక్కసారి నిశ్శబ్దంగా కళ్ళుమూసి మనసులో మదర్‌ని తల్చుకుని పని మొదలు పెట్టిన గుర్తుగా డ్రాయరు తెరిచింది. రాజగోపాలం గారు ఎదురుగా ఓ మూలగా ఉన్న కుర్చీలో కూర్చుని ఆరోజు చేయాల్సిన పన్లు గుర్తుగా వ్రాసుకున్న డైరీ తిప్పుతున్నాడు.... పదిగంటలకు స్కూలుకు వెళ్ళాలి.... బాలగంధర్వ గురించి చెప్పాలి... ఆ తర్వాత కేంటీన్‌లో భోజనాల ఏర్పాటు, సర్వంగూ చేయాలి....

''నేను వెడుతున్నాను రమణీ!....'' అన్నాడు రాజగోపాలంగారు.

''మంచిదండీ!....''

''నేను సాయంత్రం వరకూ ఇటు రాలేకపోవచ్చు....నువ్వు ఏడుగంటలకు బీచ్‌కు రాగలవా?''

రమణి ఏం మాట్లాడలేదు. ఆయన 'వెళ్ళొస్తాను' అనే మాటతో పాటే బయటకు వెళ్ళాడు.

రాజగోపాలంగారు బీచ్‌కు ఎందుకు రమ్మంటున్నారో రమణికి తెలుసు. ఆయన నోటి వెంబడి ఈ ఆహ్వానం ఈ మధ్య ఆమె తరుచు వింటూనే వుంది. ఆయన పెద్దవాడు. చాలా బాధలో ఉన్నాడు. క్రిందా మీదా అవుతున్నాడు. కానీ ఆయన సాధకుడు....జీవితంలో చాలా అనుభవాలు మూటగట్టుకున్నవాడు. అయినా ఆవేశపరుడు.... మాట్లాడుతూవుంటే ఆశ్రమ జీవితం ఈయన మీద తక్కువ ప్రభావాన్ని చూపిందా అన్పిస్తుంది. ఆశ్రమ జీవితానికి ఆయన యిమడలేక మరోదారి వెదుక్కునే ప్రయత్నంలోగానీ కొట్టుమిట్టాడుతున్నాడా అని అనుమానం వస్తుంది. అయినా, ఆయన విధి నిర్వహణలో ఏ లోటూ రానివ్వనట్లే ఉంటున్నాడు....

ఇక తను ఏకాకి. చిన్నప్పుడే తల్లి తండ్రీ చనిపోతే అక్క దగ్గర పెరిగింది. లోకంలో ప్రేమనంతటినీ రంగరించి అక్క ఉగ్గుపాలుగా పట్టింది. చదువు పూర్తయిన గుర్తుగా డిగ్రీ చేతికి వచ్చింది. అలాంటిది ఒకరోజు అక్కా బావా ఇద్దరూ యాక్సిడెంట్‌లో చనిపోయారు.... ఎటు చూసినా, తనలోకి చూసుకున్నా ఒంటరితనం.... తను ఎలా బ్రతకాలన్న ప్రశ్న విశ్వరూపంగా ఎదిగి భయపెడితే తలవాల్చాలో, నేలకొరగాలో తెలియక ఏడ్చేసింది. తుడిచేవాళ్ళూ, ఓదార్చేవాళ్లూ లేని మూలంగా బాధా, కన్నీళ్లూ కలిసి గడ్డకట్టుకుపోతే - చేతిలోని డిగ్రీలతో అరబిందో ఆశ్రమానికి వెళ్ళింది....

అక్కడి వాతావరణాన్ని మొదటిసారి చూసినప్పుడు ఏదో ఒక దివ్యానుభూతి తనని తాకినట్టు, ఒక చల్లని స్పర్శ నిమిరినట్టు ఆమెను ఆహ్వానించింది.... ఎంతో మంది సాధకులు అక్కడ తన్మయత్వం చెందిన మనుషుల్లా సేవలు చేస్తూండడం, వాళ్ళు ఏ కార్యంలో నిమగ్నులయినా కించిత్తు వెసులుబాటు

కన్పించనీయకుండా పని చేయడం ఆశ్చర్యం అన్పించింది. పైగా ఏ పనిచేసినా ఆ పని అంతకన్నా గొప్పగా చేయడం అసాధ్యం అన్నట్టుగా నిర్మలమైన మనస్సుతో అంకిత భావంతో సేవచేయడం వింతలో వింతగా తోచింది....రెండు రోజులు ఆశ్రమాన్ని, ఆశ్రమవాసుల్ని చూసి రమణి అక్కడ ఒకళ్ళిద్దరు పెద్దవాళ్ళతో మాట్లాడింది. వాళ్ళు రమణిని చూచి ఆశ్చర్యపోయారు....

"ఇక్కడి జీవనం కత్తిమీద సాములాంటిది.... జీవితంతో విసిగి కానీ భయపడి గానీ ఇక్కడికెవరూ రారు. ఇక్కడ జీవించేవాళ్ళకే చోటు" అన్నారు. వాళ్ళు చెప్పేది విన్న తర్వాతే తన గోడు చెప్పకుంది. ఆఖరికి ఒకాయన ఆశ్రమంలో నలభై ఏళ్ళుగా ఉంటున్న సీతారామ్‌గారిని కలవమని సలహా ఇచ్చారు. సీతారామ్‌గారిని కలిసింది....ఆయనది నిండైన విగ్రహం....కుర్చీలో హుందాగా, అందంగా కూర్చున్నాడు.... రమణి తన గురించి చెప్పకుంది....ఆ చెప్పకోవడంలో తడబాటు.... మాటలు వెనకవి ముందూ, ముందువి వెనకా అయ్యాయి.

"భయపడొద్దు.... మనసులో ఉద్దేశం మాటల్లో చెప్పలేనప్పడు కాగితం కలం ఉపయోగించడం శ్రేష్టం...." అన్నారు నవ్వుతూ.

రమణి పదినిముషాలు ఆలోచించి కాగితం మీద ఇలా వ్రాసింది.... "నాకు చదువు వుంది. వీణ వాయించగలను. అందులోనూ డిగ్రీ వుంది. ఇక నాకు ఇక్కడ బ్రహ్మచారిణిగా జీవించాలని వుంది. నేను వివాహం, సంసారం వీటన్నిటిని కాదనగలనని నమ్మకం.... నేను ఇక్కడి పిల్లలతో మరో చంటి పిల్లగా మారగలననే ఆశ..వాళ్ళతో ఆటపాటలు ఆడతాను.పాడతాను. గెంతుతాను. ఎవరూలేని నాకు అందరితో కలిసి గొంతు కలపాలని చిన్నప్పటినుంచీ కోరిక. అది తీరలేదు. బ్రతుకంతా శాపంగానే మారింది...."

"ఇక్కడ నిత్యజీవన పద్ధతులు కష్టంగా ఉంటాయి, తట్టుకోగల్గాలి.... క్రమశిక్షణ - అంటే శరీరంలో ఒక అంగం కాదు అది సంపూర్ణ శరీరం లాంటిది...." సీతారామ్‌గారు తనదైన భాషలో నచ్చజెబుతోన్న ధోరణిలో అన్నాడు. రమణి తల ఊపింది. "ఇక్కడి నియమ నిబంధనలు తుచ తప్పకుండా పాటిస్తాను. శ్రీ అరబిందో ఆశ్రమానికి కళంకం తేను - ముందుగా మీకు చెప్పిగానీ ఏ పని చేయను...."

సీతారామ్‌గారు నవ్వారు. ఆశీర్వదించారు ఆ పైన వారి స్కూల్లో ఉద్యోగం యిచ్చారు....రెండేళ్ళు గడిచిపోయాయి - ఆశ్చర్యంగా. తను పుట్టిందీ, బ్రతుకుతున్నదీ, బ్రతకనున్నదీ సేవకోసం అనే దృక్పథం ఆమెలో విత్తుగా మొదలై మొక్కగా ఎదుగుతోంది.... తల్లి దండ్రీ, అక్కా బావా, ఇంకా ఇంకా స్నేహితులూ ఆశ్రమానికి వచ్చిన ప్రతి వ్యక్తిలోనూ తరచిచూస్తే, కన్పించకపోరు అనే ఉత్తమ భావం అలవడింది . అయితే, ఆరేళ్ళుగా రమణి విషమ పరిస్థితుల్లో చిక్కుకుంది. పక్కనే తోడుగా నీడగా నిలబడ్డ వ్యక్తి కొత్తగా మాట్లాడ్డం, సరికొత్తగా చూడ్డం ఆమెకు ఆశ్చర్యంగా అన్పించింది. కానీ, ఆయన దగ్గరగా రావడమే కాకుండా అతి దగ్గరగా రావడానికి ప్రయత్నించడం - మాటలు ఆత్మీయంగా కాకుండా కాస్త చనువుపాలుతో రంగరించి విన్పించడం చూసి రమణి - మొట్టమొదటిసారి - మంచం మీద పడుకుని ఏడ్చేసింది. తన శరీరం - తనది కాదు అనే తప్పుడు ఆలోచనలు ఒకటికి రెండు - మెదడులోనూ, హృదయంలోనూ చొరబడి హెచ్చరిస్తూంటే - వెక్కిరిస్తూంటే బెదరిపోయింది ...నుర్నాడు గంట పైగా మెడిటేషన్ చేసింది. హృదయాన్ని చిక్కబట్టుకుంది. తన పనుల్లో సంపూర్తిగా మునిగిపోయింది....

కానీ, రాజగోపాలంగారి ఆహ్వానాలు వస్తూనే ఉన్నాయి! అందుకే అప్పుడు రమణి ఆలోచిస్తోంది. ఆయనతో ఎలా మాట్లాడాలో, ఏం మాట్లాడాలో మననం చేసుకుంటోంది.... ఏభై ఏళ్ళ రాజగోపాలంగారు మరెందుకైనా తనని ఆహ్వానించి ఉండాలనీ - తన ఊహలన్నీ నూరుపాళ్ళూ తప్పులవ్వాలనీ, తనూ ఆయన ఆత్మీయుల్లా బీచ్ నుంచి తిరిగి రావాలని.... ఏవేవో ఊహిస్తోంది. కాసేపటి తర్వాత రమణి తేరుకుని, ఎదురుగా ఉన్న మదర్ ఫోటో వైపు చూసింది.

*　　　*　　　*

సాయంకాలం మూలంగా బీచ్‌రోడ్ హడావిడిగా వుంది. ఎంతో మంది జనం బీచ్‌ని అనుకుని వున్న పిట్టగోడమీద కూర్చుని సముద్రంలోకి చూస్తున్నారు. రమణీ, రాజగోపాలంగారూ ఆ రోడ్ వెంబడి నడిచి కాస్త కష్టపడి ఇసుకవైపు దిగారు.. అక్కడ గుట్టలుగా రాళ్ళు....రమణి ఒకటికి రెండుసార్లు రాజగోపాలంగార్కి మొహంలోకి చూసింది. ఆయన మనసులో ఆవేదనకు ప్రత్యక్ష సాక్షి ఆ సముద్రమే అన్పించింది. నిజానికి ఆయనకూ, సముద్రానికీ ఏం తేడా

లేదు. సముద్రంలోంచి మధనపడి ఆవేశంతో లేచే కెరటాలను లెఖ్ఖ కట్టడం, ఆయన హృదయంలో గూడు కట్టుకున్న ఆవేదనను అంచనా వేయడం రెండూ కష్టమైన పన్లే! ప్రతికెరటం - తన గమ్యం నింగో లేక నేలో తెలియక ఒడ్డు వరకూ ప్రతి నిత్యం ఎన్నో మహాప్రస్థానాలు చేస్తుంది!! మనిషి కూడా తన వేదనల్ని చల్లార్చుకుందుకు మరో మనిషికోసం ఎదురు చూపులు చూస్తూనే వుంటాడు....

రాజగోపాలంగారు తన జీవితం, ప్రేమ, పెళ్ళి, సంసారం, భార్య ప్రవర్తనా అన్నీ విడమర్చి చెప్పి ఆఖరిగా అన్నాడు.... "నే చెప్పింది నీకు అర్థ మయిందనుకుంటాను, రమణీ!... జీవితంలో నాకంటూ ఏమీ మిగలలేదు.... చేపట్టినవన్నీ చెయ్యి జారిపోతూంటే ఇది కూడా భగవంతుడి లీలే అని సరిపెట్టు కున్నాను. ఇక్కడికివచ్చి పదేళ్ళు అయ్యింది. నా దినచర్య - అత్యంత అద్భు తంగా ఆనందంగా గడిచిపోయింది. కానీ ఏడాదిగా జరుగుతున్నది వేరు.... నువ్వు ఊహించే ఉంటావు - నా మాటలు బట్టి! నా శరీరం నన్ను అథ్మగథు గునా శాసిస్తోంది.... అంతర్లీనంగా కోరిక ఒకటి ఎదిగి ఇప్పుడు వెల్లువై నన్ను నన్నుగా బ్రతకనీయడం లేదు. అసలు ఈ వయస్సులో, ఈ వాతావరణంలో కామవాంఛ కల్గడం ఆశ్చర్యం. దాన్ని ఆదిలోనే అణగదొక్కలేకపోవడం నా బలహీనతేమో! ఆ కోరిక నాలో చీమగా ప్రవేశించి - అదిప్పుడు మృగంగా మారింది.... కానీ ఇక్కడి పరిస్థితులు నన్ను ఆపుతున్నాయి.''

రమణి రాజగోపాలంగారి మాటలు వింటూనే వుంది. ఆమెకు ఎలా జవాబు చెప్పాలో తెలియడం లేదు....ఆశ్రయంలో ఐదేళ్ళుగా తన ప్రవర్తన. తను కష్టపడి నేర్చుకున్న క్రమశిక్షణ ఆమెను కట్టి పడేశాయి. నెమ్మదిగా ఆయన్ని అడ్డుకుంటూ అంది: "మన పనులన్నీ, ఆదే చేసే ప్రతికార్యం, భగవంతుడి కోసమే చేయాలి గానీ స్వలాభాపేక్షతో చేయకూడదని మదర్ అంటుంది...కానీ మనం చర్చిస్తూన్న సబ్జెక్ట్ అందుకువిరుద్ధంగా లేదా మేష్టారూ..."

రాజగోపాలంగారు వెంటనే అన్నాడు:"ఉంది రమణీ, కాదనను....కానీ అసలు మన ప్రస్థానం, ఆదే ఈ ఆశ్రమానికి రావడం, సారీ నా ప్రస్థానం అంటాను - ఒక ఆలంబన కోసం సాగిందేమో అన్పిస్తుంది....లక్ష్యసాధన ఏమిటో పూర్తిగా అవగాహన చేసుకోకుండానే నేను ఈ ఆశ్రయాన్ని ఒక విడిదిగా అనుకున్నానేమో?"

"ఇది మీ ఆత్మ బలానికి భగవంతుడు పెట్టిన పరీక్ష అని ఎందుకు అనుకోరు? ఈ చిన్న పరీక్షలో ఓడిపోకుండా నిలబడ గల్గితే మీరూ, మీ ద్వారా నేనూ ఒక మెట్టు ఎత్తుకు ఎదగగలమో...."

రాజగోపాలంగారు నవ్వేశారు...."నిజమే. సాధన అనేది మామూలు విషయం కాదు. ఒక జీవితాన్ని సంపూర్తిగా సరెండర్ చేయగల్గాలి....ఇన్నేళ్ళ నా నిగ్రహం ఎలా చేయిజారి పోయిందో నాకర్థం కావడం లేదు....ఇక్కడ ఎవరైనా సరే జీవించాలి, జీవించగల్గాలిగానీ నటిస్తూ జీవించకూడదు. అందుకే ఈ జీవితానికి ముగింపు కోరుతున్నాను. ఇక నువ్వుకూడా ఏకాకివి....ఇలా ఎన్నేళ్ళు ఈ శరీరాన్ని మోస్తూ ఉండగలవు? నేను నీ ధ్యేయాన్నీ, నీ ఆదర్శాన్నీ, నీ భక్తినీ హేళన చేయడం లేదు ...నిన్ను నా కోసం జీవించమంటున్నాను. పాతిక సంవత్సరాలు లేని నువ్వు నిరాశతో, నిస్పృహతో ఈ దారి తొక్కావేమో ఒక్కసారి ఆలోచించు...."

రమణి - ఏవో హాస్టైల్ ఫోర్సెస్ తనచుట్టూ చేరి గేలి చేస్తోన్నట్టు భయపడింది....

"ఇలా ఓ సమస్య నాకెదురవుతుందనీ....బాధపెట్టని వయసులో ఉన్న నేనూ - బాధను మర్చిపోయిన వయసులో ఉన్న మీరు - ఈ విధంగా కొత్త బాధల పరం అవడం ఆశ్చర్యం! నాకు ఏం చెప్పాలో ఎలా చెప్పాలో తెలియడం లేదు. ఉత్తములైన, విజ్ఞులైన మీరు కోరిన కోరిక నాకు అగ్ని పరీక్షలాంటిది....ఇంతవరకూ ఆశీర్వదిస్తూ వచ్చిన మీ స్నేహ హస్తాలు ముట్టుకుని వాటిని నా హృదయం మీద అన్చుకుని వాటితో ఆటలాడగల శక్తి నాకుందా అని ప్రశ్నించుకుంటున్నాను...." రమణి ఆగింది.

"నువ్వు నన్ను నమ్మడం లేదా రమణీ! ...నేను నిన్ను పరీక్షించడం లేదు. ప్రేమిస్తున్నాను....ఈ మాటలు...." ఆయన ఆగాడు.

రమణి తలవంచుకుంది....ఆమె కళ్ళవెంట ఒకటి రెండు అశ్రువులు రాలాయి....చీకటి తప్ప వాటిని రాజగోపాలంగారు చూడలేరు.

"నాకు జవాబు కావాలి, రమణీ....జవాబు కాదు....నువ్వు కావాలి...."

రమణి నెమ్మదిగా అంది: "మదర్ చెప్తూండేవారుట - ఏ సమస్య అయినా ఎదురయినప్పుడు కంగారు పడకూడదుట....దాన్ని తట్టుకునే శక్తి కోసం మెడి

టేషన్‌లోకి వెళ్ళాలిట ...పైగా ఏ విషయానికైనా సరే....రియాక్ట్ కాకూడదుట.... రెస్పాండ్ మాత్రమే అవ్వాలిట....".

"నిజమే" అన్నాడు రాజగోపాలం....

ఇద్దరూ లేచారు. బీచ్ రోడ్‌కు ఎక్కి ఆశ్రమంవైపు మలువు తిరిగారు.

* * *

రమణి బాగా ఆలోచించింది. ఆమెకు వెంటనే అప్పుడిగా సీతారామ్‌గారు గుర్తుకొచ్చారు. ఆయన అనుభవశాలి....బ్రహ్మచారి....ఎన్నో ఏళ్ళుగా తన జీవితాన్ని మదర్ సేవలో శ్రీ అరబిందుల సేవలో గడిపాడు. ఆనాటి నుంచీ ఆశ్రమంలో ప్రతీ పనిలోనూ తనదనే ముద్ర ఒకటి వేస్తూవచ్చాడు. ఆయన పన్లన్నీ నియమం ప్రకారం జరుగుతాయి. పైగా ఆయన మంచి వక్త....రచయిత....శ్రీ అరబిందులు వ్రాసిన గ్రంథాలన్నిటి మీద ఆయన వ్యాఖ్యానాలు వ్రాశాడు. 'సావిత్రి' గ్రంథం మీద....ఇంటగ్రల్ యోగ మీదా నేటి సాధకుల అవసరాలకోసం ఎన్నో పుస్తకాలు ప్రచురించాడు. ఆయన ఎవరితోనైనా ఇట్టే కలిసి పోతాడు. పసిపిల్లలకు మంచి నేస్తం....యువకులకు స్నేహశీలి. పెద్ద వాళ్ళకు - పిన్నవాడు....

రమణి వెళ్ళేసరికి ఆయన మెడిటేషన్ పూర్తిచేసి వాలు కుర్చీలో కూర్చుని 'ది మదర్' పుస్తకం చదువుతున్నాడు. రమణి అతి నిశ్శబ్దంగా తలుపు తెరిచి - కారిడార్ దాటి హాలు వరకూ వెళ్ళింది. సీతారామ్‌గారు ఆ అమ్మాయి రావడం గ్రహించినట్టు 'రా, తల్లీ' అంటూ ఆహ్వానించాడు. రమణి మోకాళ్ళ మీద వాలి ఆయనకు నమస్కరించింది. కేమెమైల్ పుష్పాలు చేతికి ఇచ్చింది. ఆ పైన పక్కనున్న కుర్చీలో కూర్చుంది.

"నాకో సమస్య వచ్చింది....మీరు తీరిగ్గా ఉన్నారాసార్" అంది నెమ్మదిగా.

"అవునమ్మా .... ఈ పుస్తకం చదువుతున్నాను. నువ్వు చెప్తానంటే వింటాను...."

రమణి నెమ్మదిగా అంతవరకూ జరిగింది చెప్పింది. అయితే రాజగోపాలంగారి పేరు మాత్రం చెప్పలేదు.

"నేను ఇలాంటి సమస్యను ఎదుర్కొంటానని - ఎప్పుడూ అనుకోలేదు...."

సీతారామ్‌గారు నవ్వేశారు. "అలా భయపడితే ఎలా చెప్పు .... జీవితంలో ఎన్నో జరుగుతాయి....క్రింద పడతాం .... లేస్తాం....తప్పదు. ఈ విషయంలో కన్ఫ్యూషియస్ ఒక చక్కని సూక్తి చెప్పాడు. మనిషి క్రింద పడక పోవడంలో గొప్పతనం ఏం లేదుట....కానీ పడ్డ ప్రతీసారి తిరిగి లేవడం ఎలాగో తెలుసు కోవాలిట...."

రమణి నవ్వింది

"అంతా బాగానేవుంది....అతను అడిగిన తర్వాత నీకేమనిపించింది.... నీకు వివాహ వాంఛ వుందా?"

"ఈనాటివరకూ లేదు...."

"అతను, తన హృదయం విప్పి చెబితే నీకు జాలి కలిగిందా? సానుభూతి కల్గిందా? స్పందించావా?...."

"ఏవీ కాలేదు...."

ఆయన తిరిగి నవ్వేశారు ఆపైన అడిగాడు.... "దీన్ని నువ్వు ప్రాబ్లమ్ అంటావా?...."

రమణి జవాబు చెప్పలేకపోయింది....

"ఇద్దరి వ్యక్తుల ఇష్టాల మధ్య నడిచే వ్యాపారసంబంధమైన చుట్టరికాన్నే ప్రేమ - అని అంటుంది మదర్ తెలుసుగా...."

రమణి తల ఊపింది....

"ఆధ్యాత్మిక చింత అను, సాధన అను - వీటికి శారీరక సుఖానికి చుక్కెదురు.... ఇది మాత్రం నిజం.... ఈ రెండు కలిస్తే ఘోరమే అవుతుం దంటారు...."

రమణి ఆయన కళ్ళల్లోకి తలెత్తి చూసింది.

"శారీరక వాంఛను పూర్తిగా మర్చిపోలేనప్పుడు అంతఃకరణ స్వచ్ఛంగా ప్రకాశించలేదు.... దాని మూలంగా ఆధ్యాత్మిక మార్గం కూడా నిర్మలత్వాన్ని పోగొట్టుకుంటుంది....దాంతో మనిషి ఉన్నతికి వెళ్ళే మార్గానికి కూడా అవరోధం ఏర్పడుతుంది...."

అలా సీతారామ్‌గారు చెబుతూనే ఉన్నారు. ఆ తర్వాత లేచి లోపలకు వెళ్ళి రెండు గ్లాసుల నిమ్మరసం తెచ్చి, ఒకటి రమణికి ఇచ్చారు. ఆ తర్వాత ఏమనుకున్నారో బుక్ రేక్ దగ్గరకు వెళ్ళి శ్రీ అరబిందో, మదర్ వ్రాసిన 'ది ఉమెన్' పుస్తకం తీసి రమణి చేతికి యిచ్చారు.

"ఈ పుస్తకం చదువు."

రమణి సీతారామ్ గారికి మరోసారి నమస్కారం చెప్పి బయటకు అడుగులు వేసింది.

*　　　　*　　　　*

రాజగోపాలంగారు ఎప్పటిలాగే తన పన్లు తను చేసుకుంటూ పోతున్నాడు....కానీ ప్రతి పనీ శ్రమతో చేస్తోన్నట్టేవుంది. అదీకాదు - పని మీద దృష్టి లోపం ఎక్కువగా పడుతూనే వుంది....ఎటు చూస్తున్నా మరెటో చూడాలనిపించడం, ఆ చూసింది కూడా నచ్చనట్టుగా అన్పించడం జరుగుతోంది. రమణికి రెండు రోజులుగా ఫోన్ చేస్తూనే ఉన్నాడు. కానీ ప్రతిసారీ ఆమె తన పిలుపుకు దూరంగా వున్నట్టే జవాబు వినబడేది! ఆయన అసహనంగా కుర్చీలో కూలబడ్డాడు. సెక్షన్‌కు వచ్చిన ఉత్తరాలు చింపి చదివాడు. టేబిల్ సర్దాడు....కాగితాలు అటువి ఇటూ, ఇటువి అటూ పెట్టాడు. ఐదు నిముషాలు ఆ అవస్థలో దొర్లిపోయింది....ఎందుకో తలెత్తి చూశాడు. దూరం నుంచి సీతారామ్‌గారు రావడం కన్పించింది....రాజగోపాలంగారు సర్దుకు కూర్చున్నాడు. అప్రైన లేచి ఆయనకు ఎదురు వెళ్ళి పాదాభివందనం చేసి 'రండి సార్!' అంటూ సెక్షన్‌లోకి ఆహ్వానించాడు.

సీతారామ్‌గారు ప్రతి నమస్కారం చేసి కుర్చీలో కూర్చున్నాడు....

"పన్లు ఎలా సాగుతున్నాయి రాజగోపాలంగారూ?...."అని అడిగాడు.

"అంతా బాగానేవుంది...."

సీతారామ్‌గారు జేబులోంచి ఉత్తరాలు తీసి "ఈ నాలుగూ అమెరికా నుంచి వచ్చాయి....అవి వాళ్ళ పెర్సనల్ ప్రాబ్లమ్స్....రేపు నేను జవాబులు వ్రాస్తాను...."

రాజగోపాలం ఆఫీసుతో ఆ క్రితం రోజు జరిగిన విషయాలు చెప్పాడు ... ఆఫీసుకు వచ్చిన ఉత్తరాలు చూపించాడు.

సీతారామ్‌గారు ఏదో గుర్తుకు వచ్చి.... "చూడండి రాజగోపాలంగారూ! చెప్పడం మర్చిపోయాను....వారం క్రితం నాకు మన ఢిల్లీ ఆశ్రమం నుంచి ఉత్తరం వచ్చింది....వాళ్ళకు ఆశ్రమ నిర్వాహణ కష్టం అవుతోందిట....మన దగ్గర నుంచి ఎవరినైనా పంపగలరా అని అడుగుతున్నారు. రమణిని పంపుదా మనుకుంటున్నాను. అక్కడ వీరానీగారికి తోడుగావుంటుంది....అక్కడి పన్లు ఈమె అయితే అవలీలగా చేయగలదు....''

"బావుంది...." అన్నాడు రాజగోపాలం గారు నెమ్మదిగా.

"ఆ....మరో విషయం....మన బొంబాయి ఆశ్రమంవాళ్ళు 'సావిత్రి' మీద ఒక నెల రోజుల పాటు ఉపన్యాసాలు ఏర్పాటు చేయమని ఉత్తరాలు వ్రాస్తు న్నారు ...నిన్న మన కమిటీలో దీని గురించి చర్చించాం....ఎవర్ని పంపిస్తే బావుంటుందా అని ఆలోచిస్తే అందరూ మీ పేరు ఏకగ్రీవంగా చెప్పారు .... మీకు 'సావిత్రి' మీద మంచి అవగాహన వుంది....మీరు నెలరోజులపాటు అక్కడ ఉండ గలరా? ఈ కార్యక్రమం చేబడతారా?"

రాజగోపాలం క్షణం ఆశ్చర్యంగా సీతారామ్‌గారి కళ్ళల్లోకి చూసి తల దించుకుని, 'మీలాంటి వాళ్ళు వుండగా 'సావిత్రి' మీద నేను ఉపన్యాసాలు యివ్వడమా? ఇది నేను మిమ్మల్ని అవమానించడం అవుతుందేమో?...."

సీతారామ్‌గారు నవ్వేశాడు.... "అదేం మాట....మీకేం తక్కువని? మీరు అవగాహనతోనే ఈ కార్యక్రమం చేపట్టండి. అది దిగ్విజయం అవుతుంది. నాకా నమ్మకం వుంది ...''

రాజగోపాలం "తప్పకుండా" అని ఊరుకున్నాడు.

సీతారామ్ గారుక్షణం ఆగి, "బాగానేవుంది....మీతో మరో పని పడింది...." అని ఆగిపోయాడు....

"చెప్పండి....''

"అది సరే....మన ఆశ్రమంలో సాధకులు .... ముఖ్యంగా ఆడపిల్లలు, అందునా వయసులో ఉన్నవాళ్ళు పాటించవలసిన నిగ్రహం, అదే శారీరక వాంఛ గురించి ఈ నెల 'సర్వీస్ బులిటెన్'లో ఓ చిన్న ఆర్టికల్ వ్రాయాలి .... రెండు పేజీల లోపున వుంటే చాలు....ప్రెస్ వాళ్ళు అది తప్ప మిగిలిందంతా

పూర్తిచేసుకుని కూర్చున్నారు.... మేటర్ రేపు ఉదయానికి మద్రాసు వెళ్లాలి. ఈ రాత్రికి ఓ చిన్న ఆర్టికల్ వ్రాయగలరా?.... ప్లీజ్!....'' అన్నారు.

రాజగోపాలం మరోసారి ఆశ్చర్యపోయి, ఆప్పైన తేరుకుని "తప్పకుండాను. మదర్‌దే ఈ ఆదేశం అనుకుంటాను.... చేస్తాను.''

''యోగమార్గం ఎన్నుకున్న స్త్రీలకు - అదే మార్గంలో ప్రయాణించే పురుషులకు మించిన ఒక ప్రత్యేక లాభం వుంటుంది.... అదేమిటంటే - శారీరక వాంఛ స్త్రీలలో తక్కువపాలు వుండడమే అని మదర్ అంటూండేవారు....''

"నిజమేనేమో....''

"మరి నేను వెడతాను'' అంటూ సీతారామ్ గారు కుర్చీలోంచి లేచారు. నెమ్మదిగా బయటకు వెళ్ళారు. రాజగోపాలంగారు చుట్టూ చూసుకున్నాడు.... తను ఒంటరివాడో, లేక అందరివాడో అర్థం కాలేదు.... మనసులో తిరిగి మధనం మొదలయ్యింది.... సీతారామ్‌గారి ప్రతిపాదనల్ని తనెందుకు తిరస్కరించలేక పోయాడు?! తను అనుకున్నదేమిటి? జరిగిందేమిటి? అసలు తన లక్ష్యం ఏమిటి? తను ఎటు వెడుతున్నాడు? ఎటు ప్రయాణం జరగబోతోంది? - ఊహించిందీ - అందనిదీ గొప్పదా? ఊహించనిదీ - అందినదీ ఉన్నతమైనదా? ఆలోచనలు తెగటం లేదు....

సరిగ్గా ఆ సమయంలోనే రమణి సెక్షన్‌లోకి వచ్చి 'నమస్కారం మాష్టారూ!' అంది.

''నువ్వా?....''

''అవును, నేనే రాజగోపాలం గారూ! రెండు రోజులుగా మిమ్మల్ని కలవలేకపోయాను.... మీకు జవాబు చెప్పలేకపోయాను.... ఇప్పుడు....'' రమణి ఆగిపోయింది....

రాజగోపాలంగారు కాసేపు తలవాల్చి తిరిగి తలెత్తి, ఓసారి రమణి కళ్ళల్లోకి చూసి, ''అలా కూర్చో'' అన్నాడు.

రమణి కూర్చుంది....

''జవాబు చెబుదామని వచ్చావు కదూ?....''

రమణి తల ఊపింది.

''సారీ, రమణీ!.... కొంతకాలంపాటు నా ప్రశ్నను, నా కోరికను నేను వాయిదా వేసుకుందామనుకుంటున్నాను.... ఎందుకంటే, నా ప్రశ్న అదో చిక్కు ప్రశ్నగా మారి, ఇప్పుడది నాకే యక్షప్రశ్న అయి కూర్చుంది ... అందుకే నువ్వు కూడా నీ జవాబును నీ దగ్గరే వుంచుకో.... నీ హృదయానికే దాన్ని పరిమితం చేయి.... మనం మళ్ళీ కలవడం జరిగితే అప్పుడు ఆలోచిద్దాం.... ఎందుకంటే నీ జవాబు, అది ఎటువంటిదయినా విని తట్టుకునే స్థయిర్యం నేను కూడగట్టుకున్న తర్వాత - తిరిగి నేనే నిన్ను ప్రశ్నిస్తాను.... సరేనా....?....''

రమణి మౌనంగా తల ఊపింది.

''నా కోరిక విన్పించి నిన్ను గాయపర్చానా, రమణీ?....''

''మాస్టారూ.... మీరు ప్రశ్న అడిగింది నన్ను .... విన్నది నేను.... కానీ మీ ప్రశ్న, మీ హృదయావేదన, నాతోపాటు శ్రీ అరవిందులు, మదర్ కూడా వినే వుంటారు.... నాలాగా, మీలాగా వాళ్ళూ ఓ చక్కని తీర్పుకు ఈపాటికే వచ్చి వుంటారు.... ఆ తీర్పుకు వచ్చే ముందు, మదర్ తన జ్ఞానాన్ని, దీవెనల్ని, చిరునవ్వుని అందుకోసం ఖర్చుచేసే ఉంటారు.... అవునా....?'' అంది రమణి.

''నిజం....'' అన్నారు రాజగోపాలంగారు....

* * *

(ఈ మధ్య శ్రీ అరబిందు ఆశ్రమానికి వెళ్ళినప్పుడు, అక్కడ ఓ సాధకురాలు, రచయిత్రి అయిన శ్రీమతి పుష్పా ఆనంద్ ఇంగ్లీషులో చెప్పిన ఓ చిన్న కథ - ఈ కథకు ఆధారమయ్యింది. ఈ కథలో దాగివున్న ఏ సత్తువయినా అది పుష్పాఆనంద్‌కే చెల్లుతుంది.... ఆమెకు కృతజ్ఞతలతో. —రచయిత.)

# పెళ్లి ఆపిచూడు

—భమిడిపాటి రామగోపాలం

రైలు దిగి, స్టేషను వదిలి, ఇవతలికొచ్చి రిక్షా ఎక్కేవరకూ వూరుకుని, రిక్షా బయలు దేరగానే నా చేతిలో ఓ కాగితం పెట్టింది సరస్వతి.

''నా ప్రకటనకు జవాబుగా మీ దరఖాస్తు అందినది. దరఖాస్తు అని మీరు పేర్కొన్నందుకు నేను చాలా నొచ్చుకున్నాను. అయితే, ఆ మాట చూసి మీరు ఎంతో వినయ స్వభావం కలవారని అర్థం చేసుకొని నేను కొంత సంతోషించాను కూడా.

''మీరిచ్చిన వివరాలు నాకు ఆమోదంగా ఉన్నవి కనుక, మనం ఒకర్నొకరు పలకరించుకోవడం మంచిదనే ఉద్దేశంతో నేను మా అమ్మగారితో సహా ఈ నెల ఏడవతేది ఆదివారం ఉదయం సుమారు పదిగంటలకు మీ ఇంటికి రావాలని అనుకొంటున్నాను. మీరిచ్చిన అడ్రసు స్పష్టంగానే ఉంది...."

* * *

''ఏడోతారీకు - అంటే ఇవాళే!" అన్నాను.

''అందుకే కదా," అంది సరస్వతి. "అందుకే కదా, అంత హడావిడిగా నిన్న ఫోన్ చేసేను!" అని అర్థం.

నిన్నరాత్రి ఎనిమిది గంటలకి మా ఆఫీసు హెడ్‌గుమాస్తా మా ఇంటికి వచ్చేడు. ''సుందరావూ, నువ్వు రేపు ఉదయం బెజవాడలో దిగిపోవాలోయ్!" అని, జేబులోంచి ఒక కాగితం తీసి నాకిచ్చేడు. మా ఆఫీసర్‌గారు స్టెనోతో టైపు చేయించి పంపిన చీటీ అది.

సాయంకాలం ఆరూఅరవై. బెజవాడనుంచి సుందర్రావుకోసం ఎస్.టి.డి. ఫోన్‌కాల్. సరస్వతి మాట్లాడేరు. సుందర్రావు ఇంటికి వెళ్ళిపోయారని, ఈ రాత్రి

పది గంటలకి బయలుదేరే రైల్లో ఒంగోలు వెళ్తున్నారనీ చెప్పడమయింది. ఆమెకు సుందర్రావుతో అత్యవసరంగా మాట్లాడవలసిన పని ఉన్నదట. ఉదయం ఆ రైలు విజయవాడకు చేరేవేళకు స్టేషనుకి వెళ్ళి అతన్ని కలుసుకోవడానికి ప్రయత్నిస్తుందట. కాని, ఏ కారణం వల్లనైనా తాను రైల్వే స్టేషనుకి వెళ్ళలేకపోయిన పక్షంలో సుందర్రావు విజయవాడలో రైలు దిగిపోయి, ఆమె ఉండే ఇంటికి వెళ్ళి ఆమెను కలుసుకోవలసిందిగా సరస్వతి కోరుతున్నారు.

ఫోన్‌కాల్ రాగానే "ఆయన లేరండీ! ఎక్కడికెళ్ళేరో తెలియదండీ! ఎప్పుడొస్తారో తెలియదండీ!" అని చెప్పకుండా వీలున్నంతవరకు కమ్యూనికేషన్‌కి తోడ్పడాలి - అని మా ఆఫీసర్‌గారి సరణి.

* * *

సరస్వతి మా పెత్తండ్రిగారి మనవరాలు. విజయవాడలో ఒక ప్రభుత్వ ఆఫీసులో ఎకౌంటెంట్‌గా పని చేస్తోంది. మొన్న మొన్నటివరకూ ఒక హాస్టల్లో వుంది. ఈ మధ్యనే ఒక ఇంట్లో ఒక వాటా అద్దెకి తీసుకుని అందులోకి చేరింది.

బి.కామ్ పాసై కాస్ట్ ఎకౌంట్స్ చేసి కొన్నాళ్ళు ఓ చిన్న ఉద్యోగం చేసేక - అంటే ఇరవై నాలుగోఏట సరస్వతికి పెళ్ళయింది. మూడేళ్ళు కాపరం చేసేక దాని మొగుడు రంగనాథరావు పోయేడు. అప్పటికతనికి ముప్ఫయి ఏడేళ్ళు.

''జాలిగొలిపే పరిస్థితులు'' ఆధారంగా సరస్వతికి అదే ఆఫీసులో ఉద్యోగం ఇచ్చేరు. ఐతే, సరస్వతికి మంచి అర్హతలు ఉన్నందువల్ల ఎకౌంటెంట్ అయింది. రంగనాథరావు చనిపోయిన నాటికి అతను పదిహేనేళ్ళు సర్వీసు చేసి వున్నాడు. అందువల్ల కొంచెం పెన్షను, ఈ జీతం వస్తున్నాయి. సరస్వతి ఆ అత్తగార్ని వచ్చి తనతో ఉండమంది గాని, ఆవిడ కూతురింట్లోనే ఉంటానంది. సరస్వతి ఆవిడకి ప్రతినెలా నాలుగు వందల రూపాయలు పంపుతోంది. "అలా సెంటిమెంట్లు పెట్టేసుకోకు. పిల్లా జెల్లా లేరుకదా! చిన్నదానివే కదా! ఇంకో పెళ్ళి చేసుకో" అని ఈ రెండేళ్ళూ యీ అందరం సరస్వతికి చెప్తున్నాం. ''నన్ను చేసుకునే వాడొకడు దొరకాలి కదా?'' అని సరస్వతి జవాబు.

ఇప్పుడు దొరికినట్టున్నాడు.

* * *

ఇంటికి చేరిన ఐదు నిమిషాల్లో కాలకృత్యాలు తీర్చుకుని ముందు గదిలోకి వచ్చాను. ''ఆ ఎడ్వర్‌టయిజుమెంటు నాకోసారి చూపించు'' అన్నాను.

''ఓ,'' అని సరస్వతి ఒక కవరు నాకిచ్చింది. అందులో ఆ ప్రకటన, దానికి జవాబుగా తను రాసిపంపిన ''దరఖాస్తు'' కాపీ ఉన్నాయి.

"విజయవాడలో ఒక ప్రయివేటు సంస్థలో మంచి ఉద్యోగం (రు 4,500)లో ఉన్న 35 ఏళ్ళ యువకునికి 27 ఏళ్ళు దాటిన వయసుగల వధువు కావలెను. వరునికి ఒక వివాహం అయినది కాని, చట్టబద్ధమైన విడాకులు పొంది ఉన్నాడు వధువు అవివాహిత అయి వుండాలనే నిబంధన లేదు. పిల్లలులేని భర్తృహీనల నుండి కూడా జవాబులు కోరబడుచున్నవి. ఉద్యోగినులకు ప్రాధాన్యం.'' ఆ తర వాత కులం, గోత్రం వివరాలున్నాయి. బాక్సు నెంబరు ఉంది.

''అతనికి ఈ వూళ్ళోనే ఉద్యోగం అన్నమాట!'' అన్నాను.

''అందుకే కదా?'' అంది సరస్వతి.

''35 ఏళ్ళంటున్నాడు. అంటే రంగనాథరావు కంటేకూడా చిన్నవాడన్న మాట?'' అన్నాను.

''అందుకే కదా,'' అంది సరస్వతి మళ్ళీ.

''అన్నయ్యకి చెప్పేవా?''

''నిన్ననంతా అన్నయ్య కోసం ఫోన్‌లో ట్రయి చేసేను. దొరకలేదు.... అయినా, నాగపూర్ నుంచి రావాలి కదా, నీ అంత వేగం రాలేదు. ఈ ఉత్తర మైనా నాకు నిన్ననే ఒచ్చింది!''

* * *

పదింపావుకి వచ్చేరు ఆ అబ్బాయీ, తల్లీ.

అతను చాలా చక్కగా ఉన్నాడు. ఆరడుగులకి కొద్దిగా తక్కువేగాని పొడగిరి కిందనే లెక్క. తెల్లగా ఉన్నాడు. 35 ఏళ్ళన్నాడు గాని 30 లా వున్నాడు. బొజ్జలేదు; బట్టతల కాలేదు: సినిమాలో కాదు గాని ఏదో నవలలోనో నాటకంలోనో చూసిన పాత్రలా ఉన్నాడు.

అవిడకి అరవై ఏళ్ళుండొచ్చు. విధవరాలేగాని మొహానికి నల్లబొట్టు, చేతులకి బంగారు మురుగులూ ఉన్నాయి. ఇటుక రంగు పట్టంచు తెల్లచీర, అంచులేని తెల్ల రవిక. మొహంలో కొద్దిగా వేదన, కొద్దిగా విసుగు.

''రండి, రండి!'' అని సరస్వతి అవిడని రెండు చేతులూ పట్టుకుని లోపలికి తీసుకొచ్చింది. "ప్లీజ్ సిడౌన్" అని అతనికి కుర్చీ చూపించి ఆవిణ్ణి సోఫామీద కూర్చోబెట్టింది. "సరస్వతి నేనే. ఈయన మా చిన్నాన్నగారు - విశాఖ పట్నంలో వుంటారు. ఇవాళే వొచ్చారు నేను టెలిఫోన్ చేసి రమ్మంటేను" అంది.

వాళ్ళిద్దరూ నమస్కారాలు చేసి కూర్చున్నారు. "ఇల్లు కనుక్కోడానికి ఇబ్బందేమీ పడలేదు కదా? మీరు బెజవాడలోనే ఉంటున్నారట కదా? మీ ఇల్లు ఎటువేపు? బస్సులో వచ్చేరా. ఆటోలో వచ్చేరా?-" లాంటి ప్రశ్నలు వేస్తున్నాను.

"చిన్నాన్నా! నువ్వు మాట్లాడుతూ వుండు; నేనిప్పుడే వస్తాను" అని సరస్వతి లోపలికెళ్ళింది. "ఎక్స్‌క్యూజ్ మి' అని ఆ అబ్బాయికి చెప్పి నేనుకూడా లోపలికి వెళ్ళేను.

"పరవాలేదు చిన్నాన్నా; నే తెస్తాను! నువ్వుకూడా గెస్టువే కదా?" అంది సరస్వతి అక్కడున్న సరంజామా చూపించి నవ్వుతూ.

మూడు సాసర్లలో బిస్కెట్లు నాలుగేసి పేర్చివున్నాయి. మూడు గ్లాసులలో మంచినీళ్ళు పోసి వున్నాయి. మొత్తం అన్నీ ఒక ట్రేలో సర్దింది సరస్వతి. "సరే, పోనీ - నువ్విది పట్టుకెళ్ళు; నేను కాఫీ కలిపి పట్టుకొస్తాను" అంది.

సరస్వతి హుందాగా, ఉత్సాహంగా వుంది. వంక పెట్టడానికి వీల్లేని చక్కదనం. ఈ ఇల్లు తనది. స్వతంత్రంగా బతుకుతోంది. పెళ్ళి చూపులకి హాజరవడం ఇది మొదటిసారి కానేకాదు కదా? ఒకసారి పెళ్ళయింది; మూడేళ్ళు కాపురం చేసింది; ఒక ఆఫీసులో బాధ్యతగల ఉద్యోగం చేస్తోంది.

ఆకుపచ్చటి పువ్వులు మాత్రం ప్రింటు చేస్తున్న తెల్లటి ఫుల్‌వాయిల్ చీర కట్టుకుంది సరస్వతి....ఓ చేతికి గడియారం, రెండో చేతికి కంకణం లాంటి బంగారు మురుగు. మొహం మీద ఎర్రటి స్టిక్కర్ బొట్టు.

"కాఫీ నేనే కలిపి తెస్తాను. ఈ ట్రే నువ్వు పట్టుకెళ్లు" అన్నాను.

"అలాగే కాని, బావుండదేమో చిన్నాన్నా!"

"ఏమిటి, నాకు కాఫీ కలపడమే చాతకాదంటావా?" అన్నాను.

సరస్వతి నవ్వింది. "అదికాదు చిన్నాన్నా! నిన్నిక్కడ వంటింట్లో వొది లేసి నేను వాళ్ళతో కబుర్లు చెప్తూ కూచోడం బావుండదేమో - అంటున్నాను" అంది నెమ్మదిగా.

"ఐదు నిమిషాల్లో ఒచ్చేస్తానుగా; నువ్వు పద!"

అంత అందగాడూ స్ఫురద్రూపీ అయినా సరే, ఎందుకో ఆ అబ్బాయితో ఏదైనా మాట్లాడాలని అనిపించడం లేదు నాకు. ఆ అబ్బాయిని ఎక్కడ చూసేనా అనే ఈ రెండు మూడు నిమిషాల నుంచి నా ఆలోచన.

ఫిల్టర్‌లో డికాక్షన్ గిన్నెలోకి కొద్దిగా వొంచి, తగినన్ని పాలు కలిపాను. రంగు సరిపోయిందని నిర్ధారణ చేసుకొని గిన్నెని పొయ్యిమీదికి ఎక్కించేను. లైటరు తప్పమనిపించగానే నా మెదడులో ఏదో వెలిగినట్టయింది.

"పాపా!" అని పిలిచేను.

"ఒచ్చే వొచ్చే!" అంటూ మరుక్షణంలో వచ్చింది సరస్వతి. 'అయ్యో, అయ్యో! అంత సెగెందుకు చిన్నాన్నా, కాఫీ గిన్నెకింద? అందుకే కదా నేను కలిపి తెస్తానన్నాను!" అంటూ మంట తగ్గించే ప్రయత్నంలో పడ్డది.

మంట పొయ్యిలోది తగ్గింది - కాని -

"అతని పేరేమిటన్నావు?" అన్నాను.

"కె. రాజేశ్వరరావు - ట. నాకు రాసిన జవాబులో ఉంది; నువ్వు చూళ్లేదూ?" అంది సరస్వతి నెమ్మదిగా.

"అదే, అదే. సమయానికి గుర్తురాక అడిగేను. పద....కప్పులు ఇవేనా? ఇంకొక ట్రే వుందా, లేకపోతే ఈ స్టీలు పళ్ళెంలో పేర్చి తెస్తాన్లే."

"ఇంకొంచెం వేడెక్కాక...." అని సరస్వతి వెళ్ళింది.

అదీ రైటే. ఇంకొంచెం వేడెక్కాలి.

నేను వెళ్ళేసరికి రాజేశ్వరరావు మాట్లాడుతున్నాడు. "అఫ్‌కోర్స్! మీకు ట్రాన్స్‌ఫర్లు ఉంటాయి. కాని, నాకు క్యాంపులు ఉంటాయి కదా - పైగా

క్యాంపుల మధ్య లీజర్స్ కూడా వుంటాయి. ఎలాగో ఓలాగ ఎడ్జస్ట్ అవొచ్చు. అమ్మ వీలునిబట్టి ఇక్కడో అక్కడో ఉంటుంది. అఫ్‌కోర్స్; మీరెక్కడుంటే అక్కడే అమ్మకూడా వుంటే మీకు తోడుగా వుంది అన్నీ చూస్తుంటుందను కోండి నాకేముంది మొగాణ్ణి; ఎక్కడైనా ఎడ్జస్ట్ అయిపోతాను!''

బెజవాడలో వాళ్లుంటున్నది స్వంత ఇల్లా, అద్దె ఇల్లా! అద్దె ఎంత? అసలు స్వగ్రామం ఏవూరు? పొలాలూ వున్నాయా? ఇద్దరి జీతాలూ కలిపితే రాబడి ఎంత అవుతుంది? అన్నదమ్ములున్నారా? ఎక్కడున్నారు? మంచీ చెడ్డా చూడ్డం విధాయకం అయ్యే అక్కచెల్లెళ్ళుగాని లేరు కదా? ఇలాటి ప్రశ్నలయ్యాయి.

"నేను పెళ్ళి చేసుకుంటే అది రికార్డుల్లోకి ఎక్కుతుంది. ఆ తేదీ నుంచి నాకు నా మొదటి భర్త మూలంగా వచ్చే పెన్షన్ ఆగిపోతుంది. ఎంతో ఏమీ? అయిదువందల ఇరవై. అయినాసరే, ఆయన పోవడం వల్ల నాకీ ఉద్యోగం వచ్చింది కనకనూ, ఆ అత్తగారికి నేను మాటిచ్చేను గనకానూ, ఆవిడ బతి కున్నంతకాలం ఆవిడకి నెలనెలా నాలుగు వందల రూపాయలు పంపాలి. లేదా అంటే అలా ఆవిడకి నెలనెలా నాలుగు వందలు వడ్డీ వచ్చేటంత డబ్బు ఏదైనా బ్యాంక్‌లో డిపాజిట్ చెయ్యాలి'' అంది సరస్వతి.

"అంటే ఎంత?" అన్నాడతను.

సరస్వతి రెండు క్షణాలు సీలింగ్ ఫాన్ వేపు చూసి లెఖ్ఖ కట్టింది - "ఓ యాభై వేలు చాలనుకుంటాను.'"

''యాభై వేలు ఆవిడ పేర డిపాజిట్ చేసేస్తే మరి నీ కొత్త కాపరానికి ఏం మిగుల్తుంది, పాపా?" అన్నాను.

''అదేంటి చిన్నాన్నా, అలాగంటావు? కొత్త కాపరానికి ఏమిటుండాలేం, మహా?''

''అలా అనకు. కొత్త కాపరం అన్నాక ఎన్నెన్నో వుండాలి. రుచులన్నీ చంపుకొని నువ్వు సోఫా కంబెడ్డుమీద నిద్రపోతున్నావు. ఓ ఫ్రిజ్జు లేదు. ఓ టీవీ లేదు, బట్టలుతికే మిషనైనా లేదు, నీకు! - ఇద్దరు ఉద్యోగాలు చేసుకుంటున్నా మాటేగాని ఇంట్లో ఏమీలేవే - అని నీ కోలీగ్స్ అతని ఫ్రెండ్స్ ఎత్తిపొడవొచ్చు కధా....పోయినవాడు పోనేపోయాడు. అతనే పోయాక ఇంక ఆ అత్తగారేమిటి;

ఆవిడకి నువ్వు ప్రతినెలా డబ్బు ఇంతా అని పద్ధతిగా ఏర్పాటు చెయ్యడమేమిటి? తల్లిదండ్రుల్నే ఛీ, పీశ్కెక్కడ దాపరించేరని విసిరికొడ్తున్న కాలం అయితేను!" అని దురుసుగానే అన్నాను.

''తప్పుమాట, బాబూ!'' అంది, ఆవిడ. ''అమ్మాయి మనసుని విరిచేకండి బాబూ! అవతలావిడికి కొడుకే లేడు; ఈ సాయంకూడా లేకపోతే ఏమై పోతుంది, పాపం! ఆవిడ వుండేది - పోనీ ఇంకో కొడుకుదగ్గిరైతే అది వేరేమాట; కాని ఆవిడుండేది అల్లుడింట్లోనటగా?''

''మీ మొదటి భార్య - పద్మలత అన్నారు కదూ ఆవిడ పేరు?....'' అని ఒక్క క్షణం ఆగాను నేను. ''క్షమించండి; గతం తవ్వాలని కాదు, ఊరికే - సంబంధం కలుపుకునే ఉద్దేశం వచ్చింది గనుక అడుగుతున్నాను - ఆవిడకీ మీకూ ఏ కారణం వల్ల విడాకులయ్యేయి?''

రాజేశ్వర్రావు నావేపు ఆశ్చర్యంగా, అనుమానంగా చూసేడు. ''పద్మలత మీకు తెలుసా?"

పెద్దావిడ నెత్తికొట్టుకుంది. ''ఏమిటో బాబూ, బంగారం బంగారం అనుకుంటాంగానీ, వొకొక్కొక్కపుడు బంగారానిక్కూడా కిలుం పట్టొచ్చని పిస్తుంది!''

''అదో పెద్ద పొగరుబోతు పోట్లగిత్త!'' అన్నాడు రాజేశ్వర్రావు. మొహం వీధివేపు తిప్పి. ''సరస్వతిగారు మాత్రం సంపాదించుకోటం లేదా? అయినా ఇంత కల్చర్డ్‌గా, ఇంత సింపతెటిక్‌గా ఆలోచిస్తున్నారు. ఆ భర్త చనిపోయినా సరే ఆ అత్తగారిమీద సానుభూతితో ఆవిడకి హెల్ప్ చెయ్యాలన్న సంకల్పంతో వున్నారు. పద్మలత అలాక్కాదే! తను సంపాదించే దంతా తనదే అని—'' అని మళ్ళీ ఆగాడు. ''సర్లెండి. మనం ఒకరికొకరు పరిచయం అయ్యాం కదా; మిగిలిన విషయాలన్నీ క్రమంగా సెటిల్ చేసుకోవచ్చునను కుంటాను'' అన్నాడు సరస్వతితో. ''లే, అమ్మా; వెళ్దాం!'' అన్నాడు తల్లితో. '''వస్తాం, సార్, నమస్కారం!'' అన్నాడు నాతో.

ముందుగా లేచి నిలబడింది అతనే అయినా ముందుగా గుమ్మం దాటింది పెద్దావిడే. నేను ఆవిడ కూడా మెట్లు దిగుతున్నప్పుడు ఆవిడ గొణుక్కుంటోంది.

"తొందరొద్దు నాయనా అంటే వినిపించుకున్నాడు గాదు. కిలుం పట్టినా బంగారం బంగారమేరా అంటే కూడా లేచ్చక్కావొచ్చాడు!''

*　　　　*　　　　*

వాళ్ళు సందు మలుపు తిరిగే వరకూ గేటు దగ్గిర నిలబడి; అప్పుడు లోపలి కొచ్చింది సరస్వతి. రావడం రావడమే సోఫా మీద వాలిపోయింది. వాలడం వాలడమే బోర్లాపడిపోయింది. సరస్వతికి ఏదో ఆశభంగం కలిగిందని గ్రహించడానికి నాకొక నిమిషం పట్టింది. అప్పుడు కుర్చీలోంచి ఒక దిండుతీసి దాన్ని సరస్వతి తలకింద అమర్చడానికి ప్రయత్నం చేసేను.

"చాల్లే, నిరవాకం!'' అని లేచి కూర్చుంది, సరస్వతి.

కొంచెంసేపు సరస్వతిని అలా బాధపడనిచ్చేను.

"ఏమిటైందో; ఏం మాట్లాడుకున్నామో; అంతా అయోమయంగా వుంది" అంది సరస్వతి.

''కుర్రాడు బావున్నాడు, ఉద్యోగం కూడా, గవర్నమెంట్ జాబ్ కాకపోయినా మంచిదేలా వుంది. ఐనా, ప్రయివేట్ కంపెనీ ఉద్యోగాలు కూడా అంత చచ్చిపోయిలేవు ఈ రోజుల్లో" అన్నాను.

"అందుకే కదా" అంది సరస్వతి, తన మామూలు ధోరణిలో. క్షణంలో మొహం మాడ్చుకుంది. "మరి-నువ్వెందాక ఎందుకలా పుల్ల విరుపు మాట్లన్నావు? అదికాదు, చిన్నాన్నా, ఆవిడ పేరు పద్మలత-అని అతను చెప్పేడన్నావు; చెప్ప లేదే?"

"చెప్పలేదు" అన్నాను.

"ఆవిడ సంగతి వాళ్ళ దగ్గిర ఎందుకు ప్రస్తావించేవని?"

"పెళ్ళి చేసి చూడు - అనేకాదు; పెళ్ళి ఆపిచూడు - అని కూడా ఆలో చించాలి; అవసరమైతే. అందుకు; ఆవిడ పేరు అతను చెప్పకపోయినా నేనే గుర్తుకి తెచ్చేను. అతనెలా చిరాకు పడ్డాడో చూసేవుకద?"

"అంటే?"

"—జరిగిందేదో జరిగింది! గుర్తుచేస్తున్నానని ఏమీ అనుకోకు....రంగనాథరావుతో నీ పెళ్ళి మాటలు అవుతున్నప్పుడు కూడా అతనికి చిన్న వయస్సులోనే హై బీపీ అనీ, షుగరుందనీ, ఖర్చు దారీ మనిషనీ చెప్పి నేను నీ పెళ్ళి ఆపడానికి ప్రయత్నించేను....ఎవ్వరూ నా మాటలు పట్టించుకోలేదు.... ఇప్పుడు పద్మలత సంగతి చెప్తాను, విను! విన్నాక నీకెలాతోస్తే అలాగే చెయ్యి. ఆఫ్టరాల్, ఇది, నీ జీవితం, నీ యిష్టం! నువ్వు మంచిదానివి. ఎంత మంచి దానివంటేనూ నీ నెత్తిమీద ఎవరైనా చెయ్యేసి నిన్ను అణిచేస్తున్నాసరే పట్టించుకోనంత మంచిదానివి. మంచిగా వుండడం మంచిదే కాని, తెలివిగా ఉండడం కూడా అవసరమే కదా!"

సరస్వతి ఏమీ అనలేదు.

"పద్మలత అనే అమ్మాయి నాకు తెలుసు. నీలాగే బాగా చదువుకొంది. డైరెక్ట్ రిక్రూట్‌మెంట్ ద్వారా రైల్వేలో సీనియర్ అసిస్టెంటుగా ఉద్యోగం సంపాదించుకుంది. సికింద్రాబాద్ రైల్ నిలయంలో పనిచేస్తోంది. ఇతను - అంటే ఈ రాజేశ్వరరావు - హైదరాబాద్‌లో ఒక మంచి ప్రయివేటు కంపెనీలో ఇంతకంటే కూడా మంచి పోస్టులో ఉండేవాడు. సరే, పెళ్ళి కుదిరింది. పెళ్ళికుదిరితే పిచ్చికుదుర్తుందనీ, పిచ్చికుదిర్తే పెళ్ళికుదుర్తుందనీ కదా వాడుక! ఇతనికి పెళ్ళికుదిరాక పిచ్చిముదిరిందేగాని కుదిరిందిగాదు. యాభైవేలు కట్నం పుచుకున్నాడు. రెండేళ్ళలో అంతా తాగేశాడు. టూర్లు తిరిగే ఉద్యోగం కదా. ఊరూరా మొగా ఆడా తేడా లేకుండా ఫ్రెండ్సు ఏర్పడ్డారు. పాపం, ఆ అమ్మాయి; ఇల్లు నడిపిస్తూనే - పదీపాతికా మిగిల్చి ఇంటి క్కావల్సినవన్నీ కొన్నది. ఫ్రిజ్జు, టీ.వీ, వాషింగ్‌మెషిను; మిక్సీ, గ్రైండరు, కూలరు, డయినింగ్ టేబిలు, మంచాలూ, సోఫాలూ, బీరువా - ఒకటేమిటి; సమస్తం! ఇతగాడు జంటనగరాల్లో తిరగడానికి స్కూటర్ కావాలంటే తనే లోన్‌పెట్టి కొనిచ్చింది.

ఆఖరికి ఒక ఎపార్ట్‌మెంట్ కొనేటప్పుడు పేచీఒచ్చింది. మీ నాన్నగార్నడిగి డబ్బితే - అని పద్మలతని తరిమాడు. ఆయన చేతులెత్తేశాడు. ఇతగాడు దెబ్బలాట పెట్టేశాడు. తిట్టేడు, కొట్టేడు కూడానూ. నిన్ను వదిలేస్తానన్నాడు. బంధువులూ స్నేహితులూ ఎంతగానో నచ్చజెప్పేరు. ఐనా, మొండితనానికి

పోయేడు. ఒక యాడాదిపాటు వేరే రూమ్ తీసుకుని వున్నాడు. విడాకులికి కేసు వేసి గెల్చుకున్నాడు. ఆ డిక్రీ చేత్తో పుచ్చుకుని నా సామగ్రి నాకిచ్చెయ్యి; వెళ్ళిపోతానన్నాడు. నీ సామాను ఇక్కడేం లేదు పొమ్మంది పద్మలత. కోర్టు అర్డరు పొంది ఆఫీసర్ని తీసుకొచ్చేడు. తను కొన్న ప్రతీ వస్తువూ తన పేర్న బిల్లులు తీసుకునే కొన్న సంగతి పద్మలత రుజువు చేసుకుంది. మనకి పెళ్ళయి నప్పుడు నీ ఫ్రెండ్సు ప్రెజెంటేషన్‌గా యిచ్చిన సూట్ కేసు ఇదుగో. నీ బట్టలూ సర్టిఫికేట్లూ పెన్నూ పెన్సిలూ లెటర్ హెడ్సూ తప్ప ఈ ఇంట్లో నీదంటూ ఏమీలేదు; పో అవతలికి - అని తన్నకుండా తన్ని తగిలేసింది పద్మలత ఈ ప్రబుద్ధుణ్ణి. అదుగో అప్పుడు చూసేనితన్ని; ఆ పక్క ఫ్లాట్‌లో ఉన్న నారాయణ మూర్తి మామని పలకరించడానికెళ్ళి! ఇప్పుడు ఇతగాడు మళ్ళీ కొత్త జీవితం ప్రారంభించాలని పేపర్లో ప్రకటన వేసి ఉద్యోగస్తురాళ్ళకి ప్రాధాన్యం అంటు న్నాడు. వెళ్లు; నీకు ప్రాధాన్యం ఉంది. ఇతన్ని పెళ్ళిచేసుకుంటే కొన్నాళ్ళకి నువ్వు మరో పద్మలతవి అవుతావు!" అన్నాను. *

# చుక్కల ముడి

—పి. యస్. నారాయణ

రామాపురం ఇనస్పెక్షన్‌కు వెళ్ళమన్నప్పుడు నేను ఉత్సాహాన్ని ప్రదర్శించిన మాట వాస్తవమేగాని - ఆ తరువాత ఆఫీసులో ప్రతి వెధవా నేనేదో బహుదా నష్టము కష్టమూ పొందుతున్నట్లుగా పరామర్శిస్తుంటే చికాకు చిరాకేగాకుండా నీరసపడిపోయాను.

ఆ జిల్లాకేంద్రానికి నేను బదిలీ అయివచ్చి ఇంకా నెలకాలేదు. ప్రమోషన్ మీద వచ్చానేమో ఉద్యోగరీత్యా మొదటి క్యాంప్. అప్పటికీ తోటి ఉద్యోగుల పరామర్శలకు కారణాన్ని తరచి తరచి అడిగినా - ముసిముసినవ్వులతో దొంగ చూపులు చూచుకుంటూ వెళ్ళిపోయేవాళ్ళేగాని - 'ఆ ఊరి పరిస్థితి ఇదండీ సీతాపతిరావుగారూ!' అని ఒకళ్ళూ నా మొఖం మీద చెప్పిచావటం లేదు.

కడుపుకోసరం కొలువుకు జేరినప్పుడు పైవాడు ఏం చెప్పినా చేయక తప్పదు. అందుకనే ఎవరు ఏమన్నా లెక్కచేయకుండా ఆ ఊరు వెళ్ళి ఆ స్కూలును, వారి లెక్కలను తనిఖీ చేయటానికే నిర్ణయించుకున్నాను. పాత దస్త్రాల దుమ్ము దులిపాను. వాటి సారంశం: అక్కడ ఆరుగురు ఉపాధ్యాయులు ఉన్నారు. అన్ని తరగతులకు కలిపి రెండు వందలదాకా విద్యార్థులున్నారు. ఏడో తరగతివరకూ చదువు వున్నది. రెండెకరాల స్థలంలో ఆరు గదులున్న పెంకుటిల్లున్నది. ఇక ప్యూను వున్నాడు. ఇద్దరు స్వీపర్లు ఉన్నారు.

ఆ స్కూలు హెడ్మాస్టరుగారి పేరు భుజంగరావు!

ఊళ్ళోకి వచ్చేస్తున్నాం అన్నట్లుగా అక్కడొక ఇల్లు, ఇక్కడొక ఇల్లు. చెరువు కట్ట పక్కగా మట్టిరోడ్డుమీద దుమ్ము లేపుకుంటూ నడుస్తున్న బండి మర్రిచెట్టు దాటింది. సున్నపుగానుగ దాటింది.

నేనెక్కిన బండికి కట్టిన రెండు బక్కచిక్కిన నల్లమచ్చల తెల్ల ఎడ్లు నోటమ్మట నురుగకారుస్తూ వగరుస్తున్నాయి. నాకు వళ్ళంతా నొప్పులుగా వున్నది. ఉదయాన పదిగంటలకు భోజనంచేసి బస్సెక్కితే అయిదు గంటలకు ఈ ఊరికి రెండు కిలోమీటర్ల దూరంలో కంకర రోడ్డుమీద దిగాను. అక్కడనుంచి రెండెడ్ల బండిలో మెత్తగా పరిచిన గడ్డిమీద కప్పిన పట్టామీద కూర్చొని గుంటలు మెట్టలు దాటుతుంటే వళ్ళంతా చిక్కబట్టినట్లయింది.

"దిగండి సారూ!" అన్నాడు బండితోలే అతను.

ముందువైపున ముసలమ్మలు ముడుచుకు కూర్చున్నట్లుగా వున్న పాత పెంకుటిండ్ల మీదగా లేస్తున్న పొగల్ని వింతగా చూస్తున్న నేను బండివాడి మాటలకు ఉలిక్కిపడి కళ్ళెత్తి అతడివంక చూశాను.

"దిగండయ్యా!"

"వచ్చామా స్కూలు దగ్గరకు?"

సాయంత్రం ఆరు గంటలయింది. ఎండ కనుమరుగయిందిగాని చీకటి పడలేదు. చెట్లమీద కాకులు గుంపులు గుంపులుగా జేరి ఊరికి కొత్త చుట్టం వస్తున్నట్లుగా అరుస్తున్నయి.

"లేదండయ్యా! బండిదిగండి ముందు....చెబుతాను!"

దిగాను. రెండు బిందెలు సలసలా కాగే నీళ్ళు పోసేసుకుంటేగాని హాయిగా నిద్రపట్టదు. చేతిలోకి సంచీ తీసుకున్నాను.

"దాన్ని అక్కడే వుండనీయండి!"

గంటబట్టీ గమనిస్తున్నాను - అతడి గొంతు కీచుగా వున్నది. అతడు మాట్లాడుతుంటే గుడ్లగూబ అరుస్తున్నట్లున్నది. ఆ గంట ప్రయాణంలో అతడు ఒక్కసారి తలకు చుట్టిన గుడ్డతీస్తే అతడి తలమీద బారెడు జుట్టు ముడి ఊడి జారిపడితే - నా వళ్ళు ఝల్లుమన్నది - అతడు మొగా ఆడా అన్నట్లుగా.

దిగి ముందుకు వచ్చాను.

"అటు చూడండి....అక్కడ రెండు రెల్లు గుడిశెలున్నాయి గదా .... వాటి ముందు యిద్దరు ఆడవాళ్ళు కూర్చుని వున్నారు. వాళ్ళే అక్కమ్మ, చెక్కమ్మ! వాళ్ళ దగ్గరకు వెళ్ళి మీరు వచ్చిన పనిచెప్పి ఆశీర్వాదం తీసుకొనిరండి!"

నేను విసురుగా ఆ బండివాడి వంక చూశాను. నేను ఎవరో వాడికి తెలిసినట్లుగా లేదు. నేను స్కూళ్ళ ఇనస్పెక్టర్ని. ఆ ఊరు స్కూలును తనిఖీ చేయటానికి వస్తున్నాను. మధ్యలో వాళ్ళ ఆశీర్వాదం దేనికి. బోడి ఆశీర్వచనం నాకు!

"ఏం మాట్లాడుతున్నావ్?" విసురుగా అన్నాను.

"అయ్యా! నేను చెప్పేది వినుకోండి....మీకు మేలు జరుగుతుంది....వాళ్ళే మా ఊరికి దేవతలు!

"వాళ్ళు దేవతలు కానీయ్ ...దెయ్యాలు కానీమ్....నేను వెళ్ళను!" అన్నాను తల అడ్డంగా ఊపుతూ మొండిగా.

వాడు చెర్నాకోలు చేతిని పైకెత్తాడు. నాకు భయమేసింది.

అతడు కీచుగొంతుకతో నవ్వాడు. "స్వామీ! మీరు చదువుకున్నవారు.... పెద్దవారు— వయస్సులో నాకంటే కాదనుకోండి....అయినా, ఏ ఊరి ఆచారం ఆ ఊరికి వుంటుంది కదండీ?....కనుక దయయుంచి....అందరి మేలూ....ముఖ్యంగా మీ మేలుకోరి నేను చెప్పేదేఁవిటంటే....''

సూటిగా తల పైకెత్తాను. ఆ క్షణాన కళ్లు చికిలించి అతడివైపుగా చూస్తే అతడు రథం మీదవున్న కృష్ణుడిలా వున్నాడు. కురుక్షేత్ర సంగ్రామంలో కాస్తంత దూరంగా రెండు చేతులూ కట్టుకునిలబడ్డ అర్జునుడిలా నేనున్నాను.

నేను నోరు విప్పకముందే అతడు నోరు విప్పాడు. "అయ్యా! నేను చెప్పేది సావధానంగా వినుకోండి....వాళ్లు మా ఊరి దేవతలు అని చెప్పానుగదా! అలా దేవతలను ముందుగా వేడుకొని ఈ ఊళ్ళో ఎవరైనా ఏ కార్యమైనా మొదలు పెట్టాలి....ఇది మా ఊళ్ళో గత యాభై ఏళ్ళుగా వస్తున్న రివాజు.... మీకు జరగబోయే మంచికి వారి ఆశీర్వాదం ఎంత అవసరమో....వాళ్ళని ధిక్కరించటం వలన మీకు జరగబోయే హానికికూడా వాళ్లు అంతే బాధ్యులవుతారు!.... ఇది నాకు తెలిసిన నిజం....లేదంటారా....చెడుగూడా ఎలా వుంటుందో రుచి చూద్దామనుకుంటారా!.... బండెక్కెయ్యండి.... నేను మాత్రం వాళ్ళ అనుమతి

తీసుకు వచ్చి బండిని ఊళ్ళోకి నడిపిస్తాను....మిమ్మల్ని ఆ ఊరి బయట బంగ ళాలో వదిలేసి చక్కా చేతులు దులుపుకు పోతాను!"

"బెడంటే ఏం చేస్తారేం?" అతడి మొండితనం నా మాటల్ని నీరసంలో రంగరించింది.

"పెళ్ళి జరగవలసిన ఇంట్లో శవం లేస్తుంది...పిల్లో పిల్లాడో పుడతాడని కలలు కంటున్న కుటుంబంలో తల్లే కన్ను మూస్తుంది....శుభ కార్యానికి పందిరి వేస్తే భగ్గుమని మండి పూరుకుంటుంది....రాత్రికి రాత్రే ఏ తాడో పామై మిమ్మల్ని కాటేస్తే మాత్రం అడ్డుకునేవారెవరు?"

అతడి మాటతీరు నా గుండెల్లో దడ పుట్టిస్తోంది. మళ్ళీ నెత్తిన చుట్టుకునే గుడ్డను భుజంమీదనుంచి విసురుగా తీసి విదిలించాడు. పాయలు పాయలుగా వున్న అతడి జుట్టు నా మెడకు ఉరిత్రాడే అయ్యేలా వున్నది.

——నిజమే ఊరుగాని ఊరు....ఉద్యోగ రీత్యా ఒకటి రెండు రోజులు ఉండటానికి వచ్చినవాడిని....నాదేంబోయింది?. ..మనస్సులో ఎలా వున్నా పైకి చిరునవ్వుతో ఓ నమస్కార బాణాన్ని వేసి - ఆశీర్వదించండి ముసలి ఒగ్గులూ అని నసిగితే పోయే - నష్టమేమున్నది?....

ఆ జులపాల పెద్ద మనిషి చెప్పినట్లుగా కష్టాలు కోరి తెచ్చుకునే దాని కంటే ఇష్టం లేకపోయినా కష్టం కాని, కష్టంలేని ఆ పని చేసివేయటమే....

"సరిసరి....పదవయ్యా!"....ముందుకు నాలుగడుగులు వేశాను....

ఆ ముసలాళ్ళిద్దరి మొఖాలు గుడ్లగూబల ముఖాల్లా వున్నాయి. తెల్లబడ్డ జుట్టు....వేలుముళ్ళు....నాకు భయం కలిగేలా రెప్పలార్పకుండా నా వంకే చూస్తు న్నారు....దూరం నుంచి చూస్తుంటే జారిన దవడలమధ్యగా వున్న లావు పెదాల నోళ్ళలోనుంచి బొంగ కారుస్తున్నట్లుగా అసహ్యంగా వున్నారు.

"నమస్కారమమ్మా!"

"ఎవరునువు?" గొంతు గీరగా - అడవిపిట్ట అరుపులా వున్నది.

"స్కూళ్ళ ఇనస్పెక్టర్ని....కడుపు నింపుకోవటానికి కొలువు చేస్తూ.... ఉద్యోగరీత్యా మీ ఊరు వచ్చినవాడిని....మీ ఆశీర్వచనాలు కోరుకుంటున్నాను!" సాధ్యమయినంతవరకూ తెచ్చి పెట్టుకున్న వినయంతోనే అన్నాను - బండివాడు నన్ను బాగానే భయపెట్టినట్లనిపిస్తోంది - నా కంఠాన్ని ఆ క్షణాన ఎవరు విన్నా!

"అలాగే....మంచిది పోయిరారా కుర్రాడా!....అనవసరంగా హైరానా పడబోకు....శుభం కలుగుతుందిలే!"

కుర్రాడా - అన్నమాటకు నాకు బొడ్డుదగ్గర నుంచి కోపం పైకి ఎగ తన్నింది. అయినా - విద్యాశాఖలో పనిచేస్తున్నవాడిని గనుక వెంటనే - అనువు గాని చోట అధికులమనరాదు అన్న సామెత గుర్తుకు రాగా - పళ్ళన్నీ బయట పెట్టి ఒక ఇకిలింపు ఇకిలించి వెనక్కు తిరిగాను.

బండెక్కాను.

బండెక్కుతూ చూచాను - తోలేవాడి కళ్ళల్లో విజయం సాధించా అన్న ట్లుగా వెలుగు తళుక్కుమంటుంది....వెధవన్నర వెధవ అని!

* * *

ట్రావెలర్స్ బంగళా దగ్గరకు నా బండి జేరేటప్పటికి అక్కడ పదిమంది నాకోసమే ఎదురు చూస్తునట్లుగా కూర్చొని వున్నారు. నా బండిని, బండిలో నుంచి దిగుతున్న నన్ను చూస్తూనే లేచి వడివడిగా అడుగులు వేసుకుంటూ, అభివాదం చేస్తూ నా దగ్గిరకు వచ్చారు.

"ప్రయాణం సుఖంగా జరిగిందా మాష్టారూ!"

"ఆఁహాఁ....;"

"అలవాటు లేని ఈ బండి మీకేమీ ఇబ్బంది కలిగించలేదు గదా....అసలు ఇదే మా ఊరి మొత్తానికి అందమైన బండి....ప్రెసిడెంటుగారిది ..మీలాంటి పెద్దలు ఎవరు ఎప్పుడు వచ్చినా ఈ బండి ఎక్కి తీరవల్సిందే....మా పెద్దిరాజు బండి నడపాల్సిందే!" అన్నాడు బండి వాడివంక చూస్తూ.

"నేను ఈ ఊరి మీ స్కూలుకు హెడ్మాస్టర్ని సారూ! వారు ప్రెశిడెంటు గారు....వీరంతా ఈ ఊరి పెద్దలు....పెద్ద భూకామందులు!" అంటూ పేరు పేరున అందరినీ పరిచయం చేయటం జరిగింది. మరోసారి నమస్కారాలు అయినాయి.

ప్రెసిడెంటు మీసాలవెనగ్గా పెద్దగా నవ్వి "అయ్యా! తమరు ముందు స్నానం చేయండి....పొద్దుననగా ఎప్పుడు పట్నంలో బయల్దేరారు... మా పంతులు గారింట్లో చక్కటి భోజనం తయారవుతున్నది...."అంటున్న ఆయన మాటల్ను

ఇంకో ఆయన త్రుంచేస్తూ, "అయ్యయ్యో!....అలా అంటారేం ప్రశిడెంటుగారూ.... వారు తమ పాదధూళితో మా యిల్లె పావనం చేయటం మహాదానందం గదా!" అన్నాడు.

"అంతకం టేనా....?"

"ఎందుకండీ మీ అందరికీ అంత శ్రమ?... దగ్గరలో ఏదైనా హోటల్ వుంటే చెప్పండి....నాలుగు మెతుకులు తిని వస్తాను....లేదా, కాస్త క్యారియర్‌లో పెట్టి పంపండి....ఇక్కడే తినేస్తాను!...." అన్నాను మొఖమాటంగా.

"అమ్మమ్మ....హోటల్‌కు దేనికి....క్యారియర్ పంపుతాంలెండి!"

నేను ట్రావలర్స్ బంగళా అనబడే ఆ పాత చిన్న యింటి వరండాలో కాలు పెట్టాను. ఎవ్వరో ముందు వెళ్ళి అక్కడ వేసి వున్న కుర్చీమీద దుమ్మును భుజంమీద కండువా తీసి దులిపారు.

"కూర్చోండి!"

కూర్చున్నాను.

"ముందు స్నానపానాదులు పూర్తి చేస్తే....అరేయ్! ముందు పెద్ద గ్లాసు నిండా మంచి మజ్జిగ పట్టుకురా!" పురమాయింపులు.

తరువాత రెండు నిముషాలల్లోనే నా చేతిలో చిక్కటి మజ్జిగ నింపిన గ్లాసు వున్నది. ఊరు బాగుంది. ఇళ్ళు బాగున్నాయి. మనుషులు మంచివాళ్ళ లాగా వున్నారు....అని అంటానికి నేను ఎక్కువగా ఇలాంటి ఊళ్ళు చూచినవాడిని కాదు. అయినా, నా కెందుకో ఆ ఊరు నచ్చింది, అయితే— ఆ ఊరి ముందు పొలదగ్గర—శవాకారపు ముసలమ్మల ఆశీర్వచనాలు పొందవలసిన అవసరం రాకుండా వుండి వుంటే నేను ఇంకా ఆనందించి వుండేవాడిని ... ఎందుకో నాకు వాళ్ళను చూస్తుంటే ఈ ఊరికి పట్టిన పీడలా అనిపించింది. ఊళ్ళో జనాన్ని అమాయకుల్ని చేసి - కీలుబొమ్మలుగా చేసుకొని ఒక ఆట ఆడిస్తున్నారేమో ననిపించగా - జాలి గూడా వేసింది.

పొగలు గ్రక్కుతున్న వేడి నీళ్ళ బక్కెట్టు నా ముందుగానే వెళ్ళింది.

"ఇప్పుడు పొద్దుబోయింది....రేపొద్దున్నే కలుస్తాం.... మిమ్మలి స్కూలు దగ్గరకు తీసుకు వెళతాం....అక్కడ మీరు విధి నిర్వహణలో పూర్తి చేయవలసిన

కార్యక్రమాలన్నీ పూర్తి చేసుకుందురుగాని!... '' హెడ్మాస్టరుగారు నమస్కారం పెడుతూ లేచారు....వెనగ్గా ప్రెసిడెంట్‌గారు....ఆపైన పెద్దమనుష్యులు.

"ఇక్కడ మీకు తోడుగా వాచ్‌మెన్ వుంటాడు .... మిమ్మల్ని బండిలో తెచ్చిన పెద్దిరాజు వుంటాడు .... ఇంకెవరినైనా వుండమంటారా?"

"అఖ్ఖర్లేదు!"

అంతా వెళ్ళిపోయారు.

నిశ్శబ్దం ఒక్కసారిగా ఆ ప్రదేశాన్ని ఆవరించినట్లనిపించింది.

పావుగంట తరువాత ఆరుబయట ఒక రాతి మీద నిల్చొని వేడి వేడి నీళ్ళ స్నానం చేస్తుంటే — ఆ ప్రదేశమంతా ఆవరించివున్న చింతచెట్ల క్రింద చీకటి నన్ను ఉలిక్కిపడేలా చేసింది. వరండాలో గుడ్డిదీపం చీకటిని ఎంతగా చీల్చాలని ప్రయత్నించినా — నాలుగడుగులకు మించి తన శక్తిని ప్రదర్శించలేక పోతోంది.

చుట్టూ తలలు వంచుకొని ఊగుతున్న దయ్యాల్లా వున్న చెట్ల నడుమ వంటరిగా చిక్కిన ముసలిమనిషిలా ఆ యిల్లు.... శక్తి లేని నీరసించి పోయిన సైన్యాధికారిలా వాచ్‌మెన్ మెట్ల పక్కగా నిల్చొని వుండగా - నన్ను ఇక్కడకు జేరవేసిన పెద్దిరాజు తన పొడువైన జుట్టును మెలిపెట్టి ముడివేసుకుంటూ రాక్షసుడిలా కనబడుతున్నాడు.

—వేడి నీళ్ళు చురుక్కుమన్నయి!

* * * *

ఒళ్ళంతా బంక బంకగా వున్నది. చికాగ్గా వున్నది. అర్ధరాత్రప్పుడు మెళుకువ వచ్చినప్పుడు పరిస్థితి అది. గుడ్డిలాంతరు వెలుగులో చేతిగడియారం లోని ముళ్ళను కళ్ళు చికిలించి మరీ చూచుకున్నాను. సరిగ్గా పన్నెండు గంట లయింది - అర్ధరాత్రి!

నిశ్శబ్దం....అంత నిశ్శబ్దంలోనూ- రెల్లు పొదల మీద గాలి వీస్తున్నప్పుడు వచ్చే ఊళల శబ్దంలా కీచుమనే మ్రోత వెన్నులోనుంచి వణుకు పుట్టించేలా వున్నది. దయ్యాల మేడలో గబ్బిలాలు రెక్కల టపటపలతో అటూ యిటూ పరుగెడుతున్నట్లుగా ఉండి ఉండి చింతచెట్లమీదగా అలికిడి.

గాలి ఆడటం లేదు. కాస్త తలగడా వైపున్న కిటికీ తలుపు తెరిచినా బాగుండు అన్నట్లుగా లేచాను. టేబుల్ మీద వున్న కూజాలోనుంచి చల్లటి మంచి నీళ్ళు గాజు గ్లాసులోకి వంచుకొని త్రాగాను. తియ్యగా పంచదార పానకంలా వున్నాయి!

ఆ నీళ్ళు లోపలకు పోయిన తరువాత నా కర్థమయింది - నాకు మెళకువ రావటానికి కారణం నా చుట్టూ పరిభ్రమిస్తున్న ఈగల్లాంటి దోమలేనని - ఆ సన్నని కీచుమనే శబ్దం నాటి సంగీత ప్రతిభేనని - ఆపైన అవి మనిషి రక్తాన్ని చవిచూచి చాలా కాలమయినట్లుగా ఆత్రంగా మీది మీదికి వస్తున్నాయని!

ఫ్యాను వేసుకుంటే ఆ పరిస్థితి ఇంత భయంకరంగా వుండేది కాదేమో గాని - ఈ రోజేలేని విద్యుత్తు నన్ను వివశుణ్ణి చేసింది.

కిటికీ దగ్గర నిలబడి తలుపులు తీశాను. అవి ఎన్ని రోజులబట్టి అలా బంధింపబడివున్నయ్యో మరి - నా బలాన్ని ఓ పట్టుపట్టి చూచి - చివరకు ఓడి పోయినట్లుగా ఓ మూలుగు మూలిగి తెరుచుకున్నాయి.

నల్లటి గుడ్డకు అన్నీ చిల్లులే అన్నట్లుగా ఆకాశం మీద నక్షత్రాలు, సాయంత్రం కనబడ్డ పగటికొండలు ఆ చీకటిలో తుప్పుపట్టిన ఇనుప ముద్దల్లా వున్నాయి. కళ్ల బిగించుకు చూస్తుంటే చుట్టూ పరిసరాలన్నీ ఆ నక్షత్రాల వెలుగును కప్పుకుంటూ స్పష్టమవుతున్నాయి. వెన్నెలుంటే ఎంత బాగుండు అనిపించేలా కొండలబారు.... చెట్ల గుంపులు.... కొండవాలులో అక్కడొక యిల్లు, ఇక్కడొక ఇల్లు.... అవిగాక ఆ వాలులో గడ్డిమీద అక్కడక్కడా ఎవరో బుట్టలతో తెచ్చి కుప్పలు పెట్టినట్లుగా రాళ్ళు....

నాకు ఊపిరి పోస్తున్నట్లుగా చల్లటి గాలి మీది మీదికి వస్తున్నది. అప్పటి వరకూ నా మీద వీరవిహారం చేస్తున్న దోమల గుంపు తోకముడిచే ప్రయత్నంలో వున్నది.

చెమటతో తడిసిన నా శరీరానికి ఆ చల్లని గాలి మలయ మారుతంలా వున్నది. ఇంత చల్లటి గాలికి దూరమయి ఇంతసేపూ తలుపులు మూసుకొని చెమటలు కారుస్తూ బందీలా పడుకున్న నన్ను నేను నిందించుకున్నాను.

ఊరు బాగున్నది. ఊరి పరిసరాలు బాగున్నాయి. ఊళ్ళోని మనుష్యులు - మర్యాదా మన్నన తెలిసిన వాళ్ళలాగానే వున్నారు.

రేపు రాత్రికి పని పూర్తిగాక ఇక్కడే వుండవలసివస్తే బయట చెట్ల క్రింద మంచం వేసుకొని పడుకోవడం ఎంతో ఉత్తమం అనిపించింది.

జీవితంలో ఎప్పుడోగాని దొరకని అనుభవం అది.

చెట్లు ఉండి ఉండి అతిగా శబ్దం చేస్తూ....ఊగిపోతున్నాయి - నన్ను కుట్టి నట్లుగానే దోమలు వాటినీ పట్టిపీడిస్తూన్నాయేమో!

ఆకాశంచుట్టూ, కొండలచుట్టూ, ఆరుబయలు ప్రదేశంచుట్టూ ఆనందంగా తిరుగుతున్న నా చూపులు - నా కిటికీకి కొన్నివందల గజాల దూరంలో - ఎవరో పట్టుకు కుట్టేసినట్లుగా ఆగిపోయినయి.

ఆ దృశ్యాన్ని చూస్తూనే నా కళ్ళు భయంతో విశాలమయినయి. నా మేను కంపించింది. చుట్టూవున్న చల్లగాలిని ఇంకా తడిపి ముద్ద చేయాలి అన్నట్లుగా నా శరీరంనుండి చెమటలు ధారలై కారుతున్నాయి.

నా వంటిన గుడ్డలు తడిసి ముద్దవుతున్నయి.

—ఎవరినైనా పిలుద్దామన్నా నాకు నోటమాట రావటంలేదు.

నా నోరు ఎండిపోయింది.

నా కనురెప్పల పటపటలు ఎప్పుడు ఆగిపోయినయి.

అక్కడ—

ఆ కొండవాలులో - ఆ చీకటి నడుమ గుడ్డి వెలుగులో....

చచ్చిపడివున్న సమాధుల గుంపుల నడుమ - అప్పుడే సున్నం పూసి నట్లున్న తెల్లని సమాధిచుట్టూ చీరెలు బిగించి కట్టుకొని కాళ్ళు రెండూ పైకెత్తి చేతులమీదగా ప్రదక్షిణలు చేస్తున్న ఆ రెండు దయ్యాలూ నా ఊపిరిని చేత్తో పట్టుకొని గుంజుతున్నయి. నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నయి. నా పీకను గట్టిగా పట్టుకొని నొక్కుతున్నయి.

నల్లని చీకటి క్రింద నక్షత్రాల గుడ్డి వెలుగులో తెల్లని సమాధిచుట్టూ తెల్లటి దోవతుల్లో నిండాముసిగి తల్లక్రిందులుగా పరుగెడుతున్నట్లుగా నడుస్తున్న తెల్లని దయ్యాలు.

భయంతో చేతులు కిటికీ రెక్కలను బిగించి పట్టుకున్నాయి.

అంతా నిశ్శబ్దం. మధ్య మధ్య కాగితాలు బరబరా చించుతున్నట్లుగా, జుట్టు విరబోసుకొని ఊగిపోతున్నట్లుగా వున్న చెట్ల కొమ్మల శబ్దాలు....

నా శరీరంలోని ప్రకంపనాలకు ప్రతీకగా కిటికీ రెక్కలు ఊగుతున్నాయి. ఎంతసేపటికీ మూతపడని కనురెప్పలు బరువెక్కుతున్నాయి.

ఉండి ఉండీ మూలుగుతున్నట్లుగా వస్తున్న వాళ్ళ నోటినుండి శబ్దాలు నా నరనరాల్ని మెలితిప్పుతూ నా నెత్తురు పిండేస్తున్నాయి.

ఎక్కడో గాజుగ్లాసు పగిలినట్లుగా భళ్లుమన్న శబ్దం నా గుండెను మరింత బలహీనపరుస్తూ గుబేలుమనిపించింది.

చటుక్కున పక్కకు తిరిగాను. కూజామీద పెట్టిన గ్లాసు క్రిందపడి ముక్కలయింది. ఆ గుడ్డి వెలుగులో నేలమీద పడివున్న ఆ గాజుముక్కలవంక చెప్పులులేని కాళ్ళవంక చూపులు మార్చి మార్చి చూస్తున్నాను.

వాకిటిమీద టకటక - శబ్దం.... నా గుండె చప్పుడులా టకటకమంటున్న ఆ శబ్దంతో నాపై ప్రాణాలు పైనే పోయినట్లనిపించింది.

కాళ్లూ, చేతులూ, శరీరమే పూర్తిగా వణికిపోతుంది.

కళ్లు కిటికీ ఊచల బయటకు చూస్తూనే వున్నాయి. ఆ తెల్ల దయ్యాలు ఇంకా ఆ సమాధి చుట్టూ గిరగిరా తిరుగుతునే వున్నాయి.

తలుపుమీద మరోసారి శబ్దం.

తలుపు తీయాలా వద్దా అనే సంశయం. తీస్తే ఏమౌతుందో తెలియదు. తీయకపోతే ఏమౌతుందో తెలియదు. అసలు ఈ రాత్రే ఎలా తెల్లవారుతుందా అనే సంశయం నన్ను కాలసర్పంలా చుట్టివేస్తోంది.

తలుపులు పగులుతయ్యా అన్నట్లు మరోసారి ఎవరో కొట్టరు.

నన్ను నేను నిగ్రహించుకుంటూ - ఆ గుడ్డి వెలుగులోనే గాజు పెంకుల మీద కాలుపడకుండా చూచుకుంటూ వెళ్ళి తలుపు తీశాను!

ఎదురుగ్గా మరోదయ్యం.... జుట్టంతా విరబోసుకొని పెద్దిరాజు ఆత్రంగా నావంక చూస్తూ నిల్చున్నాడు. ఆ చీకట్లో విగ్రహంలా నిల్చొనివున్న అతడిని చూస్తున్న నా గుండె ఝల్లుమన్నది.

"'ఏమైందిసార్!" కీచుగొంతు

నాకు నోటిమాట పెగల్లేదు.

అలా చూస్తూ బొమ్మలా నిల్చుండిపోయాను.

అతడు రెట్టించాడు. "ఏమైందిసార్?.... ఏదో మోత అయింది!''

చేత్తో సైగ చేశాను - లోపలికి రా అన్నట్లుగా.

నేను వెనక్కు తిరగగానే అతడు లోపలకు అడుగువేశాడు.

"'గాజు పెంకులు....'' మాట ముద్దగా వచ్చింది.

అతడు నా ముందుకు వచ్చేశాడు. వంగొని క్రిందకు చూచాడు.

నన్ను తాళ్ళతో బంధిస్తున్నట్లుగా పెద్దగా నవ్వాడు. ''ఓసి దీని దుంప తెగ.... ఈ గ్లాసా పడింది.... లోపల మీరు ఒంటరిగా వున్నారు.... ఏమైందా అని భయపడి చచ్చాను!''

నేను అతడి నుంచి దూరంగా పారిపోతున్నట్లుగా అతడిని దాటుకుంటూ కిటికీ దగ్గరకు వెళ్ళాను. ఆ దయ్యాలు ఇంకా అక్కడ ఆ సమాధి చుట్టూ ప్రదక్షిణాలు తీస్తున్నయ్యో లేవో? పెద్దిరాజుకు చూపిందాకా నా ఆదుర్దా ఆగేలా లేదు.

"'ఇటు రా!"

క్రిందకు చూస్తున్న అతడు తలెత్తాడు. తలుపులు తెరిచివున్న కిటికీ దగ్గిర నిలబడివున్న నన్ను అతడు చూస్తూనే - అతడి మొఖం పాలిపోవటం - ఆ గుడ్డి వెలుగులో నాకు స్పష్టంగా కనబడింది....అంతేగాదు - అతడి పెదిమలు గూడా ఎందుకనో వణుకుతున్నాయి!

మరుక్షణం గిరుక్కున వెనక్కు తిరిగి వచ్చి మంచం మీద వాలిపోయాను!

*   *   *

పది నిముషాల తరువాత చెమటపడుతున్న శరీరాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ కళ్ళు తెరిచాను. పెద్దిరాజు మంచం పక్కగా కూర్చొని నా మొఖంలోకే ఆత్రంగా చూస్తున్నాడు. చటుక్కున కళ్ళెత్తి కిటికీవంక చూచాను. అది మూసి వున్నది.

"ఎంతపని చేశారు సార్!"

"ఏమైంది?' అన్నట్లుగా నుదురు ముడివేసి అతడికేసి చిత్రంగా చూడ సాగాను.

"మీరు చూశారా సార్ వాళ్ళను?"

"ఆ తెల్లదయ్యాలనా?''

"అవి దయ్యాలుగాదు సార్- మా ఊరి దేవతలు. మీరు ఊళ్ళోకి వస్తూ ఆశీర్వచనం తీసుకున్నారే-వాళ్ళు!"

విసురుగా లేచి కూర్చున్నాను. ఛ! ఎంత పిరికి వాడినయ్యాను.

ఆ యిద్దరూ దవడలు జారి చొంగకారే ముసలిఒగ్గులా? వాళ్ళను చూడా నేను ఇంత సేపూ ఒణికిపోయింది?

ఆ బండిలోనే పెద్దిరాజు ముందు జిల్లా మొత్తానికి స్కూళ్ళ ఇనస్పెక్టర్ని అయిన నేను ఎంతగా డీలా పడిపోయాను!

నామీద నాకే జాలి వేసింది. నామీద నాకే అసహ్యమేసింది.

"మీరు చూచారా సార్ వాళ్ళను?" అతడు మరోసారి రెట్టించాడు.

"యస్....చూచాను!" అయితే ఏమైందిట అన్నట్లుగా నిర్లక్ష్యంగా అన్నాను. నా కంఠం కఠినంగా మారింది.

"వాళ్ళు మిమ్మల్ని చూచారా సార్" అతడి మాటలో మరింత అదుర్దా.

నాకు నవ్వు వచ్చింది-ఆ పల్లెటూరి వాళ్ళ భయాలకు

''ఏమో....చూసి వుండవచ్చు....చూసి వుండకపోవచ్చు!''

"వాళ్ళుచూస్తే మాత్రం చాలా ప్రమాదం సార్! అతడు ఒక్క-క్షణం గూడా ఆగలేదు. త్వరత్వరగా అన్నాడు.

"ఏం ప్రమాదమయ్యా....బోడిప్రమాదం!.... ఆ ముసలిముండలు నన్నేం చేస్తారు?" చేతులు గాల్లోకి వూపుతూ - నన్ను వాళ్ళేం చేయరు, చేయలేరు అన్నట్లుగా నిబ్బరంగా అన్నాను.

అతను మాట్లాడలేదు. మాటలకోసరం వెతుక్కుంటున్నట్లుగా కొద్ది క్షణాలు ఆగాడు. "వాళ్ళు పట్టించుకోకపోతే పరవాలేదు .... కాని, వాళ్ళకు కోపమొచ్చిందో సర్వం నాశనం చేస్తారు. ....అసలు వాళ్ళు ప్రార్థనలు చేసేటప్పుడు మరో మనిషి చూడటాన్ని సహించరు సార్!"

''ఏం చేస్తారయ్యా....ఏం చేస్తారు?" రెట్టించాను. ''మీఊళ్ళో అందరికీ ఇలా భయపడుతున్నారు కాబట్టే వాళ్ళు ఒక ఆట ఆడిస్తూన్నారు!'' చిన్నగా నవ్వాను - నాదగ్గర వాళ్ళ పప్పులేం ఉడకవు అన్నట్లుగా.

''అమ్మో....అలా అనకండి సార్! .... వాళ్ళకు కొపమొచ్చింది అంటే ఎంతటి మొనగాడైనా యిరవైనాలుగు గంటల్లో నెత్తురు కక్కుకు చావాల్సిందే!"

"మీ భయం అది!"

"లేదు సార్.... నా జీవితంలో నేను ఎంతమందిని చూడలేదు అలా జరిగిన వాళ్ళకు!"

నెత్తురు కక్కుకు చచ్చారు అన్నమాట నా బింకాన్ని సడలిస్తోంది. నా నిబ్బరాన్ని సడలిస్తోంది. కొద్దికొద్దిగా తిరిగి నా శరీరానికి చెమటనుకూడా పట్టిస్తోంది.

ఏమో.... ఈ ఊరి విషయం, ఈ ఊరి మనుష్యుల విషయం.... ఈ ఊరి ఆ దయ్యాల విషయం నాకేం తెలుసునని!

"నిజమా?" కంఠం తిరిగి వణుకుతోంది.

"నిజం సార్!.... వాళ్ళు శపిస్తే మాత్రం యిరవై నాలుగు గంటలకు మించి ఎవ్వరూ బ్రతకరు సార్!"

"వాళ్ళు శపించారని ఎలా తెలుస్తుందయ్యా మనకు?" కాస్త విసుగ్గా అన్నాను.

"అందుకే అలా అనుమానం కలిగినవాళ్ళు వెంటనే ఊరి పొలిమేరదాటి వెళ్ళిపోతారు సార్.... పొలిమేర దాటితే ఏంకాదు సార్!"

"అదిమీ పిచ్చి!"

"సరే మీ యిష్టం సార్;.... వాళ్ళు చూడకుండా వుండి వుండాలనే నేను కోరుకుంటున్నాను.... మా ఊరివాళ్ళంతా గూడా కోరుకుంటాము.... ఇక మీ యిష్టం సార్.... తరువాత ఏమన్నా అయితే మాత్రం ఈ పెద్దిరాజు ముండా కొడుకు ఇలా జరిగినా చెప్పిచావలేదు అని మాత్రం మీరు నన్ను నిందించ గూడదు.... మీ యిష్టం సార్!.... మీయిష్టం.... తలుపేసుకు పడుకోండి.... నేను వాకిట్లో తెల్లవార్లూ మీకేం జరగకుండా వుండాలనే ప్రార్థిస్తూ కూర్చుంటాను" అతడు లేచి రెండు చేతులూ పైకెత్తి విడిపోయిన జుట్టును మెలితిప్పి ముడివేసుకుంటూ కీచుగొంతుకతో చెప్పవలసిందంతా చెప్పాడు.

నిర్ణయం నాకు వదిలేశాడు. నా భవిష్యత్తు, నా కుటుంబ భవిష్యత్తు ·కు వదిలేశాడు.

ఒక్క-క్షణం కళ్ళు మూసుకు కూర్చున్నాను.

మళ్ళీ గుండె దడ మొదలయింది.

చీకట్లో సమాధి చుట్టూ తల్లక్రిందులుగా తిరుగుతున్న వాళ్ళు కళ్ళముందు కనబడుతుంటే నా ప్రాణాలు గిలగిల లాడుతున్నాయి. కళ్ళు తిరుగుతున్నట్లని పించింది. కళ్లు గట్టిగా మూసుకు 'న్నను.

నిశ్శబ్దం....నిశ్శబ్దం....భయంకరమైన నిశ్శబ్దం....

''ఇప్పుడేం చేయాలి మరి?'' నాలోని పిరికితనం నాకే అసహ్యాన్ని కలిగిస్తోంది.

వాకిటిగడప దగ్గర నిల్చున్న అతడు నా వంకే ఆత్రంగా చూస్తున్నాడు.

''సూర్యోదయం అయ్యేలోగా మీరు ఈ ఊరి పొలిమేరదాటి వెళ్ళటం మంచిది సార్!'' అతడు గడప అవతల కాలు పెట్టేశాడు.

''తప్పదా?''

''తప్పదు సార్!.... మీ మంచికోరి చెబుతున్నాను. కావాలంటే ఆరునెలల తర్వాత మళ్ళీ వచ్చి మీ పని పూర్తి చేసుకుందురు గాని!''

''ఇప్పుడు నేనెలా వెళ్ళాలి?''

నేనెంత పిరికివాడినై పోతున్నాను!

—ఎవరికైనా వాళ్ళ ప్రాణాలమీద ఎంత తీపి ఉంటుందో జీవితంలో నాకు తెలిసి వచ్చింది.

నీరసంగా లేచి నిలబడ్డాను!

* * *

జిల్లా కేంద్రానికి తిరిగివచ్చిన మూడు రోజులకు నాకు తెలిసివచ్చిన విషయం....

నాకు జరిగిన ఘోరమైన అనుభవం వెనుక అసలు నిజం....

—మా ఆఫీసు కాగితాలలో ఉన్నట్లుగా - ఆ ఊళ్ళో స్కూలు గాని, పిల్లలు గాని, ఉద్యోగస్థులు గాని అసలు లేనే లేరని....

—అయినా ఆ స్కూలుకు అందవలసిన గ్రాంట్లన్నీ సవ్యంగా అందుతూనే ఉన్నాయని....

—స్కూలు పేరు మీదవున్న ఆ యిల్లు ప్రెసిడెంట్ గారి స్వంత లోగిలిలా చెలామణీ అవుతున్నదనీను....!

హతోస్మి! *

# యోగి

## —వై. రాంబాబు & శాయి

అతను చేతులు కట్టుకు నిలబడ్డాడు. కాయకష్టం చేసుకుబతికే మనిషిలా ఉన్నాడు. ముఖంలో ఆందోళనా - భయం. మాటల్లో తడబాటు. పక్కనే అతని భార్య కాబోలు - ఏడుస్తోంది. లోపల్లోపల కుమిలిపోతోంది.

"ఆయన లేరాండి?"

అతని చూపుల్లో వినయం గొంతులోనూ కదిలింది. ప్రశ్నార్థకంగా చూశాను.

"ఆయనకి సెపితే - అంతా రైట్రై పోద్దంట! అందుకని వొచ్చేం."

నమ్మకం మంచిదే!

కళ్ళు నులుముకుంటూ వచ్చారాయన. ఎప్పుడూ అలాగే తెల్లవారుతుంది. ఎవరో ఒకరు సుప్రభాతం పాడతారు. రాత్రెక్కడో ఏక్సిడెంట్రైందని ఆలస్యంగా వచ్చారు. ఆ బద్ధకం ముఖంలో ఎండ మెట్ల మీదికి పాకుతోంది. ఆయనక్కడే కూచున్నారు.

చేతులు జోడించి అతనేదో చెబుతున్నాడు. ఆమె తలెత్తి చూసింది. నిన్నటి అందం కళ్ళలో నీడలా ఉంది. ఆమె కళ్ళు వర్షాకాలంనాటి కారుమేఘాలు. జారుతున్న కన్నీటితో తడిసి ముద్దైన చిరుగు పట్టిన ఆమె పైటచెంగు వాళ్ళ పరిస్థితికి అద్దం పట్టింది.

అడగకముందే టీ కప్పు అందించడం నాకిష్టం. వాళ్ళకూ రెండు గ్లాసులలో పోసి, ట్రేలో తెచ్చాను.

''మా దనం ఎక్కడుందో మీరెతికి పెట్టాలి - దీనేడుపు సూడండి! కవురు తెలిపినకాణ్ణించి యిలాగే వుంది—"

ఒక్కసారిగా బావురుమంది.

"అలా బెంబేలు పడిపోతే ఎలాగ? మనసు రాయి చేసుకోవాలి—" అంటూ ఊరడించే ప్రయత్నం చేశాను.

అప్పుడు పరీక్షగా చూశాను వాళ్ళిద్దరినీ.

ఆయన చెప్పేరు - అతను గంగరాజు - పడవ నడుపుతాడు - అతని భార్య - మాంకాళమ్మ.

ఆమె వేసవిలో గోదావరిలా ఉంది. పొడవైన ఆమె మెడ - బరువులు మోసి కమిలిపోయినట్టు బోసిగా ఉంది. పొడుగాటి జడ దువ్వి ఎన్నాళ్ళయిందో! బుగ్గలు లోతుకుపోయిన మాంకాళమ్మ పెళ్ళినాటికెంత అందంగా ఉండేదో అనిపించింది.

ఆకలి అందరికీ సమానమే అయినా అవకాశాలు సమం కావు. కొందరికి రుచి తెలుస్తుంది. ఆకలి కొందరిని నంజుకుంటుంది. కన్ను ద్రవిస్తున్నా కడుపు మౌనం వహించదు. ఎంతో బలవంతంగా ఆమె టీ గ్లాసు అందుకుంది. గంగరాజు మొహమాటపడలేదు. ఆయనకు సాసర్లో పోసుకు తాగడం అలవాటు.

కాస్సేపటికాయన అవురావురు మంటూరు.

కన్నతల్లి గుండెలా మండుతోంది స్టౌ.

వాళ్ళెప్పుడు వెళ్లారో తెలీదు.

ఆయన ముఖం తుడుచుకుంటూ- "పూరీయేనా నారీమణీ!" అనడిగారు - వంటింటి గడపమీద బైఠాయిస్తూ.

గడపమీద కూచో వద్దంటే ఎంత కోపం వస్తుందో!! అరుస్తారుగాని అది కోపం కాదేమో!?

ప్లేటందుకుని, చిన్నముక్క తుంచి, బఠాణీ కర్రీ మిళాయించి నోటికందించి - "పుల్కా బావుందోయ్! ఆయుధం చేతబడితే పూరీ అనుకున్నాను" అని మరో ముక్క తుంచారు. కట్టుకున్నదాని కళ్ళలో మెరుపు చూడాలనే పురుషుడాయన.

"ఎప్పుడేనా పొద్దుపోతే - పది రూపాయలు గుంజుతాడు గంగరాజు -" తింటూనే మాట్లాడడం కొందరి కిష్టం.

ఆయనన్నదేమిటో నాకర్థం కాలేదు. నా ముఖం చూస్తే అర్థమైనట్టుంది - ''అదేనోయ్! పాళర్లపూడి రేవు దాటాలంటే అక్కడ గంగరాజులుంటారు. బండి ఓడెక్కించడానికి పగలు రెండు రూపాయలు - రాత్రి పొద్దుపోతే జనం ఉండరుగా - అప్పుడు పది'' అంటూ వివరించారు.

మరో రెండు ప్లేటు ్ కి వినిరాను. మనిషి అవకాశం కోసం చూస్తాడు. దాన్ని రూపాయల్లో కొలుస్తాడు. పగలు రెండు - రాత్రి పది. సాధారణంగా నా నవ్వు పెదాల మీదికి రానీను.

''ఒక రౌండు కొట్టి రావాలి. అనక స్నానం" అంటూ చొక్కా తగిలించు కుని చేతక్ దగ్గరకు పరుగెత్తారు.

చప్పుడైంది. పనిమనిషి.

''ఏం బుచ్చమ్మా! ఇప్పుడా రావడం?''

నా మాటలింకా పూర్తికాలేదు - ''బుచ్చమ్మేంటండీ! పేరు మార్చేసు కున్నాను'' అంటూ అందించింది గిన్నెలు.

''నేనొచ్చినట్టు సూడలేదు మీరు'' అని కూడా.

''అల్లోచ్చేరెందుకండీ!'' అంటూ అడిగేసింది.

కొందరంతే - మనల్ని మాటాడనీరు.

ధనలక్ష్మి పన్నెండేళ్ళది. ఇంట్లో పనులకు సాయపడుతుందని ఎవరో హైదరాబాదు తీసుకువెళ్ళారు. కనుచీకటి వేళ కనిపించలేదట! కబురందగానే పిల్ల మేనమామ ఆదరాబాదరా పరుగెత్తాడు. వెతికారు - కడకు పోలీసు కేసు పెట్టారు.

అంతా విని - ''స్విత్రంగుందండీ!'' అందది. దాని కొత్త పేరేంటో గుర్తు రాలేదు.

''అల్లకెంతమందండి పిల్లలు?''

''ఇద్దరు.''

ధనలక్ష్మి తల్లిని పోలి ఉండొచ్చు, మాంకాళ్ళమ్మ ఏడుపులో ఆ పిల్ల ముఖం కనిపించింది - అమాయకంగా, అలసిపోయినట్టు, ఏడుపులోనూ అందం అంధమే!

''మరిప్పుడేం సేత్తారండి? ఇంతకీ బతికుంటా దంటారా?''

సందేహించడం సహజం. కనిపించకపోవడం వెనుక కారణం ఏదైనా ఆపోహలూ, అనుమానాలూ బోలెడు.

రథసప్తమి తరవాత ఎండ చురుకైంది.

ఎంతకూ రావడం లేదని ఆఫీసుకు ఫోన్ చేస్తే-'కలెక్టర్ ప్రెస్‌మీటన్నారు. పతివ్రతలా కూచుంటే ఎలా - డైనింగ్ టేబిల్ దగ్గరకు చేరాను అప్పుడే. దొరగారొచ్చారు.

"ఏకంగా రాత్రికే స్నానం! బండి మాంఛి ఆకలి మీదుంది - రెండు కోళ్ళు కావాలి" అంటూ ఎదురుగా కూచున్నారు. ఆయనంతే! నావల్లకాదు - దిగ మింగుకోలేను అయినా - "ఒకటి - రెండు - మూడు - నాలుగు - టేబిల్‌కు నాలుగున్నాయి" అన్నాను సీరియస్‌గా చూస్తూ.

"ధర్మానికి అంతేనట - ఒక్కటీ కనిపించదు" అంటూనే - "ఈ పూట కూడా అదే కర్రీ!" స్వగతం గట్టిగానే పలికి - "నో వర్రీ!" అంటూ సాంబారులోకి వచ్చేశారు. నేనేం అనలేదు గదా - అందుకని సబ్జెక్ట్‌లోకి దూకారు.

"ధనలక్ష్మిని వాళ్లు మంచి మనస్సుతోనే తీసుకు వెళ్ళారు. పక్కూరి పెద్ద మనిషొకాయన కనిపిస్తే ఎంక్వైరీ చేశాను. ప్రసాదరావు - అదే - ఆ పిల్లను తీసి కెళ్ళి నతను - సెక్రటేరియట్‌లో చేస్తున్నాడంట! అతనికి ఫోన్ చేయాలి - " పోలీసులతో, నాయకులతో తిరగడం అలవాటయ్యాక రాత పీరులు రాటుదేలి పోతారు. చేయి తుడుచుకుంటూనే తుర్రుమన్నారు.

రాత్రి పొద్దుపోయాక ఫోన్ చేస్తే తెలీదన్నారు.

ఏమై పోయింది ధనలక్ష్మి? ఎలా అదృశ్యమైంది?! అస్పష్టమైన ఊహలు- ఎంతకూ నిద్రపట్టలేదు.

పూర్తిగా వెలుగింకా రాలేదు. తలుపు తీస్తే - గంగరాజు - నమస్కారం. మనిషిలో నిన్నటి వినయం లేదు. ఆయనగురించి తెలీదని చెప్పాను. తటపటా యించాడు. నోరువిప్పలేదు. కాస్సేపు కూచుని వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం ఫోన్ రింగౌతుంటే - ఉలిక్కిపడి లేచాను.

"నేను - హైద్రాబాదు నించి - కంగారు పడకు - ఎల్లుండుదయం ఝయింటి దగ్గరుంటాను - "

ఎంత సీరియస్‌నెస్‌లోనైనా ఏ మాత్రం చెరగని చిరునగవు - ఆయన మాటలు వింటూంటే కళ్ళముందు కదిలింది.

ఆ మరునాడు - గంట పది కావొచ్చు. ఎండ తీవ్రతకు తట్టుకోలేక ఒక పెద్ద గులాబీ మొగ్గ తలవాల్చింది. పసిమొగ్గలాంటి ధనలక్ష్మి గుర్తొచ్చింది. ఎదుగుతున్న ఆడపిల్లలాంటి అందమైన గులాబీ మొగ్గ నీడ, చల్లదనం కోల్పోతే.... మొగ్గపడుతున్న బాధ తెలుస్తోంది. కన్నవాళ్ళకుండదా? జీవితానుభవం గాయాలను ఓర్చుకునే సహనం కలిగించే చక్రాని మందంటారు. మాంకాళమ్మను చూడాలనిపించింది. దూరం ఆఫీసుకు ఫోన్ చేస్తే ఆయన అసిస్టెంట్ వెంకట్ పలికాడు.

చాల కాలమైంది జట్కా ఎక్కి మోటారు వాహనాల కాలానికి ముందూ రోజుకు ఇరవై నాలుగ్గంటలే. సమయం అప్పుడెలా సరిపోయేదో!

వెంకట్ సైకిలాగింది. జట్కా దిగుతూంటే చుట్టూ జనం చూపులు సంధించారు.

వింత వాసన గాలిలో. గుడిసెల ముందు ఎండలో చేపలు తెల్లగా. ప్రాణం పోతే చేప తట్టమౌతుంది. అది రుచికి దగ్గర చుట్టం.

గంగరాజు లేడు. కాళ్లు బారజాపుకుని, నీరసంగా ఆమె. నేలమీద కురికే ఎండలోంచి వెలుగు ఆమె ముఖం మీద చారలు కట్టిన కన్నీటిని తాకుతోంది.

సానుభూతి చూపబోతే మనిషికి మళ్ళీ కష్టం గుర్తొస్తుంది. ఏడుపు ఆమెను ఉక్కిరి బిక్కిరి చేసింది. దగ్గరగా కూర్చున్నాను. ఒడిలో కూలిపోయింది. ఆత్మీయంగా అదుముకున్నాను. అవాళ అమావాస్య. గోదావరికి పోటొచ్చినట్టుంది. కన్నీటి కడలి నుంచి ఎదురెక్కుతున్న నీరు.

''అల్లు సంపేసేరు - నా తల్లింకరాదు - మా దనం సచ్చిపోయింది."

నిరాశ మనిషి నమ్మకాన్ని నరికే గొడ్డలి. బాధపడే మనిషి భయం పోగొట్టడానికి అనుభవం కావాలి. ఊరడించాలని వచ్చాను. నా కళ్లు చెమ్మగిల్లాయి.

"అనవసరంగా భయపడొద్దు - ధనం క్షేమంగా తిరిగొస్తుంది___''

మంచి మాట చెప్పడం మాత్రమే మనిషి వంతు.

"నువ్విలా భోజనం మానేసి సాధించేదేం వుండదు. మీ కోసం ఆయన హైదరాబాదు వెళ్లారు. ధనం తప్పక కనిపిస్తుంది—"

ఆమె లేచి కూర్చుంది. నా చేతులు కళ్ళ కద్దుకుంది. మళ్ళీ ధైర్యం చెప్పాను. కన్నీళ్ల కష్టాలు తీర్చవన్నాను గుండె రాయి చేసుకోవాలన్నాను.

చురుకైనది ధనలక్ష్మి. హైదరాబాదులో ఆ ఇంట్లో మూడో అంతస్తులో ఒక సాయిబాబా భక్తురాలుందట! ఆమె ధనలక్ష్మికి మూడు పాటలు నేర్పిందట! భక్తి పేరుతో ఆ పాపాత్మురాలు ఏమైనా చేసిందన్నది పిల్ల మేనమామ అనుమానం.

* * *

పున్నమి వెన్నెలకు తళుకే తప్ప తావి ఉండదు. కొప్పున మల్లెలకైతే గుప్పుమనే పరిమళం. లక్ష చెప్పినా లక్షణాలు మారవు. అంత వెన్నెల్లోనూ చందమామలో మచ్చ కనిపిస్తోంది.

గాలికి కదులుతున్న కొబ్బరాకులమీంచి నీడలు జారిపోతున్నాయి. ధనం కనిపించకుండాపోయి రెండు వారాలు దాటింది. ఆయన చేసిన ప్రయత్నాలేమీ ఫలించలేదు. జర్నలిస్టులమీద జనానికి కొండంత నమ్మకం. నాలో అసంతృప్తి పెరుగుతున్నకొద్దీ అనంతంగా ఆలోచనలు.

కిటికీలోంచి కనిపిస్తున్న దృశ్యంలో చీకటి వెలుగును మింగుతోంది. ధనం ఏదోఒకరోజు తిరిగి రాకపోతుందా అనే నమ్మకం క్రమంగా కరిగి పోతోంది.

హైదరాబాదునుంచి తిరిగి వచ్చాక "మీ అమ్మాయి దొరుకుతుంది. బెంగ పెట్టుకోవద్దని మాంకాళమ్మకు చెప్పు" అని గంగరాజుకు ధైర్యం చెప్పారాయన.

కుతూహలం ఆపుకోలేక, కిడ్నాప్ ఎలా జరిగిందని అడిగాను. తెలీలేదట! ప్రసాదరావు దంపతులు ఏమీ చెప్పలేకపోయారు. సాయిబాబా భక్తురాలిని బెదిరిస్తే - ఆమె స్పృహ తప్పి పడిపోయింది. మేడ మీదికి వెళుతున్నానని చెప్పిన ధనం ఎంతకూ రాకపోతే - ఆ రాత్రంతా వీధి వీధీ వెదికి, తెల్లవారుతూనే పోలీసులకు రిపోర్టు చేశారట వాళ్లు.

ఆయన చెప్పినదాని పరమార్థం - ఆడపిల్లలను ఎత్తుకుపోయే ముఠా ధనలక్ష్మిని సొమ్ము చేసుకునుండాలి.

ఈ విషాన్ని ఆ తల్లితండ్రులు మింగలేరు.

ఇప్పటికీ ఆయన రాజధానిలో ఒక మిత్రుని సాయంతో తన ప్రయత్నం తాను చేస్తూనే ఉన్నారు.

గుమ్మం దగ్గర చప్పుడైంది. గంగరాజు - మెట్లకడ్డంగా. లేవాలని ప్రయత్నించి మళ్లీ పడ్డాడు.

"అమ్మగారో!" మాట తడబడింది.

"బాబుగారింత మాయసేత్తారనుకోలేదండీ!" అరుస్తున్నాడు - పెద్ద గొంతుతో.

జాలిగా చూపులు, వినయంగా మాటలు, భయంగా బతిమాలడం-వాటికి బదులు అరుపులు, పెడబొబ్బలు.

నాకు మాట పెగల్లేదు.

గోదారిని నమ్ముకు బతికేవాళ్ళు జీవితంలో కష్టాలవరదొస్తే - అది విన్న వాళ్ళ గుండె గోదారౌతుంది. అందుకే ఆయనే మాత్రం ఆలోచించలేదు. దూర భారం అనుకోలేదు. బాధ్యతగా భావించారు. స్వయంగా వెళితే సమాచారం తెలుసుకోవచ్చును కున్నారు. జరిగిందేమిటో తెలియకపోయినా-వాళ్ళకు ధైర్యం చెప్పాలని ప్రయత్నించారు.

అది గంగరాజు దృష్టిలో మాయ!

"అట్ల దాన్ని గొంతు పిసికి సంపేసోరు. ఆ తప్పు దాసిపెట్టి, ఎయ్యబద్దాలాడతన్నారు- ఇన్నాల్లూ నూసేచు - అల్లని తేల్సేయమనండి."

అతని మాటల్లో అంకెలు కనిపిస్తున్నాయి.

"అది సచ్చిపోయింది. దానిని కనిపెంచినోల్లం-మాకేం సెపుతారో సెప్పమనండి-"

ఇదెంత దుర్మార్గం!?

కూతురేమై పోయిందోనని కన్నతల్లి కలవరపడుతోంది. దిక్కుల నిండా చీకటి కమ్ముకున్నట్లు దీనంగా ఏడుస్తోంది. పోయిందెలాగు పోయింది—మా సంగతేం జేశారని గంగరాజు గావుకేకలు.

కనిపించిన దానికి కన్నీరు మున్నీరుగా ఏడవడమే తెలిసింది. పెంచే శక్తిలేక, ఏదో పని చేసుకుంటూనైనా కడుపునిండా తిని బతుకుతుందని దూరంగా పంపించడానికైనా ఒప్పుకుంది.

ధనలక్ష్మిని చంపాల్సిన అవసరం వాళ్ళకేవిటో గంగరాజుకు తెలీదు. ఆ పిల్ల ఆకలి తీర్చడం అతనివల్ల కాలేదు అభమూ శుభమూ తెలీని ఆ పిల్ల అందరిలాగా అందమైన జీవితంలోకి అడుగు పెట్టే దారేదో అతను చూడలేక పోయాడు. పెద్దదిగి, ప్రేమించగలవాడి నీడలో చేరి, బతుకంతా ఆనందం పండించుకోవాల్సిన కన్నకూతురు ఎలా కడతేరిపోయిందోనన్న బాధ అతనికి లేదు.

కని పెంచిన కూతురు కనిపించకుండా పోతే - అందుకు ఎంతో కొంత ముట్ట చెప్పాలని అతను డిమాండ్ చేయడం మగబుద్ధనిపించింది.

చుట్టు పక్కల వాళ్లు చోద్యం చూస్తున్నారు. అతని పొలికేకలు వినడం వినోదంగా ఉంది వాళ్ళకు.

గంగరాజు మగవాడు. రూపాయి విలువ తెలిసినవాడు. పాపం చేసిన వాడైనా రూపాయితో దాన్ని కడిగేసుకోగలడన్న నిజం తెలిసినవాడు. అసలు వాళ్ళను అల్లరి పెడితే కాసులు రాలతాయన్న వాస్తవం ఎరిగినవాడు.

కడకిలా యాగీకి దిగాడు.

నా ఆలోచనలు కనిపించని చీకట్లో కలిసిపోయి, కదిలే నీడల్లా భయ పెడుతున్నాయి.

అదృష్టవశాత్తు ధనలక్ష్మి యింటికి తిరిగొచ్చి తండ్రి ఆగడం తెలిస్తే అప్పుడాపిల్ల ఏమనుకుంటుంది?

ఆడపిల్లలను ఎత్తుకుపోయే ముఠా చేతిలోనే ధనలక్ష్మి పడి ఉంటే - ఆ పిల్ల ఆటబొమ్మౌతుంది, పాట బొమ్మౌతుంది. కరెన్సీ నోట్లకోసం యవ్వనాన్ని బలిపెట్టుకునే కీలుబొమ్మౌతుంది. మాయమైపోయిన పిల్లను ఎరగా డబ్బు చేపకు గేలం వేస్తున్న ఆ దుర్మార్గుడికి చీకటిబతుకులో చైతన్యం కోల్పోయి లాలసత చేతిలో కరిగిపోయే కన్నబిడ్డ గుండె చప్పుడు తెలీదు. వేడి కన్నీటి బొట్టు పాడే వేదనాగీతం తెలీదు.

గంగరాజును గన్ పెట్టి కాల్చినా పాపంలేదు - నాకు తెలిసినంత ఆవేశం వచ్చింది.

ఆయనెప్పు డొచ్చారో తెలీదు. చేతక్ చప్పుడు కూడా గంగరాజు అరుపులకు బెదిరిపోయుంటుంది.

ఆయన ఫోన్‌మీద చేయివేయడం నాకు నచ్చలేదు.

"పోలీసులెందుకు - వాడిని పంపించేస్తాను'' అని మాత్రం అంటే - ఆయన నవ్వేరు.

''వెళ్ళిపో - గంగరాజూ!'' అనరిచాను గుమ్మంలోంచి.

''అవకాశాన్ని డబ్బు చేసుకోవాలనే తప్పుడు బుద్ధి నీది - వెళ్ళిపో! ఇంకెప్పుడూ ఇటు రాకు.''

నా గొంతు నాకే చిత్రంగా ఉంది.

సముదాయిస్తూ ఆయన. వెళ్ళిపోతూ కూడా గంగరాజు అరుస్తున్నాడు. దిక్కులనుంచి ప్రతిధ్వనులు వినిపిస్తున్నాయి. *

# జ్యోతిష్కుడు బుషి

## —అరిగే రామారావు

డాక్టరు వేదవ్యాస్ చాలా చిరాగ్గా వున్నాడు.

ఇంతింత రోగాలు పెట్టుకొని వచ్చే పేషంట్స్ అంటే అతనికి చిరాకు. వంట్లో రోగాలకు తగ్గట్లుగా జేబులో డబ్బులు పెట్టుకురాలేని బీదాబిక్కీ పేషంట్లంటే మరింత చిరాకు. పేషంట్ల వెంట చేతులు వూగించుకుంటూ వచ్చి వూరికే గీచిగీచి బేరాలాడే బేవార్సుగాళ్ళంటే మహా చికాకు!

ఇప్పుడు అతడు మహాచికాకులో వున్నాడు.

"ఏంటండయ్యా ఆ ముతక ఖద్దరు గిరజాల జుట్టాయన?" మహాచిరాగ్గా అన్నాడు తన అసిస్టెంట్‌తో.

వినయ విధేయతల్తో బ్రతికే అసిస్టెంట్, "తాను బతికిచెడ్డ రిటైర్డ్ బడి పంతుల్ని అని, మూడువేలుకంటే ఎక్కువ యిచ్చుకోలేనననీన్నీ వూరికే కాళ్ళా వేళ్ళా పడుతున్నాడు సార్!" అన్నాడు వినయంగా.

మొగం కండలు పీక్కుంటూ, "మరి నువ్వేం అన్నావయ్యా?" అన్నాడు.

"అయిదువేలుకు అయిదు రూపాయిలు తక్కువైనా మా అయ్యగారు కత్తి పట్టుకోరు అన్నాను సార్!" అన్నాడు బ్రతకనేర్చిన అసిస్టెంట్.

'బేష్! మాలాటి డాక్టర్ల దగ్గర నీలాటి అసిస్టెంట్లు వుండాలి!' అని మనస్సులో అనుకొని, పైకి ప్రసన్నంగా, "గుడ్!" అన్నాడు.

డాక్టరు వేదవ్యాస్ విశాఖపట్నంలో పేరు మోసిన సర్జన్. స్థానిక కేజీ ఆసుపత్రిలో సర్జికల్ డిపార్ట్‌మెంట్‌కి హెడ్. పైగా స్వంత నర్సింగ్‌హోంలో

స్వంత ప్రాక్టీసు; అద్దె నర్సింగ్ హోంల్లో అతిథి ప్రాక్టీసున్నూ! ఆయన 'హస్త కాసి' గల సర్జన్‌గా వాసికెక్కాడు.

మాటలోనేకాక స్వంత పేరులో కూడా వినయాన్ని పెట్టుకున్న అసిస్టెంట్ వినయమూర్తి. "సార్, మీకు హైదరాబాదు నుండి యస్.టి.డి." అంటూ చేతికి రిసీవర్ అందించాడు.

ఫోన్లోని సమాచారం విన్నాక బోలెడు చిరాకు పడుతూ, "నేను అర్జంటుగా హైదరాబాదు వెళ్ళాలయ్యా! ఇప్పుడేవన్నా రైళ్ళు వున్నాయా మూర్తీ?" అన్నాడు.

"విశాఖ దొరుకుతుందండి. కానీ ఇప్పుడు అక్కడ కర్ఫ్యూ వుంది కదండీ?"

"తప్పదయ్యా. వెళ్ళాలి! అక్కడ మా బాబాయిగారికి చాల సీరియస్సుగా వుందంట. మా ఫాదరు పోయాక ఆయనే మమ్మల్ని పెంచి పెద్దచేశారు. ఇప్పుడు నేను వెళ్ళకపోతే నల్గురూ నాల్గు మాటలంటారు!" అన్నాడు యిబ్బందిగా సర్జన్.

*　　*　　*

సికిందరాబాదు స్టేషన్నుంచి వేదవ్యాస్ చస్తూపడుతూ ఎట్లాగో నిజామ్స్ ఆసుపత్రికి జేరుకున్నాడు. కర్ఫ్యూని చాల కరకట్టుగా అమలు పర్చటంవల్ల సిటీ బస్సులూ, ఆటోలూ, టాక్సీలూ ఎక్కడా తిరగడంలేదు. అతడెళ్ళేసరికి శవాన్ని ఆసుపత్రి వరండాలో పెట్టుకొని కూర్చున్నారు. ముసలాయన తెల్లారగట్ట కన్నుమూశాడంట. ఆసుపత్రి బిల్లూ అదీ కట్టి శవాన్నయితే తీసుకున్నారుగానీ, దాన్ని యింటికి తీసికెళ్ళే మార్గం లేక అప్పట్నుంచి శవాన్ని పెట్టుకొని యిదిగో ఇలా పడిగాపులు పడుతున్నారు.

అంబులెన్సులు కోసం చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. అతి కష్టం మీద ఒక టాక్సీ దొరికింది. కానీ, శవం అనగానే వాడు కాస్తా వెనక్కి తగ్గాడు. నా టాక్సీ తిరుపతి, యాదగిరిగుట్ట, భద్రాచలంలాంటి యాత్రాస్థలాలకు పుణ్యకోసం వెళ్ళే భక్తులు ఎక్కుతుంటారు. ఇలా వైకుంఠయాత్రకెళ్ళే శవాన్ని ఎక్కించుకుంటున్నానని వాళ్ళకి తెలిస్తే నా టాక్సీ ఎక్కేవాళ్ళు కూడా ఎక్కరు నన్ను వదిలెయ్యండి స్వామీ! అని ఒక దణ్ణం పెట్టి వచ్చినదార్నే

చక్కా పోయాడు. ఏ టాక్సీవాడు వచ్చినా 'శవం' అనగానే హడలిపోయి - కాస్త అటూ ఇటూగా చెప్పినా దాదాపు ఇవే మాటలు చెప్పి - వచ్చినదార్నే పోతున్నారు.

అఖరికి,' శవంగానీ, సైతాన్‌గానీ హమ్‌కో డర్ నై!' అనగలిగినవాడొకడు దొరికాడు. కాని, వాడు రావటమే ఆసుపత్రి ఆవరణలోని ఒక చెట్టెక్కి కూర్చున్నాడు. ఎందుకయ్యా చెట్టెక్కి కూర్చున్నావు అంటే, దీన్నిబట్టి మీరు 'సమజ్' చేసుకోండి అన్నాడు. సరే సమజ్ చేసుకున్నాం. నీ బాడుగెంతో చెప్పు అంటే, 'దో హజార్!' అన్నాడు.

ఈ మాట వినగానే అక్కడ జేరినవాళ్ళంతా గుండెలు బాదుకున్నారు. వేదవ్యాస్‌కి మాత్రం, ఇందులో అంత గుండెలు బాదుకోవల్సింది ఏముందో అర్థంకాలేదు. ఎందుకంటే తనెప్పుడూ ప్రతీదీ 'డిమాండ్' అండ్ 'సప్లయి' థియరీలో ఆలోచిస్తుంటాడు. 'ఎదుటివాళ్ళ అవసరాన్నిబట్టి మరినాల్గు రాబట్టుకో! వాళ్ళ అస్సహాయతను క్యాష్ చేసుకో!' అనేదే తన సూత్రం! ఈ సూత్రమే తన గాయత్రీ మంత్రం! ఇన్నాళ్లుగా తాను దీన్నే అనుక్షణం జపిస్తూ - అనవరతం అనుసరిస్తూ లక్షలు గడించాడు. తెల్లారి లేస్తే తను కేజీహెచ్‌లో ఇలాటి సన్నివేశాలు ఎన్నో చూస్తుంటాడు - మరెన్నో కల్పిస్తూంటారు. కాకపోతే, లెవెల్స్‌లోనే మార్పు! తనకిది - నథింగ్ బట్ నేచురల్!'

....సిగరెట్ సెగకు వ్రేళ్ళు చివర్లు చురచురమనేసరికి ఉలిక్కిపడి తల ఎత్తి చూశాడు.

తను నిలబడినచోటు దగ్గర్నుంచి చూస్తోంటే అక్కడ జరుగుతున్న సన్నివేశంలో ఏదో క్రొత్తమార్పు వచ్చినట్లనిపించింది.

ఒక నూతనవ్యక్తి ఎవరో రంగప్రవేశం చేశాడు. అందరూ అతనిచుట్టూ మూగారు. అతనేదో చెప్తుతుంటే ఆశ్చర్యంగా వింటున్నారు. తన కాళ్లు కూడా అప్రయత్నంగా అటు వయిపుకి లాగాయి.

ఆ నూతన వ్యక్తి, "ఈ టాక్సీవాళ్లు ఆటోవాళ్ళతో లాభంలేదండీ బాబు. జోషికి ఫోన్జేస్తే తన 'వైకుంఠరథం'తో వచ్చి వాలుతాడు...." అని అంటున్నాడు.

"అతనెక్కడా వుండేది?"

''నాచారంలో'' -

మరి దేనికి ఆలశ్యం? ఫోన్జేయండి!'' అన్నారెవరో.

—మరో గంటతర్వాత ఆసుపత్రి ఆవరణలోకి ఒక వేన్ వచ్చి ఆగింది. అది చిన్నసైజు వేన్ చూడముచ్చటగా వుంది. నలువైపులా పెద్ద పెద్ద అద్దాలతో, మంచి వెంటిలేషన్‌తో, పెద్ద స్లైడింగ్‌డోర్‌తో, లోపల మధ్యలో బాగా ఖాళీ స్థలం వదిలేసి, చుట్టూ కూర్చోటానికి అనువుగా సీట్ల డిజైన్‌తో చక్కగా వుంది. ముందువైపు ముద్దులొలికే అక్షరాలతో 'వైకుంఠరథం' అని బోర్డు వుంది. బయటి వైపు పేనల్స్ మీద అందమైన అక్షరాల్తో భగవద్గీతలోని ఆత్మ పరమైన శ్లోకాలు వ్రాసివున్నాయి. గతించేదీ, నశించేదీ అశాశ్వతమైన ఈ శరీరమే గానీ—నిత్యమై సత్యమై అమరమైన దివ్యాత్మ కాదనే అర్థాన్ని బోధిస్తోన్నాయి ఆ శ్లోకాలు!

ఆ వైకుంఠ రథచోదకుడైన జోషి ప్రసన్న వదనంతో, శాంత స్వభావంతో, ప్రేమానురాగాలు ఉట్టిపడే చూపుల్తో సౌమ్యంగా—నేరుగా ఆ వైకుంఠంనుంచి వచ్చోన్న విష్ణుదూతలాగా వున్నాడు. అంతేగానీ, మామూలు టాక్సీ డ్రైవర్లలాగా దురుసుగా, దూకుడుగా, యమదూతలాగా లేడు. మంచితనానికి మారుపేరులా కనిపిస్తోన్నాడేగానీ, దుష్టత్వం మా యింటి పేరన్నట్లుగా లేడు.

కానీ, ఎందుకనో వేదవ్యాస్‌కి జోషి నచ్చలేదు. కారణం అతనికే తెలియదు....జోషి అతనిపని అతను చకచకా చేసుకుపోతున్నాడు. సీట్ల కింద వుంచిన స్ట్రెచర్‌ని బయటకి తీశాడు. దాని మడతలు విప్పి, మఱలు బిగించి దాన్నొక చిన్న మంచంలాగా చేశాడు.

అంతలో శవాన్ని బయటకి తీసికొచ్చారు.

జోషి సగౌరవంగా వేన్ తలుపుతీసి పట్టుకొని నిలబడ్డాడు.

ఆ మంచం మీద శవాన్ని పరుండబెట్టాక, జోషి భక్తిభావంతో దానికి నమస్కరించాడు. తన చేతి సంచిలోంచి పూలపొట్లం బయటికి తీశాడు. చిన్న పూలదండను శవం మెళ్ళో వేశాడు. అగరవత్తులు వెలిగించాడు. రికార్డు ప్లేయర్‌ని ఆన్ చేశాడు. కీ॥ శే॥ ఘంటసాలవారి మధురకంఠం.

భగవద్గీతలోని సంస్కృత శ్లోకాలను తెలుగు తాత్పర్య సహితంగా ఆలపిస్తోంది....కొన్నిక్షణాల్లో ఆ వేన్‌లో ఒకానొక ప్రశాంత వాతావరణం ఆవరించింది. అందరి హృదయాల్లో వైరాగ్యభావం తొంగిచూచింది.

అందరూ లోపల ఎక్కి చుట్టూతావున్న సీట్లల్లో సర్దుకొని కూచున్నాక వేన్ బయలుదేరింది.

బయట్నుంచి చల్లనిగాని లోపలికి వీస్తోంది....వైకుంఠ రథం భాగ్యనగర వీధులగుండా పోతూంది.... లోపల కూర్చున్నవాళ్ళు ఘంటసాలవారి గంభీర కంఠాన్ని వింటూ మౌనంగా వుండిపోయారు....

డా॥ వేదవ్యాస్ మాత్రం మిగతా వాళ్ళులాగా భగద్గీత శ్లోకాల్లోని వేదాంతామృతాన్ని గ్రోలలేకపోతున్నాడు. అతని ఆలోచనలు జోషి పరంగా సాగుతున్నాయి....ఈ జోషి వేదమంత్రాలు వల్లించే దూతలాగా పోజుకొట్టుతున్నాడు గానీ, తీరా వేన్‌కి కిరాయి వసూలు చేసేటప్పటికి యమదూతలాగా మారిపోయి రెండువేలు కావాలి, మూడువేలు కావాలని పీడిస్తాడు. అదనుచూచి దెబ్బకొట్టే రకంలాగా వున్నాడు కాని, ఏ మాటకు ఆ మాటే చెప్పుకోవాలి! ఈ వేనూ, ఈ అరేంజ్‌మెంట్సూ అన్నీ క్రొంగొత్త పోకడలో వున్నాయి. తను కూడా ఇలాటి వేన్‌ని వైజాగ్‌లో ఎవరి చేతయినా లోపాయికారిగా పెట్టిస్తే బోలెడు డబ్బులు వస్తాయి. సంవత్సరం తిరగకుండానే పెట్టుబడి వచ్చేస్తుంది. ఆ తర్వాత అంతా లాభమే! అనుకున్నాడు.

.... ఆ తర్వాత మిగతా కర్మకాండంతా చకచకా జరిగిపోయింది. ఇంటి దగ్గర శవానికి స్నానాదికాలు పూర్తిచేసి, ఆ వైకుంఠ రథంలోనే శవవాటికకు తర్లించారు.

ఒక ప్రక్క దహన సంస్కారాదులు జరుగుతుంటే డా. వేదవ్యాస్ ఒక చెట్టు క్రింద కూర్చొని, వైజాగ్‌లో తాను వదిలేసి వచ్చిన ఆపరేషన్ బేరం గురించి ఆలోచిస్తోన్నాడు. ఆ రిటైర్డు బడిపంతులు కొంపదీసి మరో డాక్టరు దగ్గరికి పోయాడేమో ఈ లోపల? మళ్ళీ, వైజాగ్‌లో ఆపరేషన్‌చేస్తే తను చెయ్యవల్సిందే! ఎక్కడికి పోతాడు, చచ్చినట్లు తాను వచ్చేవరకు అక్కడే పడిగాపులు పడుతుంటాడనుకున్నాడు....

ఇంతలో తమ బంధువర్గంలోనివాళ్ళు కొందరు తను కూర్చున్న ఆ చెట్టు దగ్గరికి వచ్చారు. కొంపదీసి ముసలాయన దినవారాల ఖర్చుకోసం తనని చందా అడగరు కదా అని భయపడ్డాడు.

కాని, వాళ్ళు మాటాడుకుంటున్నది వేరే టాపిక్ గురించి అని తెలుసుకున్నాక, 'అమ్మయ్య, బ్రతికాం!' అనుకుని తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాడు.

'వైకుంఠ రథం' జోషి వేన్ బాడుగ క్రింద అయిదు వందలు యివ్వబోతుంటే తీసుకోవడంలేదని ఒకతను అన్నాడు.

మధ్యలో తను కల్పించుకుంటూ "మరెంత కావాలంట? ఈపాటి పనికి అయిదువేలు కావాలంటా?" అన్నాడు వెటకారంగా.

అలా వెటకారంగా అంటున్నప్పుడు తన మనస్సులోని కసి తనకే తెలుస్తోంది.... వీడు జిత్తులమారి నక్కని తాను మొదట్నుంచీ అనుకుంటూనే వున్నాడు.

తను చేసిన కామెంట్‌కు వాళ్లు ఒకరిమొగం ఒకరు చూచుకున్నారు.

వాళ్ళల్లో ఒకతను "నూటఎనిమిది రూపాయలిస్తే చాలు అంటున్నాడు!" అని మెల్లగా అన్నాడు.

ఆ మాట వినగానే ఎందుకో తనకు విపరీతమైన నీర్సం ముంచుకొచ్చింది. ఎక్కడ్నుంచి లేచాడో మళ్ళీ అక్కడే కూలబడిపోయాడు.

మరొకాయన, "అయిదొందలు తీసుకోమని ఎవరెంత బ్రతిమాలుతున్నా ససేమిరా వద్దంటున్నాడు. సిటీలో ఎక్కడ్నుంచి ఎక్కడకు వెళ్ళినా తన రేటు నూటఎనిమిది రూపాయలు. అదిస్తే చాలు అంటున్నాడు!" అన్నాడు.

వాళ్ళ మాటలు వింటుంటే డా. వేదవ్యాస్‌కి మతిపోతున్నట్లుంది. తాను వింటున్నది నిజమేనా? తాను వున్నది ఇలలోనా, కలలోనా? తన డిమాండ్ అండ్ సప్లయి థియరీ ఈ జోషి విషయంలో ఇంత ఘోరంగా దెబ్బ తినటం, అతని కొక పెద్ద చెంపదెబ్బ లాగా వుంది. 'ఎదుటివారి అవసరాన్ని నువ్వు క్యాష్ చేసుకో!' అనే ప్రాతిపదికమీద నడుస్తోన్న ఈనాటి సమాజంలో ఈ జోషిలాంటి వెర్రిబాగులవాళ్లుంటారంటే ఎందుకనో తనకు నమ్మబుద్ధి కావడంలేదు. ఇదొక వేషమేమో అనిపిస్తోంది, ఈరోజు దీన్తో సరిపెట్టుకొని, రేపు పెద్దకర్మ రోజున వచ్చి తనకి క్రొత్తబట్టలు పెట్టమని పీడించే ప్లానుకిది నాంది నాటకం కాదుగదా అనుకున్నాడు....

—అదే మాట వాళ్ళతో అన్నాడు.

మళ్ళీ వాళ్ళు ఒకరినొకరు ముఖం ఒకరు చూచుకున్నారు.

అందులో తనకి వరసకు అన్నయ్య అయ్యే ఒక పెద్దాయన, ''జోషి కథవింటే నీవ్వు ఈ మాట అనవు తమ్ముడూ!" అన్నాడు.

"అయితే, ఆ కథ ఏంటో చెప్పు అన్నయ్యా!"

* * *

జోషికి హైదరాబాదు మింట్‌లో ఏదో చిన్న వుద్యోగం. అసలు అతనిది కేరళరాష్ట్రం. ఎప్పుడో హైదరాబాదుకు వచ్చాడు. ఇక్కడ అతనికి నా అన్న వాళ్లు ఎవ్వరూ లేరు. ఒక కేరళ ఆఫీసరు ప్రాపకంతో ఈ వుద్యోగం సంపాదించాడు. ఈ వుద్యోగం పర్మినెంట్ అయ్యాక సొంత వూరెళ్ళి, చిన్నప్పట్నుంచీ తాను ప్రేమించిన తన మేనమామ కూతురు కుట్టీని పెళ్లాడి తీసుకొచ్చాడు. ఒక చిన్న యిల్లు అద్దెకు తీసుకొని క్రొత్తకాపురం పెట్టాడు.

క్రొత్త పెళ్లాంతో క్రొత్త కాపురం.

'చల్ మోహనరంగా! నీకూ నాకూ జోడుకుదిరెను కదరా ...' అన్నట్లు సరదాగా సాగిపోతుండగా, - మీకు నేను జోడీ అన్నట్లు ఒక చిన్న జోడీ సంవత్సరం తిరగకుండానే కుట్టీ కడుపున పడింది. జోషికి కేరళ అడవుల్లో ఏనుగును ఎక్కినంత సంబరమైపోయింది. కుట్టీని కాలు క్రింద పెట్టనివ్వటం లేదు. రెండుచేతులతో ఎత్తుకొని అక్కున హత్తుకొని నడుస్తున్నాడు. ఇంట్లో వున్నంతవరకు మోయటానికి తన చేతులున్నాయి. మెడికల్ చెకప్ కెళ్లేటప్పుడు బయట మోయటానికి ఆర్టీసీ బస్సులు, ఆటోలే శరణ్యం. మనకొక స్కూటర్ వుంటే ఎంచక్కా స్కూటరెక్కి వెళ్ళేవాళ్ళం కదా అని కుట్టీ బుంగమూతి పెట్టేది. కుట్టీ క్రొత్త కాపురానికొచ్చినప్పట్నుంచీ స్కూటర్ మీద మోజు పడేది. ముద్దుముద్దుగా పోరుపెట్టేది. ముద్దుల పెళ్లాం ముచ్చట తీర్చటానికి స్కూటర్ లోన్‌కోసం ఆఫీసులో అప్లయి చేశాడు కూడా....

తన చేతుల మీద తాను కుట్టిని మోస్తోంటే, కుట్టీ తన కడుపులో ఒక పొట్టీని మోస్తోంటే - కుట్టీ నాలిక బయటపెట్టి తనని ఎక్కిరిస్తోంటే, పొట్టీ తన చిన్ని కాలు ఎత్తి కుట్టేని కడుపు లోపల తంతూవుంటే - ఏడు నెలలు ఇట్టే గడిచిపోయాయి....

కుట్టి ఆనందాన్ని చూచి ఆ దేముడికే కన్నుకుట్టి కాలు అడ్డం పెట్టాడో, లేక ఆ పొట్టిగాడే తన కాళ్ళు చేతుల్తో పొట్టలో కుమ్మాడో తెలియదు గానీ - ఒక వర్షపు రాత్రి బాత్‌రూంలోకి వెళ్ళిన కుట్టి చీకట్లో కాలుజారి క్రిందపడింది. మామూలుగా పడడంకాదు పెద్ద పాటే పడింది - అదిన్నీ బొక్కబోర్లాపడింది.

మధ్యాహ్నం నుంచీ ముసురుపట్టి, కాల్వ కట్టి పారుతున్న వర్షపు నీటితో పాత డబ్బా రేకుల స్నానంకొట్టు ప్రక్కనుంచి కుట్టీ రక్తం ధారవచ్చి సంగమించింది....

జోషికి మధ్యలో మెలకువ వచ్చి బయటికి వచ్చి చూశాడు. బాధతో మూల్గుతున్న కుట్టిని చేతులమీద వేసుకొని రోడ్డుమీద కొచ్చాడు. చీకటి రాత్రి - వర్షం జోరున కురుస్తోంది. అదృష్టవశాత్తు ఒక ఖాళీ ఆటో కనిపించింది. దాంట్లో కుట్టిని వేసుకొని గవర్నమెంటు ఆసుపత్రికి తీసుకెళ్లాడు.

ఒక ప్రక్క కురుస్తోంది జడివాన - అప్పుడు నడుస్తోంది రాత్రి మూడో ఝాం - వచ్చింది బాడుగ ఆటో - తెచ్చినవాడు సాదాసీదావాడు - తెచ్చింది ఆ సాదా సీదావాని భార్య - ఆమె కట్టింది సాదాసీదా వాయిలుచీరె....

ముసురువచ్చి ఎడతెరిపిలేకుండా కురుస్తోన్న వానకు తోడయిన చలిగాలి చక్కలిగింతలు పెట్టుతున్న ఆ స్పెషల్ వాతావరణంలో - అక్కడున్న నైట్ డ్యూటీ డాక్టర్లకు గానీ, స్టాఫుకుగానీ ఈ 'సా(స)దా సీదా' ఎక్కడా కంటికి ఆనలేదు!

ఆసుపత్రి వరండాలో కుట్టిని పడుకోబెట్టి, జోషి గంగివెర్రు లెత్తునట్టు నెత్తీ నోరూ కొట్టుకుంటూ ఏడుస్తూ ఈ గదిలోకి ఆ గదిలోకి పరుగులు తీశాడు.

ఇతని గొడవకు రసాభంగమైన ఒక ప్రౌఢవయస్సు నర్సు నైటు డ్యూటీ కుర్రడాక్టరు గాఢ కౌగిలిలోంచి బయటికి వచ్చింది అతి విసుగ్గా.

విసురుగా వరండాలోకి వచ్చి నీళ్లోడుతున్న కుట్టీ చీరెను చూచి, "ముందు ఆ తడి చీరె విప్పి పొడిచీరె కట్టు!" అంది కోపంగా.

జోషి బిత్తరపోయి చూశాడు.

"పొడిచీరా! లేదు....తీసుకు రాలేదు ...మీ దగ్గర వుందదా?" నత్తినత్తిగా అన్నాడు.

"ఇదేం నీ అత్తగారి యిల్లుకాదు - సారె చీరె కట్టబెట్టటానికి! వేరే చీరె తీసుకురా!" కటువుగా అంది.

మళ్ళీ ఆ చీకట్లో, ఆ వర్షంలో యింటికి పరుగులు తీశాడు....

పెట్టె తెరచి చేతికందిన చీరె తీసికొని, తడవకుండా చొక్కా క్రింద పెట్టుకొని మళ్ళీ ఆసుపత్రివైపు పరిగెత్తాడు ...

అతడు రొప్పుకుంటూ మళ్ళీ ఆసుపత్రి ప్రాంగణంలో అడుగుపెట్టేసరికి తూర్పుదిక్కున తెలతెలవారుతూంది....

అప్పటివరకు కుండపోతగా కురిసిన వాన సన్నతుప్పరగా పడుతూంది.... వరండాలోని కరెంటుదీపం మాత్రం, నైట్‌డ్యూటీస్టాఫులాగా కునకకుండా - కులకకుండా, తన డ్యూటీ తాను జాగ్రత్తగా చేసుకుంటూంది.... కుట్టీని పడుకోబెట్టిన వరండా మొజాయిక్‌ఫ్లోరింగు దీపంకాంతిలో తళతళా మెరుస్తోంది. కుర్చీ కాళ్ళవైపునుంచి స్రవిస్తోన్న రక్తం ధారమీద దీపం వెల్గుపడి వింతగా మెరుస్తోంది....

తను తెచ్చిన చీరెను మడతవిప్పి కుట్టీ శరీరంమీద కప్పాడు. మళ్ళీ ఆ ప్రౌఢవయస్సు నర్సుని పిల్చుకొచ్చాడు.

కుట్టీ మీద కప్పిన చీరె లైటుకాంతిలో ధగధగ మెరిసిపోతూంది. నెమలి పింఛం రంగులో చూడముచ్చటగా వుంది.

చీరెమీద చూపు నిలుపుతూ, "చీరె బాగుందే! ఎంతకి కొన్నావు?" అంటూ జరీ అంచును మునివ్రేళ్ళతో మురిపెంగా తాకి చూశాకే కుట్టీ నాడి పట్టుకొని చూచింది. మొగాడి నాడిని పట్టటంలో దిట్టయిన ఆ నర్సమ్మకు ఆడదయిన కుట్టీ నాడి అందలేదో ఏమో వులిక్కిపడింది: మళ్ళీ మళ్ళీ చూచి తత్తరపడింది. నైట్‌డ్యూటీ కుర్రడాక్టర్ను పిల్చుకువచ్చింది.

అతను కూడా కుట్టీ నాడిని పట్టుకొని చూశాడు. చెవిలో గొట్టం పెట్టుకొని గుండె నడకను చూస్తోన్నాడు....

అతను అలా పరీక్ష చేస్తోన్నంతసేపూ ఆ నర్సు కుట్టీ చీరెవంకే చూస్తోంది....

ఆమెను అంతగా ఆకర్షిస్తోంది ఏఁవిటా అనుకుంటూ జోషి కుట్టీవంక చూశాడు. అది క్రొత్తచీరె. కుట్టీ సీమంతం కోసం కొన్నాడు. ఆమె ముచ్చటపడి

కొనుక్కుంది. ఇంకా మడతన్నా విప్పలేదు. వచ్చే ఆదివారం ఫంక్షన్ చేద్దామను కున్నాడు. ఇందాక హడావుడిలో చేతికి ఏదివస్తే అది తీసికొచ్చేశాడు.

కుర్రడాక్టరు పెదవి విర్చి, చీరను మొగం మీదకు లాగుతూ, "శవాన్ని యింటికి తీసుకెళ్ళిపో!" అన్నాడు.

అత దేమి అన్నాడో మొదట జోషికి అర్థం కాలేదు. అర్థం అయ్యాక కుట్టీ మీద వాలిపోయి, వళ్ళంతా ఆత్రంగా తడిమి చూశాడు. అది ప్రాణం లేని కట్టె అని అర్థం అయిపోయింది. ఆమె మీద పడి భోరుభోరున ఏడ్వసాగాడు.

తెల్లగా తెల్లవారినా మబ్బు విడవలేదు. వాన ఆగలేదు.

లావుపాటి తోటీ ఆడది మాటిమాటికి వచ్చి, శవాన్ని తీసెయ్యమని హెచ్చరించిపోతూంది. ఆమె ఆకారమే కాదు - రూపం కూడా భయంకరంగా వుంది. ఆమె బాధ పడలేక గేటు దాటి రోడ్డు మీదకు వచ్చాడు.

చాలాసేపు చూశాక ఒక ఖాళీ ఆటో కనిపించింది. దాన్ని ఆపి విషయం చెప్పి, ఎంతో ప్రాధేయపడ్డాడు. 'నహీ ఆతే!' అని వాడు వెళ్ళిపోయాడు. మరో ఆటో - మరో ఆటో - ఎవర్ని ఎంత ప్రాధేయబడ్డా ఎవ్వరూ వప్పుకోలేదు.

అతని బాధంతా చూస్తోన్న ఒక అసామి, "స్టేషను దగ్గర టాక్సీలు వుంటాయి. అక్కడ ట్రై చెయ్యండి. టాక్సీవాళ్ళు ఒప్పుకోవచ్చు!" అని సలహా యిచ్చాడు.

టాక్సీస్టాండు దగ్గర అందరూ అతని చుట్టూ మూగారు. 'శవం' అన్న మాట వినగానే ఎవరికివాళ్ళు వెనక్కి వెళ్ళిపోయారు.

ఒక్కరు మాత్రం ప్రక్కకి పిల్చి, రెండు వేలు యిస్తే వస్తాను అన్నాడు. అతను 'నా దగ్గర అంతడబ్బు లేదు, ఐదు వందలు ఇస్తాను' అన్నాడు. వాడు వెటకారంగా, 'మా ఇచ్చావు లేవయ్యా బోడి అయిదొందలు! అయిదొందల కిరాయికి ఈ సిటీలో ఏ టాక్సీ వాడూ రాడు—పోవయ్యా! పోయి మున్సిపాల్టీ చెత్తబండి కోసం ట్రైచెయ్యి. వాళ్ళు ఊరికే వస్తారు...." అన్నాడు.

'వెధవా, నా కుట్టీని మున్సిపాల్టీ చెత్త బండిలో వెయ్యమంటావా?' అంటూ ఆవేశంగా వాడిచొక్కా పట్టుకోబోయాడు.

వాడు కసిరికొట్టి వెళ్ళిపోయాడు.

జోషికి బోరున ఏడ్వాలనిపించింది. రోడ్డునపోయే అందర్నీ కేకలు పెట్టి బూతులు తిట్టాలనిపించింది... చేసేదిలేక తన్నుతాను తిట్టుకున్నాడు. దేముడ్ని తిట్టాడు. తనని కన్న తల్లి తండ్రులను తిట్టాడు. చివరికి కుట్టిని 'ఎందుకే యిలాటి దిక్కులేని చావు చచ్చావు? ఆ వెధవ నిన్ను మున్సిపాల్టీ చెత్తబండిలో వెయ్యమన్నాడు! ఆ చచ్చేది ఇంటి దగ్గరే చచ్చివుంటే నాకీ బాధ వుండేదికాదు!' అని తిట్టుకున్నాడు....

ఏడ్పును, కోపాన్ని దిగమ్రింగుకొని మళ్ళీ కాళ్ళీడ్చుకుంటూ ఆసుపత్రి వైపు నడిచాడు. ఏం చెయ్యడానికి పాలుబోక పిచ్చి పట్టినవాడులాగా ఆసుపత్రి గేటుముందు అటూ ఇటూ పచార్లు చేయసాగాడు....జుట్టు పీక్కున్నాడు... కని పించిన ప్రతి ఆటోనీ ఆపి అడిగాడు. ఎవ్వరూ వప్పుకోలేదు. చాలా మంది అతని ఆకారం చూచి బదులు పలకకుండా వెళ్ళిపోయారు.

ఇంతలో ఒక నడివయస్సు వ్యక్తి అతని దగ్గరకు వచ్చాడు. మెల్లగా, "చూడు భాయ్! నీ బాధ నాకర్థమైంది. 'శవం' పేరు చెబితేనే కొడుకులు అదిరిపోతున్నాడు. మరి చచ్చిన శవం ఆళ్ళను పీక్కుతింటదో ఏమో! రేపు ఆళ్ళు శవాలు కారా? ఆళ్ళ పెళ్ళాలు శవాలు కారా! పుట్టిన పతోడు రేపో మాపో శవం కావల్సిందే! ఆ శ్మశానానికి పోవాల్సిందే! దీనికూడా మరింత ఇదయి పోతారెందుకో ఈ వెధవలు? అస్సలు శవానికి సాయంబడితే, దాన్ని బుగ్గి చెయ్యటానికి భుజం కట్టితే బోలెడు పున్నెం. అది కొడుకులు ఈళ్ళకి తెలియదు. కావాలంటే ఇదిగో, నా బండి వుంది తీస్కో!" అన్నాడు.

అది నాల్గు సైకిలు చక్రాల తోపుడుబండి. దానిమీద అతడు పూలూ, పండ్లూ, కూరగాయలు పెట్టి రోడ్లవెంట తిర్గుతూ అమ్ముకుంటాడు.

మున్సిపాల్టీ చెత్తబండికంటే ఇదే నయం అనుకున్నాడు. 'ఎంత ఇవ్వ మంటావు?' అని అడిగాడు. అతడు నవ్వి భుజం తట్టి "ముందు నీ పని కానీయ్ భాయ్!" అన్నాడు.

జోషి అతనికి చేతులెత్తి దణ్ణం పెట్టాడు.

ఆ బండిని తీసుకొని ఆసుపత్రిలోనికి వెళ్ళాడు.

అక్కడ కనిపించిన దృశ్యాన్ని చూచేసరికి అతనికి తల తిర్గిపోయింది. కోపం కట్టలు త్రెంచుకుంది. గుప్పిట్లు బిగుసుకున్నాయి.

కుట్టి శవం మీద కప్పిని క్రొత్త చీరెకు బదులు చిరుగులపడ్డ ఒక పాత దుప్పటి వుంది.

'దొంగ ముండల్లారా, నా పెళ్ళాం మీద కప్పిన కొత్తచీరె ఏదే?' అని కేకలుపెట్టి అరిచాడు.

ఎవ్వరూ మాటాడలేదు. ఎవ్వరూ ఆ ఛాయలకే రాలేదు.

....కుట్టి శవాన్ని ఆ తోపుడు బండిమీద పడుకోబెట్టి రోడ్డుమీద తోసుకుంటూ వెళ్ళుతుంటే - స్కూటర్ కోసమని కుట్టి తనని పదే పదే పోరటం గుర్తుకు వచ్చింది.

"చూశావా కుట్టీ! కొత్త స్కూటర్‌మీద ఎక్కి హైదరాబాదు రోడ్లన్నీ తిరగాలనే నీ చిరకాలపు కోర్కెను ఈ దరిద్రుడెలా తీరుస్తోన్నాడో! నీ కోర్కె తీరిందా కుట్టీ? నీకు సంతోషమా?" అంటూ ఏకధారగా కారుతున్న కన్నీళ్ళను చేత్తో తుడుచుకుంటున్నాడు....

ఆ తర్వాత జోషిలో చాల మార్పువచ్చింది. వేదాంత ధోరణి అలవడింది. తన ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన తన కుట్టీ తన నుంచి దూరమైందన్న దుఃఖం ఒకటి! ఆనాడు దిక్కూ-మొక్కూ లేని నిస్సహాయ స్థితిలో ఆమె శవాన్ని తోపుడుబండిలో రోడ్ల వెంట త్రోసుకెళ్ళానే అనే దుఃఖం మరొహాటీ! రెండో దుఃఖమే దుర్భరం. తన గుండెల్ని మాటిమాటికి కలచివేస్తోంది. ఆనాడు తన కెదురైన దుర్భరస్థితి మరెవ్వరికీ రాకూడదు.... మరి దానికి తానేం చెయ్యాలి? ఆనాడు ఆ తోపుడుబండి భయ్యా అన్న మాటలు గుర్తుకు వచ్చి - స్ఫూర్తి నిచ్చాయి! తనేం చెయ్యాలో తెల్సింది - దాని ఫలితమే ఈనాటి ఈ 'వైకుంఠ రథం'!

దీనికోసం అతను వాలంటరీ రిటైర్‌మెంట్‌మెంట్ తీసుకున్నాడు. ఆ వచ్చిన డబ్బులకు తోడుగా, సొంత వూళ్లోని పొలం పుట్రా అమ్మేశాడు. కుట్టీ నగానట్రా అమ్మేశాడు. మరికొంత బ్యాంక్ లోన్ తీసుకున్నాడు. డ్రైవింగ్ నేర్చుకున్నాడు. ఆనాటినుంచీ గొప్ప అంకితభావంతో, సేవానిరతితో ఈ పవిత్ర కార్యాన్ని చేపట్టాడు. పై లోకంలోవున్న తన కుట్టీ తను చేసిన పనికి సంతోషిస్తుందని గాఢంగా నమ్ముతున్నాడు....

డా. వేదవ్యాస్ ఆ రోజే గోదావరి ఎక్కాడు. రైలుదిగి యింటికి చేరగానే తన అసిస్టెంట్‌కు కబురు పంపాడు.

"ఏఁవయ్యా, ఆ రిటైర్డు బడిపంతులు వున్నాడా, వెళ్ళిపోయాడా?" అని అడిగాడు.

''తమర్నికాదని ఎక్కడికి వెళ్లతాడండీ? తల తాకట్టు పెట్టి మన ఫీజుకు కావల్సిన రొక్కం సమకూర్చుకొని తమరి రాకకోసం ఎదురు చూస్తోన్నాడు. కాకపోతే...." అని నీళ్ల నమిలేడు అసిస్టెంట్.

"మళ్ళీ ఏఁవయిందయ్యా?"

''ఏం లేదు సార్! మన లెక్కకు కొంచెం కొరత పడ్డట్టుంది - అబ్బే, ఎంతో లేదండి! ఒక్క అయిదొందలు వరకూ వుంటుంది....'' మాటలు మింగాడు అసిస్టెంట్.

"అది నువ్వు నొక్కావా?''

''మహాప్రభో! ఎంతమాట?'' దణ్ణం పెట్టాడు.

సర్జన్ చిరునవ్వు నవ్వి, ''వినయమూర్తి, వూరికే అన్నా లేవయ్యా! అస్సలు మనం ఫీజే పుచ్చుకోకుండా ఫ్రీగా ఆపరేషన్ చేద్దామయ్యా!'' అన్నాడు.

''అయ్యా, తమరేం అంటున్నారో అర్థం కావటం లేదయ్యా!'' అయోమయంగా అన్నాడు అసిస్టెంట్.

''దీంట్లో అర్థం కానిదేముందయ్యా? మనం ఇంతదాకా గడించిన డబ్బు మనకు చాలదటయ్యా? వెధవది డబ్బుదేముందయ్యా? పరోపకారం, పుణ్యం పురుషార్థం వుండొద్దూ జన్మ ఎత్తాక! ఆ బడిపంతులుకు కబురుపెట్టు- ఒక్క రూపాయి కూడా తీసుకోకుండా ఆపరేషన్ చేస్తానని చెప్పు!'' నిబ్బరంగా అన్నాడు సర్జన్.

''చిత్రం - చిత్రం!'' అంటూ అప్రయత్నంగా రెండు చేతులూ జోడించాడు ఆయన అసిస్టెంట్ వినయమూర్తి.

[ఈ కథకు స్ఫూర్తి : శ్రీ భోజరాజు, ప్రకాష్‌బాడీ బిల్డర్స్, నాచారం.]

# మనిషి - మమత

—పవని నిర్మల ప్రభావతి

కోఠీ బస్‌స్టాప్‌లో నిల్చునివున్న నాకు కాళ్ళు పీకుతున్నాయి. ఎంతకీ బస్సు రావటం లేదు. త్వరగా వెళ్లాలి. ఆటో తీసుకుందామంటే, ఏ ఇరవై రూపాయలో పెట్టాలి! జీవితమంతా బడ్జెట్ సరిచూసుకుంటూ, జీవితంతో రాజీ పడటం తప్ప, "విలాసాలు" "ఎక్కువ ఖర్చులు" అంటూ ఆలోచనే లేని నాకు ఆ ఇరవై రూపాయలు అన్నమాటే భయంగా తోచి అలా నిల్చుండిపోయాను. సర్రున నా ప్రక్కగా మూసుకువచ్చినట్లుగా వచ్చి ఆగింది పెద్ద "ఇంపాలా" కారు.

''అరె! సుజాతా! నువ్వా? నువ్వేనా?'' అంది కారులో వున్న యువతి, నల్ల కళ్ళద్దాలు తీసి నావేపు చూస్తూ.

ఆశ్చర్యపోయాను క్షణకాలం. జ్ఞాపకాల తెరలు రెపరెపలాడాయి మనసులో.

వసుంధర!

''ఆఁ! ఆఁ!'' అన్నాను ఆశ్చర్యం అణుచుకుంటూ. వసుంధర కనిపించిందన్న ఆశ్చర్యం కంటే, ఇప్పుడు, వసుంధర నాకంటే పాతికేళ్ళు చిన్నదానిలా కనిపిస్తున్నందుకు ఆశ్చర్యంగా వుంది.

''ఎక్కడికి వెళ్ళాలి? ఎన్నేళ్ళకి చూశాను? రా! రా! కారెక్కు. మా ఇంటికెళదాం!'' అంది కారులోంచి దిగి నా ప్రక్కకి వస్తూ.

''మనవడి పుట్టినరోజు సాయంత్రం ఆరుగంటలకి. చిక్కడపల్లి వెళ్ళాలి. మరోసారి వస్తాను'' అన్నాను మొహమాటంగా.

"ఓహ్! ఆరు గంటలకు కదా! ఇప్పుడింకా రెండు కూడా కాలేదు. నేను కార్లో డ్రాప్ చేస్తాలే. రా, మా ఇంటికి." చనువుగా జబర్దస్తీగా కారులోకి లాక్కెళ్ళింది. డ్రైవింగ్ సీటులో వసుంధర, ఆమె ప్రక్కన్నే నేనూ కూర్చున్నాం. నాకోసం కోడలు పాపం, ఎదురు చూస్తుంటుంది - కాస్త పని సాయం అందుకుంటానని.

"మీ వారు రిటైర్ అయ్యారు కదా? హైద్రాబాదులోనే వున్నారా మీరిప్పుడు? మేమిద్దరం బొంబేనుండి ఈ మధ్యే హైదరాబాదు మకాం మార్చాము. ఇక్కడున్న బంగళా మరలా రీమోడల్ చేయించాం!" గబగబ మాట్లాడేస్తోంది తన సహజ ధోరణిలో వసుంధర. నా మనసు జ్ఞాపకాల పరదాలను తొలగిస్తోంది.

ఒకే కాలేజిలో డిగ్రీ పూర్తిచేశాం వసుంధరా, నేనూ. కోటీశ్వరుడైన కోటీశ్వర్రావుగారి కూతురు వసుంధర. ఆమె ఆడింది ఆట, పాడింది పాటగా పెరిగింది. రెండు సినిమా థియేటర్లూ, ఒక సుగర్ ఫ్యాక్టరీ వున్న ఆమె తలితండ్రులు - స్కూలునుండి కాలేజి వరకూ కారులోనే పంపేవారు. మధ్య తరగతి కుటుంబంలో ఒక అక్క, ఒక తమ్ముడు, చెల్లాయిలమధ్య పుట్టిన నేను మధ్యతరగతి కుటుంబాలలో వుండే అన్నిరకాల ఆర్థిక సమస్యలకూ ప్రతినిధిని. అంచేత వసుంధర "బర్త్‌డే పార్టీ" విలువ మా కుటుంబపు నెలసరి ఆదాయం, ఖర్చూను. డబ్బు ఇచ్చిన గొప్పతో వసుంధర కాలేజిలో అందర్నీ డామినేట్ చేస్తుండేది. డిగ్రీ పూర్తి కాగానే, మరో కోటీశ్వరుని కొడుకు డాక్టర్ రాఘవతో వివాహం చేశారు. వాళ్ళిద్దరూ అమెరికా వెళ్ళిపోయారు. పదేళ్ళక్రితం కాబోలు వసుంధరా, వాళ్ళాయనా బొంబాయిలో ఉన్నారని ఎవరో చెప్పగా విన్నాను.

ఇక నా జీవితం-నేను బి. ఇడి. పాసై, స్కూలు టీచరుగా ఉద్యోగంచేస్తూ, మా అమ్మ నాన్నగార్లు కుదిర్చిన సంబంధం శ్రీనివాస్‌తో గృహిణిగా మారాను. శ్రీనివాస్ నాలానే టీచరు. ఇద్దరికిద్దరం ఉద్యోగాలు చేస్తూ, మా ముగ్గురు పిల్లల్ని పెంచుకోవటం, వాళ్ళ చదువులు, పెళ్ళిళ్లు చేసి రిటైరై - పిల్లలు ముగ్గురూ హైదరాబాదులోనే సెటిలవటం మూలాన, మేమూ అక్కడే వేరుగా ఉంటాం- మా జీవితంలో మేం మెల్లగా కూడబెట్టి కట్టించుకొన్న నాలుగు గదుల ఇంట్లో! ఇప్పుడు మా అబ్బాయి కొడుకు పుట్టినరోజు పెద్దగా వేడుక కాక

పోయినా, కుటుంబ సభ్యులమంతా కలుసుకుని సరదాగా గడిపి - పిల్లాణ్ణి ఆశీర్వదిస్తాం! కొడుకులు, కోడళ్ళిద్దరూ, అమ్మాయి, అమ్మాయి భర్త అందరి కందరూ ఉద్యోగాలు చేసుకుంటున్నారు. ఇలా ఎప్పుడేనా కలుసుకుంటే ఎంతో ఆనందంగా, ఆప్యాయంగా వుంటుంది.

"మీరిద్దరూ వేరుగా ఎందుకూ? మాలో ఎవరిదగ్గరో ఒకరిదగ్గర ఉండ కూడదూ?'' అని పిల్లలంతా అంటుంటారు. కానీ నాకూ, మా శ్రీవారికీ ఇష్టం లేదు. జీవితమంతా కష్టాలు, సమస్యలు, బడ్జెట్‌తో సతమతమయ్యాం. కాళ్ళూ చేతులూ ఆడుతున్నంత కాలం పిల్లలకు బరువు కాకుండా వుంటాం. తప్పనిసరై నపుడు ఎలాగూ వాళ్ళకూ, మాకు కూడా తప్పదు. అందులోనూ ఒక గర్వం వుంది మా ఇద్దరికీ. మా ముగ్గురు పిల్లలూ మమ్మల్నిద్దర్నీ భారం అనుకోరు. సంతోషంగా మా బాధ్యత వహిస్తారు. ఆ తృప్తి, ఆ ఆలోచనే మాకు కొండంత బలం ఇస్తోందీ వయసులో.

కారు పోర్టికోలో ఆగింది. ''నా ప్రశ్నలకు నువ్వు జవాబు చెప్పకపోవ టంతో, నేనే మాట్లాడటం ఆపాను కారులో! బహుశా గతం అంతా నెమరువేసు కుంటున్నావనుకున్నాను. యామై కరెక్ట్?'' అంది వసుంధర కారుడోర్ లాక్ చేస్తూ.

"కరెక్ట్!" అన్నాను నవ్వుతూ.

మరో మయసభలా వున్న బంగాళా. ఆ ఫర్నిచర్ వగైరాల విలువ నేను అంచనా వేయదల్చుకోలేదు. డబ్బుతో కొండమీది కోతిని దింపుకురాగల స్థాయి ఎలాగూ కనిపిస్తోంది.

రాఘవ లేడు ఇంట్లో. "ఆయనగారు బిజినెస్ చూచుకొని ఏ అర్ధరాత్రికో వస్తారు. ఒక్కోసారి రారు!" అంది వసుంధర ఫ్రిజ్‌లోని కూల్‌డ్రింక్ నాకూ, తనకూ చెరొకటి తెస్తూ.

"రారా?!" అన్నాను ఆశ్చర్యంగా.

"అందులో ఆశ్చర్యపడాల్సిందేమీలేదు. మేం ఫారిన్‌లో వుండగా వెట్ పార్టీలు బాగా అలవాటయ్యాయి మా యిద్దరికీ! ఈ మధ్య నా ఆరోగ్యం కాస్త దెబ్బతిన్నది. అంచేత నేను 'డ్రింక్' మానేశాను. ఆయనగారికింకా ఆరోగ్యం

బాగానే వుంది. బిజినెస్, క్లబ్, బార్....ఇలా రాత్రివేళ రిలాక్స్ అవుతారు" అంది అతి సహజంగా.

"అలాగా?" అన్నాను ఏమనాలో తోచక.

"చూడు సుజాతా! మా ఇద్దరికీ ఇప్పుడొకటే బాధ! మా అమ్మాయి డాక్టరు. దాని భర్తా డాక్టరే! ఇద్దరూ అమెరికాలోనే సెటిల్ అయ్యారు. మా అబ్బాయి కుమార్ ఇంజనీరు, వాడి భార్య డాక్టరు. వాళ్ళిద్దరూ అమెరికాలోనే వున్నారు. కానీ ఆశ్చర్యం! ఒకళ్ళింటికి ఒకళ్ళు వెళ్ళరు. ఒకరి మీద ఒకరికి మమకారం లేదు. ఇక మేం వున్నాం -తల్లిదండ్రులం. మా ఇద్దరి మీదా ప్రేమ లేదు. మేం వాళ్ళకి దూరంగా వున్నా - చూడటానికి రారు! వాళ్ళ దగ్గర వుంచు కోరు! విసిగిపోయి బొంబాయి వచ్చాం! బిజినెస్ పెట్టుకున్నాం. అక్కడికీ రారు పిల్లలు! బిజినెస్ ఇంకా ఎవరి కోసం చెయ్యాలి? ఇంకా ఎన్ని కోట్లు సంపాయించాలి అనిపించింది. హైదరాబాదు వచ్చేశాం! ఇక్కడ విశ్రాంతిగా వుంటున్నాం. కానీ, మాకూ వృద్ధాప్యం అనేదొకటుంటుందికదా? అప్పుడు మమ్మల్నెవరు చూస్తారు? ఆ పిల్లలురారు - మమ్మల్ని రానివ్వరు! ఇక ఓల్డేజిహోం ఒక్కటే మార్గం అనిపిస్తోంది! మరి మీకో?" అంది వసుంధర అనర్గళంగా మాట్లాడి ఆపి.

"పిల్లలున్నారు. పిల్లలు చూస్తారన్న నమ్మకం మాకుంది!" అన్నాను ధృఢంగా. నాకీ క్షణంలో గర్వంగా వుంది. కాలేజీ రోజుల్లో వసుంధర రోజుకో కొత్త చీరె, కొత్త నగ వేసుకు వస్తే, ఆ అదృష్టం మాకు లేదే అని లోలోపల బాధపడే వాళ్ళం మా ఫ్రెండ్సులో చాలా మంది అమ్మాయిలం! కానీ ఈనాడు కోట్ల డబ్బు వసుంధర కివ్వని "గొప్ప" ఏదో మాకుందనిపించింది!

"ఈ తరం పిల్లలు ఇలా మారటానికి కారణమేమిటంటావ్?" అంది వసుంధర మళ్ళీ ఓ ప్లేటులో స్వీటూ, హాటూ తెచ్చి నా ముందు పెడ్తూ. వసుంధర ప్రశ్నలోనేవుంది సమాధానం. కానీ ఇప్పుడు ఇక్కడ చెప్పలేను. చెప్పి ఆమెను మరింత బాధ పెట్టలేననిపించింది.

"ఇవేం వద్దు. నాకు అరగవు!" అన్నాను టిఫిన్ ప్లేటు పక్కన పెట్టేస్తూ కాస్సేపు పిచ్చాపాటి మాట్లాడాక కారులో నన్ను మా అమ్మాయి ఇంటి దగ్గర దిగబెట్టింది వసుంధర. పిల్లలూ, మనవళ్లూ, మనవరాళ్లూ అంతా నా కోసం

ఎదురు చూస్తున్నారు ఆత్రుతగా వాళ్ళ తాతగారు (మా శ్రీవారు) నా కంటే వెనక బయల్దేరి బస్సులో - ముందుగానే చేరుకొని వున్నారు. వసుంధరని పరిచయం చేశాను. మావాళ్ళంతా ఆమెని మర్యాద చేశారు.

బర్త్ డే చాలా సింపుల్. పిల్లలు ఇంట్లో తయారుచేసిన లడ్డు, మిక్చర్, కూల్ డ్రింక్, చిన్న పిల్లలకు తలకో ఐస్‌క్రీం.

''ఎంత సరదాగా, కలిసికట్టుగా వున్నారు మీరంతా! మాలో ఈ కలివిడితనం ఎందుకు కొరవడింది సుజాతా?'' అంది వసుంధర బాధగా.

చెప్పాలి చెప్పక తప్పదు. పిల్లలంతా కబుర్లలో పడ్డారు. నేనూ వసుంధరా వరండాలో కుర్చీల్లో కూర్చున్నాం.

''వసూ! ఓ మాట అడగనా? నీ పిల్లలిద్దర్నీ నువ్వు కన్నావా?" అన్నాను.

''అదేమిటే మతి లేని ప్రశ్న! నేను గాక మా వారు కన్నారా?'' అంది వసుంధర ఎగతాళిగా.

"లేదువసూ! నీకు కాన్పు అయ్యే వారం తెలుసుకుని, మీ అమ్మగారో, మీ ఫామిలీ డాక్టర్ శ్రీదేవితో ముందే చెప్పారుట ... 'మా అమ్మాయి నొప్పులూ-ప్రసవ వేదన పడలేదు. డబ్బుకు మాకు కొదవ లేదు సిజేరియన్ ఆపరేషన్ చేసి బిడ్డను తీయమని శ్రీదేవి నొచ్చుకుని - "వసుంధరకు నార్మల్ డెలివరీ అవుతుందండీ! అనవసరంగా సిజేరియన్ ఎందుకూ?' అందిట! మీ అమ్మగారు ఆవిడని కోప్పడి, "మీరు చేయనంటే మరో డాక్టర్‌కి పదివేలైనా ఇచ్చి చేయిస్తా, అంతేగానీ, నా బిడ్డ ప్రసవ వేదన పడటం మేము భరించలేం!' అందిట. డాక్టర్ శ్రీదేవికి తెల్సు: తాను కాదంటే - తను డబ్బు పోగొట్టుకుంటుందే తప్ప నీకు సిజేరియన్ ఆపరేషన్ ఆగదని. అందుకే ఆవిడ ఒప్పుకుని - నీకు నొప్పులు ప్రారంభించక ముందే సిజేరియన్ ఆపరేషన్ చేసి, నీ కూతుర్ని నీ పక్కలో పడుకోబెట్టింది. ఇదంతా మా అమ్మ చెప్పింది అప్పట్లో! పురిటినొప్పు లేమిటో నీకు తెలీదు. సాధారణ కాన్పులో బిడ్డ తల్లి ప్రేగు తెంచుకుని రావటమేమిటో నీ బిడ్డలకూ తెలీదు. అవునా?" అన్నాను నేను.

"దానివల్ల వచ్చిన నష్టమేమిటి?" అంది వసుంధర నవ్వుతూ.

''అదే పెద్ద నష్టం! ఓ మహా ప్రసవ వేదన చవిచూచిన తల్లికి - తన బిడ్డ మీద మమకారం ఉప్పొంగి, అది చనుబాల ద్వారా బిడ్డ హృదయంలోకి చేరుతుంది. ఓ ప్రళయంలో నుంచి బయట పడిన బిడ్డ, తన తల్లి ఒడిలో శాంతి పొందుతుంది. అది సృష్టిరహస్యం. కానీ, ఈనాడు - నీ విషయంలో ఓ మంచి బొమ్మను కొన్నట్లు నువ్వు ఓ బిడ్డ బొమ్మకు అమ్మవైనావు! ఆ బొమ్మకూ అమ్మ బొమ్మేగానీ, అమ్మ కాదు. తప్పనిసరై ప్రాణాపాయస్థితి తల్లికో, బిడ్డకో ఏర్పడితే ఆపరేషన్ చేయడం వేరు. స్త్రీ సహజమైన మాతృత్వాన్ని ఆపరేషన్‌తో కోసివేయటం సైన్సుకు నిదర్శనమా? మమతలకు సమాధి కట్టడమా? ఆలోచించు.'' అన్నాను వసుంధర మాట్లాడలేదు.

''ఇక నీ భర్త - డాక్టర్ అయివుండీ - నీ బిడ్డకు నీవు పాలిస్తే నీ అందం చెడిపోతుందని ఒద్దన్నాడు. నువ్వూ సరేనన్నావు. మీ అమ్మ సంతోషించింది. నీ బిడ్డలు పుట్టిన క్షణం నుండీ డబ్బాపాలతో పెరిగారు! ఇప్పుడు నువ్వు నా కంటే పదేళ్ళు చిన్నదానిలా వున్నావు. కానీ, తల్లిపాలు బిడ్డకు ఇచ్చే మధురానుభూతిని పోగొట్టుకున్నావు. అవునా?''

వసుంధర ''నే నిలా ఆలోచించలేదు సుజాతా!'' అంది ఆర్ద్రంగా.

''తర్వాత నీ బిడ్డల పెంపకం నువ్వు చేస్తావా? అదీ లేదు. మీ అమ్మ, కూతురు కష్టపడకుండా ఆపిడా, ఆయాలూ పెంచారు నువ్వు, మీ శ్రీవారు మీ సుఖం, సినిమాలు, షికార్లూ, బిజినెస్‌లు, బార్లు, పార్టీలలో మునిగిపోయి-పిల్లల్ని ముద్దొచ్చినప్పుడు కాస్సేపు ఆడుకొనే బొమ్మల్లానే చూశారు. వాళ్ళకి మమ్మీ, డాడీ డబ్బు కోరినంత ఇచ్చే మిషన్స్‌లానే కనిపించారు! వాళ్ళకి పెళ్ళిళ్ళు చేశారు. వాళ్ళకి ఇలానే పిల్లలు పుట్టారు. వాళ్ళు ఇలాగే పెరుగుతున్నారు. ఇక ఈ గొలుసుకట్టు కథలో కుటుంబ వ్యవస్థ, మమకారాలకు తావెక్కడ? తీరిక ఎక్కడ? టైమెక్కడ? తల్లి, తండ్రి, బిడ్డలు, కుటుంబం అనే బాధ్యత, ప్రేమలకు ఆస్కారం ఎక్కడ? ఆలోచించు."

వసుంధర అవాక్కుగా నా వేపు చూస్తుండి పోయింది.

"వసూ! మా మధ్యతరగతి కుటుంబాలలో 'డబ్బు' ఒక్కటే పెను సమస్య! ఆ డబ్బు సమస్యవల్లే వృద్ధులైన తలితండ్రులు ఒక్కోసారి బరువౌతారు. కారణం - పెద్ద ఇళ్ళ వసతి లేక భార్యాభర్త లిద్దరూ ఉద్యోగాలు చేసుకోక

తప్పకా! ఆ డబ్బుతోనే అన్ని సమ్యలూనూ! కానీ మీలాటి వారికా సమస్య లేదే! లంకంత బంగళాలు - బోలెడంత మంది నౌకర్లు - డబ్బు ప్రవాహం. కానీ మీకొక్కవల్సింది మీ స్వసుఖం - మీ విలాసాలు - మీ అందం-ఆనందం. పిల్లల్ని కనలేని అనారోగ్యం ఏమీలేదు మీలో! కానీ సిజేరియన్‌తో నొప్పులు లేకుండా బిడ్డ రావాలి! కావాలి! పెంచుకొనే వసతి వున్నా - పెంపకం అనేది చికాకు! మీ బిడ్డలు మీ కడుపులో వూపిరిపోసుకున్నా, వాళ్ళు బయట ప్రపంచంలోకి వచ్చేది సహజమైన మార్గంలోగాక, శస్త్ర చికిత్స అనబడే కత్తులూ, కత్తెరలూ, కుట్లతో! ఆ పిల్లలపట్ల మీ కంతటి నిర్బాధ్యత వున్నప్పుడు ఆ పిల్లలకు మీపట్ల బాధ్యత ఎందుకొస్తుందో చెప్పు ఈ వయసులో!

"మీకు డబ్బుంది. ఓల్డేజ్ హోంలలో చేరనూ గలరు. నడపనూ గలరు. మాకు లేదు - మేము ఆ పిల్లల ప్రేమ మా సర్దుకు పోయే తత్వంతో వుండి - వాళ్ళ చిరు ప్రేమలో మా జీవిత సాఫల్యం చూచుకుంటాం. వాళ్ళూ అంతే! 'మా అమ్మ నాన్న - మా కోసం శ్రమించారు! మనకున్నదాన్లో వాళ్ళని సంతోష పెడదాం' అనుకుంటారు. అదే రహస్యం!"

బాగా చీకటి పడింది.

వసుంధర మెల్లిగా లేచింది. కారు వరకూ వెళ్లాను. మా పెద్దబ్బాయి "ఆంటీ! నేను తోడు వస్తాను" అన్నాడు కారు బయల్దేరబోతూండగా.

వసుంధర నిర్లిప్తంగా నవ్వింది. "వద్దు బాబూ! మీ అమ్మా నాన్నలని చూచుకో! మాబోటి వాళ్ళకి - ఓల్డేజ్ హోంలలో మీలా మమత, తల్లీ తండ్రీ ప్రేమ వున్న పిల్లలెవరో తోడుగా వుండి చూడాలి ఎలాగూ! ఇలా ఒంటరిగా కారు డ్రైవ్ చేసుకోవటం నాకు అలవాటే. అయినా ఈ రోజు కొత్తగా తెలుసుకున్నాను - నేను కోల్పోయిన దేమిటో! మీ కుటుంబంలో డబ్బు ఎక్కువలేదు. బంగళా కాదు మీ ఇల్లు. కానీ మీ అందరి హృదయాల నిండుగా మానవ జీవితాలకు విలువ కట్టలేనంతటి ఆప్యాయత, అనురాగాలు ధనరాసులుగా పోసి వున్నాయన్నది తెలుసుకున్నాను. వస్తా!"

వసుంధర కారు కనుమరుగైపోయింది.

*

# చితికిన కల

—శీలా సుభద్రాదేవి

తలుపు కొట్టిన శబ్దానికి తలుపు తెరవగానే నాలుగయిదేళ్ళ కుర్రాడు సొట్టలుపడిన అల్యూమినియం టిఫిన్ డబ్బా చాపి ''తోడా బరఫ్ దేదోనా'' అన్నాడు.

మార్చి నెలనుండి చుట్టుప్రక్కల గుడిసెల పిల్లలు ఐస్ కోసం రావటం అలవాటు. ప్రత్యేకించి వాళ్ళకోసం వాడకుండా కొంత అట్టే పెట్టటం కూడా చేస్తుంటాము.

లోపలికి వెళ్ళి ఐస్ క్యూబులు తీసుకొచ్చి ఆ పిల్లాడి గిన్నెలో వేసి, తలుపేశాను.

ఆ పిల్లాడిని చూడగానే 'బుడ్డిమా' కళ్ళముందు మెదులుతుంది. వయస్సు వల్ల ఒళ్ళంతా వదలిపోయి, నడుము వంగిపోయి నాలుగడుగుల కన్నా ఎత్తు ఉండనట్లు కనిపిస్తుంది. ఉదయం, రాత్రి మాయింటి దగ్గరలోనే ఉన్న గుడిసెల బస్తీ మొదట్లో ఒక గోనె పట్టా పరచి కూరలు అమ్ముతూ ఉంటుంది. కూరలంటే కిలోల లెక్కని కాదుకదా పావుల లెక్కను కూడా కాదు - గోనె పట్టామీద చిన్నచిన్న కుప్పలు పెడుతుంది. ఒక్కొక్క కుప్పలో రెండో మూడో వంకాయలో ఇతర కూరలో ఉంటాయి. అన్నీ ఆ బుడ్డిమాలాగే వదలిపోయి ఉంటాయి. కొన్ని ఒకప్రక్క కుళ్ళుతూ కూడా ఉంటాయి. వాటిని ఆ గుడిసెలవాళ్ళే పావలో, అర్ధో యిచ్చి తీసుకెళ్తూ ఉంటారు. పులుసో, పచ్చడో చేస్తారేమో!

ఆ కుర్రాడు ఆమెకి బంధువో లేకపోతే సాయంకోసం ఏ దిక్కులేని వాడిని చేరదీసిందో ఆమెతోనే ఉంటాడు. సాయంత్రం పూట తోచనప్పుడు డాబా జాలు దగ్గర నిలబడి వాళ్ళనే చూస్తూ ఉంటాను.

సాయంత్రం వేళల్లో కూరగాయల మార్కెట్టుకి వెళ్తే అక్కడ క్రింద పడిన కూరలు, కొంచెం పాడయ్యాయని పారేసిన కూరలూ ఆ కుర్రాడి సాయంతో ఏరుకుంటూ ఉంటుంది. కూరగాయల వాళ్ళు కూడా చాలామంది వడలిపోయినవో, పుచ్చువో, చచ్చువో ఆవిడని పిలిచి మరీ ఇస్తుంటారు. ఎవరన్నా దయతలచి ఓ పది పైసలు ఇస్తే పుచ్చుకుంటుంది. అంతేతప్ప తనకి తాను చేయిచాపి అడగదు.

నిజానికి ఓ నాలుగిళ్ళు అడుక్కుంటే ఆవిడకీ, కుర్రాడికీ కడుపు నిండి పోతుంది. కానీ బుడ్డీమా అడుక్కోగా నేను చూడలేదు. ఒంటి సత్తువ ఉండి కూడా కష్టపడకుండా పరాన్నభుక్కులై ఒకర్ని పీడించి అయినా తమ పబ్బం గడుపుకొనేవారే ఎక్కువ ఈ రోజుల్లో. ఒంట్లో సత్తువ వున్నంతవరకూ కష్ట పడి పని చేయాలనుకునే ఆమె పద్ధతి నాకెంతో నచ్చింది. ఆమె నీడలో పెరిగే ఆ కుర్రాడికి కూడా అదే ధోరణి అలవడక తప్పదు. మరో రెండు మూడేళ్ళు పోతే ఆ కుర్రాడే సంపాదించుకుని ఆ ముసలిదాన్ని ఆదుకోవచ్చు. అందాకా ఆమె బతక్కపోదు. బుడ్డీమాని చూస్తే నాకు ఆశ్చర్యమే కాదు, గౌరవం కూడా కలుగుతుంది. కూరలకు వెళ్ళినపుడు పదో ఇరవయ్యో పైసలు ఆ పిల్లవాడి చేతిలో పెడుతుంటాను. కానీ మనసులో పిల్లవాడికి అడుక్కోవటం అలవాటు చేస్తున్నానేమోనని నాలో నేనే భయపడతాను.

ఆమె హిందూవో, ముస్లిమో తెలియదు. కూరలవాళ్ళు, గుడిసెలవాళ్లూ, 'బుడ్డీమా' అనే అంటారు అప్పుడప్పుడు తెలంగాణా యాస తెలుగు మాట్లాడినా 'ఉర్దూ'నే మాట్లాడుతుంది.

ఒకసారి మధ్యాహ్నం ఎవరింటికో వెళ్ళాల్సి వచ్చి బయల్దేరాను. మా ఇంటి దగ్గర్లోనే ఒక గవర్నమెంటు ప్రైమరీ స్కూలు ముందునుండి వెళ్తూ స్కూలుముందు 'బుడ్డీమా'ని చూశాను.

ఉడకబెట్టిన తెల్లదుంపలూ, వేయించిన గోల్డుపింగర్లూ బుట్టలో పెట్టుకొని అమ్ముతోంది. అప్పుడే స్కూలుకి ఇంటర్వెల్ అయినట్లుంది. పిల్లలు ఆవిడ చుట్టూ చేరి కొనుక్కుంటున్నారు. అది చూసిన తర్వాత ఆవిడపట్ల నాకు అభిమానం, ఆసక్తి ఇంకా ఎక్కువయ్యాయి. కూరలు అమ్మిన డబ్బులతో ఇవి కొని అమ్ముతుందను కుంటాను. వచ్చిన డబ్బుతో రొట్టెముక్కో, ఏదో కొనుక్కొని

వాళ్ళిద్దరూ కడుపు నింపుకుంటారేమో! ఆ చుట్టుపట్ల గుడిసెలవాళ్లుకూడా కలిగిన దాంట్లోనే మిగిలినది ఆవిడకి పెడతారేమో! అవిడకూడా వాళ్ళకి ఏదో సాయం చేస్తూనే ఉంటుంది.

నాకు ఏమాత్రం ఖాళీ సమయం దొరికినా బుడ్డిమా జీవన విధానాన్ని గమనించటం ఒక అలవాటై పోయింది.

ఆ పిల్లవాడు స్వంత మనవడో, చేరదీసినవాడో అయినా ఒక నిమిషం ఆమెని వదిలిపెట్టి వుండడు. వాడేకాదు, మిగతా పిల్లలుకూడా చుట్టూ చేరుతూనే ఉంటారు. వాడు తప్ప ఆమెకెవరూ బంధువులైతే లేనట్లుంది. ఎందుకంటే, రాత్రివేళ ఆ పిల్లాడితో కలసి అక్కడే కిరాణాషాపు అరుగుమీద పడుకుంటుంది.

వర్షంపడినప్పుడూ, మంచి చలిరాత్రుళ్ళలోనూ ఆ చుట్టుపక్కల గుడిసెల వాళ్ళే వీళ్ళకి కూడా తలదాచుకోవటానికి స్థలం యిస్తారనుకుంటాను. ఆ రోజుల్లో కనిపించదు.

ఒకరోజు మా కాలనీ హౌసింగు సొసైటీ నెలసరి సమావేశం ఏర్పాటు అయింది. ఆయనకి తీరికలేకపోతే నేనే వెళ్ళాను. సాధారణంగా ఆ సమావేశాలకు తరచుగా నేనే వెళ్తుంటాను.

యథాప్రకారం గుడిసెల వాళ్ళు కలిగించే న్యూసెన్సు గురించి కొంత మంది చర్చించారు.

''బరఫ్ అంటూ వస్తుంటారు. బయట చెప్పులో, ఏవో ఎత్తుకు పోతుంటారు'' అంది ఇంజనీరుగారి భార్య.

''ఎంతో ముచ్చటపడి గార్డెను పెంచుకుంటున్నామా? ఎప్పుడొచ్చి పాడు చేస్తారో కానీ తడికల్లోంచి, గేట్లలోంచి చేతులుపెట్టి ఆకులో మొగ్గలో అందినంత మేరా తుంచి పోస్తుంటారు'' అన్నారు రిటైర్డు అడ్వకేటుగారు.

"రోడ్డు కూడా చాలా కంగాళీ చేస్తున్నారండీ బాబూ!" మరో పెద్దాయన.

ఇలా ఎన్నో....

ఆ స్థలం నిజానికి మా కాలనీ సొసైటీకి చెందినదేనట. వాళ్ళు ఆక్రమించి గుడిసెలు వేసేశారట. దాని గురించి చాలా ఏళ్ళుగా కోర్టులో కేసు నడుస్తూనే ఉంది. అది తేలటం లేదు. ఇక్కడ గుడిసెలు పెరుగుతూనే ఉన్నాయి.

ఈసారి ఎలాగైనా కేసు తేలేటట్లు చేసుకోవాలనీ, ఎంత డబ్బయినా పర్వాలేదనీ, ఈ న్యూసెన్సు భరించటం తమ తరం కాదనీ అందరూ కలసి తీర్మానం చేశారు.

అది కాకుండా సొసైటీకి కొంతమంది పూర్తిగా సొమ్ము కట్టలేదనీ, కట్టని వాళ్ళని సాధ్యమైనంత తొందరలో కట్టమనీ హెచ్చరించారు.

నేను అటెండెన్సుకోసం అన్నట్లు వెళ్తుంటానే గానీ అంతకన్నా ఎక్కువేమీ మాట్లాడను. ఎందుకంటే, నలుగురిలోనూ కలువలేని మనస్తత్వం ఒకటీ, నా ఒక్కదాని అభిప్రాయం చెప్పటం వలన ఫలితం ఉండదని మరొకటీ.

సొసైటీ సెక్రటరీ సప్లై చేసిన టీ, బిస్కట్లు పూర్తిచేసి ఇంటికి వచ్చేశాను.

ఆ రాత్రి "ఏమిటీ మీటింగు విశేషాలు?" అని అడిగిన శ్రీవారితో టూకీగా చెప్పాను "షరా మామూలే" అని.

ఆ వేసంగిలో మేము ఆడబడుచు కూతురి పెళ్ళికి వెళ్ళినప్పుడు, అక్కడ నుండి ఆయన అన్నదమ్ములంతా కలసి స్వంతవూరు వెళ్ళి అక్కడ అమ్మకానికి పెట్టిన పిత్రార్జితమైన ఇల్లూ స్థలం అమ్మకం కూడా సెటిల్ చేసుకున్నారు. ఆ పంపకాలన్నీ పూర్తిచేసుకొని ఆయన హైదరాబాదు వెళ్లిపోయారు. నేను మాత్రం పాపతో ఆ చుట్టుపట్ల వూళ్ళలోని దగ్గర బంధువుల యిళ్ళకు చుట్టరికాలు పూర్తి చేసుకొని, పుట్టింటికి వెళ్ళి ఓ వారం రోజులుండి తీరికగా ఓ యిరవై రోజులు దాటాక మళ్ళీ ఇల్లు చేరుకున్నాను.

రైలు దిగగానే స్టేషనుకు వచ్చిన శ్రీవారిని సొసైటీకి డబ్బు కట్టేశారో లేదో కనుక్కొని విశేషాలన్నీ అడిగేశాను.

ఇంక ఆటో ఎక్కిన తర్వాత ఆ శబ్దానికి మాటలు వినబడవులే అని మరి మాట్లాడలేదు.

మా కాలనీ మలుపు తిరిగేసరికి అంతటా శ్మశాన నిశ్శబ్దం ఆవరించి ఉన్నట్లనిపించింది. కారణంముందు గుర్తుపట్టలేకపోయాను. తర్వాత అర్థమైంది.

"ఏమిటండీ? గుడిసెలు ఏమయిపోయాయి? ఇంతసేపూ చెప్పనే లేదేమిటి?" అన్నాను ఆతృతగా.

"రోడ్డుమీద ఆ కబుర్లన్నీ ఎందుకు? ముందు ఇంటికి తాళం తియ్యి. తర్వాత మాట్లాడుకొందాం" అంటూ ఆయన ఆటో మీటరు చూసి డబ్బులు లెక్కచూసుకుంటున్నారు.

నేనేమీ మాట్లాడకుండా సామాను దింపాను.

"అమ్మా! బుడ్డీమా కనిపించడం లేదేమిటి?" అంది పాప.

"పద, ముందు ఈ బేగు పట్టుకో" అంటూ ప్లాస్టిక్ బుట్ట పాపచేతికి యిచ్చి ముందుకు తోశాను.

పాప యింకా ఏదో అడుగుతోంది, కానీ నా చెవుల్లోకి అవేవీ ఎక్కటం లేదు.

అడవిలా ఉన్న ఇల్లు చూసేసరికి ఇంక తర్వాత మాట్లాడుకోవచ్చని ముందు నడుము బిగించి పనిలో పడ్డాను.

సూట్‌కేసు మంచం కిందకి తోసి, పాపని గదులు ఊడ్చమని చెప్పి నేను వంటింట్లోకి నడిచాను, ముందు కాస్త కాఫీ తాగుదామని.

కాఫీకి పాలు స్టౌ మీద పెట్టి, గదులు కొంచెం సర్ది పాపని స్నానానికి పంపించాను. తర్వాత కాఫీ కప్పులు తీసుకొచ్చి ఆయన కొకటి యిచ్చి నేనూ కుర్చీలో కూర్చున్నాను.

''ఇక చెప్పండి'' అంటూ ఆయన ముఖంలోకి చూశాను.

''చెప్పేందుకేముంది? ఈసారి మన సొసైటీ వాళ్ళే కేసు గెల్చారట. గుడిసెలన్నీ బుల్‌డోజర్ తెచ్చి కూల్చేశారట. వీళ్ళందరికీ గడ్డి అన్నారం దగ్గర కాబోలు - ప్రభుత్వం పట్టాలిచ్చి స్థలాలిస్తా నన్నారట. మరి యిచ్చిందో లేదో తెలియదు. ఇదంతా నేనొచ్చే లోపలే జరిగిన విషయాలు, ప్రక్కాయన ద్వారా తెలిశాయి.''

ఆయన చెప్పేది పూర్తి కానిచ్చి ''మరి బుడ్డీమా ఎందు కెళ్ళిపోయింది, ఆవిడకి గుడిసె లేదుకదా!''

''ఆవిడ దగ్గర చచ్చు, పుచ్చు కూరలు కొనేది వాళ్ళే కాస్త గంజి కాసిపోసేదీ వాళ్ళే. వాళ్ళే లేనప్పుడు ఇక్కడ ఆవిడకి అర్చేవాళ్ళు కానీ తీర్చే వాళ్లుకానీ ఎవరుంటారు?

నేను ఏమీ మాట్లాడలేకపోయాను.

కాసేపు నిశ్శబ్దంగానే ఉండి తిరిగి ఆయనే అన్నారు: "కూల్చేసిన గుడిసెల రాళ్ళలోంచి ఇనుపరేకు ముక్కలవీ ఏరుకొని ఎక్కడో అమ్ముకొని

వచ్చేది. కాని, ఎప్పుడో ఏ తుప్పుపట్టిన రేకుముక్కో గుచ్చుకుందేమో - సెప్టిక్ అయి ముసలి ప్రాణం కావటంతో నిమిషాల మీద ముంచుకొచ్చేసింది. మునిసిపాల్టీ వాళ్ళకి కబురు పెట్టి శవాన్ని తీయించేశారు. పిల్లాడు అప్పటినుండీ ఏమయ్యాడో కనిపించటం లేదు.

కథలా ఆయన చెప్తున్నది వింటుంటే తాగుతున్న కాఫీ మింగుడుపడలేదు.

ఆ తర్వాత కూడా చాలా రోజుల వరకూ మర్చిపోలేకపోయాను. కిటికీలోంచో, డాబా జాలు దగ్గర నుంచున్నప్పుడో ఆ గుడిసెలు ఉండే స్థలం చూస్తుంటే అదంతా రక్తం కళ్ళాపు చల్లినట్లు ఎర్రగా కనిపించి ఒళ్ళు జలదరించేది. డాబా జాలు దగ్గర నిలబడటమే మానేశాను.

ఆ స్థలాన్ని పార్కుగా అభివృద్ధి చేయాలని నిర్ణయించి బాగు చేయించి మొక్కలవీ వేస్తున్నారు.

అయిదారు నెలల తర్వాత ఒకసారి స్నేహితురాలితో సినిమాకు వెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు బస్టాపులో బస్సుకోసం ఎదురుచూస్తూ నిలబడి మాట్లాడుకుంటున్నాము.

అకస్మాత్తుగా పాదాలను ఎవరో తాకినట్లు చల్లగా అనిపించింది. నా స్నేహితురాలు ''ఛీఛీ.... అవతలకిపో....'' అంది.

చటుక్కున కాళ్ళు జరుపుతూ చూశాను. పాకుతూ కొంచెం అవతలకి జరిగి ''అమ్మా.... పైసా'' అన్నాడు ఓ పిల్లవాడు.

నా కళ్ళు ఆ పిల్లాడినీ, నలిగిపోయి వేలాడిపోతున్న వాడి కాళ్ళనీ చూస్తున్నాయి.

కానీ నోటి నుండి మాట పెగల్లేదు. ఎందుకంటే - నా గుండే కాదు, నా ఒళ్ళంతా మంచుగడ్డలా చల్లబడిపోయింది.

ఆ పిల్లాడు బుడ్డిమా దగ్గర ఉండే కుర్రాడు!

వాడి కాళ్ళు నలిగి మెలికలు తిరిగి వేళ్ళాడిపోతున్నట్లుగా ఉన్నాయి.

ఏ స్కూటరు కిందన్నా పడితే కాళ్ళు విరిగాయి కాబోలు. లేకపోతే, చేరదీసిన వాళ్ళే అడుక్కోవటానికై వాడిని .... అపై ఆలోచించటానికే నాకు భయం వేసింది.

*

# జారిన మల్లెలు

—శారదా అశోకవర్ధన్

"అమ్మా! అన్నం పెట్టు. మళ్ళీ వెంటనే ఆఫీసుకి వెళ్ళిపోవాలి" హడా వుడిగా లోపలికొస్తూ అన్నాడు హరీష్. "ఏమిట్రా ఆ తొందర. తిండికూడా కడుపునిండా తినడానికి నీకు టైము లేదంటావు. ఏం పిల్లాడివో ఏమిటో. ఎన్ని సన్లున్నా, తిండి దగ్గర తొందరైతే ఎలా? ఆ తినే నాలుగు మెతుకులూ నెమ్మ దిగా తినవాయె" అనుకుంటూ వొచ్చి కంచం, గ్లాసూ పెట్టి, వడ్డన మొదలె ట్టింది రామాయమ్మ.

"ఏది శ్రేష్ఠ, కనబడదేం?" అడిగాడు హరీష్.

"ఇప్పటివరకూ ఇక్కడే వుందే! నీతో తిందామని ఇప్పటివరకూ భోంచెయ్యకుండా కూర్చుంది. పాపం, చూసి చూసి నువ్వెంతకీ రాకపోయేసరికి ఇందాకే తింది. అమ్మాయ్ శ్రేష్ఠా....శ్రేష్ఠా...." పెద్దగా పిలిచింది రామాయమ్మ హరీష్‌కి కూర వడ్డిస్తూ.

"ఆఁ....ఆ!....చాలు.... అటు బెడ్‌రూంకేసి చూస్తూ నా కంచంలో వడ్డి స్తున్నావ్, ఎంత వేసేసేవో చూడు.... అబ్బ ఇదంతా ఎలా తినాలి?" అన్నాడు పళ్ళెంకేసి చూస్తూ హరీష్.

"ఒరేయ్! అదేం కూరో చూసే అంటున్నావా ఆ మాట? నీకు ఎంతో ఇష్టమయిన గుత్తొంకాయ కూర...."

"ఓ.... మరింకేం? అంతా లాగించేస్తా! నీ కోడలు చేసిందా? నువ్వు చేశావా?" అన్నంలో కూర కలుపుకుంటూ అడిగేడు.

"ఎవరు చేస్తే ఏమిరా.... తిని బాగుందా లేదా చెప్పు" నవ్వుతూ అంది ఆమె,

"అహఁ....నువ్వు చేస్తే అసలు బాగుండదన్న ప్రశ్నే లేదుగా...." ముద్ద నోట్లో పెట్టుకుంటూ అన్నాడు.

''అంతా నీ ఊహ....మొన్న నువ్వూరెళ్ళినప్పుడు కోడలు వంట చేసింది. ఎంత బాగా చేసిందనుకున్నావ్. మీ నాన్నే భోంచేస్తూ నాకసలు వంటేరాదు పొమ్మన్నారు" అంది కొడుకు కంచంలో మరింత కూర వడ్డిస్తూ.

"ఏమో! నేను ఎక్కడ తిన్నా నీ వంట రుచిరాదు. ఆఁ....పెరుగేసెయి" అన్నాడు హడావుడిగా గడియారం చూసుకుంటూ.

వీరి సంభాషణంతా వింటూన్న శ్రేష్ఠముఖం ఎఱ్ఱ మందారంలా గైంది. ఒళ్ళు వేడి సెగలు కక్కుతూన్నట్టుగా అనిపించింది. గబగబా వెళ్ళి మంచం మీద పడుకుని కళ్ళుమూసుకుంది. భోజనం పూర్తిచేసి గదిలో కొచ్చి, భార్య పడుకుందనుకని చప్పుడు చెయ్యకుండా వెళ్ళి ''అమ్మా....వెళ్ళొస్తాను. సాయంత్రం ఆరూ ఆరున్నర కల్లా వొస్తాను.'' అంటూ వెళ్ళిపోయాడు హరీష్.

తలుపు గడియవేసి, కోడలు గదిలోకెళ్ళి ఆమె పడుకునుండడం చూసి, వెనక్కెళ్ళి ఆరోజు శనివారం కావడంవల్ల రాత్రి టిఫిన్ ఏర్పాట్లు చేస్తూ వుండి పోయింది రామాయమ్మ, మినపరొట్టె కోసం పప్పు రుబ్బుతూ.

రామాయమ్మగారిని చూడగానే ఎవరికైనా రెండుచేతులూ ఎత్తి నమస్కరించాలని పిస్తుంది. పచ్చటి శరీరచ్ఛాయ, కళ్ళనిండుగా కాటుక, పావలా కాసంత బొట్టూ చక్కటి తలకట్టూ నిండైన చిరునవ్వు, స్త్రీత్వం పుట్టిపడేలా అనిపిస్తుంది. మంచి విగ్రహ పుష్టేకాదు-మంచి గంధంలాంటి మనసు కూడా ఆమెకు భగవంతు డిచ్చిన వరం. అందుకే ఆమెను చూడగానే అందరికీ దండం పెట్టాలనిపిస్తుంది. ఆ చుట్టు ప్రక్కల ఆ వాడలోవున్న పిన్నా పెద్ద అందరూ ఆమెకు ఆప్తులే. 'వొదినా' అని కొందరూ అక్కాఅని కొందరూ 'పిన్నీ'అని కొందరూ-అలా వరసలు కలిపేసి క్షణంలో ఆమెకి చేరువవుతారు. చివరకి చిన్న పిల్లలు కూడా. బొమ్మల పెళ్ళిళ్ళు చెయ్యాలంటే తాటాకు బొమ్మలు చెయ్యడానికి, తాటాకు బుట్టల దగ్గరి నుంచి, ముస్తాబు చేసేందుకు పాత గుడ్డలూ, బొట్టూ, కాటుకా మాత్రమే కాకుండా, పప్పు బెల్లాలు, పిండి వంటలూ కూడా ఆమె తయారు చేసిచ్చేది. పిల్లలందరికీ ఆమె అమ్మమ్మో బామ్మో అవుతుంది.

''నీ ఓపిక్కే మెచ్చుకోవాలి రామాయమ్మా'' అనేవారు తోటివారు. ''ఊరి పిల్లలందరికీ ఇంత చేస్తావ్.... నీ సొంత మనవడో మనవరాలో ఒస్తే

ఇంకా ఎంత చేస్తావో.... అసలు కింద కాలు పెట్టి నడవనిస్తావా? ఇంతకీ ఆ వొచ్చే కోడలు అదృష్టవంతురాలు అనేవారు "తల్లిలాంటి అత్త దొరకడం అదృష్టం కదూ! ' అనేవారు చిన్నవారు. కోడలు నెల తప్పిందని తెలుసుకుని మురిసిపోతూ, ఊళ్ళో వాళ్ళ మాటలు తలుచుకుని మురిసిపోతూ పప్పురుబ్బడంలో నిమగ్నమయిపోయింది రామాయమ్మ.

'మినప రొట్టంటే హరీష్‌కి ప్రాణం. దాన్లో నంచుకోవడానికి ఉల్లిపాయ పచ్చడి చేస్తే వాడికి పంచ పరమాన్నాలు తిన్నంత ప్రీతి. ఆయనా అంతేగా! రామూ! మళ్ళీ ఎప్పుడు చేస్తావ్ మినప రొట్టె అనేవారు చేతులు కడుక్కుంటూ, ఆ పూట తిన్న వెంటనే వెంకట్రావుగారు. ఆయనకి భార్య వంట ఎంత ఇష్టమో భార్యంటే అంతకు రెట్టింపు ఇష్టం. ఆమె పంచే మమతానురాగాలు బొండు మల్లెలకన్నా ఇష్టం. కాపురానికొచ్చినది మొదలు ఇంట్లో ప్రతీవాడికీ తల్లో నాలుకలా మెలుగుతూ మంచిపేరు తెచ్చుకుంది. ''కోడలంటే నా కోడలే. మేలిమి బంగారం!'' గొప్పగా చెప్పుకునేది ఆమె అత్తగారు సూరమ్మగారు. అయితే వారికొచ్చిన సమస్యల్లా పెళ్ళయి పదేళ్ళు కావొచ్చినా రామాయమ్మ కడుపు పండకపోవడం.సూరమ్మగారు చెయ్యని పూజ లేదు, మొక్కని దేముడు లేడు.

ఏ నోటి వరమో, ఏ పూజా ఫలితమో పధ్నాలుగు సంవత్సరాల తర వాత వాళ్ళింట్లో పాపాయి పలికింది. హరీష్‌ని పువ్వుల్లో పెట్టి పెంచారు. సూరమ్మ కడుపు నిండిపోయింది. బంగారు మొలతాడు, మామిడి పిందెల గొలుసు, రెండు చేతులకీ మురుగులూ, కాళ్ళకి మువ్వలూ అచ్చు అంబాడే బాల కృష్ణుడిలా వుండేవాడు హరీష్. ఆమె హరీష్‌కి మూడోనెల రాగానే ముద్ద కుడుములు చేయించి ఊరంతా పంచింది. పాకుతూంటే పాయసం, అడుగులేస్తే అరిసెలు సంతర్పణ చేయించింది. పగలంతా హరీష్ సూరమ్మగారి ఒడిలో రాత్రిళ్ళు రామాయమ్మ పక్కలో. అందరికీ ఆరోప్రాణం హరీష్. హరీష్ పలుక నేర్చాక, నడక నేర్చాక, చేతికర్ర విసిరి అవతల పారేసింది. గుడికి వెళ్ళే టప్పుడు వాడు ఆమెకి తోడు. బడికి వెళ్ళేటప్పుడు ఆమె వాడికి తోడు. ఊళ్ళో పిల్లలందరూ వొచ్చి వాళ్ళింటి ముందు ఆడాలి. హరీష్ ఆటకి వెళ్ళినా ఎప్పుడైనా ఆమె ప్రాణం కొట్టుకుపోయేది. వాడాడింది ఆట, పాడింది పాట. వాడికేం కావాలన్నా సిఫారస్ చెయ్యడానికి బామ్మ ప్రత్యక్షం. బామ్మ మాటంటే జడ్జిమెంటే మరి!

"అత్తయ్య మరీ గారాబం చేసి వాణ్ణి పాడు చేస్తున్నారు" అనేది రామాయమ్మ.

"ముద్దుకైనా హద్దుండాలి" అనేవారు వెంకట్రావుగారు.

"హద్దులూ, ఎల్లలూ లేనిదేరా బామ్మా మనవళ్ళ ప్రేమ. అని బామ్మయి నువ్వు తాతయిననాడు తెలుస్తుంది ఈ తీపి. చెబితే అర్థంకాదు" అంటూ వెళి హరీష్‌ని ఎత్తుకుని కూర్చునేది.

పప్పు రుబ్బుతున్నంత సేపూ, గతం మనసులో నలిగిపోయింది. ఊహాలు తుమ్మెదల్లా మనోపుష్పం మీద వాలిపోయాయి, ఆలోచనల పుప్పొడిని ఆరగిస్తూ అనురాగపు లేయందనాన్ని గ్రోలుతూ!

* * *

ఆరు దాటుతూన్నా శ్రేష్ఠ లేవలేదు. "అమ్మాయ్! వొంట్లో బాగులేదా? అబ్బాయొచ్చేవేళయింది లే!" అంటూ లేపింది రామాయమ్మ.

సమాధానం చెప్పకుండా లేచి బాతురూంలోకెళ్ళి మొహం కడుక్కొచ్చింది శ్రేష్ఠ.

"వొంట్లో నలతగా వుందేమో కనుక్కో. మందేమైనా కావాలంటే చెప్ప నేపట్టుకొస్తా, వాడొచ్చేసరికి లేటవొచ్చు" అన్నారు వెంకట్రామగారు.

''ఏమీ అక్కర్లేదు'' ముక్తసరిగా జవాబు చెప్పింది శ్రేష్ఠ.

మాటల్లోనే హరీష్ రావడంతో ఎవరి పనుల్లో వాళ్ళు నిమగ్నమయి పోయారు రామాయమ్మ వెంకట్రావుగార్లు. హరీష్‌ని చూడగానే మళ్ళీ మంచ మెక్కింది శ్రేష్ఠ.

"శేష్ఠా.... అమ్మాయ్...." పిలిచారు వెంకట్రావుగారు.

''అబ్బబ్బబ్బబ్బబ్బ.... చంపేస్తున్నారు. ఏమిటో ఆ గావు కేకలు?'' విసుక్కుంటూ అటునుంచి ఇటు తిరిగి పడుకుంది శ్రేష్ఠ.

''నాన్నగారు పిలుస్తుంటే వెళ్ళవేం?'' అడిగేడు హరీష్

''పిలుస్తారు. పొద్దుగూకులూ, మీ నాన్నా అమ్మలకి సమాధానం చెప్పడమే నా ఉద్యోగం." కసురుకుంది శ్రేష్ఠ.

''ఓస్! అదీ కష్టమేనా?'' నవ్వేడు హరీష్.

మరొకప్పుడు అయితే ఆ నవ్వుతో శృతి కలిపేది శ్రేష్ఠ. కానీ ఈరోజు కాలిపోతున్న మనసుకి ఆజ్యం పోసినట్టుంది ఆ పిలుపు! అందుకే జ్వాలల్లో దహించేస్తున్నట్టుంది ఆ పిలుపు.

''ఏమిటే! ఒకసారి మీ అత్తయ్య పిలుపు. మరోసారి మీ మామయ్య పిలుపు. ఈ ఛాదస్తపు శాల్తీలతో ఎలా వేగుతున్నావే బాబూ! ఇరవైలోనే అరవైలావున్నావ్'' అంది లిపిస్టిక్‌ని చిన్న అద్దంలో చూసుకుని కర్చీఫ్‌తో సరి చేసుకుంటూ తన ఫ్రెండు నిత్య.

ఇప్పుడా మాటలు గబుక్కున జ్ఞాపకమొచ్చాయి.

ఆమెలో దాగివున్న కోపం పడగవిప్పి బుసలుకొట్టింది.

"అమ్మాయ్ శ్రేష్ఠా......."

"నాన్నగారు పిలుస్తుంటే వెళ్ళవేం?" బట్టలు మార్చుకుంటూ అడిగేడు హరీష్ కొంచెం హెచ్చు స్వరంతో.

"పిలవగానే పరుగెత్తడానికి నేనేం పనిమనిషినా? క్షణానికోసారి పిలుస్తారు పనున్నా లేకపోయినా.... మీరిప్పుడే ఇంటికొచ్చారు కదా! భార్యాభర్తలు ఏదో మాట్లాడుకుంటుంటారు. పిలవడమెందుకు అన్న జ్ఞానం వుండక్కర్లా!....అయినా, నేను పెళ్ళి చేసుకున్నది మిమ్మల్నా? వాళ్ళనా - పిలవగానే పరుగెత్తడానికి?"

''శ్రేష్ఠా....! నువ్వేనా మాట్లాడుతునది?" ఆమెకేసి ఆశ్చర్యంగా చూస్తూ అడిగేడు హరీష్.

''అవును నేనే! మిమ్మల్ని చేసుకుని నేనేం సుఖపడ్డాను? సరదాగా ఒక సినిమా కెళ్ళడం లేదు. ఒక షికారు కెళ్ళడంలేదు. ఎంతసేపూ మీరు మీ అమ్మ నాన్నల భజనచేస్తూ కూర్చుంటారు. మీ వెనక తందానా తానా అంటూ నేను. ఒక్కడే కొడుకు సుఖపడతావు అంటూ, వొచ్చిన సంబంధాలన్నీ వొదులుకుని మీకిచ్చి కట్టబెట్టారు. ఎమ్.ఏ. చదువుకుని అంట్లదానిలా ఇంట్లో కూర్చున్నాను. నా స్నేహితులందరూ హాయిగా ఉద్యోగాలు చేసుకుంటూ, జల్సా చేసుకుంటూ హాయిగా వున్నారు." కళ్ళు తుడుచుకుంటూ ముక్కు చీదుకుంది శ్రేష్ఠ.

ఆమె దగ్గరగా వెళ్ళి నవ్వుతూ ''శ్రేష్ఠా....హాయిగా వుండడం అంటే ఉద్యోగం చెయ్యడమేనా? మనకా అవసరం ఏముంది చెప్పు? అమ్మకి నాన్నకి

నేనంటే ఎంత ఇష్టమో నువ్వన్నా అంతే ఇష్టం. వారికి ఆడపిల్ల లేని లోటు నీ ద్వారా తీర్చుకుంటున్నారు. ఎందరికి అత్తవారిండ్లో ఆ స్థానం దొరుకుతుంది చెప్పు" అన్నాడు భుజాలమీద చేతులు వేస్తూ. అతని చేతులు తోసిపారేసింది శ్రేష్ఠ.

"నా మొహం ఇదీ ఒక అదృష్టమేనా? ఆ ముసలాళ్లు జలగల్లా పట్టుకుని పీక్కుతింటున్నారు" అంది. అంతే హరీష్ అరచేతి అయిదు వేళ్ళూ ఆమె చెంప కతుక్కుపోయాయి.

ఆమె కళ్ళంట జలపాతం ప్రవహించింది.

అప్పుడే శ్రేష్ఠ ఎంతకీ రాకపోవడంతో కొన్న మల్లెపూలు దోసిట్లో పోసుకుని లోపలికొస్తున్న వెంకట్రావుగారు, ఆ దృశ్యం చూసి చలనంలేని వారిలా దోసిలి ఒదిలేశారు. గాభరా పడ్డట్టుగా మల్లెలు గదంతా గంతులు వేశాయి.

వెంకట్రావుగారి గుండె ఆగిపోయినట్టయింది.

లోపల్నుంచి బయటికొచ్చి చూసిన రామాయమ్మగారికి ఆ దృశ్యం అర్థం కాలేదు.

"ఏమయిందండీ! ఈ పూలన్నీ ఇలా పడేశారేమిటి?" అంటూ దగ్గరగా వెళ్ళింది.

"కోడలికి నీకూ అని కొన్నాను. జారిపోయాయే" అన్నారు."పరవాలేదు. నేనురుతాలెండి" అంటూ ఒక్కొక్క పువ్వేతీసి ఏరింది రామాయమ్మ.

ఆమెకేసి తదేకంగా చూస్తున్న వెంకట్రావుగారు, "ఈ పువ్వుల్ని ఏరేవ్ గానీ జారిపోతున్న నవ్వుల పువ్వుల్ని ఎలా ఏరుతావ్!" అన్నారు ఆమెకేసి చూస్తూ ఆ మాటల్లోని అర్థం బోధపడక అతనికేసి అమాయకంగా చూసింది ఆమె.

"అవును రామూ! మనం కొన్నాళ్ళు ఎక్కడికైనా పోవాలి.ఎప్పటినుంచో కాశీ, రామేశ్వరం, గయా తీర్థయాత్రలకి వెళ్ళాలన్నావుగా. పద, తీసికెళతాను. మంచి రోజు చూడు" అన్నారు తను విన్నమాటలనీ చూసిన దృశ్యాన్నీ మర్చిపోవడానికి ప్రయత్నిస్తూ.

"చాల్లెండి. మనం తీర్థయాత్రలు చెయ్యడానికి ఇదా సమయం? ఎవరైనా వింటే నవ్విపోతారు. కోడలు ఇప్పుడు ఉట్టి మనిషి కూడా కాదు. పాపం ఏంపని చేసుకోగలుగుతుంది? దానికి ఏదైనా తినాలనుంటే చేసిపెట్టాలి. ఏడోనెలలో

శ్రీమంతం చెయ్యాలి. అప్పటికి మల్లెపూల కాలం అయిపోతుంది. అందుకని ఇప్పుడే పెద్ద పెద్ద పువ్వులు తెప్పించి మల్లెపూలతో వొంకీ జెడ వెయ్యాలి'' అంది చేతిలోని పూలని పళ్లెంలో పోస్తూ.

వెంకట్రావుగారు ఆమెకేసి జాలిగా చూసి నిట్టూర్చారు. రామాయమ్మ ఆ నిట్టూర్పెందుకో అర్థంకాక, అతని మొహంలోకి చూసింది.

అంతలో శ్రేష్ఠ వెక్కి వెక్కి ఏడుస్తూ, గట్టిగా అరుస్తూన్న హరీష్ గొంతు విని కంగారుగా అక్కడికి వెళ్ళింది రామాయమ్మ. ఆమె రావడం చూసి దభాల్న తలుపేసేసింది శ్రేష్ఠ. రామాయమ్మకి భూమి బద్దలయిపోతూన్నట్టని పించింది. కళ్ళు గిర్రున తిరిగాయి. అంతలో బయటి కొచ్చాడు హరీష్ తలుపు తెరుచుకుని. గడప దగ్గరనుంచున్న రామాయమ్మని చూసి "అన్నం పెట్టమ్మా..." అన్నాడు.

ఆ మాటలకి వెంకట్రావుగారు రామాయమ్మని చూసి ఏదో సైగ చేశారు శ్రేష్ఠ గదివైపు చూపిస్తూ. అర్థమయినట్టు తలూపింది రామాయమ్మ.

''నాకు కాళ్ళు పీకుతున్నాయి. నీ పెళ్ళాన్ని వడ్డించమను. అయినా పెళ్ళామొచ్చినా కూడా నన్ను వడ్డించమని అడుగుతావేమిట్రా చిన్నపిల్లాడిలా?'' అంది పక్కనున్న కుర్చీలో కూర్చుంటూ.

''అమ్మా.... నువ్వేనా ఇలా అంటూన్నది? శ్రేష్ఠ మాటలకి కోప మొచ్చిందా? అమ్మా! ఈ ఇల్లు ఒక అనురాగ కోవెల అందరికీ. నాన్నా, నువ్వు అందరికీ దేవతలతో సమానం. అటువంటిది, కన్నబిడ్డని నాకు మీకన్నా ఎవ రమ్మా ఎక్కువ? మీ ప్రేమని అర్థం చేసుకోలేని మూర్ఖురాలు శ్రేష్ఠ. పల్లె టూళ్ళో ఎక్కడో పుట్టి, ఎలాగో ప్రైవేటుగా పరీక్షలు కట్టి ఎమ్.ఎ. పాసయి, పదిమంది పిల్లల్లో తాను ఒక్కర్తిగా మధ్య తరగతి కుటుంబంలో పెరిగి, మీరు పంచే ప్రేమని అందుకుని అరిగించుకోలేని తెలివి తక్కువ మనిషి. అసూయతో స్నేహితురాలు చెప్పే మాటల్ని అర్థం చేసుకోలేక ఆచరించాలనుకుంటూన్న బుద్ధిహీనురాలు. దాని మాటలకేం? నువ్వొచ్చి అన్నం పెట్టు'' అంటూ కంచం దగ్గర కూర్చున్నాడు.

శ్రేష్ఠని రమ్మని బతిమాలింది రామాయమ్మ. అయినా రాలేదు శ్రేష్ఠ. ఆమె మూర్ఖత్వానికి మండిపడుతూ భోజనం చెయ్యకుండానే వెళ్లిపోయాడు

హరీష్. ఆ పూట అందరికీ పన్తే. ఎంతో సంతోషంగా చేసిన మినవరొాట్టె తమని చూసి నవ్వుతున్నట్టనిపించింది రామాయమ్మకి. ఎలాగో అందర్నీ వొప్పించి, కాస్త ఎంగిలిపడనిచ్చింది రామాయమ్మ-అలా పస్తుండడం ఇష్టంలేక.

యాత్రలకని దూరంగా వెళ్ళడం ఇష్టంలేక, ఇక్కడే దూరదూరంగా వుంటున్నారు దంపతు లిద్దరూ. కొడుకు ఆఫీసునుంచొచ్చే సమయానికి వీళ్ళు గుడి కెళ్ళిపోతారు. ఏ రాత్రికో వాళ్ళ భోజనాలయ్యాక ఇల్లు చేరుకుంటారు. "ఎందుకమ్మా ఇంత ఆలస్యం" అని అడిగితే "పురాణ కాలక్షేపం జరుగుతోంది బాబూ గుడి దగ్గర" అని చిన్న అబద్ధం చెప్పేవారు. నిజానికి గుళ్ళో కూర్చున్నంత సేపూ వాళ్ళ ఆలోచనలు హరీష్, శ్రేష్ఠా, పుట్టబోయే పాపాయి గురించే.

* * *

ఏడో నెల రాగానే పుట్టింటికి బయలుదేరింది శ్రేష్ఠ. శ్రీమంతం వేడుక పూర్తిచేసి తల్లితో పంపించేసింది రామాయమ్మ. శ్రేష్ఠ వెళ్ళిపోతూవుంటే రామాయమ్మ పడ్డ బాధ మరో మనసున్న మనిషికి తప్ప మాటలతో అర్థం కాదు. బయలుదేరి వెళ్ళినప్పటినుంచి రోజులు లెఖ్ఖపెట్టడం మొదలెట్టింది.

ఆమె మది నిండా కొత్త ఊహలు కొత్త ఊసులే, ఆ ఇంట్లో మళ్ళీ బుచ్చి హరీష్ వెలుస్తాడు. హరీష్‌కి సూరమ్మగారు చేయించిన మురుగులూ, బంగారు మొలతాడు, మామిడి పిందెల గొలుసు, కాళ్ళ గజ్జెలు చేతి ఉంగరాలూ అన్నీ అలాగే వున్నాయి అవన్నీ మళ్ళీ వాడికి పెట్టాలి. మూడో నెలలో ముద్ద కుడుములూ, పాకుతూంటే పాయసం, అడుగులేస్తే అరిసెలూ అన్నీ హరీష్‌కి జరిగి నట్టే జరగాలి. ఆ మాటే వెంకట్రావుగారితో అంది. ఆయన నవ్వుతూ "మనవడూ మనవడూ అంటున్నావ్! ఇవన్నీ మనమరాలైనా చేస్తావా లేక మనవడైతేనేనా?" అన్నారు. "మనమరాలైతే ఇంకా ఎక్కువ చేస్తాను. నా మెళ్ళో వున్న గొలుసు కూడా దానికే వేసేస్తాను. మనవడైనా, మనవరాలైనా ముద్దు ముచ్చట్లు ఒక్కటే కదండీ?" అంది ఆమె నవ్వుతూ. "ఎంత అచ్చరలచ్చలు విలువచేసే మాటన్నావే రామూ! నీ మనసు బంగారం" అన్నారు ఆమె తల నిమురుతూ. వాళ్ళిద్దరి అరవై ఏళ్ళ దాంపత్యంలోనూ, ఎన్నడూ దెబ్బలాడుకున్న రోజు కనీసం ఒక్కటైనా లేదంటే నమ్మశక్యం కాదు. ఎవరైనా దెబ్బలాడు కుంటూంటే ఎందుకు దెబ్బలాడుకుంటున్నారో కూడా వాళ్ళకి అర్థం కాదు. జన్మ జన్మల బంధం వారిది. అనురాగాల వారసత్వం వారిది. ప్రేమించడమే తెలుసు.

ప్రేమను పొందడమే తెలుసు. నాగరికత ముదిరిన కల్మష వాతావరణం కృత్రిమతత్వం వారికి అంటలేదు.

కాలచక్రంలో మరో మూడు మాసాలు గడిచిపోయాయి. ఒక శుభ ముహూర్తంలో పండంటి పిల్లాణ్ణి ప్రసవించింది శ్రేష్ఠ. రామాయమ్మగారికి పెద్ద నిధి దొరకినంత సంతోషం కలిగింది. పదకొండో రోజు నామకరణానికి వెళ్ళేటప్పుడు పిల్లాడికి నలుగుపెట్టి స్నానం చేయించాలని సున్నిపిండి విసిరించింది. మంచి ఆముదం, పుట్టతేనె, కస్తూరి మాత్రలు, అన్నీ ఒక సూటుకేసు నిండా నింపింది. కోడలి కోసం జడకుచ్చులు. నాగరం చేయించింది. వెంకట్రావుగారూ రామాయమ్మ పదోరోజునే శ్రేష్ఠ ఊరు చేరుకున్నారు.

శ్రేష్ఠనిచూడగానే గతుక్కుమంది రామాయమ్మ. శ్రేష్ఠ జుట్టు మెడలవరకూ కత్తిరించేసుకుంది. ఆమెకిద్దామని తెచ్చిన జడకుచ్చులూ నాగరం తనని చూసి హేళనగా నవ్వుతున్నట్టున్నాయి. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "చక్కటి నీలాలు, పిరుదుల దాకా వేలాడే జడ." నిట్టూర్చింది. మర్నాడుదయమే పిల్లాడికి స్నానం చేయించడానికి ఆముదం, సున్నిపిండి, మీగడా, వెన్నపూసా అంతా తయారు చేసింది. బాత్‌రూంలో రెండు పీటలు వేసి, వేడినీళ్ళు పెట్టుకుని కూర్చుంది, బాబునెత్తుకుని శ్రేష్ఠ గబుక్కున ఆమె చేతిలో నుంచి బాబుని లాక్కుంది. "ఇవన్నీ ఏమిటండీ చాదస్తం! బేబీ సోప్‌తో స్నానం చేయిస్తాను. ఈ గొడవంతా ఒద్దు. ఈ పిచ్చిపిచ్చివన్నీ ఇప్పుడెవ్వరూ చెయ్యరు. నాకిష్టం లేదు" అంది.

రామాయమ్మ నోరు తెరిచి గుడ్లప్పగించి చూస్తుండి పోయింది, మతిపోయినదానిలా. ఆమె కళ్ళనిండా నీళ్ళు నిండుకున్నాయి. గుండె బరువెక్కింది. పీటమీంచి లేచి వెళ్ళిపోయింది శ్రేష్ఠకి దారినిస్తూ.

'కిరీటి' అని పేరు పెట్టారు బాబుకి. "ఎన్నో కీర్తి కిరీటాలు సంపాదించి చిరంజీవిగా వర్ధిల్లు బాబూ!" అని ఆశీర్వదించి, ఆభరణాలన్నీ తొడిగింది బాబుకి రామాయమ్మ. "ఇవన్నీ వేయడమేమిటి పిల్లలకి అసహ్యంగా" అంటూ శ్రేష్ఠ వెంటనే అవన్నీ తీసేసింది. రామాయమ్మ గుండెల్లో మరో శూలం గుచ్చుకుంది. మరి కాస్సేపటికి,కంసాలిని పిలిపించి, పిల్లాడికి పెట్టిన నగలన్నీ కరిగించి, తను నెక్లెస్ చేయించుకోడానికి ఆర్డరిచ్చింది శ్రేష్ఠ. అది చూసిన రామాయమ్మకి గుండె ముక్కలు ముక్కలయిపోయింది. తన శరీరంలో ఒక భాగాన్ని కోసేసి

నంత బాధనిపించింది. గుండె బెరువై పోయింది. కన్నీళ్ళు జలజలా రాలేయి. శరీరంలోని శక్తంతా పోయినట్టు కుప్పగా కూలిపోయింది. ప్రేమా, అభిమానం, అప్యాయతా, మమకారం - ఇవన్నీ మనసున్న మనిషికి భగవంతుడు పెట్టిన శాపాల్లా అనిపించాయి. దీనంగా కూర్చున్న రామాయమ్మ భుజంమీద చెయ్యివేసి "రామూ! నువ్వలా కళ్ళ నీళ్ళు పెట్టుకుని దిగులుగా కూర్చుంటే నే చూళ్ళేను. పశుపక్ష్యాదులు కూడా వాటి ప్రేమని కొంతవరకే చూపిస్తాయి. మరి మనుషులుకూడా వాటిలాగే మారిపోతే సుఖం వుంది కదూ! మారే కాలంలో విలువలుకూడా మారిపోతున్నాయి. వాటి ప్రకారం మనం మారకపోతే ఆందోళనా, బాధతప్ప ఏమీమిగలదు." ఓదార్చారు. ఆయన గుండెలమీద తలపెట్టి తనివి తీరా ఏడ్చింది రామాయమ్మ. ఆ కన్నీటి తడికి తడిసి గుండె చల్లబడిందేమో- లేచి మామూలుగా పన్లు చేసుకుంది.

ఆ మర్నాడే తీర్థయాత్రలకని బయల్దేరారు దంపతులిద్దరూ, ఇంటి కెళ్ళడం ఇష్టంలేక. ఇంటి తాళాలు శ్రేష్ఠ చేతిలో పెట్టింది రామాయమ్మ. అమ్మా నాన్నా ఎందుకు వెళుతున్నారో తెలుసు. కానీ ఏమీ చెయ్యలేని పరిస్థితి. అటు తనని కన్నవారూ, ఇటు తను కన్నవారూ, కట్టుకున్నవారూ. మధ్యలో మనసు నలిగిపోయింది హరీష్‌కి. బరువెక్కిన గుండెతో కన్నీరు కనబడకుండా ముఖానికి చేతులడ్డం పెట్టుకుని రైలు కనుమరుగయ్యేవరకు చెయ్యూపుతూ వీడ్కోలు చెప్పాడు హరీష్. "ఇదే జీవితం! తెలుసుకో ఈ సత్యం!" ఎవరో చెబుతూన్నట్టుగా ఎక్కడినుంచో ఈ మాటలు వినిపించాయి, గుండె లోతుల్లోంచీ నరనరాలన్నుంచీ.

రైలు వెళ్ళిపోయింది. ఒక్కసారిగా జనం మటుమాయమైనట్టు స్టేషను నిశ్శబ్దంతో నిండిపోయింది. అడుగులో అడుగు వేసుకుంటూ హరీష్ తిరుగు ముఖం పట్టేడు జీవన సత్యాన్ని కనుగొన్న యోగిలా- మరో పాతికేళ్ళ తరవాత తన కొడుకు కిరీటి కూడా, తనలాగే తనని సాగనంపడానికి ఈ విధంగానే వచ్చే దృశ్యాన్ని ఊహించుకుంటూ!

*

# ఓ మంచి మనిషి కథ

—రాజ్యలక్ష్మి పోలాప్రగడ

మేడలూ, డాబాలూ పెంకుటిళ్లూ, పూరిళ్ళూ ఇలా వివిధమైన అంతస్తుల్లో కాపురాలు సాగిస్తూ ఉంటారు లోకంలో కదా?

మహల్సులో ఉండే జమిందారీ కాపురాల సంగతి అసలు తలచుకోవద్దు. అయితే ఇంతకీ మన కథ - అదే మంచి మనిషి కథకి వద్దాం ఇది కథా నిజమా అనే సంగతి మీరు నిర్ణయించవలసిన విషయమే.

సీతారామ్ ఓ చిన్న గుమస్తాగిరీ చేస్తున్నాడు కరెంటు ఆఫీసులో.

రెండు గదుల అద్దెఇల్లు. పొట్టిగా పీలగా ఉండే అతని భార్య. ఇద్దరు కూతుళ్ళును,

ఆఫీసులో సీతారామ్ అంటే అందరికీ ఇష్టమే ఎందుకనుకున్నారు?

ఆఫీసులు ఉన్న స్టాఫుకి ఎవరికి ఏ సమస్య వచ్చినా? ఇతనికే చెపుతారు. సీతోనే ఉంది. నువ్వు తలుచుకుంటే వెంటనే ఈ పనిఅయి తీరుతుంది అంటారు. పొగుడుతారు. మరోసారి బతిమాలుతారు. ఎలాగో అలాగ సీతారామ్‌కి పనులు అప్పచెప్పి హాయిగా వారంతా పేకాట అయినా వేస్తారు. లేకపోతే సినిమాకి వెళతారు. లేదా రెస్టు తీసుకుంటారు.

ఎటువంటి పనులనుకుంటున్నారు?

సీతారామ్‌కి చెప్పేవి ఒకటా, రెండా వారి సమస్యలన్నీ ఇన్నీ కావు.

ఒకరికి ఇల్లు అద్దెకి చూసి పెట్టడమే. మరొకరికి ఇంటి స్థలం కొని పెట్టడమే, ఇంకొకరికి అమ్మాయికి పెళ్ళి కొడుకుని చూసి పెట్టడమే.

ప్లీజ్! మావాడికి కాలేజీలో సీటు గురించి ప్రయత్నించవూ? అంటూ అతన్ని అన్నం తిననివ్వరు. పెళ్ళాం బిడ్డలతో సుఖంగా కాలక్షేపం చెయ్య నివ్వరు. పాపం- ఆఫీసు పనీ, ఆ తర్వాత వీళ్ళందరి పనీను.

ఇలా కొన్నాళ్ళ అలవాటు అయినాక ఊరికే కూర్చోవడం అలవాటు పోయి గానుగ ఎద్దులాగా కష్టపడ్డమే జీవితధ్యేయం అయిపోయింది.

ఇంత కష్టపడుతున్నా - ఏమిటి? ఈ సీతారామ్‌కి పని అప్ప చెపితే సరిగా టైముకి చెయ్యలేక పోతున్నాడు? ఇదివరకూ ఇలాకాదు. సీతారామ్‌కి చెపితే వెంటనే పని అయిపోతూ ఉండేది అని స్టాఫ్ అంతా జేరి గుస గుసలు మొద లెట్టారు. ఓ రోజున—

సీతారామ్ వాళ్ళ దగ్గరకి వెళ్ళి, "సారీ సార్, రేపు తప్పకుండా మీ పని చేసిపెడతాను." అని దీనంగా పలికేవాడు. వాళ్ళు "సరే చూస్తాంగా, ఎంత గొప్పగా చేస్తావూను" అంటూ విసుక్కునేవారు.

సీతారామ్‌కి ఆ మాటలు ములుకుల్లా గుచ్చుకునేవి. ఛీ - ఈ వేళ నాకు ఎంత అవమానం జరిగింది వాళ్ళ మనసు ఎంత బాధ పెట్టాను. రేపు తప్ప కుండా వారి పని చెయ్యాలి - లీవు పెట్టేనా? అనుకుని ఒక్కసారి వాళ్ళ అమ్మను తలుచుకున్నాడు.

మంచి వాళ్ళను అమాయకులుగా చూసే రోజుల్లో పుట్టావు అని - పరోపకారం ఇదమ్ శరీరం అనీ, అందరితోటీ కలిసిమెలిసి, వసుధైక కుటుం బంలా మెలగాలనీ, స్వార్థంతో బ్రతికితే బ్రతుకు బరువు అవుతుందనీ, ఇలా ఎన్నో చెప్పేది, ఎంత తెలివి ఉన్నా. నివురుగప్పిన నిప్పులా ఉండాలనీ, ఇలా జ్ఞాపకం వచ్చి, తనని, తను పరిశీలించుకుని కొన్ని జీవిత సత్యాలు అలవరుచు కుని. తన మార్గమే రాజ మార్గమని తలుచుకుని, ఆఫీసులోనూ, ఇంట్లోనూ అందరికీ అనుకూలంగా, తనవల్ల ఎవరికీ ఇబ్బంది కలగకూడదు అనే నిర్ణ యంతో, మంచికి మారుపేరు సీతారామ్ అని అందరూ అనుకోవాలని, చాలా ఓర్పుతో, నేర్పుతో జీవిత నౌక సాగించసాగాడు.

అప్పుడప్పుడు సీతారామ్ భార్య ఛలోక్తులు వేస్తూ ఉంటుంది.

మీకు. సీతారామ్ అని రెండు మంచి పేర్లు కలిపి పెట్టారేమిటండీ, బాబూ, మీరు చేస్తున్న పనులు మంచివా అంటే మంచివే కాని కొంచెం స్వార్థ ంలండీ బాబూ అని అబ్బే ఆమె మాటలు అతని చెవికి వినిపించవు.

అతని ధ్యేయం ఎంతసేపు ఎవరికి ఏ సహాయం చేయాలా అని ఆలోచనే తప్ప. మరొక ధ్యాస లేదు.

ఆడపిల్లలు ఇద్దరూ డిగ్రీకి వచ్చారు. చదువుకుంటున్నప్పుడు కొంచెం ఇంగ్లీషు గ్రామర్ చెప్పండి అంది సీతారామ్ భార్య ఓ సారి. సరే చెప్పాలనే ఉంది కానీ.... నా స్నేహితుడికి ఇల్లు కట్టుకుందుకు లోన్ శాంక్షన్ అయింది. కాంట్రాక్టర్ని మాట్లాడాలి. అయినాసరే చెపుతాను అని కూర్చున్నాడు సీతారామ్ ఇబ్బందిపడుతూనేను.

అతను ఇల్లు కట్టుకుంటే మనకేం ఒరిగింది. రెండు గదుల అద్దె ఇంట్లో నానా అవస్థా పడుతున్నాం. జీవితాంతం ఒకర్ని చూచి సంతోషించవలిసిందే. మన బ్రతుకులు ఎదుగూబొదుగూ లేవు. కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ కిరసనాయిల్ స్టౌ మీద వంట సాగించింది. సీతారామ్ అది విని, భార్య మాటలకి, కలతబడ్డ మనసుతో అక్కడ ఉండలేక, ఆమెను మంచి మాటలతో మరిపించాలని దగ్గరగా వెళ్ళి, ఓ నల్లపిల్లా! ఓ నీలసుందరి నీ దిగులు నాకు తెలుసునే అంటూ నవ్వుతూ ఆమెని సుతారంగా తనవైపుకి తిప్పుకుంటూ, బుగ్గలు పుణికి. "నీ కోరికలు నాకు తెలుసును. అందమైన మేడలో ఆ ఎదురింటి ఇల్లాలా కాపురం చెయ్యాలనీ, కాలుకింద పెట్టకుండా కారులో షికార్లు పోవాలనీను. నీ మొగుడు గుమస్తా కాకుండా ఆఫీసరే కావాలనీను. ఇదిగో ఇలా చూడు, కోరికలు ఉండ వచ్చును కాని, మనం ఏనాడూ, ఎవరికి ఏమీ పెట్టుకోలేదు. ఈ జన్మలు రమ్మంటే ఎలా వస్తాయి చెప్పు? ఇలా ఊరికే బాధపడిపోక, చదువుకో. బి. ఏకి కట్టు. డైరెక్టు బి.ఏ. అయినావంటే రేపు నువ్వూ ఒక ఉద్యోగం చేయచ్చును. కాలక్షేపం అవుతుంది. కాస్త నా జీతానికి, నీ జీతం కలిపితే, మనకు కోరినవన్నీ కొనుక్కోవచ్చును" అన్నాడు సీతారామ్.

అతని మాటలు భార్యకి బాగానే నచ్చాయి. గోముగా తల ఊచింది, చిరునవ్వుతో ముఖం విలసిల్లింది. సీతారామ్ మనస్సున పున్నమినాటి వెన్నెల కురిసింది

సీతారామ్ ఆఫీసుకి వెళ్ళేటప్పటికి, ఏమిటి? ఈవాళ ఇంత ఆలస్యంగా వచ్చావు? ఆఫీసర్‌గారు నిన్ను పిలుస్తున్నారు అని కొలీగ్సు చెప్పారు. ఏమిట్రా భగవంతుడా, ఎప్పుడూ ఆలస్యంగా రానివాణ్ణి, ఎందుకు పిలిచాడో ఏమిటో, నూరు జ్వరమున్నా, ఆఫీసుకి వెళ్ళద్దు శలవు పెట్టండి అని భార్య చెప్పినా విన

కుండా, హాస్పిటల్‌లో ఆలస్యం అయిందని భయపడుతూనే వచ్చాను. అయినా వెళ్ళి కనుక్కోవాలి కదా? పాపం, ఎందుకు పిలిచారో అనుకుంటూ, ఆఫీసర్ రూమ్‌లోకి వెళ్ళాడు సీతారామ్.

"ఏమిటి, ఆఫీసుకి లేటుగా వచ్చావేమిటి?"

"జ్వరం వచ్చింది సార్."

"అయితే, సెలవు పెట్టకపోయావా?"

"సెలవులు అయిపోయాయి."

"అవును, అయిపోవూ? ఆఫీసులో అందరి పనులూ నువ్వే చూస్తావు. సెలవులు పెట్టి. సరే, కొంచెం రెస్టు తీసుకో, రీడింగు రూమ్‌కి వెళ్ళి" అన్నాడు.

"సరే సార్" అంటూ వెడుతున్న సీతారామ్‌ని పిలిచి-

"అసలు నిన్ను పిలించింది ఎందుకంటే - రాత్రింబగళ్ళు ఆఫీసు వర్కు అర్జంటుగా పూర్తి చేసావు కనుక, నాపై ఆఫీసర్ వచ్చి కాగితాలు అన్నీ చెక్ చేసినప్పుడు నన్ను ఎంతో మెచ్చుకున్నాడు. పైగా, నాకు ప్రమోషన్ వచ్చే ప్రయత్నం చేస్తానన్నాడు అది చెబుదామనీ, మా అమ్మాయికి నువ్వు చూపించిన సంబంధం కుదిరింది, నీ మేలు మరిచిపోనులే" అన్నాడు నవ్వుతూ ఆఫీసర్.

"అలాగా సార్, కొంచెం జ్వరంతో చలిగా ఉంది కాని, నేను ఇంకా సంతోషిద్దును సార్" అన్నాడు సీతారామ్, ఇబ్బందిపడుతూ. "భలేవాడివే, నాకు ప్రమోషన్ వస్తోందన్న సంతోషం కన్న, నీలాంటివాడు నేను వెళ్ళినచోట దొరకడని బాధపడుతున్నానోయి!" అన్నాడు, ఆఫీసర్. "అయితే, నేను ఇంక వెళ్ళవచ్చునా సార్?" అన్నాడు సీతారామ్ ఆఫీసర్ కేసి వినయంగా చూస్తూను.

కాలం చాలా విచిత్రంగా కదులుతూ ఉంటుంది. అన్ని కాలాలూ, అంతో కొంతో ఇబ్బందినీ పెడతాయి. సంతోషాన్నీ ఇస్తాయి. వర్షధారలు ఆకాశాన్నుంచి అందంగా కురుస్తూ ఉంటూంటే కవిగారి కలంనుంచి జాలు వారుతున్న కథలాగా, కవితలాగా బాగుంటుంది. కాని, జన సమర్థం లేక వీధులు అన్నీ బావురుమంటే ఏం బాగుండదు కదా?

అల్లాగే, ఎండలు మండుతాయి. నదులు అన్నీ ఎడారులవుతాయి, మళ్ళీ మల్లెల గుబాళింపుతో మలయమారుతం వీస్తూంటే, అంత హాయిగానూ ఉంటుంది మరి.

అలాగే, మనుష్యులలో మంచి గుణం, స్వార్థం రెండూ ఉంటాయి కదా?

మన సీతారామ్ కూడా ఆఫీసులో చేస్తున్న సహాయానికి కొందరు విమర్శిస్తున్నా, మరికొందరు పొగుడుతున్నారు. ఏదో ఒకటి చెయ్యాలి కదా కాలక్షేపానికి! పాపం, వారు అలా అలా ఆత్మస్తుతి పరనిందా లాంటి కబుర్లు చెప్పుకుని కాలక్షేపం చేస్తారు. వీరికి వీరే సాటి అనే ఆత్మవిశ్వాసంతో బ్రతికేస్తారు.

మరి సీతారామ్‌కి మాత్రం బొత్తిగా తీరిక ఉండదు. ఎక్కడ ఎవరి పని చేయకపోతే ఎవరు బాధపడతారో- అదీ అతని జీవిత ధ్యేయం. తన గురించి ఆలోచించుకోవడానికి కూడా తీరిక ఉండదు. ఇష్టముండదు అని కూడా చెప్పవచ్చును.

భార్య బి ఏ. పూర్తిచేసింది. కూతుళ్ళు ఇద్దరూ మాష్టర్ డిగ్రీ తెచ్చుకున్నారు. ఆవేళ ఆఫీసుకి వెళ్ళిన సీతారామ్‌కి ప్రమోషన్ వచ్చిందని ఆఫీసర్‌గారు చెప్పారు. ఆర్డరు కాగితం చేతికి ఇచ్చారు. అమ్మో! హైదరాబాదా? నా జీతం ఏం సరిపోతుంది? అని ఒకసారి భయపడ్డాడు. ప్రమోషన్ వచ్చిందన్న సంతోషం లేదు అతనిలో. అయినా, అందరి దగ్గర శలవు తీసుకున్నాక ఆఫీసులో కొలీగ్సు అంతా అన్నారు, నీకు ప్రమోషన్ వచ్చి నువ్వు వెళుతున్నావంటే సంతోషమే. మరి మా పనేంకాను? అని బాధపడ్డారు.

హైదరాబాద్ రాగానే ముందు ఇల్లు వెతుక్కోవడం కార్యక్రమం మొదలుపెట్టాడు. చిక్కడపల్లిలో వసతులు బాగుంటాయి అని కొన్ని ఇళ్ళు వెతికాడు.

ఒక ఇంటికి వెళ్ళేటప్పటికి, నువ్వా సీతారామ్! రా....రా అంటూ ఆప్యాయంగా పలకరించి, కాఫీ యిచ్చి, సంగతులన్నీ అడిగి చివరికి, 'నా ఇల్లు నీ ఇల్లు అనుకో' అన్నాడు ఆ స్నేహితుడు. నాకెన్ని సహాయాలు చేసిపెట్టావు? నేను మరచిపోలేదు. ఎప్పుడూ మనసులోనే మెదులుతావు అన్నాడు. సీతారామ్‌కి ఆనందం అయిపోయింది మా అమ్మాయి అమెరికాలో ఉంది. ఒక్కగానొక్క అమ్మాయి - పురుడు పొయ్యడానికి వెళ్ళుతున్నాం నా భార్యా నేనూ. నువ్వూ, నీ భార్యా ఇంట్లో ఉంటే మాకు ఇంటి భయం ఉండదు. కానీ అద్దె అఖ్ఖరలేదు. నేను తిరిగి వచ్చేటప్పటికి ఒక సంవత్సరం పడుతుంది అన్నాడు.

కారుంది. అప్పుడప్పుడు డ్రైవరు వస్తాడు. కాస్సేపు అలా తిరిగిరండి. అమెరికాలో అమ్మాయి కాపురం చల్లగా సాగుతోందంటే ఆ రోజుల్లో నువ్వు చూపించిన సంబంధమే అంటూ సీతారామ్‌ని పొగిడేస్తూ ఉంటే, కలా నిజమా

అని ఆనందపడిపోయాడు ఇప్పుడు సీతారామ్‌నీ, ఇల్లూ కారునీ చూసి, అదృష్ట వంతుడివి అని పొగిడేవారే అంతాను.

సీతారామ్ భార్యకి ఈ మధ్యన భర్త మీద అమితమైన ప్రేమ వచ్చింది.

ఆడపిల్లలు ఇద్దరూ తండ్రి అంటే ఎనలేని ప్రేమ. తాతనీ బామ్మనీ కూడా ఈ ఊరు తీసుకువద్దాం, ఆ పల్లెటూళ్ళో ఏం ఇబ్బంది పడుతున్నారో, ఏమిటో అంటూ జాలిపడ్డారు.

సీతారామ్‌కి తల్లినీ, తండ్రినీ తీసుకురమ్మన్నారనే టప్పటికి ఏనుగు అంత బలం వచ్చేసింది. ఆనందంతో గుండెలు నిండాయి.

సీతారామ్‌ని ఆఫీసులో అందరూ పొగడ్డమే- అందమైన ఆడపిల్లలు' చదువుకున్న వాళ్ళూను. నువ్వు ఎలా అయినా అదృష్టవంతుడివోయి అని.

పొగిడిన వాళ్ళే ఓ రోజున కబురు చేశారు- మీ అమ్మాయిల్ని మా అబ్బా యిలకి చేసుకుంటాము అని. ఇంటికొచ్చి, పెళ్ళి మాటలు మాట్లాడారు. ఈ రోజుల్లో ఇంత కుదురైన అమ్మాయిలు లేరండీ, అంటూ మరికొందరు, సీతా రామ్ మంచితనమే వచ్చిందని మరికొందరు.

ఇవన్నీ విని సీతారామ్ భార్య ఛలోక్తిగా అంది: "మాకు రెండు మంచి పేర్లు కలిపి పెట్టారండీ. ఉగ్గు పాలతో మంచితనం రంగరించి పోశారండీ! లేకపోతే ఈ రోజున ఇటువంటి స్టేజికి రాగలమా" అని మురిసిపోయింది, కళకళలాడే ముఖాన్ని అద్దంలో చూసుకుంటూను."ఇన్నాళ్ళకైనా మా అబ్బాయి మంచితనం తెలుసుకున్నావ్, అదీ మాకు సంతోషం" అన్నారు సీతారామ్ తల్లి తండ్రులు నవ్వుతూను, చలోక్తిగా. అప్పుడే అమెరికానుంచి వచ్చిన ఉత్తరం చదివి——

ఇంకా ఇంటివారు నాలుగు ఏళ్ళదాకా రావడం కుదరదు, నా ఇల్లు నీ ఇల్లుగా చూసుకో అని రాశారని, వాళ్ళకి అక్కడ గ్రీన్ కార్డు వచ్చిందనీ. "ఈ మేడా, ఈ కారూ అమ్మాయిలు ఇద్దరికీ ఇంతమంచి సంబంధాలూ రావడం దైవకృప అంతే" అంది ఆ మాటలు విన్న సీతారాం భార్య. ''అవునౌను కాదు మరీ. ఈవేళ మా ఆఫీసులో ఒకతను రిటైరౌతున్నాడు. పెన్షన్, కాగితాలూ, రెడీ చేశారో లేదో అర్జంటుగా వెళ్ళాలి" అని సీతారామ్ బయలుదేరి వెళ్ళాడు. అతని మార్గం, మంచితనం అందరికీ పంచు తండ్రీ! లోకంలో ఎన్నో సమస్యలు తీరుతాయి అని కోరుకున్నారు అతని తల్లితండ్రులూ, భార్యా పిల్లలూను- *

# గుడ్ బై టు మెర్విన్

## —కె.ఆర్.కె. మోహన్

ఆపరేషన్ మెర్విన్, భారత అమెరికా దేశాలు సంయుక్తంగా నిర్వహిస్తున్న ప్రాజెక్టు. దీని ఉద్దేశం ప్రధానంగా బుధ శుక్రగ్రహాలను పరిశోధించడం. బుధుడు సూర్యునికి అత్యంత సమీపంగా వున్న గ్రహం. గ్రహాలన్నిటిలోనే ప్లూటో తర్వాత ఇదే అత్యంత చిన్న గ్రహం. చంద్రుని కంటె కొద్దిగా పెద్దదైన ఈ గోళంలో నీరుకాని, గాలికాని బొత్తిగా లేవు సూర్యుని నుంచి భూమి తొమ్మిది కోట్ల మైళ్ళ దూరంలో వుంటే బుధుడు మూడుకోట్ల మైళ్ళ దూరంలోనే ఉన్నాడు. అందువల్ల అక్కడ సీసం కూడా కరిగిపోయేటంతటి వేడిమి. మన భూమిపైనుంచే సూర్యుని నేరుగా చూడలేం ఇంక బుధుని పైనుంచి సూర్యుని తీక్షణ ఊహకి కూడా అందనంతటి అధికంగా ఉంటుంది. అందువల్ల ప్రత్యేకమైన అద్దాలు ధరించకపోతే ఆ తీక్షణతకు కళ్లు పోతాయి. భూమి తన ఆకర్షణ శక్తితో చంద్రుని గాఢంగా బంధించివేసినట్లు సూర్యుడు కూడా బుధుని బంధించి వేశాడు. అందుకనే చంద్రునిలాగే బుధుడు కూడా సూర్యునివైపు ఎప్పుడూ ముఖాన్ని ఒక వైపునే ఉంచుతాడు. ఈ భాగంలో నిత్యమూ నిప్పులు చెరిగే ఎండ రెండవ వైపు కళ్ళు పొడుచుకున్నా కానరాని నిత్యచీకటి, మంచు కన్నా అతి తక్కువగా వుండే శీతలం.

బుధునికి ఇంచు మించు వ్యతిరేక పరిస్థితులు శుక్రగ్రహం మీద. దీని పరిమాణం ఇంచు మించు భూమి అంతే. అయితే, దీనిపై వాతావరణం మాత్రం భూమి మీద కంటే ఎన్నోరెట్లు ఎక్కువ ఉష్ణోగ్రత నాలుగు వందల డిగ్రీలపైన ఉంటుంది. ఈ వాతావరణంలో అతి స్వల్ప పరిమాణంలో నీటి ఆవిరివున్నా ఉపరితలంమీద నీరు భొత్తిగా లేదు. అక్కడ నిత్యమూ భయంకరమైన ఇసుక

తుఫానులు చెలరేగుతుంటాయి. అమిత ప్రమాణంలో ధూళి పైకి లేచి దట్టమైన మేఘాలుగా నిత్యము వాతావరణాన్ని కప్పి ఉంచుతుంది. ఫలితంగా ఎంతటి శక్తిమంతమైన టెలిస్కోపుల ద్వారా కూడా శుక్రోపరితలం మనకి కనిపించదు. శుక్రుడు సూర్యుని నుంచి సుమారు ఆరుకోట్ల మైళ్ళ దూరంలో ఉన్నాడు.

బుధ, శుక్రుల ఈ భౌతిక లక్షణాలు తెలిసినప్పుడు వాటిని గురించి పరిశోధించవలసింది ఏముంటుంది అని అనిపించవచ్చు. బుధగ్రహం మీద బొత్తిగా నీరూ గాలి లేకపోవడం వల్ల అది ఆవిర్భవించినప్పటి నుంచీ ఏవిధమైన మార్పులూ లేకుండా ఉంటుంది. గ్రహాలన్నీ ఒకే సమాజంలో ఆవిర్భవిందాయని శాస్త్రవేత్తల నమ్మకం. కనుక బుధ గ్రహాన్ని పరిశోధించడం వల్ల సృష్ట్యాదిలో భూమి ఎలా వుండేదో తెలుసుకోగల అవకాశం ఉంది. ఇక భూమికీ, శుక్రునికీ వున్న పోలికల మూలంగా, భూమికూడా ఒకప్పుడు శుక్రునిలాగా వుండి క్రమేపీ ఇప్పటిలాగా పరిణామం చెంది ఉండవచ్చునని కొందరు శాస్త్రవేత్తల విశ్వాసం. అందువల్ల శుక్రుని పరిశోధించడం వల్ల భూపరిమణాం గురించిన అనేక రహస్యాలు తెలియవచ్చునని వారి విశ్వాసం.

బుధ, శుక్ర గ్రహాలు అంటే మెర్క్యూరీ, వీనస్‌లకు సంబంధించిన పరిశోధనలు లక్షణంగా కలది కనుక దీనికి ఆ రెండు గ్రహాలకుదించిన పేర్లను కలిపి 'ఆపరేషన్ మెర్వీన్' అని పేరు పెట్టారు. ఈ ప్రాజెక్టు చేపట్టిన పరిశోధన మరొకటి కూడ ఉంది. అది సూర్యగోళానికి సంబంధించినది. సూర్యుని నుంచి సోలార్ విండ్, అల్ట్రావయొలెట్ కిరణాలు, గామా కిరణాలు వంటి ఎన్నో శక్తివంతమైన ప్రసారాలు వెలువడుతుంటాయి. అయితే, దట్టమైన భూవాతావరణం వీటిలో చాలా భాగాన్ని హరించి వేయడంవల్ల భూమిపై నుంచి వీటిని సమగ్రంగా పరిశోధించగలగడం అసాధ్యం. స్పేస్ స్టేషన్‌లద్వారా ఇట్టి పరిశోధనలను నిర్దుష్టంగా జరపవచ్చు.

బుధ, శుక్ర గ్రహాలను పరిశోధించే స్పేస్ స్టేషన్‌కు "మెర్వీన్'అని పేరు పెట్టారు. ఇందులో శాస్త్రజ్ఞులు నిర్ణీతకాలంవుంటూ పరిశోధనలు జరుపుతుంటారు. భూమినుంచి స్పేస్ షటిల్స్‌లో కావలసిన ఆహార పదార్థాలూ, శాస్త్రీయ సామగ్రి వంటి వాటిని వెంటతీసుకుని కొత్త శాస్త్రీయ బృందాలు స్పేస్ స్టేషన్‌కి వస్తూంటాయి. పాత బృందాలు అదే షటిల్‌లో పరిశోధనలకు సంబంధించిన రికార్డులను తీసుకుని భూమికి తిరిగి వెళ్తుంటాయి.

స్పేస్ స్టేషన్ మెర్విన్‌ను శుక్ర బుధ గ్రహాలమధ్య ఏర్పరచారు. ఈ రెండు గ్రహాల పరస్పర ఆకర్షణ శక్తి సమమయ్యే బిందువుకి కొంతదూరం శుక్రుని వైపుగా దీని కక్ష్యను రూపొందించారు. అందువల్ల అది శుక్రుని ఉప గ్రహం లాగా దాని చుట్టూ ఆ కక్ష్యలో పరిభ్రమిస్తుంటుంది.

ప్రస్తుతం మెర్విన్‌లో ఇద్దరు శాస్త్రజ్ఞులు ఉన్నారు. వీరు భారతదేశంలో షార్ కేంద్రానికి చెందిన డాక్టర్ రాంప్రసాద్, అమెరికాలోని నాసా కేంద్రానికి చెందిన ప్రొఫెసర్ విల్స్.

ఆ రోజున సూర్యగోళం గురించి పరిశోధనలు చేస్తున్న డాక్టర్ రాంప్రసాద్‌కి రాడార్ స్క్రీన్‌మీద ఏదో చుక్క కనిపించింది. అది అంతకు ముందు గమనించినది కాకపోవడంతో, ప్రొఫెసర్ విల్స్‌ని పిలిచి చూపించాడు.

వారు కంప్యూటర్‌ద్వారా, ఇతర పరికరాలద్వారా అదేమిటో గుర్తించారు. "మైగాడ్[1] ఇది మిటియోర్. ఈ ఉల్క మహావేగంతో ఇటే వస్తోంది. దీని వ్యాసం కొన్ని మీటర్లకంటే ఎక్కువ ఉండకపోవచ్చు. కాని, అంతటి వేగంతో ఈ అంతరిక్ష శిల వచ్చి గుద్దుకుంటే చాలు. మెర్విన్ నామరూపాలు లేకుండా నశిస్తుంది'' అన్నాడు విల్స్ ఆందోళనగా.

అంతరిక్షంలో ఇటువంటి ఉల్కలు అసంఖ్యాకంగా పరిభ్రమిస్తుంటాయి. కనుక అప్పుడప్పుడు ఇటువంటి ప్రమాదాలు ఏర్పడుతుంటాయి. అయితే, వాటిని వెంటనే గుర్తించి ఆటోమేటిక్‌గా అంతరిక్షంలోనే ఎదుర్కొనే మిసైల్స్ ఉంటాయి. ఇవి వాటిని పేల్చివేసి నుగ్గునుగ్గు చేయడమో లేదా పెద్దవైతే తమ తాకిడితో వాటి గమనమార్గం మారేటట్లుగానో చేస్తాయి.

ఆ ఉల్క అంతకంతకు చేరువవుతున్నట్లు రాడర్‌స్క్రీన్ చూపిస్తోంది. నిజానికి ఆ రేంజిలోకి వచ్చిన ఉల్కని అప్పటికే ఆటోమేటిక్ మిసైల్ వెళ్ళి ఢీకొని పేల్చివేయాలి. కాని, ఆ విధంగా జరగకపోవడంతో ఆ సిస్టెంను చెక్ చేయసాగాడు డాక్టర్ ప్రసాద్.

"ప్రొఫెసర్! ఉయ్‌ఆర్ ఔట్. ఈ ఆటోమేటిక్ సిస్టంలో ఏదో లోపం వచ్చింది. దాన్ని సరిచేసే లోపలే ఆ ఉల్క వచ్చి మన స్టేషన్‌ని గుద్దుకోవడం ఖాయం. ప్రావిడెన్స్ ఓన్లీ షుడ్ హెల్ప్ అజ్'' అన్నాడు డాక్టర్ రాంప్రసాద్ ఆందోళనగా.

ప్రొఫెసర్ విల్స్ ఒక్క క్షణం ఆలోచించాడు. వెంటనే శుక్రతలానికి వ్యతిరేక దిశలో మెర్విన్‌ని అంటివున్న రాకెట్‌ను ప్రేల్చాడు. ఒక్కసారిగా రాకెట్ పైభాగం నుంచి జ్వాల అంతరిక్షంలోకి ఎగసింది. దానికి వ్యతిరేక దిశలో అంటే శుక్రగ్రహం వైపుకి స్పేస్ స్టేషన్ కదిలింది. ఈ చిన్నరాకెట్ ప్రేల్చినందువల్ల మెర్విన్ కక్ష్యలో మార్పు రావడం కాని, శుక్రగ్రహ ఆకర్షణను ఛేదించుకొని వెళ్ళిపోవడంకాని జరుగదు. వేగంగా వెళ్ళే కారుకు, బస్‌కు సడన్ బ్రేక్‌వేస్తే ఎగిరిపడ్డట్లు ఒక జెర్క్ ఇస్తూంది, అంతే. అది శుక్రుని దిశగా సాగుతోంది. రాకెట్‌లోవున్న ఇంధనం ఖర్చయ్యేవరకు ఇలా జరుగుతుంది. ఆతర్వాత అవసరమైనప్పుడు శుక్రగ్రహం దిశగా జ్వాల వచ్చేటట్లు మరో రాకెట్‌ను ప్రేల్చి స్పేస్ స్టేషన్‌ను యథాస్థానానికి తీసుకువెళ్ళవచ్చు.

క్రియ, ప్రతిక్రియలు (యాక్షన్ అండ్ రియాక్షన్) ఎప్పుడూ సమానంగానూ వ్యతిరేక దిశలలోనూ ఉంటాయన్న న్యూటన్ సూత్రాన్ని అనుసరించి ఎప్పుడూ రాకెట్‌ను ప్రేల్చినప్పుడు దాని ఇంధన జ్వాలకు వ్యతిరేక దిశలో రాకెట్ పయనిస్తుంది. ఈ రాకెట్లు స్పేస్ స్టేషన్‌కి బిగించి వుంటాయి కనుక వాటితోపాటే స్పేస్ స్టేషన్‌కూడా ఆ దిశలో పోతుంది.

మహావేగంతో వస్తున్న ఆ ఉల్క స్పేస్‌స్టేషన్‌ని సూటిగా గుద్దుకుంటే అది సర్వనాశనం కావడం, వారిద్దరూకూడా అంతరిక్షంలో తునాతునకలైపోవడం ఖాయం. అందుకనే భయంగా చనిపోతాడనుకున్న రోగికి చివరి ప్రయత్నంగా గరళం పోసినట్లు ఈ విధంగా చేశాడు విల్స్.

మరికొద్ది నిమిషాలలో ఆ ఉల్క వచ్చి గుద్దుకుంటుంది. ఈలోగా స్పేస్ స్టేషన్ స్థానాన్ని మార్చగలిగితే, అదృష్టం బాగుంటే ఆ ఉల్క ప్రక్కనుంచి దూసుకుపోవచ్చు. అప్పుడు ప్రమాదంనుంచి బయటపడవచ్చు.

రాకెట్ జ్వాల శుక్రునికి వ్యతిరేక దిశలో ఉండేటట్లు పేల్చడంవల్ల స్పేస్ స్టేషన్ శుక్రుని వైపు ప్రయాణం మొదలుపెట్టింది. దీనికి శుక్రుని గురుత్వాకర్షణ శక్తికూడా కలియడంతో గిలకతో నీళ్ళ చేదను లాగినట్లు అది మరింత వేగం పుంజుకుంది. విల్స్ ఊహించిన విధంగానే మెర్విన్ శుక్రగ్రహంవైపు సాగింది తన కక్ష్యమార్చుకుని. కాని, ఈలోగానే భయపడిన ఉపద్రవం రానే వచ్చింది. ఉల్క మహావేగంగా వచ్చి స్పేస్‌స్టేషన్‌ని గ్రుద్దుకుంది.

అయితే,అప్పటికే మెర్విన్ స్థానం మారి ఉండడంవల్ల సూటిగా కాకుండా ఒక ప్రక్కనుంచి రాసుకుంటూ వెళ్ళిపోయింది. ఆ అదురుకి అకస్మాత్తుగా భూకంపం వచ్చినట్లు మెర్విన్ అటూఇటూ ఊగిపోయింది. ఆ తాకిడికి చివరి భాగం విరిగిపోయి అంతరిక్షంలోకి ఎగిరిపోయింది. ఆ భాగంలోనే రేడియో ఎక్విప్‌మెంట్ ఉంది. ఆహారం, నీరు ఎక్కువ భాగం అందులోనే ఉన్నాయి. భయంకరమైన తుఫాన్‌లో చిక్కుకునని కొయ్య ఓడలాగా శిథిలమైపోయింది ఆ స్పేస్ స్టేషన్ మెర్విన్.

షాక్ నుంచి తేరుకున్నాక తమ పరిస్థితిని పరిశీలించారు డాక్టర్ రాంప్రసాద్, ప్రొఫెసర్ విల్స్‌లు. ఆహారపదార్థాలు, నీరు చాలా తక్కువగా మిగిలాయి. అవి ఎంత జాగ్రత్తగా వాడుకున్నా, పది పన్నెండు రోజులు మించి రావు ఇంధనం కూడా చాలా తక్కువగా ఉంది. మామూలుగా స్థిర కక్ష్యలో తిరుగుతున్న స్పేస్ స్టేషన్‌కి ఇంధనం అవసరం ఇంచుమించు ఉండదు. గ్రహ ఆకర్షణ శక్తి మూలంగానే అది తిరుగుతుంటుంది. అయితే, దానినుంచి రాకెట్లను పంపాలన్నా లేదా స్పేస్ స్టేషన్‌తోనే భూమికి తిరిగి వెళ్ళిపోవాలనుకున్నా ఇంధనం అవసరమవుతుంది. కావలసిన ఇంధనాన్ని ఇతర పదార్థాలతో పాటు స్పేస్ షటిల్ ద్వారా తెప్పించుకుంటారు. మెర్విన్‌కి జరిగిన ప్రమాదం గురించి భూమికి వార్త పంపగలిగితే భూకేంద్రంవారు వెనువెంటనే స్పేస్ షటిల్‌ను ఇంజనీర్లతోను, ఇతర సిబ్బందితోను పంపగలరు. వారు తమ వెంట ఆహారపదార్థాలూ, నీరూ, ఇతర వస్తువులు తీసుకు రాగలరు. వచ్చాక స్పేస్ స్టేషన్‌కి అవసరమైన రిపేర్లు చేయగలరు. కాని, ఈ వార్త భూమికి జేరడం ఎలా? రేడియో ఎక్విప్‌మెంట్ పూర్తిగా నాశనం అయిపోయి, అంతరిక్షంలోకి ఎగిరిపోయింది.

''నాకు ఒక ఆలోచన వస్తుంది. ప్రతిరోజూ మనం క్రమం ప్రకారం భూకేంద్రంతో మాట్లాడాలి కదా! మన దగ్గర నుంచి రెండు, మూడు రోజులు ఏ కబురూ లేకపోతే, మన కేదో ప్రమాదం జరిగిందని వాళ్ళు అర్థం చేసుకోగలరు. వెంటనే స్పేస్ షటిల్‌ను పంపగలరు'' అన్నాడు ప్రొఫెసర్ విల్స్.

"లాభంలేదు ప్రొఫెసర్!" అంటూ తల అడ్డంగా ఆడించాడు రాంప్రసాద్.

"ఇప్పుడు సోలార్ ఫ్లేర్స్ చాలా ఎక్కువగా ఉన్నాయి. సూర్యుని మీద మచ్చల సంఖ్యకూడా బాగా పెరిగింది. ఇటువంటప్పుడు మన నార్మల్

ప్రసారాలు జామ్ అయిపోతాయి. ఈ కారణం చేత మన దగ్గర నుంచి రేడియో ప్రసారాలు అందడం లేదని భావిస్తారే తప్ప మనం ఏదో ప్రమాదంలో చిక్కుకున్నామని అనుమానించరు. లేదా వాళ్ళు అసలు విషయం గ్రహించి స్పేస్‌షటిల్‌ను పంపేటప్పటికి మనం ఇక్కడ శవాలుగా మారి అంతరిక్షంలో తిరుగుతుంటాం. సూర్యుని మీద అల్లకల్లోలం చాలా ఉధృతంగా ఉంది. ఇది తగ్గడానికి కొన్ని రోజులైనా పడుతుంది. అందువల్ల కొద్ది రోజుల్లోనైనా మన పరిస్థితి వారు గ్రహిస్తారేమోననుకుంటే ఆ అవకాశమూ లేదు" అంటూ వివరించాడు.

"బాడ్‌లక్. క్రిందటిసారి స్పేస్‌షటిల్ వచ్చి గట్టిగా పదిరోజులు కాలేదు. మళ్ళీ రావడానికి ఇంకో నెలన్నర అయినా పడుతుంది. అప్పటికి అంతా అయిపోతుంది" అంటూ తలపట్టుకున్నాడు విల్స్. కొంచెం ఆలోచించి "మన దగ్గర స్పేర్ రాకెట్‌లు ఉన్నాయి. ఫ్యూయల్ కూడా ఉంది. మెసేజ్ రాసి రాకెట్ ద్వారా భూమికి పంపిస్తే?" అన్నాడు రాంప్రసాద్.

"పంపవచ్చు. కాని,ఏం ప్రయోజనం? మొదటిది: ఇప్పుడు మన దగ్గరున్న యంత్రాలన్నీ బాగా దెబ్బతిన్నాయి. వీటిని సరిచేసి సరైన టైములో, యాంగిల్‌లో రాకెట్‌ని పంపడం చాలా కష్టమైన పని. టైముకూడా చాలా తీసుకుంటుంది. ఇది త్వరగానే చేశామనుకున్నా,ఈ రాకెట్ వెళ్ళి మెసేజ్ అందజేసి, వాళ్ళు స్పేస్‌షటిల్‌ను పంపి, అది వచ్చేసరికి కనీసం ఇరవై రోజులు పడుతుంది. అప్పటికి పుణ్యకాలం పూర్తయిపోతుంది" అన్నాడు విల్స్.

"అయితే ఏమిటిగతి? అంతరిక్షంలో దిక్కులేని చావు చావవలసిందేనా?" అన్నాడు రాంప్రసాద్ దిగులుగా.

"చావడం ఖాయం అనుకున్నప్పుడు దిక్కులేని చావు ఎందుకూ చావడం? వీర మరణమే పొందుదాం" అన్నాడు విల్స్.

"అంటే?"

"చూడండి మిస్టర్ ప్రసాద్! ఈ ఉల్కతాకిడికి మన మెర్‌విన్ ఏ దిశలో పోతుందో తెలియడం లేదు. దాని మార్గం మాత్రం స్వతహాగా నిర్ణయించిన కక్ష్యలో ఉండదు.శుక్రుని వైపుకి నెట్టబడివుంటే క్రమంగా శుక్రుని చుట్టూ నెమ్మదిగా ప్రదక్షిణాలు చేస్తూ చేస్తూ అంతకంతకూ దగ్గర అవుతూ చివరకి అమెరికన్

స్కైలాబ్ భూమిమీద కూలిపోయినట్లు శుక్రునిమీద కూలిపోతుంది. కొన్ని నెలలకో కొన్ని సంవత్సరాలకో చివరకి ఇది తప్పదు. ఒకవేళ బుధగ్రహం వైపు నెట్టబడి వుంటే అప్పుడూ ఏదోనాడు దానిమీద కూలిపోక తప్పదు. ఈ రెండూ కాకుండా వేరే దిశలో నెట్టివుంటే ఆ తాకిడి మనల్ని శాశ్వతంగా ఎటో నెట్టివేయవచ్చు. సౌర మండలంలోని ఏ గోళం మీదైనా పడ్తామో, ఈ మండలానికి శాశ్వతంగా గుడ్‌బై చెప్పి ఇతర నక్షత్రం మండలాలవైపు వెళ్ళిపోతామో!'' అన్నాడు విల్స్.

"మై గాడ్! ఇప్పుడేమిటి చేయడం? మన పరిస్థితి చూస్తే నాకు అపోలో 13 అంతరిక్ష యాత్రికులు పడిన అగచాట్లు గుర్తుకి వస్తున్నాయి. వారి నౌక చెడిపోవడంతో చంద్రుని మీద దిగలేక, భూమికి తిరిగి రాలేక, అంతరిక్షంలో బందీలై అతికష్టంమీద తిరిగి రాగలిగారు.

''అయితే ఒక తేడా వుంది. వారిని గురించి, వారి నౌకకు కలిగిన ప్రమాదం గురించి ప్రపంచానికంతా తెలుసు. అందుకే వారి క్షేమంగురించి ప్రపంచంలోని అన్ని దేశాలూ, అందరు ప్రజలూ వారు తిరిగివచ్చేదాకా ఎంతో ఆందోళన చెందారు. ఈ విధంగా లోకమంతా ఒకే సంఘటనపై దృష్టిని కేంద్రీకరించిన వైనం మరోటిలేదు. మన సంగతో? ఎవరికీ తెలీదు. కనుక, మనల్ని గురించి పట్టించుకొనేవారు లేరు. అయ్యో అని సానుభూతి చూపించేవారు కూడాలేరు."

"నువ్వు చెప్పింది నిజం. మన పట్ల సానుభూతి చూపించేవారు ఉన్నా లేకపోయినా అపోలో-13 యాత్రికులలాగా మనంకూడా ఎలాగోలా బయటపడాలి."

"దీనికి ఒక్కటే మార్గం మనం భూమికి వెళ్ళిపోవడం."

"ఏమిటి....తుక్కుతుక్కైన ఈ మెర్‌విన్‌లోనా?"

"నో....దటీజ్ ఇంపాజిబుల్ మన దగ్గర ఎమర్జెన్సీ లైఫ్‌బోట్స్ రెండు వున్నాయి కదా! ఒకదానిలో మనం భూమికి వెళ్ళిపోవాలి. ఇప్పుడు మనం ఉన్నది బుధ శుక్రగ్రహాల ఆకర్షణలు పరస్పరం న్యూట్రలైజ్ అయ్యే స్థానానికి దగ్గరలో కనుక, ఇక్కడి నుంచి టేక్‌ఆఫ్ సులువు. ఇందుకు ఎక్కువ ఇంధనం ఖర్చుకాదు. ఇప్పుడు మన దగ్గరవున్న సోఫిస్టికేటెడ్ ఫ్యూయల్‌తో రోజుకి కోటిమైళ్ళకంటే ఎక్కువ దూరమే ప్రయాణం చేయవచ్చు. మన వెహికల్

భూమివైపు వెళ్ళినకొద్ది దాని ఆకర్షణ కూడా పనిచేసి లైఫ్‌బోట్ ఇంకా పుంజు కుంటుంది. మొత్తంమీద ఆరేడు రోజుల్లో భూమిని చేరగలం. అప్పటి వరకు ఉన్న ఇంధనాన్ని, ఆహారాన్ని, నీటిని జాగ్రత్తగా వాడుకుని గడుపుకోవాలి. సరైన యాంగిల్‌లో బ్లాస్ట్ చేస్తే ఎలాగోలా భూమిని చేరవచ్చు" అన్నాడు విల్సన్.

"కాని,.... కాని మన దగ్గర ఫ్యూయల్ చాలా తక్కువ ఉంది. దీనితో టేక్ ఆఫ్‌కి ఏమీ ఇబ్బంది ఉండదు. అటు తర్వాత జెర్నీకి కూడా ప్రాబ్లెం ఉండదు. అయితే, వచ్చిన చిక్కల్లా లాండింగ్‌తోనే. భూవాతావరణంలో మహా వేగంతో ప్రవేశించాక రెట్రో రాకెట్స్‌ని భూమి ఆకర్షణకి వ్యతిరేక దిశలో పేల్చి దాని వేగం కంట్రోల్ చేయకపోతే మన వెహికిల్ వాతావరణంలోనే మండి పోతుంది. లేదా- మహా వేగంతో వెళ్ళి సముద్రంలో పడి మునిగిపోతుంది. అదీ కాకపోతే నేలమీద ఎక్కడో కూలి, షూమేకర్ - లెవీ తోకచుక్క శకలాలు గురు గ్రహాన్ని ఢీకొని సంక్షోభాన్ని సృష్టించినట్లు మహా భయంకరమైన సంక్షో భాన్ని సృష్టిస్తుంది. రెట్రో రాకెట్స్‌కి అవసరమైన ఇంధనం మన దగ్గర లేదు" అన్నాడు డాక్టర్ రాంప్రసాద్.

''మనం ఈ సమస్యను ఒక విధంగా ఎదుర్కొవచ్చు. మన దగ్గర వున్న సోఫిస్టికేటెడ్ ఫ్యూయల్‌తో ఇనీషియల్ బ్లాస్ట్‌ని గంటకి 13 లక్షల మైళ్ళ వేగంతో ఉండేటట్లు చేయాలి. టేక్ ఆఫ్‌కి ఎటూ ప్రాబ్లెం లేదు. ఈ యాక్సిల రేషన్ మెయింటైన్ అయినంత కాలమూ ఏ ఇబ్బందీ ఉండదు. ఎటొచ్చీ మార్గ మధ్యంలో ఏవైనా ఇతర గోళాల వ్యతిరేక ఆకర్షణ శక్తి మూలంగా వేగం తగ్గితే అప్పుడు మళ్ళీ రాకెట్లను పేల్చి ఇంధనం ఖర్చు చేయవలసి ఉంటుంది. నా ఉద్దేశ ప్రకారం ఇటువంటి సమస్యలేవీరావు. వచ్చినా మనం చేయగలిగింది లేదు. రిస్కు తీసుకుని ప్రొసీడ్ కావలసిందే. దీని విషయం సరే. ఇప్పుడు టేక్ ఆఫ్‌కి సరైన యాంగిల్ నిర్ణయించడం కూడా చాలా కష్టం. ఎందుకంటే, మన మెషినెరీ అంతా దెబ్బతింది. యాంగిల్‌లో ఒక్క సెకను తేడా వచ్చినా మన నౌక భూమికి శాశ్వతంగా ఉపగ్రహంగా మారిపోవడమో, ఈ సౌరమండలాన్ని విడిచిపెట్టి శాశ్వతంగా అనంతవిశ్వంలోకి వెళ్ళిపోవడమో జరుగుతుంది. కనుక ఇప్పుడు మనం తీసుకుంటున్నది ప్రతీదీ ఛాన్సే. అయితే, ఛాన్స్ తప్పకుండా అవకాశాలు మెరుగయ్యేందుకు మన అనుభవం పనికి వస్తుంది. అందుకనే

అన్నాను అంతరిక్షంలో దిక్కులేని చావు చచ్చే బదులు వీరమరణమే పొందుదా మని. మన ప్రయత్నాలు ఫలించి భూమికి జేరగలిగితే విజయం పొందిన వీరులవుతాం. లేకుంటే వీరమరణం చెందిన అంతరిక్ష యాత్రికులం అవుతాం." అన్నాడు ప్రొఫెసర్ విల్స్ నిబ్బరంగా.

''ఓ.కె. లెటజ్ ప్రొసీడ్ దెన్" అన్నాడు డాక్టరు రాంప్రసాద్.

స్పేస్‌స్టేషన్‌కి, స్పేస్ షటిల్‌కి అనుకోని ప్రమాదాలు సంభవిస్తే ప్రాణాలు రక్షించుకొవడానికి లైఫ్‌బోట్స్‌ని ఏర్పాటు చేస్తారు. ఇవి ఓడలను అంటిఉండే లైఫ్ బోట్స్ వంటివి కావు. ప్రాణాలు రక్షిస్తాయి కాబట్టి ''లైఫ్‌బోట్స్'' అని అన్నా- నిజానికి ఇవి మీడియంసైజు రాకెట్లు. వీటిలో ఇద్దరు ముగ్గురు మనుష్యులు, వారికి అవసరమైన సామాగ్రి, యంత్రాలు, ఇంధనం పట్టేటంత జాగా ఉంటుంది. యాత్రని సక్రమంగా నిర్వహించడానికి కంప్యూటర్ కూడా ఉంటుంది. అత్యవసర పరిస్థితులలో ఈ రాకెట్లను ఉపయోగించి భూమికి కాని, ఇతర గ్రహాలమీదికి కాని వెళ్తారు అంతరిక్ష యాత్రికులు.

ఉల్క తాకిడికి ఉన్న రెండు లైఫ్ బోట్స్‌లోను ఒకటి దెబ్బతింది. రెండోది బాగానే ఉంది. అదృష్టవశాత్తు దానిలోని కంప్యూటర్‌కి కూడా ఏమీ కాలేదు. దానితో బ్లాస్ట్ ఆఫ్‌కి కావలసిన టైం, యాంగిల్‌లను నిర్ణయించారు విల్స్, ప్రసాద్‌లు. వారి ప్రయాణ వివరాలను కంప్యూటర్‌కి ఫీడింగ్ ఇచ్చే శారు. ఇంక వెంటవెంటనే ఈ లైఫ్ బోట్‌లోకి ఆహార పదార్థాలు, నీరు, ఇంధనం, ముఖ్యమైన రికార్డులను తరలించారు. టేక్ ఆఫ్‌కి సరిగ్గా నాలుగు గంటల ఇరవయ్యారు నిమిషాల యాభైయ్యొక్క సెకన్లను ముహూర్తంగా నిర్ణ యించింది కంప్యూటర్. అంటే- సుమారు మరో గంట తర్వాత.

సరిగ్గా ముహూర్త సమయానికి నిర్దేశించిన యాంగిల్‌లో బ్లాస్ట్ ఆఫ్ అయింది. చూపుకి అందనంతటి వేగంతో ఆకాశంలోకి దూసుకుపోయింది లైఫ్ బోట్.

* * *

ఆరు రోజులు గడిచాయి ఎంత పొదుపుగా వాడినా ఇంధనం బాగానే ఖర్చవుతోంది. భూ వాతావరణంలో ప్రవేశించాక రెట్రో రాకెట్లను పేల్చి లైఫ్ బోట్ వేగాన్ని అదుపుచేయకపోతే నౌక మండిపోయే ప్రమాదం ఉంది. అందు వల్ల ప్రతి గ్రాము ఇంధనాన్ని కూడా ఎంతో జాగ్రత్తగా వాడుతున్నారు.

ఏడో రోజు వచ్చింది.

లైఫ్‌బోట్ భూవాతావరణంలో ప్రవేశించింది. నీలం, ఆకుపచ్చ కలిసిన రంగుతో, తెల్లని మబ్బుల దొంతరలతో అద్భుతంగా మెరిసిపోతోంది భూమి. "నేలమీద కాలు పెడితే వీసాలు, పాస్‌పోర్టులు అంటూ గిరులు గీసుకు కూర్చుంటాము. అంతరిక్షంనుంచి మొత్తం భూమిని ఒక్కకంటితో చూడగలుగుతున్నాం" అని అనిపించింది వారికి. తూర్పు పశ్చిమ దేశాల శాస్త్రజ్ఞులు కలిసి మొత్తం భూమిని ఒక్కకంటితో ఒక్కటిగా చూడగలుగుతుండడం వారికి ఒక విచిత్రానుభూతిగా అనిపించింది.

లైఫ్‌బోట్‌లోని మీటర్ భూవాతావరణ సాంద్రతని, ఒత్తిడిని తెలుపుతోంది. సాంద్రత పెరిగిన కొద్దీ రాపిడి ఎక్కువై, వాహనం మండిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. ఆ ప్రమాదస్థాయిని గుర్తించి సమయానికి రెట్రో రాకెట్‌ను ప్రేల్చడానికి కంప్యూటర్‌కి ఫీడింగ్ ఇచ్చాడు ప్రొఫెసర్ విల్సన్.

సరిగ్గా సమయానికి రెట్రో రాకెట్ ప్రేలి స్పేస్‌బోట్ వేగాన్ని తగ్గించింది. ఇంధనం పరిస్థితి చాలా ఆందోళనకరంగా ఉంది. కనీసం ఇంకా నాలుగుసార్లన్నా రెట్రో రాకెట్లను ప్రేల్చవలసి ఉంటుంది. వీటిలో చివరిది చాలా ముఖ్యమైనది. నౌక భూమిమీద పడుతున్న వేగానికి సమానమైన వేగంతో రెట్రో రాకెట్‌ను ప్రేల్చినపుడు రెండు విరుద్ధ శక్తుల మూలంగా నౌకవేగం పూర్తిగా పోయి సాఫ్ట్ లాండింగ్ సాధ్యం అవుతుంది. ఇలా కాకుంటే నౌక మహావేగంతో భూమిని గ్రుద్దుకుని సర్వనాశనం అవుతుంది. అందువల్ల ఈ చివరి దానికోసం తగినంత ఇంధనాన్ని ఉంచడం తప్పనిసరి. ఇలా వుంచితే వాతావరణంలో ప్రేలవల్సిన రాకెట్లకి తక్కువ పడుతుంది. వీటిని ప్రేల్చకపోతే వాతావరణం అంతకంతకీ దట్టం అవుతుంది కనుక తప్పకుండా మండిపోతుంది నౌక. ముందు నుయ్యి వెనుక గొయ్యిగా వుంది పరిస్థితి.

లైఫ్‌బోట్ డిజైన్‌ని, డిటైల్స్‌ని ముందు పెట్టుకుని శ్రద్ధగా చూస్తూ ఏంచేయాలా అని దీర్ఘంగా ఆలోచించసాగాడు డాక్టర్ రాంప్రసాద్. ఇంధనం ఇంక కేవలం ఒక్క రెట్రో రాకెట్ ప్రేల్చడానికే సరిపోతుంది. లైఫ్‌బోట్ భూమికి లక్షన్నర అడుగుల ఎత్తున ఉంది.

మరొక్క పది నిమిషాలలో ఇంకో రెట్రో రాకెట్ ప్రేల్చకపోతే వాతావరణంలో లైఫ్‌బోట్ మండిపోవడం ఖాయం. ఆ ఒక్కటీ పేలిస్తే ఇంక వాతా

వరణంలో ప్రేల్చవలసిన అవసరం ఉండదు. కాని, అసలది సాఫ్టలాండింగ్ టైంలో కావాలి. అది జరగకపోతే భూమిని గుద్దుకోవడం అనివార్యం.

ఆలోచించే వ్యవధి లేదు.

''డాక్టర్ ప్రసాద్! మనకి వ్యవధి లేదు. సాఫ్టలాండింగ్ సంగతి తర్వాత ఆలోచిద్దాం. చివరి రెట్రోరాకెట్‌ను ప్రేల్చేస్తున్నాను'' అన్నాడు విల్స్.

''ఓ.కె. ప్రొసీడ్'' అన్నాడు రాంప్రసాద్.

వెంటనే కంప్యూటర్‌కి ఫీడింగ్ ఇచ్చేశాడు విల్స్. సరిగ్గా నిర్ణయించిన సమయానికి చివరి రెట్రో రాకెట్ ప్రేలింది. నౌకవేగం బాగా తగ్గిపోయి గాలిలో మండిపోయే ప్రమాదం తొలగిపోయింది.

భూమిని సమీపిస్తున్నకొద్దీ లైఫ్‌బోట్ మళ్ళీ వేగం పుంజుకుంది. చివరకి వేగంగా వెళ్ళి భూమిమీద పడుతుందో, సముద్రంలో కూలుతుందో! భూమిని గుద్దుకుంటే ఆటంబాంబ్ లాగా ప్రేలి విపరీతమైన విధ్వంసాన్ని కల్పిస్తుంది. సముద్రంలో కూలితే ఆకస్మిక ఉప్పెనలను కల్పిస్తుంది. చివరిదశలో దుర్మరణం పొందబోవడం బాడ్‌లక్ అనుకొన్నారు వారు.

ఇంతలో లైఫ్‌బోట్ డిజైన్‌ను నిశితంగా పరిశీలిస్తున్న డాక్టర్ రాంప్రసాద్‌కి ఆకస్మికంగా ఒక ఆలోచన వచ్చింది.

''ప్రొఫెసర్!....డిజైన్‌లో ఈ పోర్షన్ చూడండి. దీని డిటైల్స్ చదవండి'' అన్నాడు ఆనందంతో.

అది చదివి పట్టరాని సంతోషంతో ''వండర్‌ఫుల్'' అని అరిచి ''గో ఎహెడ్. స్విచ్ ఆన్'' అని అరిచాడు ప్రొఫెసర్ విల్స్. డాక్టర్ రాంప్రసాద్ ఒక స్విచ్‌ని ఆన్ చేశాడు కొద్ది సెకండ్లలో వారి నౌకను ఎవరో పైనుంచి బలంగా పైకి గుంజుతున్నట్లు అనిపించింది.

ఆ లైఫ్‌బోట్‌కి పైభాగన పారాచ్యూట్ అమర్చబడి ఉంది. స్విచ్ ఆన్ చేసినప్పుడు పైభాగం తెరుచుకుని పారాచ్యూట్ పైకి ఎగసి గాలిలో విచ్చుకుంది. గాలి ఒత్తిడి ఎంత ఎక్కువగా ఉంటే అంత బలంగా అది పైకి లాగుతుంది. అందువల్ల నౌక వేగం ఇంచుమించు పూర్తిగా తగ్గిపోయి, నెమ్మదిగా క్రిందికి దిగుతుంది. అప్పటివరకూ లైఫ్‌బోట్‌ను ఉపయోగించవలసిన అవసరం రాకపోవడం, రెట్రో రాకెట్స్ మీదనే వారి దృష్టిని కేంద్రీకరించడం కారణాలుగా ఈ పారాచ్యూట్ అరేంజిమెంట్ గురించి వారికి ఆలోచనే రాలేదు. ఎప్పుడైతే

బోట్‌ను పైకి గుంజిన అనుభూతి కలిగిందో, వెంటనే విల్స్ "డాక్టర్! ఇట్ వర్క్‌డ్" అంటూ సంతోషంతో అరిచాడు.

డాక్టర్ రాంప్రసాద్ వెంటనే రేడియో ట్రాన్స్‌మీటర్ ఆన్‌చేసి భూకేంద్రాలకు తమ గురించి సందేశం పంపాడు. లైఫ్‌బోట్‌లో ఏర్పాటు చేసిన ట్రాన్స్‌మీటర్ తక్కువ శక్తిది కావడం వల్ల, భూమిని సమీపించాకనే దానిని ఉపయోగించడం సాధ్యమైంది. డాక్టర్ రాంప్రసాద్ పంపిన రేడియో సంకేతాలను మన షార్, అమెరికాలోని నాసా కేంద్రాలతో సహా ప్రపంచంలోని ప్రముఖ కేంద్రాలన్నీ రిసీవ్ చేసుకున్నాయి.

"నా అంచనా ప్రకారం మనం మరో గంటలో, అంటే- మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో కార్‌నికోబార్ సమీపంలో లాండ్ అవుతాం. సముద్రంలోనే దిగుతామో, నేలమీదే వాలుతామో అప్పుడే చెప్పలేను" అన్నాడు విల్స్.

"కార్‌నికోబార్ అంటే, మా భారతదేశంలో భాగం. ఇక్కడ దిగడం అంటే నాకు ఎంతో ఆనందంగా ఉంది" అన్నాడు రాంప్రసాద్.

భూకేంద్రాలు ప్రపంచంలోని అన్ని సర్వైలెన్స్ ఏజన్సీలకు ఈ లైఫ్‌బోట్ ఆగమన విషయం తెలియజేసి ఎలెర్ట్ చేశాయి. ఆ కేంద్రాలు లైఫ్‌బోట్ ఎక్కడ దిగినా పట్టుకోడానికి ఆయత్తమయ్యాయి.

డాక్టర్ రాంప్రసాద్ తమ నౌక పరిస్థితి, స్థానం వంటి వివరాలను నిరంతరంగా ట్రాన్స్‌మిట్ చేయసాగాడు. ప్రొఫెసర్ విల్స్ అంచనా వేసిన విధంగా అది కార్‌నికోబార్ ప్రాంతంలోనే దిగుతుందన్న విషయం ఖాయం అయిపోయింది.

మరో అరగంటలో రాజహంస నేల మీద వాలినట్లు ఆ లైఫ్‌బోట్ కార్‌నికోబార్ ఐలండ్ సముద్ర తీరం మీద దిగింది. గస్తీ పడవలు వెంటనే వారిని రిసీవ్ చేసుకున్నాయి. ఈ వార్త వెంటనే వైర్‌లెస్ ద్వారా షార్, నాసా కేంద్రాలకు అందజేశారు. మరికొంచెం సేపట్లో ఇండియన్ ఎయిర్‌ఫోర్స్‌కి సంబంధించిన ప్రత్యేక విమానం డాక్టర్ రాంప్రసాద్‌ను, ప్రొఫెసర్ విల్స్‌ను తీసుకుని ఢిల్లీకి బయలుదేరింది. వారు అంతరిక్షంలో సాధించిన విజయానికి గుర్తుగానా అన్నట్లు వారు వచ్చిన లైఫ్‌బోట్ సముద్ర తీరంలో నిటారుగా నిలబడి గర్వంగా తలెత్తుకున్నట్లు ఉంది. *

# గుమాస్తాగారి కోపం

—నవులూరి వెంకటేశ్వరరావు

అది ప్రథమ వీక్షణానికే కలిగిన ప్రేమ. యవ్వనపు ప్రథమాధ్యాయంలోనే కలిగింది. అవతలివైపునించి స్పందనకు అవకాశం లేదు - అవి ప్రాణంలేని ప్రభుత్వ కాగితాలు కాబట్టి. పద్దెనిమిదేళ్ళ వయసునుంచి, పదవీ విరమణ దినం వరకూ అది కొనసాగిందని చెప్పటం తప్పు. పదవీ విరమణ తర్వాత వాటిని అతను ప్రేమించటం మానేస్తేగదా? ఏ ప్రభుత్వ నియమ నిబంధనలను గాయత్రీ మంత్రంలా పఠిస్తూ వచ్చాడో వాటి ప్రకారం 58 సంవత్సరాలకు పింఛను పుచ్చుకోక తప్పలేదు. ఏ నియమమైనా, నిబంధనయినా ప్రభుత్వ కాగితాలనుంచి భౌతికంగా తనను వేరు చేయగలదేమోగాని, వాటిని ప్రేమించటం, మానటాలకు వర్తింపవుగదా? బహుశా ఇప్పుడది ప్లేటోనిక్ ప్రేమ. వాటితో పడిన ప్రేమ కారణంగా పెళ్ళిచేసుకోలేదు. పెళ్ళి, గిళ్ళిలకు మనసుని మళ్ళించటానికి సమయమూ దొరకలేదు. సర్వీసులో సూర్యుడిని చూసి ఎరుగడు. సూర్యోదయానికి ముందు నించి అస్తమయానంతరం వరకూ కార్యాలయానికి పరిమితమైనవాడు సూర్యుడిని ఎలా చూడగలడు? అసలు, ప్రభుత్వ ఫైళ్ళకంటే సూర్యుడిని గొప్పవాడుగా గుర్తించడు. సూర్యుడిని చూడకపోతే నష్టమేమైనా వుందా? పైపెచ్చు, సూర్యుడు తన విధిని తను నిర్వర్తిస్తున్నాడు; తనదారిన తను నిర్వర్తిస్తూ పోతూవస్తున్నాడు.

మూడు సంవత్సరాలయింది పదవీ విరమణ అయి. "పదవి''లేని జీవితం వింతగా వుంది, ఇబ్బందికరంగా వుంది, రోతగా వుంది, అర్థరహితంగా వుంది.

పింఛను నిర్ధారణ కాలేదు. నిజానికి దానిమీద ఇసుమంత ఆసక్తి లేదు. 'తన' ఫైళ్ళని, కుర్చీని చూడాలన్న బలమైన కోర్కె కారణంగా ఆఫీసు కొచ్చాడు.

సరాసరి తన సీటు దగ్గరకెళ్ళాడు. సహోద్యోగులలో ఒకడు తను కూర్చుంటూ వచ్చిన చోటనే కూర్చుని వున్నాడు. అయితే, కుర్చీ తనది కాదు. తన కుర్చీని తన టేబులుకు అవతల పనిమీద వచ్చినవాళ్ళు కూర్చోటానికి వేసి వుంది. అతను నొచ్చుకున్నాడు- అంతవిలువైన కుర్చీని అతిథులకు వేసినందుకు. యాభై వత్సరాల టేకు కుర్చీ. ఆంగ్లేయుల పరిపాలనాకాలంలో, బోలెడంత వ్యవధివున్న షరాబు, తన పనిని తను ప్రేమించటం తెలుసుకున్నవాడు చేసినది. ఎంతో సుఖం, విశ్వాసం, గౌరవం, గర్వం ఇచ్చినది.

''నమస్కారమండీ!"

''ఆఁ."

ప్రతినమస్కారం అలవాటు లేదు. ఎవడు నమస్కారం చేసినా ఏదో తనను ఆశించే చేస్తున్నాడన్న నిశ్చితాభిప్రాయం జీర్ణించుకునివుండటం వల్ల 'నమస్కారం' చేసిన గుమాస్తాకి తను ఇప్పుడు చేయగలిగిందేమీ లేదు గదా? అతనే తన పింఛను కాగితాలు కదిలించాల్సి వుంది. అలవాట్లు తేలిగ్గా చావవు గదా?

"ఎలా గడుస్తున్నాయి రోజులు?" కొత్తాయన అడిగాడు.

''ఆఁ....ఊఁ....'' అన్నాడు.

''సూటిగా సమాధానం ఇవ్వటం అనే ప్రక్రియకు ప్రభుత్వ వుద్యోగంలో అడుగుపెట్టిన కొంతకాలానికే కాలం చెల్లింది. ఏదీ సూటిగా చెప్పకూడదు, డొంక తిరుగుడును ఆశ్రయించాలి ఎల్లవేళలా - అన్న తారకమంత్రం అతి శీఘ్రంగా నేర్చాడు. ఎటుపొయ్యి ఎటొస్తుందో; తను ఉద్యోగ రీత్యా ఇబ్బందిలో ఇరుక్కోవచ్చు; సంస్థకి అనవసరమైన కమిట్‌మెంటు ఇచ్చినట్లవ్వవచ్చు. అవతలి నించి పది పేజీల ఉత్తరం వస్తే, ముక్తసరిగా పదిలైన్ల సమాధానం రాస్తే అదే గొప్ప. పాస్సివ్ వాయిసులో, పాస్సివ్‌గా, 'నో' అన్నది 'ఓం' అంతగొప్పది నోకారం నాలుక చివర, పెన్నుపాళీ చివర సతతం నెలకొని వుండాలి.

''మీ పింఛను కేసు....''

తన పింఛను కేసు గురించి అట్టే ఆసక్తి చూపించకుండా మధ్యలో అందుకుని అన్నాడు-

"తండేలు కృష్ణారావు పింఛను నిర్ధారించారా?''

కొత్త గుమస్తా బల్లమీదే వున్న ఫైలు తీసి మనవాడి ముందుకు తోశాడు, "ఏం చెయ్యాలో తోచటం లేదు" అంటూ.

కళ్ళలోకి కొత్తకాంతి వచ్చింది; ఉత్సాహం వచ్చింది.

"సర్వీసు బ్రేకు విషయంలో మనం చేయగలిగిందేమీ లేదు....ఉద్యోగానికి వాడు ఎగనామం పెట్టిన సంవత్సర కాలాన్నీ మినహాయించాల్సిందే...."

"దానివల్ల వాడికి చాలా న...."

"రూల్సొప్పుకోనపుడు మనమేం చెయ్యగలం?"

"మన పెన్షనా, కేంద్ర ప్రభుత్వపు పెన్షనా అని కూడా వాడు ఆప్షను ఇవ్వలేదు"

"ఆప్షన్ ఇవ్వని కేసులన్నిటికీ మన పెన్షను పథకం అన్వయించటమే...."

"అలా అయితే వాడికి నెలకీ వందరూపాయలు నష్టం...."

"అయితే అయింది."

కొత్త గుమాస్తా మాట్లాడలేదు. తను చెప్పింది నచ్చిందో లేదో తెలీదు. రూల్సుకు వ్యతిరేకంగా చేస్తాడేమోనన్న భయాందోళనలు కలిగాయి. "అయినా నాకేలా? రిటైరయ్యానుగదా!" అని సమాధానపడటానికి ఉపక్రమించాడు.

"ఇదో ముత్యాలమ్మ కేసు సెటిలయ్యింది."

ఆత్రుతగా అడిగాడు - "ఏ విధంగా?"

"మీరు రాసిన దానికి 'అలాగే' అని పెద్దాయన ఉత్తర్వు వేశాడు."

మొహం డబుల్ ఫుల్ స్కేపయింది.... రాళ్ళు నీరయ్యేట్లు ముత్యాలమ్మ మూడు పేజీల విన్నపం చేసుకుంది, అంగుళం అంగుళానికి చెయ్యెత్తి నమస్కరిస్తూ. భర్త పించనుకు ఆప్షను ఇవ్వకుండా, వచ్చిన పి. ఎఫ్. అంతా వసూలు చేసుకుని, రిటైరయి, చేసివున్న అప్పులు తీర్చి, వెంటనే చావటంవల్ల బతకటానికి చిల్లిగవ్వ లేక వీధి పాలయ్యానంది. పస్తులెరుగని రోజులేదంది. ఈడొచ్చిన కూతురికి పోయిన భర్త వుద్యోగం ఇప్పించి ఆదుకోమంది. కానీ, రూలేది? మానవతా దృక్పథంలో పరిశీలించడానికి 'అర్హమైన' కేసుగాదు! సరిగ్గా ఆ విషయాలనే అందంగా, చక్కని భాషాజాలంతో అనేక డొంకలు తిప్పి వారం

రోజులు నిద్రమాని ఆలోచించి మరీ రాశాడు. తను రాసిన అఖరి 'నోట్ల'లో అదొకటి.

"గూడ్ డ్రాఫ్టింగని అయ్యగారు ఎర్రింకుతో రాశారు మీ నోటు మీద."

చాలు! ఆ ఒక్క మెచ్చుకోలు చాలు! తనకు జీవితాంతం పింఛను ఇవ్వక పోయినా పర్వాలేదన్నంత ఆనందం కలిగింది. కలగదా? పది లక్షల విలువ చేసే కాంట్రాక్టులో, కాంట్రాక్టరు తొమ్మిది లక్షలు 'మామూలు'గా అయ్యగారికే ఇచ్చి వేసినా, అయ్యగారు వాడిని మెచ్చుకోరే - అలాంటిది తన డ్రాఫ్టింగు మెచ్చు కున్నారు. కలగదా ఆనందం? కలగదా గర్వం? అయ్యగారిని వెంటనే కలిసి కృతజ్ఞతాభావంతో సాష్టాంగపడదామనిపించింది. చాలాకాలం ఆయన్ని 'దొర గారు' అని పిలుస్తుండేవారు. అంతకంటే 'అయ్యగారు' అనటం ఎక్కువ ఉచి తంగా, సబబుగా, గౌరవ పురస్కారంగా వుంటుందని ఆ సంబోధన తనే ప్రవేశ పెట్టాడు.

"నేనేమాత్రమైనా ఆంగ్లం రాయగలుగుతున్నానంటే మాథ్యూ దొరగారు- కుక్కల దొర అనేవాళ్ళు - ఆయన చలువ; అంతే!" అన్నాడు ఆత్మవిశ్వాసం, వినయం కలబోస్తూ.

మాథ్యూ జ్ఞాపకం ఆంగ్లేయుల పరిపాలనా దినాలకేసి లాక్కుపోయింది మనసును. ఆయనపట్ల ఆయన కుక్కలకన్నా ఎక్కువ విశ్వాసపాత్రంగా వుండే వాడు. ఆయన ఎన్ని సంకరజాతి కుక్కల్ని పెంచేవాడు! వాటిని ఎంతో ఆప్యా యంగా పెంచుకునేవాడు. అవే సర్వస్వం. ఎప్పుడు బంగ్లా కెళ్ళిన వాటితో అతి చక్కటి రాణి/రాజుగారి ఆంగ్లంలో భాషిస్తుండేవాడు. కార్మికులకు ఉద్యోగులకు ఆయనంటే హడల్. ఆయన ముందుకు వెళ్ళాల్సొస్తే ముందు టాయిలెట్ ముగించుకుని (ప్యాంటు గుండీల విషయం మరచిపోకుండా) రావాలి. కుక్క లను ప్రేమించలేనివాళ్ళు వాటిని కసిరి తోలేసినట్లు దొరగారు వాళ్ళను కసిరి కోలేసేవారు. నోరు తెరిస్తే 'స్వైన్' 'బాస్టర్డ్' ధారాపాతంగా వెలువడేవి. ఆ మాటలు ఎంత మధురంగా వెలువడేవి! మళ్ళీ మళ్ళీ అనిపించుకోవాలనిపించేది.

అర మోడ్పు కన్నులతో జ్ఞాపకాల వీథిలో విహరిస్తున్న సంతానాన్ని మూడుసార్లు పలకరించే ప్రయత్నం చేసి, నాలుగోసారి సఫలీకృతుడయ్యాడు కొత్త గుమాస్తా.

"మీ పింఛను...."

తన కేసు గురించిన ఆ మాటలపట్ల సంతానం ఉత్సాహం చూపటం లేదు. వాటిని మధ్యలో త్రుంచేస్తూ —

"అన్నట్లు, క్రేన్ డ్రైవరు క్రిష్టయ్య కాంపెన్సేషన్ విషయంలో అయ్యగారు ఏమన్నారు?"

"మీ(రాసినట్లే డూప్లికేట్లో దరఖాస్తు ఇవ్వలేదు కాబట్టి దాన్ని పరిశీలించటం వీలుకాదన్నారు."

క్రిష్టయ్య కాలుపోయింది క్రేనుమీదినించిపడి. ఆ కేసును సంతానం చాలా సునిశితంగా పరిశీలిస్తూ వచ్చాడు. గుమాస్తా తెలివితేటలు వెల్లడయ్యేది అట్లాంటి కేసుల్లోనే గదా? తన తెలివితేటలు ప్రదర్శించుకోడానికి అట్లాంటి అవకాశాన్ని వినియోగించుకోలేనివాడు అత్యంత గొప్ప ఉద్యోగమయిన గుమాస్తాగిరీకి అనర్హుడు. సంవత్సరమయింది కాలు ఆసుపత్రిపాలయి, కత్తికి ఎర అయి.

అసలా డ్రైవరు 'మందు' ప్రభావంతో ఆ సమయాన లేడు అని వైద్యుడు సర్టిఫికేటు ఇవ్వాలని మొదటిసారి అభ్యంతరం లేవదీసినవాడు సంతానమే. వాడు సర్టిఫికేటు తెచ్చాడు అది దొంగది అని సంతానం నమ్మకం. అజాగ్రత్త వలన పడిపొయ్యుండొచ్చు అని మరొక అభ్యంతరం లేవదీశాడు. ఆ కార్మికుడు పాతికేళ్ళనించి సర్వీసులో వున్నాడని; అట్లాంటి జాగ్రత్తమంతుడు సాధారణంగా వుండడని, ఎందుకంటే- వాళ్ళావిడ లేనప్పుడు వంటచెయ్యాల్సొస్తే వంటగదిలోకి సేఫ్టీషూ తొడుక్కొండే - బాయిలర్ స్యూటు, గ్లవ్స్ వేసుకోందే వెళ్ళడని చాలా తీవ్రమైన భాషతో పర్యవేక్షక అధికారి ఉత్తరం రాశాడు. అసలు అంత క్రేన్ ఎక్కి ఆ పని చేయగల దేహ దారుఢ్యం, ఆరోగ్యం వున్నాయా లేవా అన్న విషయం సూపర్‌వైజర్ గమనికకు వచ్చిందా లేదా; వచ్చినా అతగాడు రిపోర్టు చెయ్యడం మానేశాడా అన్న విషయం శోధించి నివేదిక పంపించాలని సూపర్‌వైజర్‌మీద అధికారికి ఉత్తరం రాశాడు. ఈ విధంగా ఆ కథ నత్తసిగ్గుపడే నడక నడుస్తూ వచ్చింది. తాను పదవిలో వుండివుంటే సంస్థకు యాభై వేల రూపాయల నష్టం వాటిల్లకుండా చూసేవాడు.

అయా మతాభిమానులు బైబిల్, ఖురాన్, గీత వగైరాలను ఎంత భక్తి విన్నమతలతో కొలుస్తారో అంతగానూ ఎస్సార్, సివిల్ సర్వీసు రూల్సు పఠిస్తూ

వచ్చాడు. అతని నోటినుంచి ఏ పదం జారినా దానికి ఏదో వొక ప్రభుత్వ ఉత్తర్వు ఆసరా వుండి తీరుతుంది. అతను ఎస్సార్ అని ఎగస్వాస పీలుస్తాడు. సివిల్ సర్వీస్ రూల్స్ అని దిగుస్వాస వదులుతాడు. అవి పఠించని నాలుక నాలుక కాదు. ఆ పుస్తకాలు పట్టుకోని కరములు కర్రలు, చదవని కళ్లు తోలు గుంటలు. సంకలన కర్త ముత్తుస్వామి విగ్రహం ఏ ప్రభుత్వ కార్యాలయం ముందూ నెలకొల్పకపోవటం దౌర్భాగ్యం, దారుణం అని భావించేవాడు.

అంతటి విలువైన పుస్తకాల అట్టలు మూడు రోజుల్లో చిరిగి ఆ గుమస్తా (తన) బల్లమీద పడి వుండడాన్ని, రెక్కలు తెగిపడివున్న పెంపుడు పక్షులను చూసినట్లు చూసి విలవిల్లాడిపోయాడు సంతానం. ఏదో కావ్యం అతని పెద వులనించి వెలువడుతున్నట్లు "చొచ్చొచ్చో" అన్న మాటలు అసంకల్పితంగా వెలువడ్డాయి. అయితే, ఈ కావ్యం ఆ మూడు అక్షరాలతో ఆగిపోయింది. అతను బాధకు స్పందించి కావ్యాలూ గీవ్యాలూ రాసే నిరర్థక పనులకు పూనుకునే వ్యక్తికాదు. కార్యవాది. దిగ్గునలేచి మరో బల్ల దగ్గరకెళ్ళి జిగురుతెచ్చి ఆ రెక్కలను ఆ పక్షులకు నెప్పికలగని రీతిలో అంటించటం మొదలుపెట్టాడు.

"తెలుసా? పీటర్ చనిపోయాడు!" ఇంగ్లీష్ వాక్యం నిర్మాణంలోనే వొక దర్జా.

నిరుత్తరుడయ్యాడు సంతానం. కొత్త గుమస్తా వివరాలు చెప్పాడు:

అయ్యగారికి ఈ వయసులో రావలసిన కష్టం కాదు. పీటర్‌ని అయ్యగారు ప్రాణం కన్నా మిన్నగా, తన భార్య ప్రాణంకన్నా మిన్నగా ప్రేమించటం తెలీని వారెవరు! ఎవరితోనన్నా మనసు విప్పి మాట్లాడుతారంటే, చనువుగా వుంటారంటే, తనతో చనువుగా వుండనిస్తారంటే ఆ ప్రాణి పీటరే! ప్రభాత సేవకు అయ్యగారింటికి వెళ్ళినప్పుడల్లా ఆ జీవితోనే అయ్యగారు దర్శన మిచ్చే వారు బీచ్‌లో.

"నో పీటర్ నో, ఎస్ పీటర్ ఎస్" అని నిరోధిస్తూనో, అభినందిస్తూనో, గంభీరంగా, ముద్దుగా అరుస్తుంటే ఎంత రమణీయంగా వుండేది! అధికారుల, పెద్దవాళ్ళ భార్యల చేతుల మీదుగా రంగస్థలాలు వగైరాల మీద బహుమతు లిప్పించటం, ఫోటోలు తీయించటం, దిగటం మన గొప్ప సాంప్రదాయాలలో ఒకటి గదా! భార్య అంటే ఆయా గొప్ప వ్యక్తికి చాలా ప్రీతి పాత్రమయిన

వ్యక్తి అని భావించటం వలన గదా అట్లా చేస్తాం? అయ్యగారికి అమ్మగారి చేత అలాంటి పురస్కారాలు చేయిద్దామా, పీటర్‌చేత చేయిద్దామా అంటే, వారు తడుముకోకుండా 'వై నాట్ పీటర్' అని, 'అఫ్ కోర్సు అది మనిషిలా ఇవ్వ లేదు గదా' అంటూ విచారం వ్యక్తం చేస్తారు. పీటర్ జతలేని అయ్యగారిని ఊహించుకోలేం.

అయ్య గారిది ఎంత చక్కని బొజ్జ! (మాటలతో గారడీలు చేసిన సంతానం మనసులో మెదిలిన ఆ వాక్యాన్ని స్వల్పమైనదే మార్పుచేసి ఎలా వుంటుందో చూశాడు.) అయ్యగారిది ఎంత చక్కని పెద్ద బొజ్జ! అది చక్కనిది కాబట్టే పొద్దునే సముద్రపు ఇసకలో నడిచి దాన్ని శుష్కింప చేయబూనటం శుద్ధ అనవసరం. అయితే, ఏం పర్లేదు - అయిదేళ్ళనించి ఇసకలో నడిచినా అది దాని రూపు నేమాత్రం కోల్పోలేదు గదా, దిన దిన ప్రవర్ధమానమవుతోంది. దాన్ని కప్పి కప్పనట్లుండే బనీను షర్టులకు తెలుసా విషయం. బొడ్డు దగ్గిర చుట్టుకుని నిలబడటం సాధ్యపడదు గనక బొడ్డుకు జానెడు కింద చోటుచేసుకుని వేలాడే లుంగికి తెలుసా సంగతి. అంతటి ఘనుడయిన అయ్యగారిని ఆ శున.... పీటర్ నావను టగ్గు లాక్కెళుతున్నట్లు లాక్కెళుతుంటే ఈన రెండు చేతులతో గొలుసు లాగివట్టుకుని 'నో పీటర్ నో' అంటూ లాక్కుపోబడే దృశ్యం మైకెలేంజెలో, లెనార్డో దావిన్సీలు గీయనిది, గీయలేనిది.

అయ్యగారికంటే ముందు పింఛను పుచ్చుకుంటున్నందుకు తను అదృష్ట వంతుడు. ఆయనలేని కార్యాలయం దేవుడు లేని శిథిలాలయం.

రిటైరయిన ఉద్యోగస్తులు తమతమ పింఛన్ల నిమిత్తం వారిని కలుసుకునే సందర్భంలో విధిగా వేసే జోకు గుర్తుకొచ్చి పెద్దగా నవ్వుదామనిపించింది. అయితే, పీటర్ చావు ప్రస్తావనకు వచ్చిన ఈ సందర్భంలో బుద్ధిలేనివాడు చేసే పని అది. సంతానానికి అది వుంది అన్న విషయానికి నవ్వకపోవటంకన్నా రుజూ వేంకావాలి. మనలో మనం అది చెప్పుకోవచ్చు, 'నవ్వు' అనేది ఒకవేళ వస్తే ఆ పని కానియ్యవచ్చు.

"హిహ్హిహ్హి, ఊం.... నీ ఇన్నేళ్ళ సర్వీసులో తీసుకున్నది పింఛనే గదయ్యా! జీతమా? పని చేశావా పాడుచేశావా? హహ్హహ్హ...." (ప్రతిసారీ, నవ్వి నపుడు కన్నీళ్ళు వస్తాయి.)

అట్లాంటి అయ్యగారికి పీటర్ వియోగం! మనసంతా వికలమయింది.

అట్లాంటి వార్త చెప్పి బాధించటం చాలదన్నట్లు, హృదయంలేని కొత్త గుమాస్తా మరో సమ్మెట పోటు "ఈ క్రింది విధంగా" వేశాడు:

''మీ పింఛను....'' అని చెప్పబోతుంటే, మరోసారి వినకుండా జిగురు సీసా తీసుకుని ఎక్కడినించి తెచ్చాడో అక్కడ పెట్టి తిరిగి వచ్చాడు. ఆ పదార్థంలా కొత్త గుమాస్తా వదలకుండా అన్నాడు:

''మీ పింఛను 1207 రూపాయలుగా నిర్ధారించబడింది. ఇదిగోండి కాగితం.''

రెండవ సమ్మెట పోటుకు ఓర్చుకోలేక కుర్చీలోనించి సంతానం దిగ్గుమని లేచిపోయాడు. అంతగా ప్రేమిస్తూ వచ్చిన దాన్ని వెనక్కినెట్టి మాటలనే "ఈ దిగువ చెప్పబడిన" పిడుగులను కురిపించాడు. చిత్తగించ ప్రార్థితులు:

''జీ. వో. అయ్. (భారత ప్రభుత్వం!) ఉత్తరువు నెం॥ పెన్ పిపిపి ప్రకారం అంత పింఛను నాకు రాదు. మూడు రూపాయల పది పైసాలు తక్కువ వస్తుంది. జీ.వో. టిటిటి ప్రకారం చూసినా పది తగ్గుతుంది. అసలు ఆ ఉత్తర్వులు చదివారా? (గౌరవ సంబోధనకు ఈ కారణం వల్ల అనర్హుడిగా భావించి ఏకవచనంలోకి దిగాడు) చదివి అర్థం చేసుకున్నావా? నియమ నిబంధనలకు వ్యతిరేకంగా లెక్కలువేసి పింఛను సెటిల్-సివు చేస్తే చెయ్యొచ్చేమోగాని-దాన్ని తీసుకోడానికి నేను మాత్రం సిద్ధంగా లేను.''

బుసలుకొడతూ, వడివడిగా రాతిమెట్లు దిగి రోడ్డుమీదికి వచ్చి నిలబడ్డాడు సంతానం.

*

# అనివార్యం?

—విహారి

ఎడంచేతి చూపుడువేలికి కట్టుకున్న గుడ్డపీలికని సరిచేసుకున్నాడు రాజు. కత్తెర గాయం సన్నగా సలుపుతోంది.

టైమ్ చూశాడు. తొమ్మిదిన్నరయింది

షాపులో అందరూ బట్టల తానుల్ని సర్దుతున్నారు.

షాపు మూసే టైమయింది. సేట్ నోట్లకట్టల్ని లెక్కపెట్టుకుంటున్నాడు. ఒకరిద్దరు కష్టమర్లు బేరం పూర్తిచేసుకున్నారు. సేల్స్‌మెన్ ఒక్కొక్కరే కదిలి పైఅంతస్థుకి వెళ్తున్నారు.

ఇవ్వాళ జీతాల బట్వాడా. మొదటి అంతస్థులో సేట్ బావమరిది ఇస్తాడు.

రాజు బాగ్‌లో బట్టల్ని వుంచి తనముందున్న దంపతులకి ఇచ్చాడు. 'కొంచెం ఆలస్యమైనా చివరికి మంచి చీర దొరికిందండీ!' అంటూ మురిసిపోతోంది భార్య. 'ధర కూడా మంచిగానే వుందిలే పద' అంటూ బయటికి దారితీశాడు భర్త.

కౌంటర్‌లో చీరలూ, ఇతర తానులూ షోకేస్‌లో సర్ది, తానూ కదిలాడు రాజు.

మొదటి అంతస్తు రద్దీగా వుంది. జీతం తీసుకుని కిందికొస్తున్నారు ఒక్కొక్కరే. మెట్లమీద ఎదురైంది మాధవి. హేండ్‌బాగ్‌ని బుజానికి వేసుకుంటూ రాజుని ఉద్దేశించి 'గుడ్‌లక్' అంది. ఆగకుండా సాగిపోయింది. సన్నగా నవ్వుతోంది. అవును. ఆ పిల్ల విష్‌లోనూ, నవ్వులోనూ వ్యంగ్యం వుంది. అది రాజుకొక్కడికే తెలుసు. మాధవి తనపక్క కౌంటర్లో మ్యాచింగ్ బ్లౌజ్‌పీస్‌లు

చూస్తూ వుంటుంది. తమ కష్టసుఖాల్ని - అడపాదడపా - ఖాళీగా వున్నప్పుడు కలబోసుకుంటూ వుంటారు.

పైకి వెళ్ళి సేట్ బావమరిదికి కనపడేటట్లు ముందుకు వెళ్ళాడు. 'నువ్వుండు' అన్నాడాయన. దబ్బపండుచాయలో, రిమ్‌లెస్ జోడుతో, తెల్లటి బట్టల్లో అందంగా, ఆరోగ్యంగా, ఆనందంగా వుంటాడు ఆయన. 'తాగుతున్న యాపిల్ జ్యూస్‌ల మహత్యం' అనిపించింది రాజుకు. అతని మనసులో అప్పటి వరకూ పొడి పొడిగా వున్న అనుమానం, ముద్దముద్దగా మారుతోంది. మనసుకు బెజ్జం పడినట్లు - కోపం తొంగిచూస్తోంది. కారణం అతనికి తెలుసు. ఈ నెలలో మూడు రోజులు షాప్‌కు లేటుగా వచ్చాడు. మూడురోజులు లేటయితే ఒకరోజు జీతం తగ్గిస్తాడు సేట్. ఇది రూలు. ఈ రూలుని అమలు చేసేటప్పుడు విడిగా చిన్న ఉపన్యాసం ఇస్తాడు - సేట్ బావమరిది. అందుకే అతనిప్పుడు - రాజుని 'నువ్వుండు' అని ఆపింది.

స్టూలుమీద కూర్చున్నాడు రాజు. అతని మనసు పరిపరివిధాల పోతోంది.

మొదటిసారి లేటయిన రోజున తను పడిన అవస్థంతా గుర్తుకొచ్చింది. ఆ వేళ పధ్నాలుగో తారీఖు. బస్‌పాస్ కొనుక్కుని షాప్‌కి రావాలని బయల్దేరితే కోఠీచేరే దారిలోనే బస్ చెడిపోయింది. అక్కణ్ణుంచీ బస్‌లు మారుతూ గమ్యం చేరుకొనే సరికి పుణ్యకాలం కాస్తా మించిపోయింది.

రెండోసారి—

ఆ రోజు ఉదయం నుంచే జోరున వర్షం ప్రారంభమైంది. హడావిడిగా బయల్దేరి గుమ్మం దాటబోతుంటే - ఎదురుగా నీళ్ళ బిందెతో లోపలికొస్తున్న కమలని ఢీకొన్నాడు బిందెతోసహా కుప్పగా పడిపోయింది కమల. బిందె సొట్ట పడింది. కమలకి గట్టిదెబ్బే తగిలింది. కొద్దిసేపు ఈ సంభవంతో ఆలస్యమైంది.

మూడోసారి - చాదర్‌ఘాట్ అవతల ఏదో పార్టీ కార్యకర్తలు 'రాస్తా రోకో' నిర్వహిస్తుంటే, లేటయింది - బస్‌కి.

అయినా - కారణాలూ గట్రా సేట్‌కి అక్కర్లేదు. 'లేట్‌గా వచ్చావా లేదా?'బస్. అంతే. లేట్‌గా వచ్చావు గనుక - ఫలితం అనుభవించు!

రాజుకి నవ్వొచ్చింది. తన బాల్యం గుర్తుకొచ్చింది.

ఐదో తరగతిలో తమకు మాధవపెద్ది వెంకటేశ్వర్లుగారు టీచరు. ఆయనకి - క్లాసులో పిల్లల్ని అందర్నీ ఇంటిపేర్లతో పిలవడం అలవాటు. నెలలో మూడుసార్లు స్కూలుకి లేట్‌గా వస్తే - ఆ విద్యార్థి - గ్రౌండ్‌లో వున్న తాటిచెట్టు కింద ఒంటి కాలిమీద గంటసేపు నిలబడాలి. ఇదీ ఆయన నియమం. ఒకసారి - చిమటా వారబ్బాయి మాధవ మూడోవసారి లేటుగా వచ్చాడు. ఆయన బెత్తం పుచ్చుకుని రూమ్‌లో పచార్లు చేస్తూ, 'ఏరా - చిమటా! తాటిచెట్టు తెలుసా?' అని ప్రశ్న వేశాడు మాధవ అసలే కంగారులో వున్నాడు. పైగా భయం. వణికిపోతూ, గుమ్మంలోవాడు గుమ్మంలోనే ఒకటి చేసేశాడు. మాష్టారితో పాటు అందరమూ నవ్వేశాం. కానీ, ఆ తర్వాత జాలేసింది. క్రమశిక్షణకి మారు పేరయినా మా వెంకటేశ్వర్లు మాష్టారిది వెన్నవంటి మనసు. 'పోరా - వెధవా! ఇంటికిపో. కొట్టనులే. పోయి నెక్స్ట్ పిరియడ్‌కి రా' అని పంపించేశారు.

సేట్‌కి అట్లాంటి దయాదాక్షిణ్యాలేమీ లేవు. ఓనెల్లో మాధవికి కోత, మరో నెల్లో రామానుజంకి కోత. రామానుజమంటే సేట్ షాపు ప్రారంభించి నప్పుడు చేరి ఇరవై మూడేళ్ళుగా వుంటున్న సీనియర్ మోస్ట్ సేల్స్‌మన్. అప్పుడు ఒక రూమ్‌లో ప్రారంభించిన బట్టల కొట్టు అది. ఇవ్వాళ ఇది - నూటఅరవై మంది సేల్స్‌మన్ పనిచేస్తున్న - వస్త్ర ప్రపంచం!

''రాజూ!....'' పిల్చేడు, సేట్ బావమరిది ఆయన పేరు కమలేష్.

ఉలిక్కిపడి ప్రస్తుతంలోకి వచ్చాడు రాజు, జీతం అందుకున్నాడు. పక్కకి వచ్చి లెక్కపెట్టుకున్నాడు. ఎనిమిది వందలా డెబ్బయి రూపాయలు. కమలేష్ అన్నాడు, "రాజూ! ప్రతి నెలా నీ హాజరు పట్టీలో ఒకటీ రెండూ లేట్ మార్కులుంటున్నై. నేను మంచివాణ్ణి కనుక ఓపిగ్గా చూస్తున్నాను. నువ్ చాలా మారాలి. ఓ. కె. నువ్వెళ్ళు.''

ముల్లు గుచ్చుకుంది రాజుకు. నెమ్మదిగా బయటికి వచ్చాడు. ఈ ఆలో చనతోనే బస్‌స్టాప్ దాకా నడిచాడు. నిలబడ్డాడు. షాప్‌లన్నీ సీరియల్ లైట్లతో దేదీప్యమానంగా వెలుగుతున్నై. గుమాస్తాగాళ్ళంతా బయటపడుతున్నారు. తను ఇక్కణ్ణుంచి బస్ పట్టుకుని కోఠీ చేరాలి. అక్కణ్ణుంచీ వేరే బస్‌లో టెలిఫోన్ కాలనీ చేరుకోవాలి. పది కావస్తోంది కమల తన కోసం చూస్తూ వుంటుంది.

రోజూ ఇంతే. గూటికి చేరేసరికి పదకొండు. ఉదయం ఎనిమిదిన్నరకి షాపు గుమ్మం ముందు వుండాలి. రాత్రి తొమ్మిదిన్నర దాకా డ్యూటీ. మధ్యాహ్నం అర్ధ గంట లంచ్ అవర్!

నవ్వుకున్నాడు రాజు. అవర్ అని పిలుస్తూ - అర్ధ గంట విరామ మేమిటో! ఆ అర్ధ గంటలోనూ తను బాక్స్‌లో తెచ్చుకున్న మజ్జిగన్నం తినేది పది నిముషాలే. మరో పది నిముషాల్లోనే తను మళ్ళీ కౌంటర్లో కొచ్చేస్తాడు. కానీ, లేట్ మార్క్ వేసేటప్పుడు ఈ సమయాలకేమీ ముదరా దొరకదు. అయినా, తను అందరిలా ఖరాఖండిగా ఆ అర్ధగంట విరామాన్ని వాడుకోడు. ఇతరులతో చెప్పుకోవలసిన విషయాలుగానీ, ఇతరులనుంచి వినాల్సిన విషయాలు గాని ఏవీ కనపడవు తనకు ఆ అర్ధగంట విరామంలో.

బస్ వచ్చింది. ఎక్కి కూర్చున్నాడు.

రాజు ఇంటికి చేరేవరికి మిషన్ మీద ఏదో కుట్టబోతోంది కమల. అతన్ని చూసి ఆ ప్రయత్నం ఆపేసింది. అంతలోనే అతనన్నాడు "రాత్రుళ్ళు మిషన్ పట్టుకోవద్దన్నానుగా?" అని. అతని స్వరంలో మార్దవమే ఎక్కువగా ధ్వనించింది. 'లేదులెండి' అని, చిరునవ్వుతో 'మీరు స్నానం చెయ్యండి' అని కిరోసిన్ స్టౌమీద కాగి వున్న అల్యూమినియం గిన్నెని పాతగుడ్డతో పట్టుకుని దొడ్లోకి నడిచింది కమల. రాజు ఆమె వెంట నడిచాడు. రాజు స్నానం అయింది. ఈలోగా భోజనం ఏర్పాట్లు చేసింది కమల. ఇద్దరూ కూర్చున్నారు.

అన్నం తింటుండగా చెప్పింది కమల - "అత్తయ్య ఉత్తరం రాసింది. వారంనుంచీ జెరంట. దగ్గు తగ్గటంలేదుట. లతకి నాలుగోనెలట. సుధాకర్ సంగతేమీ తెలీలేదుట. చిన్నా, కళ్యాణి బాగానే వున్నార్ట."

మధ్య మధ్యలో ఊఁ కొట్టూ విన్నాడు రాజు. మొన్ననే అతికష్టం మీద మూడువందలు పంపింది కమల. దగ్గూ జెరం తగ్గటల్లేదంటే? - రాజుకి యమేసింది. టీ.బీ.తో పోయిన తండ్రి గుర్తుకొచ్చాడు. 'అమ్మకూడా అలాంటి మైనా....?' ఆలోచించలేకపోయాడు. లతకి నాలుగో నెల అంటే - ఆ తర్వాత లా ఖర్చులు వస్తాయి. సుధాకర్ సంగతి ఏమీ తెలీదు - ఎక్కడికి వెళ్ళాడో? చేస్తున్నాడో?

రాజుకి తమ్ముడు గుర్తుకొచ్చాడు. కాలేజీలో చేర్పించలేనన్నదని అమ్మ మీద అలిగి ఇంట్లోనుంచి వెళ్ళిపోయాడు. ఇప్పటికప్పుడే మూణ్ణెల్లు దాటింది. ఎంతగా వాళ్ళ బాధ్యతని తాను తీసుకోవాలనుకున్నా, తమ పరిస్థితి అంత మాత్రంగానే వుంది. తనకు వచ్చేది తొమ్మిదివందల జీతం. దాన్లో ముందు నూట యాభై బస్‌పాస్‌కి పెట్టాలి. ఇంటి అద్దె మూడువందలు. అదీ ఈ పేటలో, ఈ ఇంట్లో కనుక. రెండు గదులు పైన పెంకులు - సూర్యచంద్రులకి జల్లెడలా నిలుస్తున్నై. అంతే పెరట్లో చుట్టు తిరిగి, ఇంటివాళ్ళ దొడ్లోనుంచి తెచ్చు కోవాలి నీళ్ళు.

నిజానికి తమ ఇద్దరి పొట్టలూ గడవడానికి ఈ జీతం రాళ్ళు ఏ పాటివి? నగర జీవనంలోని ఏ ఆకర్షణకీ లోనుగాకపోయినా, చేతికీ నోటికీ చాలవు. అందు కనే వేణ్ణీళ్ళకి తోడు చన్నీళ్ళలా కమల కుట్టుమిషన్ పెట్టుకుంది. అబ్బనాకారి ఆరోగ్యం ఆమెది. అయినా, తనను ఒప్పించి పాత మిషన్ తీసుకుంది - వాయి దాల్లో డబ్బు ఇచ్చేటట్లు ఆ అప్పు తీరిన తర్వాత గడించిన నాలుగు రాళ్ళే మొన్న అమ్మకి పంపిన మూడువందలు.

ఆలోచనతోనే అన్నం అయిందనిపించాడు, రాజు కాంపౌండ్‌లోకి నడిచాడు. దూరంగా రోడ్డుమీద లారీలు పోతున్న శబ్దం వినిపిస్తోంది.

ఇంటి ముందు నైరు మంచం వాల్చుకుని పడుకున్నాడు రాజు. కమల ఇల్లు సర్దుకుంటోంది. రాజు మనస్సును ఆలోచనలు వెంటాడుతూనే వున్నై. పల్లెలో చిన్నా వ్యవసాయానికి తీసుకున్న కౌలుమీద రాబడి వాళ్ళకి అంతంతగా సరిపోతుంది. ఇక్కడి తన పరిస్థితి - గొఱ్ఱెతోక చందంగా వుంది.

తన తలపుల్లో తానే మెదిలాడు. పదేళ్ళ క్రితం నగరానికి వచ్చాడు తను. పదోతరగతి అయినవాడికి ఉద్యోగాలు ఉరుక్కుంటూ వస్తాయా? పేపర్‌బాయ్‌గా చేరాడు. రెండు పూటలా కడుపు నిండలేదు. కొరియర్స్‌లో డెలివరీ బాయ్‌గా చేరాడు. బస్‌పాస్ ఇచ్చారు వాళ్ళు కానీ, ఆ తిరుగుడూ, ఉత్తర భారతం వాడి హిందీ తిట్లూ - తనకు పడలేదు. సాయంత్రం పూట తన చేతికి ఇచ్చిన ఉత్తరాన్నో, పార్సెల్‌నో - ఆ ఉదయమే ఎందుకు డెలివరీ చేయలేదని అడ్డగోలుగా అడిగేవాడు ఆ యజమాని. ఆ తర్వాత ఏదో కంపెనీలో సెక్యూరిటీ గార్డ్‌గా చేరాడు. అక్కడ రాత్రి డ్యూటీలు, పెళ్ళయిన రెండో వాడికి పగలూ, తనకు

రాత్రి కేటాయించారు. రెండో నెలలోనే తనకు ఆరోగ్యం చెడింది. కారణం తను ఎంతగా ప్రయత్నించినా పగలు తగినంత నిద్రపోలేకపోవడమే. అది మానేసిన తర్వాతే ఈ వస్త్ర ప్రపంచంలో చేరింది.

పల్లెలో వుండగా - నగర జీవనాన్ని గురించి తను కన్న కలలేవీ ధాన్యపు పురులో, బంగారు మొహరీల సంచులో కాలేదు. అయితే, తన వారికి తనను గురించి మాత్రం దొడ్డ ఆశలే వుండేవి.

సీతాకోక చిలుక వెంట పరిగెత్తే పిల్లలా, అమ్మ తన పెళ్ళి ప్రసక్తి వెనుక పరిగెత్తసాగింది. డబ్బులేక ఎండిపోతున్న తన ఊహల్ని - మామయ్య ముందుకూడా - వాస్తవాల ఏకుల బుట్టలా - పరచాడు. అయినా ఆయనా, అమ్మా - తనని ఊపిరి సలుపనీయలేదు. వీళ్ళకి తోడు కమలకూడా, మేన మామ కూతురుగా - తనమీద ఆమెకున్న అధికారాన్ని చెప్పి చెప్పకుండా చెప్పింది. పెళ్ళి జరిగింది!

పల్లెలో బక్కరైతు కూతురు నగరంలో బట్టలకొట్టు గుమాస్తా భార్య అయింది. కమలతో కాపురం పెట్టాడు తను. జంట బతుకు సమస్య కొద్దికొద్దిగా అర్థమౌతూ వచ్చింది, ఇద్దరికీ కొత్త అవసరాలూ తెలిసివచ్చినై.

తమ ఆర్థిక పురోగమనానికి-ఏ చక్రాన్ని ఆధారం చేసుకున్నా-ఊసుల్లో, ఊహల్లో ఎంతెంత దూరం పరిగెత్త కలిగినా - వాస్తవపు గొంగళి అంగుళం కూడా కదలదనేది సత్యవాక్కులా చల్లగా తగిలేది. అంకెల్ని ఎటువేసి, ఏవైపు కూడినా, దేన్నుంచీ దేన్ని తీసివేసినా - చివరికి 'ఋణ' ధృవం బరువు అధికమనే తెలిసివచ్చింది.

కమలకూ తనకూ మధ్య చిరుకోపాలూ, చిన్న చిన్న వాగ్వాదాలూ చాలాసార్లు వస్తూ వుండేవి.

ఎన్ని ఆదివారాలు - పగటివేళలు - గడప దాటలేక ఆలోచనల చిరు తిండి తింటూ గడిపినా - తన జీతం - కనీసావసరాల ఖర్చుల్ని సమానం చేయలేదని తేలిపోయింది.

అలాగని, తాము పెద్దగా ఆశాభంగం పొందిందీ లేదు. తమ వ్యాకులత అంతా పల్లెలో వున్న తమవారి గురించే. వారికి తాము ఎలా సహాయపడ మనే. ఈ కోరికనుంచి జనించిన ఆలోచనే కుట్టుమిషన్ - కమల ధైర్యంగా

ఆచరణలో పెట్టింది. 'ఆరోగ్యం జాగ్రత్త' అనే ఒక్క సూచన మాత్రం ఆమెకు తాను పాటికి పదిసార్లు చేస్తూ వున్నాడు....

—కమల వచ్చి మంచం మీద కూర్చుంది. 'ఏఁవిటి బావా, ఆలోచిస్తున్నావ్?' అడిగింది. ఆమె రాజుని ఇప్పుడూ బావా అనే సంబోధిస్తుంది.

రాజు ఆమెకేసి చూశాడు. విరిసిన సంపెంగలా వుంది. పచ్చని మొహం మధ్య స్వచ్ఛమైన, మనోజ్ఞమైన నేత్రాలు - చుక్కపూలలా మెరుస్తున్నై.

'ఊఁ' అన్నది మళ్ళీ. సర్దుకుని కూర్చుంది, వెనక్కి.

ఊపిరి తెచ్చుకుని అన్నాడు రాజు, "జీతంలో ముప్ఫై రూపాయలు తగ్గినై ఈ నెల. అమ్మవాళ్ళ సంగతి ఆలోచించాలి."

''ఫర్వాలేదు - కానియ్ చూద్దాం'' అని, ''చలిగాలిగా వుంది. లోపలికి పోదాం'' అంటూ లేచింది. రాజూ లేచాడు....

—తెల్లవారింది. ఆవేళ ఆదివారం - రాజుకు సెలవురోజు.

పది దాటింది.

స్నానాలయినై. రాజుకు దగ్గరగా కూర్చుని కూర తరుగుతోంది కమల. అదిగో అప్పుడు వచ్చాడు సుధాకర్.

పరామర్శలు అయినై. తమ్ముడిమీద కోపగించుకున్నాడు రాజు. మధ్య మధ్య కమలే కల్పించుకుని, వాతావరణాన్ని కాపాడుతూ వచ్చింది. సుధాకర్ చాలా కటువుగా తెగేసి చెప్పేశాడు: ''నేనా ఊళ్ళో వుండి ప్రయోజనం లేదు. వాళ్లూ వీళ్లూ కష్టపడుతున్నారని ఏ బాధ్యతనీ నెత్తినేసుకోలేను. నా దారి నేను చూసుకోవాలనే వచ్చేశాను. ఈ మూణ్ణెళ్ళల్లోనూ - ఇదిగో, ఈ ఉద్యోగంలో కుదురుకున్నాను. జవానుద్యోగమని నాకేమీ నామోషీ లేదు. వచ్చే అరొందల్లో నా పొట్ట నేను పోషించుకోగలను.''

తమ్ముడి అనుభవ రాహిత్యానికి నవ్వొచ్చింది రాజుకు. తానూ మొదట్లో ఇట్టాగే అనుకున్నాడు. వచ్చే ఆరువందల్లో అద్దె భరించాలి. బస్ ఛార్జీలు. ప్లేట్ మీల్స్‌తో గడిపినా-కొన్ని రాత్రులు నీళ్ళుతాగి, కడుపులో కాళ్లెట్టుకోవాల్సిందే! టీ నీళ్ళకి కూడా వెనకా ముందూ చూసుకోవాలి!....

ముగ్గురూ భోంచేశారు.

అప్పుడు అన్నాడు సుధాకర్: 'మీకు ఇబ్బంది కాదనుకుంటే ఇక్కడుంటాను. లేకపోతే - కూకట్‌పల్లిలో వొక ఫ్రెండు గది వుంది. అక్కడే చేరతాను.'

ఈ మాటలకి, రాజూ కమలా ఇద్దరూ నొచ్చుకున్నారు. సుధాకర్‌కేసి చూశాడు రాజు. 'ఏంటిరా సుధా నువ్వనేది?' అన్నాడు.

కమల అందుకుంది: 'మనవాళ్ళు మనకే ఇబ్బంది కావడమేంటి సుధా?' అని, 'మాతోపాటే వుండు. కానీ, ఇంతదూరంనుంచీ నీ ఆఫీస్‌కి వెళ్ళడం కష్టమౌతుందేమో - ఆ సంగతి ఆలోచించుకో' అంది.

ఆ ప్రసక్తి అంతటితో ఆగింది.

సాయంత్రం వెళ్ళిపోయాడు సుధాకర్.

మర్నాడు రాత్రికి సూట్‌కేస్‌తో దిగాడు ...

రోజులు గడుస్తున్నై....

తల్లి ఆరోగ్యం గురించి రాజు సందేహించినంతా జరిగింది. ఆమె రోగానికి మందులూ, తిండీ ఖర్చు గడవడం కష్టమైపోయింది.

పులిమీద పుట్రలా - ఆ ఏడు ఉప్పెనతో పంటలు పోయినై. రాజూ కమలా పల్లెకి పోయి తమ కష్టాల్ని గురించి మాట్లాడారు. చివరికి కమల తండ్రి సలహా మేరకు తల్లీ, తమ్ముడూ, చెల్లెలూ కూడా పట్నం చేరారు. ఇల్లు మారడం తప్పనిసరి అయింది. ఇంకో వంద ఎక్కువిచ్చి మూడుగదుల ఇల్లు తీసుకున్నారు. చిన్నా తనంతతానుగా కూరలబండి మొదలెట్టాడు. తల్లి కళ్ళనీళ్ళు పెట్టుకుంది. గతంలో పల్లెజీవితం - భర్త వున్నప్పుడు తమ సంసారం బతికినతీరూ - గుర్తు చేసుకుని బాధపడింది.

రాజుకి ధైర్యం కమల. కమలకి స్థైర్యాన్నిస్తున్న బలం రాజు. ఇద్దరి ముగ్గురి సంపాదనా - బొటనవేలు నోట కరచుకుని పెరుగుతున్న శిశువులాగా, నిస్తేజంగా, నిస్సారంగా వుంటోంది.

ఒకరోజు,

రాత్రి—

ఒకరి మాటల్లోని వెచ్చదనాన్ని వొకరు అనుభవిస్తూ, ఒకరి మమతని ఒకరు పంచుకుంటున్న తరుణంలో - ఉన్నట్టుండి ఒళ్ళు ఝల్లుమంది రాజుకూ, కమలకూ.

ఈనాటి యదార్థం, రేపటి వాస్తవం - వొకేసారి చీకటి దుప్పటిలా మీద వాలాయి. ఉద్వేగం కాలికాలి చల్లారిపోయింది.

ఒకరి భయాన్నీ, బెరుకునీ భరించడానికి మరొకరు తోడున్నారని - ఒకరికొకరు చెప్పుకున్నారు. తమ బతుకుని తాము అర్థంచేసుకున్న రీతిలో - వివేకాన్ని విచక్షణనీ రంగరించుకుని విశ్లేషించుకున్నారు కలుగబోయే పరిణామాలూ, పర్యవసానాలూ కూడా చర్చించుకున్నారు.

ఇద్దరూ - విడివిడిగా, జంటగా - ఒకే నిర్ణయానికి వచ్చారు.

నారు పోసినవాడు నీరు పోస్తాడనీ, ఏదో జరిగిపోతూవుటుంది లెమ్మని - ఒక మార్గంలో పోవడంకన్నా, ఉన్న పునాది మీద నిర్మాణం గురించి ఆలోచించడమే, జీవన లిపి అనేదే రాజూ కమలా చేసుకున్న నిశ్చయం.

ఆ మర్నాడు ఉదయాన్నే తమ నిర్ణయాన్ని అమలు చేశాడు రాజు. తన కర్తవ్యాన్ని తాను నిర్వర్తిస్తున్న డాక్టరు మాత్రం - మనసులో బాధపడుతూనే వున్నాడు. 'తెలిసి తెలిసీ నేరం చేస్తున్నారేమో!' అని అన్నాడు రాజునీ, కమలనీ ఉద్దేశించి.

రాజు సన్నగా నవ్వుకున్నాడు. ఎప్పుడో చదువుకున్న వాక్యాలు గుర్తుకొచ్చినై - ''దండింపవలసిన నేరమే లేదు లోకాన. చికిత్స చేయవలసిన రోగమే కాని!''

ఇద్దరికీ చివరికి మిగిలింది - ఆత్మగీత! *

# విడియోమోషన్

—బీనాదేవి

మా ఇల్లెప్పుడూ సంతలా ఉంటుంది.

ఆ వేళ పండుగ రోజుల్లో సంతలా ఉంది.

పీక్ అవర్లో సికింద్రాబాద్ స్టేషన్లా ఉంది.

డ్రాయింగ్ రూం నిండా సోఫాల్లోనూ, కుర్చీల్లోనూ, స్టూలు మీద అంతా మా మనవడు, వాడి గేంగ్.

ఎవరికీ ఇరవై ఏళ్ళు నిండలేదు.

ఎవరికీ మీసం, గెడ్డం పూర్తిగా రాలేదు.

అదిగో- ఆ సోఫాలో మా వాడి పక్కన కూర్చున్న అబ్బాయి ఆనంద్.

అతని జోళ్ళు పదిహేను వందలు.

అతని షర్టు వెయ్యి పైనే.

చెవికి బంగారం రింగు.

మెళ్ళో ముత్యాల గొలుసు.

చేతికి బంగారు కడియం.

జుత్తు చక్కగా పైకి ఎగదువ్వి, రబ్బరు బేండ్‌తో చిన్న పిలక వేసుకున్నాడు.

పేంట్, షర్టు తీసేసి జరీ కండువా, పంచ కడితే రాయల కాలం నాటి పురోహితుడిలా ఉన్నాడు ఈ జుత్తు బాధ పడలేక అప్పుడప్పుడు నాకు మొగాళ్ళలాగా క్రాపు చేయించుకుంటే ఎంత హాయిగా ఉంటుందో అనిపిస్తుంటే!

మరి ఈ మగపిల్లల కీ పిలక వ్యామోహం ఏమిటో!

ఇదంతా స్టార్ టి. వి మహత్యం.

ఇంతకీ ఈ సంత గోల ఎందుకో?

ఏఁవిఁటి ఆ స్పెషల్ ఎట్రాక్షన్?

అదే అడిగేను మా వాడిని "ఏఁవిఁటిరా సంగతి" అని.

మరేంలేదు వీడియో ఫేషన్ షో అట.

ఏ "షో" అయినా నాకు ఒకటే.

కాకపోతే మా వారు ఇంట్లోనే ఉన్నారు. ఇంత గోల ఆయనకి నచ్చదు. గోల చెయ్యద్దంటే వీడికి నచ్చదు.

కరవమంటే కప్పకోపం, విడవమంటే పావుకోపం.

మరంచేత మా వాడ్ని పక్క గదిలోకి పిల్చి "వీళ్ళెవరికీ టి. వి. లు లేవేవిఁట్రా?" అనడిగేను, వాడికోపం రానంత నెమ్మదిగా. కాని, నా అంచనా తప్పు.

వాడికోపం సర్రున వచ్చేసింది.

"వాళ్ళేం ముష్టి వెధవలనుకున్నావా? (నువ్వు ముష్టి వాళ్ళతో ఫ్రెండ్ షిప్ చేస్తావని నేను కలలో కూడా నమ్మనురా అబ్బీ!) అందరికీ ఫారెన్ టి.వి. లున్నాయి. మనింటికొచ్చి ఈ ముష్టి టి.వి. చూడాల్సిన ఖర్మ వాళ్ళకేం పట్ట లేదు" అని కస్సుమన్నాడు.

"మరిప్పుడెందుకు పట్టిందో?"

"ఏఁవిఁటి?"

"ఖర్మ!"

"నీ చిన్నప్పుడు టి వీ.ల్లేవుకదా! అంచేత నీకు చెప్పినా అర్థం కాదులే" వెధవ వ్యంగ్యం నవ్వొకటి.

నాకూ కోపం ఎక్కువే.

కాకపోతే ఆడదాని కోపం అసలుకే మోసం.

అంచేత "పోనీ. నాకు అర్థం అయ్యే భాషతోనే చెప్పొచ్చుకదా?" వీలై నంత శాంతంగానే అన్నాను.

"కొన్ని ప్రోగ్రామ్స్ అందరం కలిసి చూస్తేనే ఎంజాయ్ చేస్తాం."

"గాంగ్ రేప్‌లాగ?"

తుళ్ళిపడ్డాడు గాడిద.

"అమ్మా, నీకు సున్నితంగా మాట్లాడం రాదా?"

"రాదు. నన్నేం చెయ్యమంటావు? నా జాతకంలో సున్నితమైన గ్రహాలేం లేవుట. పైగా, వాక్ స్థానంలో శని ఉన్నాడు. మరింక నా భాషే అంత" అంటూ ఓ కుర్చీలో కూలబడ్డాను.

"నువ్వూ చూస్తావా?" వాడి మొహంలో ఆశ్చర్యంకంటే విసుగు ఎక్కువ కనిపించింది.

ఔను మరి. నేనుంటే వాళ్ళు ఫ్రీగా కామెంట్ చేసుకోలేరు. నాకు మాత్రం ఈ ప్రోగ్రాములు ఇష్టవాం! కాని, అప్పుడప్పుడు ఇలాంటి శిక్షలు భరించక తప్పదు మరి. కారణం - మావారు ఆఫీసు గదిలో ఉన్నారు. గాలివానలాంటివి వార్నింగు ఇచ్చి మరీ వస్తాయి. కాని, మావారు భూకంపంలా విదౌట్ వార్నింగ్ వస్తారు. మరి ఆయన్ని కొంచెం సాఫ్ట్ డౌన్ చెయ్యాలంటే నేనుండక తప్పదు.

"నేను చూడకూడనివి ఏం లేవులే" అన్నాను, టేబిల్ మీదున్న పుస్తకం తీస్తూ.

నేను భయపడ్డ భూకంపం రానే వచ్చింది.

"ఏమిటి? ఇక్కడేదో సమ్మిట్ కాన్ఫరెన్సు జరుగుతోంది- నేను రావచ్చా?" అంటూ మావారొచ్చి నా పక్కనే కూర్చున్నారు.

అప్పుడు చూడాలి వాళ్ళందరి మొహాలు.

అందరి తల్లిదండ్రులు ఒక్కసారే పోయినట్టు అతి దీనంగా పెట్టేరు మొహాలు. పోనీ, మరో ఇంటికి పోదామంటే టైములేదు. ప్రోగ్రాం ప్రారంభించడానికి మరో మూడు నిమషాలే ఉంది.

ఆ మూడు నిమషాలూ శ్మశాన నిశ్శబ్దం.

పిన్ డ్రాప్ సైలెన్స్ అన్నమాట నాకు అప్పుడే అర్థమైంది.

నాలుగో నిమిషం....

ప్రోగ్రాం ప్రారంభమైంది.

స్టేజీ, సెట్ అంతా బ్రహ్మాండంగా ఉంది.

అంత అద్భుతమైన ఫోటోగ్రఫీకి జోహార్లే.

మ్యూజిక్‌కూడా వినబుల్‌గానే ఉంది.

తెరలోంచి ఇద్దరమ్మాయిలు వచ్చేరు.

"పీళ్ళు అమ్మాయిలేంవిఁటి? ప్రౌఢలే. వాళ్ళకి లైఫ్ బిగిన్స్ ఎట్ ఫార్టీకాని మనకి లైఫ్ ఎండ్స్ ఎట్ ఫార్టీ. మరంచేత పీళ్ళు ప్రౌఢలే...."మావారి కామెంట్.

ఇద్దరమ్మాయిలూ గెడకర్రల్లా ఉన్నారు. చెరో పక్క నిలబెట్టి తాడుకట్టి బట్టలారేసుకోవచ్చు.

"ఈ గుంటలేంవిఁటి ఇలా ఉన్నారు? స్లిమ్‌గా ఉండడం ఫేషనేమో కాని సరసానికి మాత్రం బావుండదు ఏవంటావు?" మావారి గుసగుస.

''కాసేపు మాట్లాడొద్దంటాను.'' విసుక్కున్నాను.

స్టేజిమీద అమ్మాయిలు హొయలు ఒలకబోస్తూ నడుస్తున్నారు.

ఒకమ్మాయి గుండెలమీద ఓ వెడల్పు రిబ్బనంత గుడ్డముక్క కప్పుకొని వీపుమీద ముడేసుకుంది బేండేజి వేసుకున్నట్టు.

మొలమీద మూరెడు గుడ్డ చుట్టబెట్టుకుంది. అంత చిన్న గుడ్డ పడి పోకుండా ఏం చేసిందో తెలీలేదు.

రెండో అమ్మాయి గుండెలమీద ఏం వేసుకోలేదు. వరసగా పూసల దండలు పేర్చుకుంది.

వీపంతా ఖాళీ.

మూడేళ్ళ పిల్లకి సరిపోయే లాగు తొడుక్కుంది ఆ లాగు నిండా పూసలు, గవ్వలు మువ్వలు.

ఆ పిల్ల ఆ పూసలు కదలకుండా సర్కస్‌లో వైరుమీద నడిచినట్టు అతి లాఘవంగా నడుస్తోంది.

భుజాలమీద తెల్లటి దేవతా వస్త్రం లాంటిది వేలాడుతోంది.

''దాన్ని 'సీ-త్రూ' అంటారు '' గొణిగేడు ఆ గాంగ్‌లో ఒకడు.

మా వారివి పాముఁ చెవులు. విననే విన్నారు.

''ఆ రెండో అమ్మాయి గో...,'' అంటున్న మావారి నోరు తక్కున మూసేసేను.

"ఆ బొడ్డూడని గుంటడికి లేని సెన్సారు నాకేవిఁటి? డోన్ట్ బి సిల్లీ" అని అంత తక్కున నా చేయి తోసేశారు.

భగవాన్! భగవద్గీత బోధించి కురుక్షేత్రం చేయించావు. ఏ గీత బోధిస్తావో కాని ఈ కురుక్షేత్రం ఆపించు.

నా వెర్రిగాని అది పురాణయుగం కాబట్టి భగవంతుడి మాట చెల్లింది.

ఈ యుగంలో చెల్లదు.

నా అదృష్టం బావుండి ఆ అమ్మాయిలు వెళిపోయేరు.

ఈసారి మరో ఇద్దరమ్మాయిలు, ఒక అబ్బాయి వచ్చేరు

అబ్బాయిలు పాపం ఒంటి నిండా బట్టలు కట్టుకున్నారు.

ఒక అమ్మాయి బట్టలు ఉండవలసిన చోట్లలో రంగుల్తో పువ్వులు, లతలు పెయింట్ వేయించుకుంది.

రెండో అమ్మాయి ఒళ్ళంతా అరంగుళం జాగా లేకుండా రంగులు వేయించుకుంది.

"వీళ్ళిద్దరూ చెట్లకి మనిషి బుర్రలు కాసినట్లున్నారు. పాపం! ఎవడు వేశాడో కాని ఆ ఆర్టిస్టు - ఐ రియల్లీ పిటీ హిమ్." గొణిగేరు మావారు.

అందరమ్మాయిలు కొంచెం తేడాతో అదే వేషం. అందరూ రావడం, కాస్సేపు వీపు, కడుపు చూపించడం, వానావానా చల్లప్ప తిరగడం, వెళ్ళిపోవడం.

ఇంతలో వీధిలో ఎవరో పిలిచినట్లైంది.

"ఎవరో చూడు." మావారు మనవఁడ్ని పురమాయించేరు.

వాడు విసుక్కుంటూనే వెళ్ళి తలుపు తీశేడు.

ఒక్క నిమిషం ఆగి ధబ్‌మని తలుపేశేసేడు "ఛీ! ఛీ!!" అంటూ.

"ఎవర్రా?"

"ఎవరో ముష్టిది?"

"దానికంత విసుకెందుకూ? పిడికెడు బియ్యమో, డబ్బో ఇచ్చి పంపించవచ్చు కదా?" మావారూ విసుక్కున్నారు.

నేను లేచి వెళ్ళేను

గుమ్మంలో ఒకమ్మాయి నిల్చుంది.

ఒక్క నిమిషం మెరుపు మెరిసినట్టైంది.

ఎవరీవిడ?

ఇంద్రలోకంలో నుండి జారిపడిన అప్సరసా?

దారితప్పిన గంధర్వకన్యా?

దుష్యంతుడి శకుంతలా?

ప్రవరుడి వరూధినా?

ఏ మునీశ్వరుడి శాపంవల్లో భూమ్మీదకొచ్చిన దేవతా కన్యా?

ఏఁవిఁటీ అందం?

ఏ ఏడ్ ఏజెన్సీవాడో చూస్తే ఎగరేసుకుపోడూ!

వయసు పాతిక మించదు.

ఈ అమ్మాయి కూడా గుండెలమీద ఓ తువ్వాలంత గుడ్డ కప్పుకుంది.

నడుముకి మరో తువ్వాలంత గుడ్డ చుట్టుకుంది. ఓ చేతిలో చంటిపిల్ల, ఆ పిల్ల తువ్వాలులో తలదూర్చి తల్లి దగ్గర పాలు తాగుతోంది. తలుపు చప్పుడుకి కాబోలు తల బైటపెట్టి చూసి, పలకరింపుగా ఓ చిరునవ్వు విసిరి, మళ్ళీ తల దూర్చేసింది.

గబుక్కున లోపలికి వెళ్ళి ఓ పాత చీర, రెండు గౌన్లు తెచ్చి ఇచ్చేను.

దణ్ణం పెట్టి వెళ్ళిపోయింది.

లోపలికి రాగానే "ఎందుకమ్మా చీర ఇచ్చేవు?" అని నిలేశాడు మా మనవఁడు.

"మీకు తెలీదు ఆంటీ! వీళ్ళకి బట్టలు లేక్కాదు. మనం జాలి పడతాఁవని అలా వేషా లేస్తారు. మనం ఇచ్చిన బట్టలన్నీ అమ్మేస్తారుట" అన్నాడు ఆ గేంగ్‌లో ఒకడు. వాడెప్పుడూ తల పైకీ, కిందకీ అచ్చు తొండలా ఆడిస్తాడు. పైగా, మొహం కూడా కొంచెం కోలగా తొండ మొహంలాగే ఉంటుంది. మేము వాడ్ని "తొండ" అనే అంటాం. వాడిలోవున్న గొప్పతనం ఏవిఁటంటే వాడేం ఫీలవడు.

నాకు బాగా చిర్రెత్తుకొచ్చింది.

పేంటు తొడగ్గానే పెద్దవాళ్ళమైపోయా మనుకుంటారు. అనుకుంటే పరవాలేదు.

అన్నీ వాళ్ళకే తెలుసనీ, పెద్దవాళ్ళు ఒట్టి ఫూల్సనీ కూడా అనుకుంటారు.

ఈ గాడిదలకి ఒక గుణపాఠం చెప్పాలి.

నేనెందుకూ?

ఓ చిన్న సమిధ విసిరేస్తే మావారు హోమం అయిపోరూ!

''ఒరే లల్లూ! ఈ ఫేషన్ షో అమ్మాయిలు కూడా పాపం, మన జాలి కోసమే అలా చేస్తున్నారంటావా?'' ఒక సమిధ విసిరేను.

''ఛీ! వాళ్ళకి మన జాలి ఎందుకూ? బోలెడు బట్టలుంటాయి వాళ్ళకి'' అన్నాడు మావాడు.

''ఈ ఫేషన్ షోలలో పార్టిసిపేట్ చేసినందుకు వాళ్ళకి లక్షలిస్తారు'' అన్నాడు ఆ 'తొండ' కుర్రాడు తల పైకీ, కిందికీ ఆడిస్తూ.

''జాలికోసం కాదు, బట్టల్లేకా కాదు- మరెందుకు విప్పుకుంటున్నార్రా పిల్లా?'' రెండో సమిధ విసిరేను. ''డబ్బుకోసవేఁ కదా?'' అని కూడా కలిపేను.

''అబ్బా! నీకు తెలీదు. ఒకరు చెప్తే వినవు. అసలు ఈ షోలలో తీసుకోవడవేఁ ఓ ప్రిస్టేజి.'' వివరించేడు మావాడు.

''ప్రిస్టేజికి ఎంత మంచి అర్థం చెప్పేడో విన్నావా?'' మావారి మొహంలో నేను విసిరిన సమిధలు కనిపిస్తున్నాయి.

''ఒరే లల్లూ....నాకు తెలీకడుగుతానూ....తెలీకేలే.... ఔట్ ఆఫ్ షీర్ ఇగ్నోరెన్స్ (మావారి క్రోధం ఎప్పుడూ ఇంగ్లీషులోనే వస్తుంది) - మరి మా చిన్నప్పుడు ఈ టి.వీ. లు వగైరాల్లేవు కదా .... " ఎఫెక్టుకోసం ఆగేరు.

ఎఫెక్టు రావలసినదానికంటె ఎక్కువగానే వచ్చింది.

గేంగ్ అంతా గజం బద్దల్లా నిటారుగా సాగేరు.

అందరి మొహాల్లోనూ టెన్షన్.

మర్డరుకేసు జడ్జిమెంటునాటి ముద్దాయిల్లా ఉన్నారు.

''ఈ అమ్మాయిలు డబ్బుకోసవేఁ... ఐ మీన్ ఏజ్ ఎ ప్రొఫెషన్........ కేవలం డబ్బుకోసవేఁ ఇలా గుడ్డలిప్పుకుంటున్నారు.... అంతేనా?''

"విప్పుకోవడం లేదు.'' మా మనవడు సరిదిద్దబోయేడు.

''సరే.... సరే.... ఐయామ్ సారీ.... వెరీవెరీ సారీ.... విప్పుకోపటం లేదు అన్నది తప్పు ప్రయోగం. యు ఆర్ రైట్. టు బి ప్రిస్టైజ్ కట్టుకోవడం లేదు....'' అగ్నిహోత్రం అంటుకుంది. ఈ నిప్పు ఇంక చల్లారదు.

''అబ్బ ఏమిటి నాన్నా! ఇది కోర్టుకాదు- క్రాస్ ఎక్జామిన్ చెయ్యడానికి. ఏదో సరదాగా టి.వి. చూద్దామంటే పెద్ద రాద్ధాంతం....'' లేవబోయేడు.

అంతవరకు కూర్చున్న మావారు లేచి నిల్చుని సిగరెట్ అంటించేరు. అంటే కొంచెం సీరియస్‌గానే ఉన్నారన్నమాట!

ఆయన మా వాడి దగ్గరకెళ్ళి భుజం మీద చెయ్యేసి కూర్చోబెట్టేరు.... "కూర్చో, కూర్చో. రాద్ధాంతంకాదు- సిద్ధాంతం. ఇది కోర్టుకాదని నాకు జ్ఞాపకం చేసినందుకు థేంక్స్. యువర్ ఎప్రోచ్ టువర్డ్స్ లైఫ్.... అంటే తెలుగులో ఏమంటారే అమ్మీ.. జీవితంపట్ల నీ దృక్పథం.... అది తప్పని చెప్పటం... ''

ఫ్రెండ్స్ ముందు అలా పాఠాలు చెప్పించుకోవటం వాడికి సుతరామూ ఇష్టంలేదు.

''పోనీ, తరవాత చెప్పొచ్చుకదా?" అని వాడి బాధ.

మరే తప్పుచేసిన అర్నెల్లకి, నీకు జ్ఞాపకం వచ్చినప్పుడు, వాడికి తీరిక దొరికినప్పుడూ కాదు. ఏ తప్పైనా వెంటనే దిద్దకపోతే, ఆ తప్పు పెద్దవాళ్ళది అన్నది మావారి థియరీ.

వాడి ఫ్రెండ్సుకి ఇబ్బందిగానే ఉంది. అంచేత వెళ్ళడానికి లేవబోయేరు.

ఆడియన్స్ లేకపోతే మావారికి మూడ్ రాదు.

''కూర్చోండి....కూర్చోండి...."

అందరూ ముళ్ళకుప్పలమీద కూర్చున్నట్టు కూర్చున్నారు.

''మిమ్మల్ని ఫేషన్ షోలు చూడొద్దని చెప్పను. న్యూడ్ షోలు కూడా చూడండి. ఆ వయసు అటువంటిది. అంతా మంచే చూస్తే చెడు ఎలా తెలుస్తుంది? చెడు చూడాలి, దాన్నుండి ఒక పాఠం నేర్చుకోవాలి. ఏమంటారు?''

ఔనన్నట్టు అందరూ తలాడించేరు.

"ఆ ఫేషన్ షోలలో అలా గుడ్డలిప్పుకున్నందుకు- ఐయామ్ సారీ....కట్టుకోనందుకు వాళ్ళకి ఏ మాత్రం ముట్టచెప్తారు?"

ఎవరూ మాట్లాడలేదు.

"లక్షలమీదే ఉంటుందనుకుంటాను. మరి మీరు ఈ ముష్టిదానికి రూపాయైనా ఇవ్వరే? ఏం? గ్లామర్! అంతే. ఇదే అమ్మాయిని ఏ నాలాటివాడో చేరదీసి మేకప్ చేసి ఫాషన్‌షోకి పంపిస్తే మీరే ఎగబడతారు. ఆ అమ్మాయిలకి బీరువాలనిండా బట్టలుంటాయి, కాని, అవి కట్టుకుంటే వాళ్ళకి డబ్బురాదు. అంచేత గుడ్డలిప్పుకొని డబ్బు సంపాదించి, ఆ డబ్బుతో మళ్ళీ కొనుక్కుంటారు. 'ఈజీమనీ' కావాలి ప్రతివాడికి. కష్టపడి, ఒళ్ళువంచి పని చెయ్యడం ఎవరికీ ఇష్టంలేదు.

"ఇంతకీ నేను లెక్చరు ఇవ్వదల్చుకోలేదు. ఒళ్ళుకొవ్వి గుడ్డలిప్పుకొని గెంతినవాళ్ళకి వహ్వా కొట్టి, గతిలేక ఒంటిమీద బట్టల్లేనివాళ్ళని చీదరించుకోకండి."

"లేమి తప్పుకాదు. పాపం అంతకంటే కాదు. కేవలం పరిస్థితుల ప్రభావం అంతే. అవకాశాలు లేకపోవడం. వాళ్ళు ఆ పరిస్థితుల్లో ఉన్నారంటే ఆ తప్పు వాళ్ళది కాదు. వాళ్ళని అలా ఉంచిన మనది. ఆ పరిస్థితులకి సిగ్గుపడాల్సింది వాళ్ళుకాదు- మనం. అర్థమైందా?" అందరూ బుర్రలు ఊపేరు.

వెంటనే బతుకు జీవుడా అని బైటకి పారిపోయేరు.

ఏది ఏమైనా మళ్ళీ మా ఇంట్లో విడియో ఫాషన్ ప్రోగ్రాం పెట్టలేదు.

కురుక్షేత్రం ఇంత శాంతియుతంగా సాగినందుకు నేను మావారికి థేంక్స్ చెప్పకతప్పదు *

# చెత్తకుండీ

—రావులపాటి సీతారాంరావు

నగరం కంటే చిన్నదే కాని పట్టణం అనుకొనే తీరులో వుంటుంది ఆ ఊరు!

రైల్వేస్టేషన్లు - బస్ స్టేషన్లు - పోలీసు స్టేషన్లూ వున్నాయి. సూపర్ మార్కెట్లు - కూరగాయల మార్కెట్లు - బట్టల మార్కెట్లు అన్నీ వున్నాయి. పోష్ లొకాలిటీ - హైక్లాస్ సొసైటీలతోపాటు మిడిల్‌క్లాస్ ఏరియా - రెడ్‌లైట్ ఏరియా - స్లమ్ ఏరియాలుగూడా వున్నాయి.

ఇన్ని వుండటం చేతనే మున్సిపాలిటీ గూడా వుందని అనుకుంటే పొరపాటు. అన్ని పట్టణాలకు వున్న మాదిరే ఆ పట్టణానికి గూడా ఓ మున్సిపాలిటీ వుంది.

అయితే ఆ మున్సిపాలిటీలోని పనివాళ్ళంతా జీతాలు యివ్వటం లేదని సమ్మె చేస్తున్నారు.

స్వీపర్లు - రోడ్లు సమ్మెకు మునుపు వారానికి ఓసారో - ఎవరైనా ప్రముఖుడు వస్తున్నాడంటేనో ఊడ్చేవాళ్ళు - ప్రస్తుతం అదీ లేదు.

చెత్తకుండీలలో చెత్తంతా భయంకరంగా పేరుకొనిపోయింది. ప్లేగు భయంతో జనం అసలే హడిలి ఛస్తుంటే, ప్రస్తుతం చెత్తకుండీల సమస్య అనుకోని రీతిలో జటిలంగా మారిపోయింది.

చెత్త సమస్య ఓ చెత్త సమస్యగా ప్రక్కకు తోసేసే పరిస్థితి లేదు - అది ప్రామినెంట్ సమస్యగా అర్జెంట్‌గా రూపుదిద్దుకుంది!

సమ్మెకూ - చెత్తకుండీల సమస్యకు అనుకోకుండా లంకె ఆవిధంగా పడింది.

సమ్మె గొడవలతో, చెత్త గొడవలతో ఆ పట్టణం హైరానా పడుతున్న సమయంలోనే ఓ హత్య జరిగింది. ఆ హత్యను గురించి పత్రికలు పెద్దగా పట్టించుకొని, సంచలనం సృష్టించలేదు. పోలీసులు గూడా సమ్మె బందోబస్తులో తలమునకలవటంచేత దర్యాప్తు గూడా కొంచెం ఆలస్యంగానే మొదలుపెట్టారు. దాన్ని గురించి కూడా ఎవరూ పట్టించుకోలేదు. ఎవరైనా పట్టించుకొని హంగామా చేస్తేనే గాని, ప్రజలు పట్టించుకోవటానికి అలవాటుపడ్డారు అందుచేత, ప్రజల దృష్టిలో గూడా ఆ హత్య పట్టించుకొనేంతగా పడలేదు.

సమ్మె ఆగిపోయింది. చెత్తకుండీల సమస్య సమ్మె ఆగటంతో తీరుతుందనుకున్నారు కానీ, అదీ పెద్దగా తీరినట్లుగా దృష్టాంతరాలేవీ కనపడలేదు. ప్లేగు ఆగిపోయిందన్నారు. పేపర్లూ అంతే వ్రాశాయి. ప్రజలు గూడా ప్లేగు ఆగినందుకు ఊపిరి పీల్చుకున్నారు. నిజంగా ప్లేగు ఆగిపోయిందో లేదో కూడా చిత్రంగా ఎవరూ పట్టించుకోలేదు.

జరిగిన హత్య విషయంలో మొదట ఆధారాలు లభ్యం కాలేదు. చనిపోయింది ఓ మున్సిపల్ కౌన్సిలర్. సమ్మె ఆగిందన్న తర్వాత, మున్సిపల్ కౌన్సిలర్ హత్య గురించి పోలీసులు పట్టించుకోవటంలేదని కొందరు మున్సిపల్ ఉద్యోగస్తులు మళ్ళీ సమ్మె చేస్తామని బెదిరించారు. ఓ రాజకీయ పార్టీ రెండు గంటలు రాస్తారోకో చేసి, ట్రాఫిక్‌ను ఆపేసి, అందులో యిరుక్కున్న వాళ్ళని నానాయిబ్బంది పెట్టింది. కానీ, ఇబ్బందులు పడడానికే వున్నట్లుగా రోడ్డు మీద జనం లేని నవ్వు తెచ్చుకొని రాస్తారోకోలో పాల్గొన్నారు. ఆ ప్రోగ్రాం ఏర్పాటు చేసిన వారు, మేం అర్జెంటుగా పోవాలి ప్లీజ్ అని వినయంగా వేడుకున్న ఒక వ్యక్తి మీద గూడా దాష్టీకం చేసి, ఓ మనిషిని చంపేస్తే నువ్వు పట్టించుకోకుండా ప్లీజ్ నేను పోవాలి అని అడుగుతున్నావా - నాన్సెన్సు అని దబాయించేసరికి అతను గుడ్ల నీళ్ళు కుక్కుకొని అలాగే వున్నాడు కానీ - నా భార్య హాస్పిటల్లో చావు బ్రతుకుల్లో వుంది. నేను పోక తప్పదు అని చెప్పలేకపోయాడు.

పోలీసులు మొత్తానికి మున్సిపల్ కౌన్సిలర్ హత్యానేరం మీద ఓ పదహారేళ్ళ పిల్లవాడ్ని అరెస్టు చేశారు

సమ్మె ఆగిపోయిన ఏడాదికి ఆ కేసు కోర్టులో ట్రయల్‌కు వచ్చింది.

ఆ కోర్టులో ఏళ్ళ తరబడి లిటిగేషన్లు, కేసులు నడుస్తునే వున్నాయి. నల్లకోట్లు న్యాయం కోసం పోరాడుతునే వున్నాయి! కోర్టులోని బెంచి క్లర్కులు, మిగతా ఉద్యోగస్థులు రాబందుల్లా కోర్టు కొచ్చిన ప్రతివాడినీ పీక్కుని తింటూనే వున్నారు. వాళ్ళకు మాత్రం వేరే గత్యంతరం ఏముంది? యుగధర్మం అలాంటిది. కోర్టులో జడ్జిగారు నిస్సత్తువగా వున్నారు. ఆయన ఎన్నో సంవత్సరాల నుంచి ఉద్యోగంలో వుండటం చేత నిర్లిప్తత మొహం నిండా కొట్టొచ్చినట్లు క్రమ్ముకుంది.

మనుషులు దొంగతనాలు చేయటానికి - దారిదోపిడీలు చేయటానికి హత్యలు చేయటానికే పుట్టారేమో అనే అనుమానం ఆయనలో క్రమేపీ బలపడుతున్నది. లేకపోతే అన్ని వందల కేసులు ఎట్లా వస్తాయని ఆయన ఆలోచన.

ప్రతి కేసులో క్రమం తప్పకుండా ఓ తంతు జరగాలి కాబట్టి ఆ కేసులోనూ ఆ తంతు మొదలయింది.

"నీ పేరు?" బెంచిక్లర్కు బోనులోకి ఎక్కించగానే అడిగాడు.

ఆ పిల్లవాడు చాలా సేపు ఆలోచించాడు.

"చెత్తయ్య" అన్నాడు.

ఎవరూ ఆ పేరులోని విశిష్టతను గుర్తించే ప్రయత్నం చేయలేదు. చాలా సాధారణమైన పేరులాగానే వ్రాసుకున్నారు.

జడ్జి తనకు పట్టనట్లు నిరామయంగా తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్‌ను చూశాడు. అతను ఆ కోర్టులో మానసికంగా లేనట్లే లెక్క. ప్రస్తుతం ఇంట్లో వున్నాడు. పెళ్ళికాని ఇద్దరు పిల్లలను చూపిస్తూ వీళ్ళకు పెళ్ళి చేయటం నీ చేత కాదు అని భార్య దెప్పుతున్నది. నిజంగా తను చేతకానివాణ్నేమో అనే అనుమానం గూడా బలపడుతున్నది. చేతగాకపోవటం అనేది ఎలా సంక్రమిస్తుంది? డబ్బు లేకపోవటం వల్లనా? ఎన్నో పుస్తకాలు రిఫర్ చేశాడు కానీ దానికి సరియైన సమాధానం ఎన్నడూ తటస్థపడలేదు. కోర్టులో మాత్రం న్యాయదేవత హోదాలో వున్నాడు. తను చెప్పేదే తీర్పు! తను మాట్లాడేదే వేదం! ఎంత విచిత్రం! ఇంట్లో తను చెల్లనిగవ్వ. యిక్కడ....సర్వాధికారి!

నవ్వుకున్నాడు. జడ్జిగారు సన్నగా నవ్వుకోవటం చూసి కోర్టు గూడా సన్నగా నవ్వింది! పేరు 'చెత్తయ్య' అన్నందుకు జడ్జిగారు నవ్వుతున్నారేమో అని నల్లకోట్లు సమాధాన పడ్డాయి.

చెత్తయ్య మీద మోపబడిన అభియోగమేమిటో చదివి వినిపించారు.

"సమ్మె ఉధృతంగా జరుగుతున్న రోజుల్లో చెత్తకుండీలన్ని నిండిపో సాగాయి. చెత్తయ్య హోటల్ అన్నపూర్ణ ముందున్న చెత్తకుండీలో తిని పడే సిన పదార్థాలన్నీ ఏరుకొని తినేవాడు. ఊళ్ళో ప్లేగు వస్తుందేమోనని అధికారులు కంగారుపడుతున్న రోజులవి. ధర్మయ్య మున్సిపల్ కౌన్సిలర్ - పదిమంది మేలు కోరేవాడు. చెత్తయ్య ఆరోగ్యం కాపాడాలనే ఉద్దేశ్యంతో ఆ విధంగా తిన కూడని ఒకటి రెండుసార్లు చెప్పి చూశాడు. వినలేదు - పైగా, ఆ దారి వెంబడే నడిచిపోతున్న ధర్మయ్యను బండతో తలమీద బాది చెత్తయ్య హత్యచేశాడు. మంచి చెప్పినందుకు ధర్మయ్య బలయిపోయాడు.''

చెత్తయ్య అటూ యిటూ చూశాడు. జీవితంలో మొదటిసారి అంతటి ప్రాముఖ్యతను అనుభవిస్తున్నాడు. కొంచెం యిబ్బందికరంగా వున్నా కుతూ హలంగానే వుంది.

పోలీసు అధికారి కేసు ఏవిధంగా దర్యాప్తుచేసి, ముద్దాయిని అరెస్టుచేసి చార్జిషీటు పెట్టిందీ ముక్తసరిగా చెప్పాడు.

చెత్తయ్య తరపున కేసు వాదించటానికి డిఫెన్సు లాయర్‌ను ప్రభుత్వమే నియమించింది. కుర్ర లాయర్ బెరుకు బెరుకుగా అడిగాడు పోలీసు ఆఫీసర్‌ను "ఇందులో మోటివ్ ఏమిటీ" అని. ప్రతి నేరం వెనక బలమైన కారణం లేనిదే నేరం చేయటం సాధ్యపడదని ఎక్కడో చదువుకున్నాడు. సమయానికి అది జ్ఞాపకం వచ్చి అడిగాడు. పోలీసు ఆఫీసర్ విసురుగా సమాధానం చెప్దామను కున్నాడు కానీ దర్యాప్తులో నిజంగానే బలమైన కారణం తేలలేదు. ధర్మయ్యను చంపటానికి చెత్తయ్యకు బలమైన మోటివ్ ఎంత ఇన్వెస్టిగేట్ చేసినా తేలలేదు. అయినా వున్న సాక్ష్యంతో కేసును కోర్టులో తోసేశారు.

జవాబుకోసం కొంచెం తటపటాయించి "బలమైన కారణం ఎలా వున్నా - చెత్తయ్యే హత్య చేశాడని రుజువు చేయటానికి ప్రత్యక్ష సాక్షాలు వున్నాయి'' అని డొంక తిరుగుడుగా పోలీసు ఆఫీసర్ చెప్పాడు.

కుర్ర లాయర్ ధైర్యం పుంజుకొన్నాడు. అదే సమయంలో ఇంటి సంగతులు ఆలోచించటం మాని జడ్జిగారు కోర్టుకు చేరుకున్నారు!

"చెత్తయ్య చెత్తకుండీల ప్రక్కన కూర్చొని తిని పారేసిన వాటిని ఏరుకొనేవాడు. వాటి మీద బ్రతికేవాడు. ధర్మయ్య మున్సిపల్ కౌన్సిలర్. మంచివాడని మీరే సెలవిచ్చారు. రాజకీయాల్లో వున్నటువంటివాడు. అంతటి వాడ్ని - చెత్తయ్య - ఎందుకు హత్య చేస్తాడు? ఇంపాజిబుల్ - మీ ప్రత్యక్ష సాక్ష్యాలన్నీ కట్టుకథలు. పోలీసుల స్టాక్ విట్‌నెస్‌లు! మోటివ్ లేకుండా యింతటి మాతుకానికి ఏ వ్యక్తి తలపడడు! పోలీసువాళ్ళు నా క్లయంట్ మీద కేసు నిరూపించటంలో విఫలురయ్యారు - యువర్ ఆనర్ - చెత్తయ్య నిర్దోషి" - కుర్ర లాయర్ కూర్చున్న తర్వాత ఊపిరి పీల్చుకున్నాడు. ఆ కేసులో గుండెకాయను పట్టేసినట్లుగా అనుభూతి చెందాడు.

జడ్జిగారు గూడా తలూపాడు. 'మోటివ్' బదులు 'డబ్బు' వినపడింది ఆయనకు. డబ్బు లేకుండా ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు ఇంపాజిబుల్ అని కుర్ర లాయర్ సెలవిచ్చినట్లుగా భ్రాంతిచెందాడు. పోనీ, యీ కుర్ర లాయర్ పెళ్ళి ఫీల్డులో వున్నాడా? అటువైపు ఆలోచన మళ్ళింది. వూరికే వినటానికే అలవాటు పడ్డ జడ్జిగారికి ఆలోచనే ఆరో ప్రాణంగా మారింది! ఆయన ఆ ధ్యాసలో వున్నప్పుడు పబ్లిక్ ప్రాసిక్యూటర్ లేచి డైరెక్ట్ సాక్ష్యాలు వున్నప్పుడు మోటివ్ అవసరంలేదని ఏదేదో చెప్పాడు కానీ, కోర్టులో ఎవరూ ప్రభావితులు కాలేదు. అసలు జడ్జిగారే వినలేదు ఆయన ఆర్గ్యుమెంటు (అలవాటు చొప్పున!).

అప్పుడు చెత్తయ్య కొంచెం కంగారుపడి గొంతు సవరించుకొని "అన్యాయం అండీ!" అన్నాడు. అందరూ అటు తిరిగారు. జడ్జిగారు గూడా అలవాటు చొప్పున అతన్ని నిశితంగా చూశాడు.

"ఆయన్ను నేనే రాయిపెట్టి సంపేసనండీ!" అన్నాడతను. కుర్ర లాయర్ నిరుత్సాహపడ్డాడు. ఎంతో బాగా ఆర్గ్యుమెంట్స్ చెప్పాననుకుంటే ముద్దాయే తనను వెన్నుపోటు పొడుస్తాడని అనుకోలేదు!

"నేను సంపక ఏం చేస్తానండి? సమ్మె లేనప్పుడు రెండ్రోజులకోసారి కూడు దొరికేదండీ! సమ్మె వున్నప్పుడు మొదట్లో ప్రతిరోజూ కడుపునిండా కూడేనండీ! అన్నపూర్ణ హోటల్ ముందు చెత్తకుండీ నాదేనండీ! అది నాకు

పెర్మినెంట్ అండీ! వీడు వచ్చి, నేను కౌన్సిలర్‌ని - కుండీలో కూడు తింటే నాకు రోజూ అర్ధరూపాయి యివ్వాలి అని పేచీ పెట్టాడండీ! నేను డబ్బులు ఎక్కణ్నించి తేవాలని అంటే - అడుక్కొచ్చి యివ్వమన్నాడండీ! నన్ను కుండీలో కూడు తిననీయకుండా తన ఏరియా కుర్రాడిని తెచ్చి కుండీలో సరు కంతా తీసుకెళ్ళాడండీ! నాకు ఆకలేసిందండీ! కోపం వచ్చిందండీ! చెత్తకుండీ కూడు గూడా నాకు గాకుండా చెడగొట్టినందుకు రాయేసి సంపేసానండీ! ఊళ్ళో వున్న చెత్తకుండీలన్నీ వాడివే అన్నాడు - యిదొక్కటి ఎన్నాళ్ళ నుంచో నాదే నండీ! కూడు పోతుందేమోనని వాడ్ని కూలేసానండీ.''

మామూలుగానే చెప్పాడు కానీ ఆ మాటల్లో అక్కడున్న వాళ్ళకు అనేక అర్థాలు ధ్వనించాయి.

జడ్జిగారికి డబ్బొక్కటే కాదు ఆకలి గూడా ముఖ్యం అని తెలిసివొచ్చింది.

పోలీసు ఆఫీసర్‌కు హత్యకు బలమైన కారణం ఏమిటో తెల్సొచ్చింది.

నల్లకోట్లకు నిజమేమిటో తెలిసి వొచ్చింది!

కోర్టులోని జనానికి చిన్న చిన్న విషయాలను కొనేవాటిల్లో గూడా 'ఎక్స్‌ప్లాయిటేషన్' జరుగుతుందని తెల్సి వొచ్చింది.

''నేరం ఒప్పుకున్నావు కాబట్టి నీకు శిక్ష పడ్తుందన్న సంగతి తెల్సు గదా?'' జడ్జిగారు ఆలోచనావస్థలోంచి బయటపడి నోరు తెర్చారు.

''తెలుసు అండీ! శిచ్చ వేస్తే జైలులో కూడు పెట్తారు గదండీ! చెత్త కుండీ దగ్గరయితేనేం, జైలులో నయితేనేం - కూడుంటే చాలు!'' జీవిత సత్యాన్ని తేలిగ్గా చెప్పాడు చెత్తయ్య.

*

# కేసు

—శ్రీ రాగి

"ప్రియమైన మామకు :-

వచ్చేనెల 10 వ తేదీకి మీ కేసు వాయిదా వేసారు. ఆ రోజు మీ సాక్ష్యము రికార్డు చేస్తాను. ప్రతివాది లాయరు....క్రాస్ ఎక్జామినేషను వుండవచ్చు....మీరు తప్పక రావాలి. అమ్మా నాన్నా బావున్నారు.... రాజా, రామారావు బాగా వున్నారనుకొంటాను.... అత్తను అడిగానని చెప్పండి.

మేనల్లుడు
శంకరం"

సుబ్బారావు నెల్లూరు నుంచి వచ్చిన వుత్తరం శ్రీమతికి చూపించాడు.

"అయితే 10 వ తేదీ మీరు నెల్లూరు వెళ్లాలా?' సుబ్బారావు శ్రీమతి అడిగింది....

"మరి వెళ్ళకపోతే ఎలా? ఆ స్థలం వదిలేసుకొందామంటే మీరంతా ఒప్పుకోకపోతిరి...."

"మీది మరీ చోద్యమండీ! ప్రభుత్వం యిచ్చిన స్థలాన్ని వదిలేసుకొంటా నన్న ప్రబుద్ధుల్ని.... మిమ్మల్నొక్కర్నే చూస్తున్నాను...."

"ఏం చెయ్యాలి మరి.... ఆ నెల్లూరు యిక్కడుందా.... తొమ్మిది గంటల ప్రయాణం ...పైగా వెధవ బస్సులు....వళ్ళంతా హూనాహూనమై పోతుంది. ఈ వయస్సులో ఆ వెధవ ప్రయాణం చెయ్యాలంటే నా తలప్రాణం తోకకొస్తున్నది."

"బావుందండీ! అందుకని లక్షరూపాయలు విలువచేసే స్థలం వదులు కొంటారా? ఆ వెధవెవరో యిల్లు కట్టాడు - వాడికన్నా బుద్ధి వుండొద్దా పరాయి

వాళ్ళ స్థలంలో యిల్లు కట్టుకోటానికీ....అయినా వాడేమంటాట్ట .. ?" కోపంగా అడిగింది సుబ్బారావు భార్య.

''తనకూ....తాసీల్దారు....ఆ పట్టా నంబరులోనే పట్టా యిచ్చారంటాడు. కాయితాలు చూపించాడు కూడానూ....తర్వాత విచారిస్తే తెలిసింది....ఆ తాసీల్దా రెవడో గుడినీ గుళ్లో లింగాన్నీ మింగే రకంట....రెండువేలు పుచ్చుకొని చాలా మందికి దొంగ పట్టా లిచ్చాట్ట....''

''వాడి కడుపు మాడిపోనూ .... మనం ఆ వూర్లో లేనంతమాత్రంచేత అంత అన్యాయానికి వొడిగడ్తాడా?''

''ఏంచేస్తాం? పట్టాలొచ్చిన రెండు సంవత్సరాలకే మనకు వేరే జిల్లాలకు బదిలీ వచ్చె....అప్పటికీ....అడపా తడపా....నే పోయి చూసి వస్తూనే వున్నా.... అయిదు సంవత్సరాల క్రిందట వెళ్ళి చూసేటప్పటికి ఓ ప్రబుద్ధుడు మన స్థలంలో మూడు గదులు.... ఓ మూలగా కట్టి పైన అజ్‌బెస్టాస్ రేకులు వేసాడు.... కాంపౌండు గోడా కట్టించాడు....మున్సిపాల్టీ వారికి పన్నుగూడా కడ్తున్నాట్ట...."

''ఇప్పటికి మనం దావా వేసి ఎన్నాళ్ళయింది?''

''ఇది నాల్గో సంవత్సరం....''

''ఈ సంవత్సరంలో అయినా కేసు ఒక కొలిక్కి వస్తుందా?...."

''అదే అడుగుతాను మనవాడిని....పాపం, వాడి అన్న రాజారావు.... క్రిందటి నవంబరులో చచ్చిపోయాడు గదా....షుగరు వ్యాధితో....మనమిప్పించిన వుద్యోగంలో పాతికేళ్లుగా చేసాడు .. కాని, వాడికి అదృష్టం కలిసిరాలేదు. పెండ్లి అయింది కాని.... పెండ్లాం లేచిపోయింది....''

''ఎవరి ఖర్మకెవరు కర్తలండీ! సరే రేపు, 10 వ తారీకు మీరు నెల్లూరు వెళ్లాలి....అంతేగదూ!''

"అవును....మళ్ళీ ఓ అయిదు వందలు ఖర్చు. ఇప్పటికి నాల్గువేలయింది.... ఎప్పుడో కేసు గెలుస్తూంది, మన స్థలం మనకొస్తూందని .. ఖర్చు పెడుతున్నాం. చివరికేమౌతుందో?....'' సుబ్బారావు ఆవేదనగా అన్నాడు.

"అంతా భగవంతుడి దయ!" సుబ్బారావు శ్రీమతి శారద అన్నది.

"ఏమయినా ఈ లాయర్లని నమ్మటానికి వీళ్ళేదు.... వాళ్లు యే కేసయినా రెండు వైపులా వాదించగలరు... "సుబ్బారావు విసుగ్గా అన్నాడు.

"మరి వాళ్ళ వృత్తే అది గదండీ!"

"సరే! వస్తున్నానని .. మనవాడికి వుత్తరం వ్రాస్తాను...."

సుబ్బారావు పోస్టాఫీసుకు బయలుదేరాడు.

* * *

సుబ్బారావుది అసలు స్వగ్రామం నిడుబ్రోలుకు ఆరుమైళ్ల దూరంలో ఓ కుగ్రామం. అక్కడ ఒకప్పుడు తన తాతలు జమీందార్లుగా బ్రతికారు. నూరెకరాల మాగాణీ భూమిట - ఎవరో జమీందారు - తాతలు చేసిన పనికి మెచ్చుకుని ఆ భూమిని దానంగా యిచ్చారుట.

తన తాత పెద్ద పెంకుటిల్లు కట్టించాడు తానెప్పుడు స్వగ్రామంలో పట్టుమని పదిరోజులుకూడా వుండలేదు.

ఇప్పుడా భూములూ లేవు. ఆ పెంకుటిల్లూ లేదు.

అంతా పోయింది.

సుబ్బారావు తండ్రి లాయరుగా తెనాలిలో పాతికేళ్ళు ప్రాక్టీసు చేసినా.... అద్దె యిళ్ళలోనే జీవితం గడిపాడు. ఆఖరికి ఓ అద్దె యింట్లోనే అంతిమ శ్వాస వదిలాడు.

సుబ్బారావుకు యిప్పుడు భార్య శారదా, యిద్దరు కొడుకులూ, ఒక కూతురూ వున్నారు. పెద్దవాడు హైద్రాబాదులో ఉద్యోగం చేసుకొంటున్నాడు-ఓ ప్రభుత్వశాఖలో. మూడోవాడు, అమ్మాయి ఈ వూళ్ళోనే బ్యాంకులో ఉద్యోగాలు చేసుకుంటున్నారు.

రెండోవాడు నెల్లూరులో వున్నప్పుడు సీటి ప్రమాదానికి గురై మరణించాడు. అప్పుడు వాడికి పదహారేళ్ళు.... డాక్టరుని చేద్దామనుకున్నారు.

కాని, సుబ్బారావు దంపతుల ఆశలు అడియాశలే అయినై.

నెల్లూరులో సుబ్బారావు పదేళ్ళు వుద్యోగం చేశాడు. అప్పుడు 800 మంది యన్. జి. వో. లతో పాటు సుబ్బారావుకు కూడా $5\frac{1}{2}$ సెంట్ల యిండ్ల స్థలం యిచ్చింది ప్రభుత్వం. అది యీ రోజున లక్ష రూపాయల ఖరీదు చేస్తుంది సుబ్బారావు వేరే జిల్లాకు బదిలీ అయినప్పుడు....ఎవడో ప్రబుద్ధుడు దానిని ఆక్రమించి యిల్లు కట్టాడు.

మగపిల్లలిద్దరికీ వివాహాలు అయినై. అమ్మాయికి కావాలి.

ఇదీ సుబ్బారావు పరిస్థితి....

*　　　*　　　*

నానా అవస్థలుపడి, నెల్లూరు జేరుకున్నాడు 10వ తారీకు వుదయమే.... తనకు తెలిసిన లాడ్జిలో దిగి గది తీసుకుని.... స్నానం చేసుకుని.... తొమ్మిది గటలకల్లా తయారై, శంకరం ఆఫీసుకు వెళ్ళాడు సుబ్బారావు.

హెడ్ పోస్టాఫీసు దగ్గరలో....ఓ చిన్న గొందిలో.... మేడమీది భాగంలో వుంటున్నాడు శంకరం .... భార్యా పిల్లలతో.... తల్లీ తండ్రీ .... మిగతావాళ్ళు జేమ్సు గార్డెనులో స్వంత యింట్లో వుంటున్నారు.

రాజారావు శంకరానికి అన్న అవుతాడు. గోపీ చిన్న అన్న. వీళ్ళిద్దరికీ నెల్లూరులో పని చేసేటప్పుడు....సుబ్బారావు తను పని చేస్తున్న శాఖలోనే వుద్యోగాలు యిప్పించాడు.

రాజారావు తండ్రి....నారాయణ కుటుంబము.... సుబ్బారావు అద్దెకుంటున్న యింటి కెదురుగా.... తమ స్వంత స్థలంలో ఓ పూరిపాక వేసుకొని వుండేది.

కాలక్రమాన వాళ్ళ కుటుంబంతో సుబ్బారావు కుటుంబానికి పరిచయ మయింది.

నారాయణగారి కొడుకు లిద్దరికీ వుద్యోగా లిప్పించిన సుబ్బారావును.... ఆయన కుటుంబాన్ని.... నారాయణగారి కుటుంబము మర్చిపోలేదు.

కాని, దురదృష్టం....ఇద్దరూ....అకాల మరణవాతపడటం జరిగింది.

రాజారావు పనిచేసే ఆఫీసుకు దగ్గర్లోనే సుబ్బారావుకు గవర్నమెంటు మంజూరు చేసిన స్థలం వుంది.... "కాస్త చూస్తూవుండరా!'' అని గూడా చెప్పి వచ్చాడు సుబ్బారావు తనకు బదిలీ అయినపుడు.

"సరిలే మామా!" అన్నాడేగాని.... వాడూ చూడటం నిర్లక్ష్యం చేశాడు....

ఎవడో యిల్లు కట్టాకగాని, సుబ్బారావుకు సమాచారం అందలేదు....

''లాండ్ ట్రిబ్యూనల్‌లో కేసు వేద్దాం మామా! మీ స్థలం మీకొచ్చేటట్లు చూసే పూచీ నాది. నీవు ఖర్చులుమటుకు పెట్టుకో....నాకిప్పుడేం ఫీజు వద్దు.... గెల్చిన తర్వాత నీవెటూ యివ్వకుండాపోవు గదా!" అన్నాడు శంకరం....

సుబ్బారావు అదృష్టం ఎలా కలిసివచ్చిందంటే, శంకరం.... రాజారావు తమ్ముడు లాయరై.... ఆ వూళ్ళోనే ప్రాక్టీసు పెట్టడం.

అదే వేరే లాయరైతే ఎంత ఫీజు యివ్వాల్సి వచ్చేదో, ఈ రోజుల్లో ఏ లాయరూ.... ఏ చెత్త కేసుకయినా అయిదు వేలకన్నా తక్కువ తీసుకోడు.

* * *

''ఏంరా శంకరం, ఎలా వున్నారు?"

''రా మామా! నీ కోసం ఎదురుచూస్తున్నాం."

శంకరం భార్య మంచి కలుపుగోలు మనిషి.... సుబ్బారావుకు కాఫీ యిచ్చి మర్యాద చేసి "భోజనం యిక్కడే చెయ్యాలండీ!" అంటూ బలవంత పెట్టింది.

''మా వూరు వొచ్చి మా యింట్లో భోంచెయ్యకపోతే నేవూరుకుంటానా?'' శంకరం నవ్వుతూ అన్నాడు....

సుబ్బారావుకు సరే అనక తప్పలేదు.... కోర్టు పని అయిన తర్వాత లంచి టైములో వచ్చి యిద్దరూ భోంచేసేటట్లు యేర్పాటయింది.

సుబ్బారావుకు.... కోర్టులో యెలా చెప్పాలో పాఠం చెప్పాడు....

"మీ ప్రతివాది మీ పర్మిషను తీసుకొనే స్థలంలో వుంటూ, తర్వాత ఖాళీ చెయ్యడానికి నిరాకరించినట్లు నువ్వు స్టేటుమెంటు యియ్యాలి...."

"తప్పదా?" బాధగా అడిగాడు సుబ్బారావు....

"మీరిదివరకే విచారణ కొచ్చిన డిప్యూటీ తాసీల్దారు దగ్గర స్టేటుమెంటు అలాగే యిచ్చారు గదా....అదే యిప్పుడు న్యాయస్థానంలో....కోర్టువారిముందు.... బోనులో నిల్చొని....చెప్పాలి... ఈ పైగా మీరు చెప్పేదేం లేదు....నేను ప్రశ్న లడుగుతూ వుంటాను....అవునూ....కాదు... అని చెప్పటమే...."

"అంతవరకూ బాగానే వుంది....ప్రతివాది లాయరు క్రాస్ ఎగ్జామినేషనులో ఏం అడుగుతాడో?"

"ఆయన మొఖం? మీ రెందుకు భయపడతారు?" అంటూ శంకరం ధైర్యం చెప్పాడు సుబ్బారావుకి.

సుబ్బారావు .... ఒకప్పుడు .... అంటే యాభై సంవత్సరాల క్రితం ఈ కోర్టుల్లో స్టెనోగా....రెండు నెలలు సెలవు ఖాళీలలో .... తాత్కాలికంగా పనిచేశాడు.

సుబ్బారావు సర్వీసు కమీషనుకు రెండో సారి కూర్చొన్నప్పుడు స్టెనోగా సెలక్టయ్యాడు .... కాని చేరలేదు .... తాను మొదట చేరిన శాఖలోనే వుండి పోయాడు.

తర్వాత చాలా సందర్భాలలో ఆఫీసు డ్యూటీ మీద కోర్టుకు గూడా హాజరైనాడు.

అతనికి కోర్టు అంటే భయం లేదు.

పైగా, అతని తండ్రి లాయరే గదా!

సరిగా పదిన్నరకు ఓ కిలోమీటరు దూరంలో వున్న జిల్లా కోర్టుకు లాయరు శంకరంతో సుబ్బారావు. కోర్టు హాలుకు చేరుకొన్నాడు.

జడ్జిగారు 10.45 కి తన స్థానంలో కూర్చున్నాడు. ఆయన రాగానే ఆచారం ప్రకారం....కోర్టులో హాజరైన లాయర్లు గుమస్తాలు పార్టీలు లేచి నించొని న్యాయస్థానానికి నమస్కారం చేసి....జడ్జిగారు కూర్చోగానే తమ స్థానాలలో కూర్చొన్నారు.

హాలు మధ్యలో గుండ్రంగా వున్న బల్లచుట్టూ నల్లకోట్ల లాయర్లు తమ కేసు చిట్టాలను ముందు వేసుకొని కూర్చున్నారు. ఆడ లాయర్లు నలుగురైదుగురు వున్నారు.

కోర్టు గుమాస్తా కేసులు పిలుస్తున్నాడు.

పార్టీలు హాజరవుతున్నారు జడ్జిగారి ముందు.

ఎన్నో కేసులు అయిన తర్వాత సుబ్బారావు కేసుకు పిలుపు వచ్చింది.

సుబ్బారావు బోనెక్కాడు....

శంకరం అడుగుతూంటే సుబ్బారావు సమాధానాలు యిచ్చాడు.

అంతా పదిహేను నిమిషాలలో అయిపోయింది.

"మీ క్రాస్ ఎక్జామినేషన్?" ప్రతివాది లాయరును అడిగాడు జడ్జిగారు.

ప్రతివాది తరఫున సీనియరు లాయరు రాలేదు. ఆయనకు వేరే కోర్టులో పని వుందట....తన జూనియరు లేడి లాయరును పంపాడు.

"యువరానర్! క్రాస్ ఎగ్జామినేషన్ మా సీనియరు లాయరు చేస్తాడు - వాయిదా యివ్వండి....

"ఏ రోజుకి కావాలి?"

"మీ యిష్టం - ఏ రోజయినా సరే.''

"ఇరవయ్యో తారీక్కు వాయిదా వేస్తున్నాను.''

కోర్టుకు నమస్కారం చేసి శంకరం కోర్టు హాలు నుంచి బయటకు వచ్చాడు. సుబ్బారావు అతణ్ణి అనుసరించాడు....

''శంకరం....మళ్ళీ రావాలి గదా!''

''రావాలి మామా! ఏం చేస్తాం....?''

రిక్షాలో సుబ్బారావుతో శంకరం యింటికి వచ్చాడు. శంకరంతోపాటు భోంచేసి లాడ్జికి వచ్చాడు....

* * *

20 వ తారీఖున సుబ్బారావు మళ్ళీ కోర్టుకు హాజరయాడు. ప్రతివాది సీనియరు లాయరు కోర్టుకు హాజరైనాడు....

కాని, జడ్జిగారు కేసు పిల్చినప్పుడు తను కేసు కాగితాలు ఇంకా చూడ లేదంటూ వాయిదా అడిగాడు.

జడ్జిగారు లాయరును మందలిస్తూ మళ్ళీ పదిహేను రోజులకు వాయిదా యిచ్చారు....

ఆ రోజున మళ్ళీ సుబ్బారావు లాయరు శంకరం ఆఫీసులో తొమ్మిది కల్లా హాజరైనాడు....

ఈసారి ఓ పోలీసు కానిస్టేబుల్ లాయరు దగ్గర హాజరైనాడు....

సుబ్బారావు ఆయనని కేసు వివరాలు అడిగాడు.

''నీ కేసుకి సరిగా అయనది రివర్సు....మీ సర్వేనంబరుతోనే ఓ ఉద్యోగి తన స్థలాన్ని ఆయన కమ్మి....దస్తావేజు వ్రాశాడు....ఈయన పేరు....వాసుదేవ మూర్తి....ఆ స్థలంలో యిల్లు కట్టుకొన్నాడు....స్థలం రిజిష్టరు చేసుకోలేదు....

ఈలోగా ఓ ఫైర్ యాక్సిడెంటులో ఆ దస్తావేజు తగలడిపోయింది....ఈయన నాయన....అ స్థలం అమ్మినతన్ని మళ్ళీ దస్తావేజు రాసిమ్మని అడిగాడు.... ఆయన యిదిగో వ్రాస్తాను....అంటూ ఈ కోర్టులోనే కేసు దాఖలు చేశాడు తన స్థలంలో వాసుదేవమూర్తి యిల్లు కట్టాడని....మిగతా విషయాలు ఆయనను అడుగు చెప్తాడు....''

అంటూ లాయరు శంకరంవాసుదేవమూర్తి కేసును పరిచయం చేశాడు.

సుబ్బారావు వాసుదేవమూర్తి కేసు ఇంటరెస్టుంగా వుండడంతో ఆయనను ఇంటర్వ్యూ చేసాడు.

వాసుదేవమూర్తి యిలా చెప్పాడు——

"కానిస్టేబులుగా నేను పోలీసు శాఖలో 20 ఏళ్ళనుంచి పని చేస్తున్నాను. ఓ వుద్యోగి - తన కిచ్చిన యిళ్ళ స్థలాన్ని నాకమ్మాడు. అప్పుడు యింత ధర లేదు - అయిదారు వేలు వుంది మొత్తం స్థలం ఖరీదు...."

"ఇప్పుడె యెంతుందంటావు?"

"ఇప్పుడా? లక్ష రూపాయలపైనే - అందుకేగదా స్థలం అమ్మిన మహాను భావుడు నా మీద దావా వెయ్యటం...."

''అయినా చాలా ఆశ్చర్యాంగా వుందే ... తనే స్థలాన్ని అమ్మి.... మీరు యిల్లు కట్టుకొంటే.... తన స్థలాన్ని అక్రమించాడని మీ మీద కేసు పెట్టాడా?''

''కేసు పెట్టటమే కాదు - పకడ్బందీగా కేసు నడిపించి.... నేను ఖాళీ చెయ్యాలంటూ.... కోర్టువారి వుత్తర్వులను కూడా సంపాయించాడు....''

''మరి మీరింత కాలం యేం చేస్తూన్నారు?'' సుబ్బారావు అడిగాడు.

"ఏం చెప్పమంటారు! కష్టాలు వస్తే అన్నీ ఒక్కసారే వస్తాయంటారు...."

''ఏమయిందేమిటి?''

''డ్యూటీలోనే ఓ స్కూటరు నన్ను గుద్దింది.... నేను స్పృహతప్పి పడి యాను - మద్రాసు ఆస్పత్రిలో 15 రోజుల తర్వాతగాని నాకు తెలివి ంతేరు....''

''చాలా పెద్ద ప్రమాదమన్నమాట!''

"అవునండి! ఆరు నెలలు.... నేను ఆస్పత్రిలోనే వున్నానా.... మా కుటుంబం ఎన్ని తిప్పలు పడిందో నా వైద్యానికి.... ఆఖరుకి మా డిపార్టు మెంటువాళ్ళు జీతం గూడా యివ్వలేదు ..."

"అదేంటండీ? రూల్సు వున్నాయి గదండీ - డ్యూటీలో యాక్సిడెంటు అయితే ఆస్పత్రిలో వున్న కాలానికి నిండు జీతం యివ్వాలని.... మీరు మీ సూపరెన్టెంటుకి దరఖాస్తు చెయ్యలేదా?"

"ఒకటా? రెండా? ఎన్నో పెట్టినా.... ఆఖరికి I.G. కి కూడా పెట్టాను." అవన్నీ బుట్టదాఖలా అయినై....

"మీరు S.P. ని స్వయంగా చూడాల్సింది...."

"చూసాను - ఆరునెలల తర్వాత?"

"ఆయనేమన్నాడు?"

"ఉద్యోగులను పిల్చి చివాట్లు పెట్టాడు.... ఆ నెల నుంచి.... జీతం యియ్యమన్నాడు...."

"సెలవు జీతం యివ్వలేదు...."

"ఇంకా దస్త్రాలు పైకీ.... క్రిందకు తిరుగుతున్నాయి...."

"మీ కేసు యెన్నాళ్ళనుండి జరుగుతున్నది....?" సుబ్బారావు ఆత్రంగా అడిగాడు.

"ఇది పదో సంవత్సరం...."

ఆశ్చర్యపోయాడు సుబ్బారావు.

"ఆయన నలుగురైదుగురు లాయర్లను మార్చి అంతా అయ్యాక eviction (ఖాళీ చెయ్యడం) మీద స్టేకు నా దగ్గరకొచ్చాడు. హైదరాబాదులో లాయరును పట్టుకొని ఎలాగో 'స్టే' యిప్పించాను. ఇప్పుడు కేసు నడుస్తున్నది...." లాయరు శంకరం అన్నాడు.

"మన లాయరుగారు.... ధర్మరాజండీ! ఇంత ఫీజు యియ్యమని గట్టిగా అడగడు - ఇచ్చింది తీసుకొని పని చేస్తాడు...." వాసుదేవమూర్తి అన్నాడు.

"శంకరం!.... వాసుదేవమూర్తిగారు కేసు గెలుస్తారంటావా?" అడిగాడు సుబ్బారావు.

"చక్రం తిప్పుతున్నాను, కేసు గెలవాలనే. న్యాయం ఆయనవక్షే వుంది. కాని ఆ విక్రయదస్తావేజులు.... లేవు.... అంతా సాక్ష్యాలమీద ఆధారపడింది కేసు.... చూద్దాం" అన్నాడు లాయరు.

సుబ్బారావు కేసుని గురించి వాసుదేవమూర్తి వివరాలు తెలుసుకున్నాడు.

"గవర్న మెంటు యిచ్చిన పట్టా మీ దగ్గరుంది.... ఆ పట్టా రద్దు కాలేదని డిప్యూటీ తాసీల్దారు రిపోర్టు కూడా ఇచ్చారంటున్నారు. అసలు మీరు నోటీసు యియ్యకుండా మీ పట్టా రద్దు చెయ్యటానికి రెవెన్యూ వాళ్ళకి హక్కు లేదుగదా! మీరు తప్పక గెలుస్తారు. మీ ప్రతివాదిది బోగస్ పట్టా అని తేలికగా ఋజువవు తుంది...."

"పోనీలేండి....కేసు చివరకు ఏమయినా, మీరైనా ఒప్పుకొన్నారు నేను కేసు గెలుస్తానని... థ్యాంక్యూ ..." సుబ్బారావు అన్నాడు....

వాసుదేవమూర్తిని చూస్తే సుబ్బారావుకు జాలిలేసింది. మనిషి, నల్లగా, సన్నగా, పొడుగ్గా వున్నాడు. మీసాలు వున్నాయి....యాక్సిడెంటులో తగిలిన దెబ్బలు చూపించాడు. ట్రీట్ మెంటుకే పదిహేను వేలయిందిట....డ్యూటీ చెయ్య లేక హెడ్ కానిస్టేబులుగా ప్రమోషను వస్తే వద్దని వ్రాసిచ్చాడుట.... కాకీ దుస్తులే వేసుకున్నాడు.

ఓ కాన్‌స్టేబిలునే మోసగించిన ఆ మహానుభావుడు యెంత ఘనుడో?

* * *

ఆ రోజు మళ్ళీ కోర్టుకు హాజరయ్యాడు....

ప్రతివాది సీనియరు లాయరు లంచ్ అవరు తర్వాత వస్తానని కబురు చేశాడు.

సాయంకాలం అయిదవుతుండగా వచ్చి మరు రోజుకు వాయిదా అడిగాడు.

మరునాడు కూడా లంచ్ అవరు తర్వాత కోర్టుకు వస్తానన్నాడు, వేరే కోర్టుల్లో అర్జంటు కేసు లున్నాయంటూ.

సాయంకాలం $4\frac{1}{2}$ అయింది. ప్రతివాది లాయరు హాజరు కాలేదు.

ప్రతివాదిని కోప్పడ్డాడు జడ్జిగారు—

'పోయి పిల్చుకురావయ్యా మీ లాయరును....' అంటూ.

పాపం ప్రతివాది హడావుడిగా కోర్టుమెట్లుదిగి బయటకి వెళ్ళాడు.

ఆయనటు వెళ్ళాగానే యిటు ప్రతివాది లాయరు వచ్చాడు.

ఈలోపు జడ్జిగారు ఆఫీసు కాయితాలు సంతకానికి తన ఛాంబరులోకి వెళ్ళి సరిగ్గా 4 45 కి తిరిగి వచ్చారు.

ప్రతివాది లాయరు సుబ్బారావును బోనులో ఎక్కించి ఏవో పిచ్చి ప్రశ్నలు వేసాడు...

సుబ్బారావు తాగినట్లుగా సమాధాన మిస్తున్నాడు....

ఈలోగా సాయంకాలం అయిదు అయింది.

"మిగతా క్రాసు ఎగ్జామినేషను! రేపు చేస్తాను...." అన్నాడు ప్రతివాది లాయరు.

సుబ్బారావు సహసం కోల్పోయాడు....

"యువరానర్! నిన్న కావల్సిన కేసు యిది.... ఈ రోజుకి వాయిదా వేసారని....ఈ రోజు కేసు అయిపోతుందని బస్సు టికెట్టు గూడా బుక్ చేసు కొన్నాను ... ఇంకోరోజుకు వాయిదా వెయ్యండి దయచేసి...." అన్నాడు. జడ్జిగారితో.

"సరే....వచ్చేనేల అయిదో తారీక్కు వాయిదా వేస్తున్నాను...."

జడ్జిగారు తన ఆసనంనుంచి లేచారు.

వారితోపాటు లాయర్లు, పార్టీలు లేచారు....

లాయరు శంకరం, సుబ్బారావులు వుసూరుమంటూ తిరుగుముఖం పట్టారు....

సుబ్బారావు మళ్ళీ వచ్చేనెల అయిదోతారీకున కోర్టుకు హాజరు కావాలి.

తన క్రాసు ఎగ్జామినేషను ప్రతివాది లాయరు పూర్తి చేయచ్చు.

అంతటితో కేసు అయిపోతుందా?

కాదు....

తర్వాత బోలెడంత తతంగం వుంది.

ప్రతివాది కోర్టులో సాక్ష్యమియ్యాలి.

దానికి సుబ్బావు లాయరు అడ్డు ప్రశ్నలు వెయ్యాలి....

తర్వాత యిరుపక్షాల వైపు సాక్ష్యాలు....

తర్వాత సర్వేయరుచేత స్థలం గుర్తింపు....

అందుకు కోర్టు ఫీజే వెయ్యి రూపాయలట!

సుబ్బారావు ఆ ఫీజు కోర్టుకి చెల్లించాలి.

తాలూకాఫీసు నుంచి సర్వే రికార్డులు తెప్పించాలి.

ఇదంతా యెప్పుడవుతుంది?

ఈలోగా ప్రతివాది....సుబ్బారావు స్థలంలో కట్టిన యింట్లో కులుకుతుంటాడు హాయిగా....

లాయరు శంకరం సుబ్బారావు కేసులో ప్రతివాది సుబ్బారావు స్థలం అక్రమించి యిల్లు కట్టాడని నిజమైన పట్టా అసలైన పట్టా సుబ్బారావుదనీ కాబట్టి ప్రతివాది చర్య న్యాయబద్ధం కాదని అతనిని ఖాళీ చేయించి ఆ స్థలం సుబ్బారావుకు యివ్వాలని వాదించాడు.

వాసుదేవమూర్తి కేసులో ఆ స్థలం అసలు స్వంతదారు వాసుదేవమూర్తికి అమ్మాడనీ ఆ స్థలం కొనుకొన్న తర్వాతనే తన పార్టీ యిల్లు కట్టుకున్నాడనీ దురదృష్టవశాత్తు దస్తావేజు కాయితాలు రిజిష్టరు చేసుకునే ముందే తగలబడిపోయాయని తను ఆ స్థలం కొన్నట్లుగా సాక్షులున్నారని ప్రతివాది పిర్యాదు అక్రమమనీ వాసుదేవమూర్తికే స్థలం యిల్లు చెందాలని లాయరు శంకరం వాదించాడు.

ఇరు పక్షాలా సాక్షులూ....తాము నిజమే చెప్తున్నామంటూ సాక్ష్యం చెప్పారు.

ఎవరిది నిజం? ఎవరెది అబద్ధం? జడ్జిగారు తెలుసుకోవాలి.

ఎప్పటికీ తేలని కేసులు.

స్థలం అక్రమణ కేసులు ఆరు నెలల్లో తేల్చాలని ప్రభుత్వం వుత్తర్వులు వున్నాయట! కాని పట్టించుకునే జడ్జీలేరీ? హైకోర్టుల్లో, సుప్రీమ్ కోర్టుల్లో గూడ యిదే తంతు గదా! ఈ న్యాయస్థానాలు క్రమబద్ధంగా పని చేసేదెప్పుడు?

సుబ్బారావు, వాసుదేవమూర్తి...కోర్టుచుట్టూ తిరుగుతూనే వున్నారు.... అటువైపు ప్రతివాదీ, వాదీ! అంతే!!

జడ్జీలు మారిపోతూనే వున్నారు.

"నీ కేసు తేలుస్తాం...."అంటూనే వున్నారు యిద్దరు లాయర్లు....పార్టీలకు డబ్బు నీళ్ళలాగా ఖర్చవుతూనే వుంది.

"గెలిచినవాడు యింటిదగ్గరేడుస్తే ఓడిపోయినవాడు కోర్టులోనే యేడ్చాట్ట" అనే సామెత వూరికే పోతుందా?

*

# తిరుగబడిన యువతి

— కె. పి. బాబు

స్వాతంత్ర్య సమరం ముమ్మరంగా సాగుతున్న కాలమది....

రాజమండ్రిలో మోహనాంగి ఆ రోజుల్లో కూడా పైలా పచ్చీసుగా జీవించింది. ఆమె కొక్కతే బిడ్డ - కనకాంగి. తనకు వయసు పైబడుతున్నదని గ్రహించిన మోహనాంగి కూతుర్ని అల్లారు ముద్దుగా, ఏ లోటూ ఎరుగనిదానిలా పెంచుకొచ్చింది; పెద్దమనిషి అయ్యేవరకూ చదివించింది కూడా. అయితే, కనకాంగి సమర్తాడగానే స్కూలుకి పంపడం ఆపేసి, ఆ పిల్లకు తగిన పెద్ద మనిషితో వైభవంగా 'కన్నెరికం' చేయించి, 'వృత్తి'లోకి దింపాలని ప్రయత్నాలు చేయసాగింది.

అది తెలిసి కనకాంగి "నేను సానిదాన్నికాను; సంసారి నవుతాను!" అని చెప్పింది. తల్లి తెల్లబోయింది; బంధుమిత్రులు నవ్వుకున్నారు. ''నీకిదేంపోయే కాలమే? ఇంతకాలం ఇంత కష్టపడి పెంచింది ఇందుకేనా?'' అని మోహనాంగి కసురుకుంది.

''కన్నబిడ్డను పెంచడం కష్టంగా భావించేది తల్లేనా? కులమతాలే వుండ కూడదంటున్న యీ రోజుల్లో కులవృత్తి పేరుతో ఒక దురాచారాన్ని నేను ఆచరించలేను'' అని కనకాంగి కుండబద్దలు కొట్టినట్లు చెప్పేసింది.

దానితో రెచ్చిపోయిన తల్లి, బంధువుల సాయంతో కూతుర్ని నానా హింసల పాలుచేసింది. కొన్ని రోజులు కూడూ నీళ్లూ లేకుండా బాధ పెట్టింది. చివరికి వాతలు కూడా పెట్టింది. అయినా కనకాంగి లొంగలేదు. సరిగదా- ''నేను చావనైనా చస్తానుగాని, సానిని మాత్రం కాను!'' అని తెగేసి చెప్పేసింది.

''అయితే, నిన్ను పోషించి పెళ్ళిచేసి పంపడానికి నేను సిద్ధంగా లేను. నా దగ్గర్నుంచి పోయి, నీ పాట్లేవో నువ్వు పడు - పోవే!'' అన్నది మోహనాంగి.

''నేను నీ ఆస్తిపాస్తుల నాశించలేదెప్పుడూ. నా కాళ్ళమీద నేను బతుకుతూ నా కిష్టమైన జీవితాన్ని నేను గడుపుకోగలను తల్లీ!'' అని కనకాంగి అనాడే తన ఒంటిమీదున్న నగల్ని కూడా తీసి తల్లి ముఖాన కొట్టి, కట్టుబట్టలతో ఇల్లొదిలిపోయింది.

రెండు మూడు రోజులు చూచి అదే తిరిగి వస్తుందని ఊరుకుంది మోహనాంగి. కాని, కనకాంగి మళ్ళీ ఆ గుమ్మం తొక్కలేదు. తనకు తెలిసిన ఒక సంఘసేవిక సుమిత్ర వద్దకు పోయింది. ఆమె ఆదర్శాన్నీ, ధైర్యసాహసాల్నీ మెచ్చుకుని, ఆదరించింది. కనకాంగి కోరిక మేరకు ఒక గది అద్దెకు తీసిచ్చి, ఒక కుట్టుమిషను కొనిపెట్టింది.

కనకాంగికి కుట్టుపనీ, అల్లికపనీ బాగావచ్చు. ఆ పనులు చేస్తూ, సుమిత్రకు సంఘసేవా కార్యక్రమాల్లో చేదోడు వాదోడుగా వుంటూ జీవించసాగింది. కాని, ఆమె అసలు కోరిక "పెళ్ళి" అనేది జరిగేట్లు కనిపించలేదు. ఆమె కులం యువకులైతే, ఆమెకు ఆస్తిపాస్తులేం లేవు - రావు అనుకుని ఆమెను పెళ్ళిచేసుకోవడానికి ముందుకు రాలేదు. ఇతర యువకులు 'ఎంతైనా సానిపిల్ల' అనే దృష్టితో సాహసించలేకపోయారు.... అదొక్కటే కనకాంగికి బాధ కలిగించసాగింది....

అటువంటి సమయంలో రాము జైలునించి విడుదలై, సుమిత్రవద్దకేదో పనిమీద వచ్చాడు. అతను కృష్ణశాస్త్రిగారి ఏకైక కుమారుడు. కృష్ణశాస్త్రిగారంటే రాజమండ్రిలో అప్పుడున్న సనాతన ఛాందస బ్రాహ్మణుల్లో అగ్రేసరులు; సిరిసంపదల్లోనూ అంతే! ఒక్కగానొక్క బిడ్డగదా అని కృష్ణశాస్త్రిగారు రామశాస్త్రిని ముద్దుమురిపాలతో పెంచసాగారు. ఆయన వేదవేదాంగాలు చదివించబోతే, తల్లి పట్టుబట్టి ఆధునిక పాఠశాలకు పంపించింది.

రామశాస్త్రి స్కూల్లో చదువుతున్నప్పుడు పంతుళ్ళవల్లా, సహచరులవల్లా లోకజ్ఞానం బాగా సంపాదించుకున్నాడు. అందువల్ల అతను స్వాతంత్ర్యోద్యమంలో చురుగ్గా పాల్గొనడం మొదలెట్టాడు. ఖద్దరు బట్టలు ధరించనారంభించాడు. తనపేరు చివరవున్న 'శాస్త్రి' అనే మాటను స్వచ్ఛందంగా తీసిపారేసి, 'రాము',

'రామయ్య', 'రామన్న' అని పిలుపించుకోసాగాడు. అవన్నీ తెలిసి కృష్ణశాస్త్రి గారు ఆగ్రహిస్తుంటే, ఆయన భార్య సోమిదేవమ్మ శాంతింపజేస్తూవచ్చేది....

చివరికోసారి రాము విదేశీ విద్య, వస్తువులు వద్దంటూ, కాలేజీకి పోకుండా జైలుకి వెళ్ళాడు. విడుదలయ్యాక ఏదో పనిపడి సుమిత్ర వద్దకిపోయాడు. అక్కడఅతనికి కనకాంగి కనిపించింది. "ఎవరీ అమ్మాయి?" అని యాదాలాపంగా అడిగాడు రాము.

"సానిగా సుఖ భోగభాగ్యాలనుభవించడంకన్నా, సంసారిగా కలో గంజో తాగడం మంచిది అనుకొని ఇల్లొదిలి వచ్చేసిన ఆదర్శప్రాయురాలు!" అని సుమిత్ర కనకాంగి గురించి అంతా వివరంగా చెప్పింది.

అటువంటి అమ్మాయిని పెళ్ళాడేందుకు ఎవరూ ముందుకురావడంలేదని తెలుసుకుని రాము ఎంతో ఆవేదన చెందాడు. కొన్నాళ్ళుపోయాక మళ్ళీ సుమిత్రను కలిశాడు. "ఆ అమ్మాయి నెవరన్నా పెళ్ళి చేసుకోవడానికి వచ్చారా?" అని అడిగాడు.

"ఇంతవరకూ రాలేదు, రామూ!" అన్నది సుమిత్ర విచారంగా.

"ఇదిగో సుమిత్రమ్మా! ఆమె ఇష్టపడితే నేను చేసుకోదల్చాను" అనేశాడు రాము.

ఆ మాట విని సుమిత్ర దిగ్భ్రాంతురాలైంది. కనకాంగికి కలేమో అనిపించింది. "మీ కాలిగోటికి సరిపోలని నేను మిమ్మల్నెలా కాదనగలనండీ? పైగా ఇది నా మహద్భాగ్యంగా భావిస్తాను" అన్నది ఆపైన కనకాంగి, ఆనందాశ్రువులు రాలుస్తూ.

రాము చిరునవ్వుతో, "సినిమా డైలాగులు వల్లించొద్దు. నిజ జీవితంలో నువ్వొక దురాచారం మీద దండెత్తి, కట్టుబట్టలతో ఇల్లొదిలివచ్చేసి, ఒంటరిగా నీ కాళ్ళమీద నువ్వు నిలబడుతూ, ఓ ఆదర్శ గృహిణివి కావాలనుకుంటున్నావు. అటువంటి నీకిప్పుడు తగిన చేయూత నివ్వకపోతే నీవంటి అనేకమందికి ఆశాభంగం కలిగించినట్లవుతుంది. ఇస్తే - ఎందరికో ఎంతో ధైర్యోత్సాహాలు కలిగించి నట్లవుతుంది. అదే ఉద్దేశంతో నేనీ సాహసానికి పూనుకుంటున్నానంతే గాని, నేనేం మహా పురుషుడ్ని కాను - మహద్భాగ్యం కలిగించడానికి! పైగా,

నాతో కాపురంచేయడం అంటే ముళ్ళబాటమీద ప్రయాణం చేయడమే కావచ్చు-తెలుసా?" అన్నాడు.

"దేనికైనా నేను సిద్ధమే!" అన్నది కనకాంగి దృఢస్వరంతో.

సుమిత్ర మనస్ఫూర్తిగా వాళ్ళిద్దర్నీ ఆశీర్వదించింది.

* * *

ఆనాడే రాము కనకాంగిని తమ అభిమానుల సమక్షంలో, బ్రహ్మసమాజంలో వివాహం చేసుకున్నాడు; అక్కడ్నుంచి తిన్నగా తన యింటికి కనకాంగిని తీసుకుపోయాడు.

అప్పటికే ఆ సంగతంతా తెలిసిపోయిన కృష్ణశాస్త్రిగారు దెబ్బతిన్న పులిలా సింహద్వారంకి అటువైపు నిలబడి వున్నారు. ఆయన వెనుక సోమిదేవమ్మ గుడ్ల నీరుకుక్కుంటూ వుంది.

రాము మాత్రం నవ్వు ముఖంతో కనకాంగిని చేయిపట్టుకుని సింహద్వారం వద్దకు నడిపించుకు వెళ్ళాడు. భయాందోళనలతో నిలువునా వణికిపోతోంది కనకాంగి. ఆమె అనుకున్నట్లే వాళ్ళు సింహద్వారాన్ని సమీపించగానే లోపల్నుండి "ఆగండి!" అన్న సింహగర్జన వంటి కృష్ణశాస్త్రి గారి కంఠస్వరం వినబడింది.

ఆయన తన చేతికర్ర నెత్తి ఊపుతూ, "భ్రష్టుడా! ఆనాడు శిశుపాలుడ్ని నూరు తప్పుల దాకా శ్రీకృష్ణుడు సహించినట్లు ఈనాడు నువ్విన్ని అకృత్యాలు చేసినా భరించాను. కాని, ఇప్పుడు నువ్వు చేసిన అపచారాన్ని మాత్రం ఇక సహించేది లేదు. పో! ఇక నువ్వు మా కొడుకువే కాదనుకుంటాం. ఈ సిరిసంపదలన్నీ నా స్వార్జితం. దీనిలో నీకింక ఒక్క దమ్మిడీ అయినారాదు. పో! ఆ సాని పిల్లతో ఎలా సుఖిస్తావో - సుఖించు - పోపో!" అని అరిచారు ఆవేశోద్రేకాలతో.

ఆయన వెనుక వున్న సోమిదేవమ్మ "ఏమండీ, ఏమండీ!" అని వెక్కి వెక్కి ఏడవ నారంభించిది. రాము పక్కనున్న కనకాంగీ, అతనితో వచ్చిన అభిమానులూ హడలిపోసాగారు. కాని, రాము తొణకలేదు - బెణకలేదు. అతని నవ్వుముఖం మాత్రం గంభీరముద్ర దాల్చింది.

"కృష్ణశాస్త్రిగారూ! మీరిక నన్ను కొడుకును కాదనుకుంటున్నారు గనుక ఇక మిమ్మల్ని 'నాన్నగారూ' అని పిలవదల్చుకోలేదు మీరనుకునేట్లు నేను అకృత్యాలూ, అపచారాలూ చేసినవాడినయితే మీకు నా ముఖం చూపకుండానే ఎటో పోయి వుండేవాడిని. కాని, నేను చేసినవన్నీ మంచిపనులేనని నా అంతరాత్మ చెప్తోంది కాబట్టే ఇన్నాళ్ళూ మీ యింట్లో మసిలాను. ఇప్పుడు చేసిన ఈ పనికూడా మరింత మంచిదని భావించాను. కాబట్టే, ధైర్యంగా తలెత్తుకుని, మీ ఆశీర్వాదాలు పొందాలని యిలా వచ్చాను. అంతేగాని, మీ ఆస్తిపాస్తుల్ని ఆశించి కాదు. ఇంతకు ముందు కూడా వాటిని నేనాశించి ప్రవర్తించలేదని మీరింతవరకూ గుర్తించ లేదంటే ఆశ్చర్యపోతున్నాను - ఇప్పటికైనా గ్రహిస్తే సంతోషిస్తాను. 'వెళ్ళొస్తాం' అనాలని మీ ఆచారం. కాని, ఇప్పటి పరిస్థితినిబట్టి నేను 'వెళ్తున్నాను' అని పోతున్నాను - సెలవ్!" అని గిర్రున వెనుదిరిగి, కనకాంగిని వెంటబెట్టుకుని అక్కడనుండి వెళ్ళిపోయాడు.

అతని నిర్భయత్వానికీ, నిశ్చింతకూ అక్కడ చేరిన వాళ్ళేగాక, కృష్ణశాస్త్రిగారు కూడా ఆశ్చర్యపోయారు. "ఏమండీ, ఏమండీ!" అని దుఃఖిస్తున్న భార్యను "ఎన్నాళ్ళే యీ బింకం వాడికి? నువ్వేం దిగులు పడకు. నాలుగు రోజులు గడిచాక చూడు - 'అమ్మా, నాన్నా! పొరబాటై పోయింది - క్షమించరూ?' అని, దాన్నొదిలేసి వాడే మన దగ్గరకి వచ్చేస్తాడు!" అని ధైర్యం చెప్పి, ఓదార్చారు పైకి. కాని, రాము మాత్రం మళ్ళీ ఆ గుమ్మం తొక్కలేదు!

* * *

ఆదర్శం కోసం సర్వస్వం వదిలేసి వీధిన పడ్డ రాముకి మొదట్లో కనకాంగి అద్దెకు తీసుకున్న గదే ఆశ్రయమైంది; ఆమె సంపాదనే ఆధారమైంది. అది అతనికి యిష్టం లేదు. మరే విధంగా నిలబడాలో అని ఆలోచిస్తుండగా అతన్ని వెతుక్కుంటూ కిరీటి వచ్చాడు....

కిరీటి రాజమండ్రీలో ఒక కార్యవాది అయిన సంఘసంస్కర్త. అతనికో ప్రెస్సుంది; 'సర్వోదయ' అనే వార పత్రిక వుంది. రాము అప్పుడప్పుడు ఆ పత్రికకు రాజకీయ, సాంఘికపరమైన వ్యాసాలూ అవీ వ్రాస్తుండేవాడు. అందుకనే కిరీటి రాము చేసిన ఘనకార్యం తెలియగానే వచ్చి, "బాబూ! నువ్విప్పుడు ఏదన్నా ఉద్యోగం కావాలని వెదుకుతున్నావట. నా పత్రిక్కి సహాయ సంపాద

కుడుగా వుంటూ, నా ప్రెస్సు పనీ చూస్తుండరాదా? నీక్కావలసినంతా నెల నెలా యిస్తుంటాను" అన్నాడు.

"అంతకంటేనా?" అని ఆనందంతో అంగీకరించాడు రాము.

ఆ నాటినుంచి కిరీటికి గొప్ప బరువు బాధ్యతలు తొలిగిపోయినట్లయింది, రాముకి నిత్యజీవనసమస్య తప్పిపోయినట్లయ్యింది. సర్వోదయప్రెస్సూ, పత్రిక కూడా మరింత అభివృద్ధిపథాన నడవసాగాయి.

అన్నింటినీ మించి కొందరి అనుమానాల్నీ, ఆశంకల్నీ పటాపంచలు చేస్తూ రాము, కనకాంగి కాపురం నిత్యకల్యాణం - పచ్చతోరణంలా కొనసాగింది....ఇక వారిని ఆ దేవుడు కూడా వేరు చేయలేడు అని తెలిపోయాక అటు మోహనాంగీ, ఇటు కృష్ణశాస్త్రిగారుకూడా ఆవేశంతగ్గించుకొని,ఆవేదనలోపడ్డారు. అవసాన దశకూడా సమీపించడంతో ముందు మోహనాంగి తనకు మిగిలినదంతా కనకాంగికి యిచ్చేసి కన్నుమూసింది. అయితే, దాన్నంతా కనకాంగి రాము సూచనమేరకు మనస్ఫూర్తిగా 'అనాధయువతీశరణాలయం'కు దానం చేసేసింది. తర్వాత కృష్ణశాస్త్రిగారు తన యావదాస్తినీ రాము పేర వ్రాసి మరీ పోయాడు. అయితే, రాము ఇల్లు మాత్రం తల్లికని వుంచి, మిగతాదంతా సంఘ సేవా సంస్థలకు విరాళంగా పంచేశాడు. ఆ తల్లి బ్రతికివున్నంతకాలం కంటికిరెప్పలా కాపాడాడు.

*  *  *

మరికొంత కాలానికి దేశానికి స్వతంత్రం వచ్చింది. అదే సమయానికి కనకాంగి ఒక ఆడపిల్లను ప్రసవించింది. ఆ పిల్లకు సందర్భోచితంగా "విజయ లక్ష్మి" అని పేరు పెట్టి, ఆనందోత్సాహాలతో పెంచసాగారు రాము దంపతులు.

విజయలక్ష్మికి తమ ఆచార ప్రకారం చిన్నప్పట్నుంచీ ఖద్దరు బట్టలే తొడుగుతూ వచ్చారు వాళ్ళు. నగలు కూడా అట్టే పెట్టేవాళ్ళు కాదు. అక్షరాభ్యాసం అయ్యాక మునిసిపల్ స్కూల్లోనే చేర్చారు. తెలుగు మాధ్యమంగానే చదువు చెప్పించసాగారు.

స్వాతంత్ర్యం లభించాక దేశంలో చాలా మార్పు లొచ్చాయి. అవి విపరీతంగా పరిణమించాయి కూడా. స్వతంత్రం రాక ముందు 'ఇంగ్లీషు వద్దు' అనే వారు కాని, తర్వాత కాన్వెంటు స్కూళ్ళు పుట్టగొడుగుల్లా వెలిశాయి వీధి వీధికీ.

అధిక సంఖ్యాకులు వాళ్ళ పిల్లల్ని ఆ స్కూళ్ళల్లోనే ఎంతెంతో ఖర్చు పెడుతూ చదివించనారంభించారు. 'అమ్మా - నాన్నా; మామయ్యా' బదులు 'మమ్మీ - డాడీ; అంకుల్' అని పిలుచుకోవడం అలవాటైపోయింది.

విజయలక్ష్మికి చిన్నతనంనుండీ 'మమ్మీ - డాడీ' సంస్కృతి మీదే అభిమానం ఏర్పడింది. చక్కని యూనిఫారాలతో స్కూటర్ల మీదో, సైకిల్ రిక్షాల మీదో, స్కూల్ వేన్లలోనో కాన్వెంట్లకు వెళ్ళి వచ్చే పిల్లల్ని చూస్తూ తనకా అదృష్టం పట్టలేదే అని లోలోన చింతించేది. ఇంట్లో వున్న విలువైన గ్రంథాల్ని, పత్రికల్ని 'తలనొప్పి' అని ఈసడిస్తూ, లెండింగ్ లైబ్రరీలనుండి సినిమా పత్రికలూ, 'ఆధునిక' నవలలూ తెచ్చుకుని చదువుతుండేది. ఆమెకు ఆదినుంచీ సంగీత, నృత్యగానాల మీద అభిలాష అధికంగా వుండేది. కనుక, వాటిలో ప్రైజులు పొందుతూ - చదువుసంధ్యల్లో వెనుకబడుతూ వచ్చింది. ఎలాగోలా స్కూల్ఫైనల్ పాసయ్యా ననిపించింది. కాలేజీలో చేరదామంటే - మార్కులు తక్కువ, డొనేషన్లు ఎక్కువ - ఇతర తంతులవల్ల కుదరలేదు. 'మీ నాన్నగారు తలుచుకుంటే - ఆయనకున్న పలుకుబడికి ఏ కాలేజీలోనైనా సరే నీకు ఈజీగా సీటొస్తుంది గదా!' అన్నారెంతమందో. కాని, మంచి మార్కులు రాని తన బిడ్డకి, సీటు యిప్పించమని ప్రాధేయపడడం రామయ్యకు సుతరామూ గిట్టలేదు. ఎందరెందరికో అటువంటి సహాయాలు చేశాడు గాని, కన్నకూతురుకు అలా చేయడం భావ్యం కాదనుకున్నాడు. అది చూచి, అతనో బాదస్తు దను కున్నారు అనేకులు. అది నిజమేననుకుంటూ విజయలక్ష్మి మరింతగా బాధపడుతూ, సినిమాలు చూస్తూ, సినిమా పత్రికలు చదువుతూ కాలక్షేపం చేయసాగింది.

ఆ సినిమా పత్రికల్లో కనిపించే నటీనటుల రంగు రంగుల చిత్రాలూ, వారి చిత్రవిచిత్రమైన జీవిత చిత్రణలూ విజయలక్ష్మిని ఏవేవో ఊహాలోకాల్లో విహరింపజేసేవి. అలా వుండగా, ఒకనాడు ఎవరో కనకమ్మను "మీ అమ్మాయి పెళ్ళెప్పుడు?" అని ప్రశ్నించడం, ఆమె "వీలైనంత తొందరలో చేయాలనే చూస్తున్నాం" అని జవాబివ్వడం విన్నది విజయలక్ష్మి. దానితో ఆ అమ్మాయిలో అనేకమైన ఆలోచనలు పుట్టి వేధించ జొచ్చాయి.... తత్ఫలితంగా ఒకనాడు విజయలక్ష్మి ఇంట్లోంచి మాయమైపోయింది! ఆరా తీయగా, ఒక స్నేహితు రాలితో కలిసి ఎటో వెళ్ళిపోయిందని తెలిసింది.

కనకమ్మ బాధ తొలగించడానికన్నట్లు రామయ్య అటూ యిటూ కూతురి కోసం వెదకి, వెదికించి చివరికి ఏమీ తెలియనట్లే ఊరుకున్నాడు.

* * * *

తర్వాత ఒకసారి ఏదో పనిమీద కిరీటి మద్రాసుకు వెళ్ళాడు. అక్కడుండగా ఆయనకు విజయలక్ష్మి అచూకీ కొంత తెలిసింది. ఆశ్చర్యపోతూ కిరీటి ఆమెను వెదకుతూపోయాడు.

ఒక చిన్న బిల్డింగ్‌లో - దేవలోకంలో అప్సరసలా వుంది విజయలక్ష్మి. ఆ బిల్డింగ్ ఒక సినిమా ప్రొడ్యూసర్‌దనీ, ఆయన ప్రాపకంలోనే ఆమె వుంటున్నదనీ తెలుసుకుని నిర్ఘాంతపోయాడు కిరీటి.

''అంకుల్! ఏమిటలా చూస్తున్నారు? ఎప్పుడొచ్చారు? రండి-రండి'' అని సాదరంగా ఆహ్వానించి, ఒక సోఫాలో కూర్చోబెట్టింది విజయలక్ష్మి.

''నువ్వు చేసిన యీ పనికి యింకెలా చూడమంటావమ్మా?'' అన్నాడు కిరీటి ఆగ్రహావేశాల్ని అణచుకుంటూ.

''నేనేం చేశా నిప్పుడు అంకుల్? ఆ సాదా సీదా బతుకు బతకలేక నాలో వున్న కళల్ని ప్రదర్శించి సుఖ భోగా లనుభవించాలని వచ్చేశాను - తప్పా? నన్నీ ప్రొడ్యూసర్ లైక్ చేశాడు. త్వరలోనే గ్రేట్ స్టార్‌ని చేయబోతున్నాడు. నాకింకేం కావాలి? అక్కడుంటే రేపో మాపో ఏ దౌర్భాగ్యుడికో నన్ను కట్టబెట్టి మా అమ్మా నాన్నా మరింత ఆదర్శప్రాయు లనిపించుకుంటారు - అంతేగా?'' అన్నది విజయలక్ష్మి, నిరసనగా తలవిదిలిస్తూ.

''ఆ సంగతలా వుంచుగాని, ఈ ప్రొడ్యూసర్‌కి ఒక భార్యా, ముగ్గురు బిడ్డలూ వున్నారని విన్నాను - నిజమేనా?'' అని ప్రశ్నించాడు కిరీటి.

''ఒక భార్యా ఇద్దరు బిడ్డలేం ఖర్మ? మరో స్టారూ, ఆమెకో యిద్దరు పిల్లలు కూడా వున్నారట! ఈయనకి స్టార్ మేకరని పేరీ ఫీల్డులో. అది తెలిసే చేరాను నేనీయన వద్దకి. దానికి తగినట్లే నన్ను వాళ్ళందరికన్న మిన్నగా చూచుకుంటున్నాడు - తెలుసా?'' అన్నది విజయలక్ష్మి గొప్పగా.

టిగ్గున లేచాడు కిరీటి. అణచినా అణగని ఆవేశంతో నిలువెల్లా ఊగిపోతూ ''అమ్మాయ్! సూటు బూట్లు ధరించే గాంధీగారు అంగవస్త్రంతో, స్వల్ప

హారంతో ఎందుకు గడిపాడో తెలుసా నీకు? 'నా దేశంలో ప్రజలందరికీ తగిన కూడూ గుడ్డా లభించేంతవరకూ నేనిలాగే జీవిస్తాను!' అని ప్రతిజ్ఞ చేశాడా మహాత్ముడు. అలాగే మీ అమ్మానాన్నలుకూడా పట్టు పీతాంబరాలు కట్టగలిగి వుండికూడా ఖద్దరు బట్టలతోనే కాలం గడుపుతున్నారని నీవింతవరకూ తెలుసుకో లేకపోవడం నీ అజ్ఞానాన్ని మాత్రమే తెలియజేస్తోంది - తెలుసా? అలాగే ప్రతి విషయంలోనూ వారి గొప్పతనాన్ని అర్థం చేసుకోలేక నువ్వు వారిని అసమర్థులుగా భావిస్తూ-వచ్చావని నాకిప్పుడర్థమవుతోంది.

''ముఖ్యంగా చెప్పాల్సిందొకటుందమ్మాయ్! మీ అమ్మ ఏ సిరిసంపదలను లెఖ్ఖ చేయకుండా ఏ దురాచారంపైనైతే తిరుగుబాటు చేసిందో - అదే సిరి సంపదల మీద మోజుతో ఆ దురాచారంలోకే నీవు తిరుగబడిపోయావు! ఈ తేడా గుర్తించనంతవరకూ నీకూ - నీవంటివారెవరికైనా కూడా సుఖశాంతులుండవనుకో!'' అంటూనే బయటకు విసవిసా వెళ్ళిపోయాడు.

ఆయనకు గొప్ప విందు చేసి తన ఘనత ప్రదర్శించాలనుకున్న విజయలక్ష్మి అట్టే నిలబడిపోయింది అచేతనంగా.... *

[ఈ కథ వ్రాసేందుకు తగిన స్ఫూర్తినిచ్చింది ఏలూరు "పాము"]

# చేనేత చిత్రం

—మునిపల్లె రాజు

మనిషి - తన బాల్యావస్థనుండీ భవిష్యత్ జీవితాన్ని గురించి ఎన్నో మధురమైన స్వప్నాలు దర్శిస్తుంటాడు ఆశలు పెంచుకొంటాడు తీరా, తన జీవికకు పునాదులు ఏర్పడేసరికి తన కలలకూ వాస్తవ పరిస్థితులకూ ఎక్కడా పొంతన కుదరదు. నిరాశ పడతాడు. కుంగిపోతాడు. అయినా వాస్తవంలోనే జీవించాలి. తప్పదు గదా! ఇది జీవిత రహస్యం.

ఎక్కడో ఒక మారుమూల పల్లెసీమ సుందర వాతావరణంలో జన్మించి, నా బతుకంతా అక్కడి ప్రశాంతతలోనే గడిచిపోతుందని కన్న కలలకూ, తర్వాత బొంబాయి మహా నగరంలో కడుపు చేతపట్టుకొని నేను చేయవలసి వచ్చిన వుద్యోగ ధర్మానికీ సాపత్యం ఎట్లా వుంటుంది? పదిహేనేళ్ళుగా నా జన్మభూమిని మరిచిపోయాను. నా చిన్ననాటి కలలను విస్మరించాను. కాని ఇద్దరు వ్యక్తులు తారసపడి మళ్ళీ నన్ను నా బాల్యానందంలోకి, నా జన్మభూమి ప్రశాంతతలోకి తీసుకుపోవడంగూడా జీవిత రహస్యమే.

ఆ వ్యక్తుల్లో మొదటివాడు నా సహోద్యోగి - ముఖర్జీ. ప్రతి ఆదివారం పది మైళ్ళ దూరాన్నుంచి నా గదికి వచ్చేవాడు. ''కీమోషాయ్....నొమొష్కార్ నొమొష్కార్'' - (అంటే) ఏం మహాశయా - నమస్కారం నమస్కారం-అనే పిలుపు. చంకలో పొదివి పట్టుకొన్న హార్మోని పెట్టెను సోఫామీద పెట్టేవాడు. దాని శృతుల్ని సరిచేసేవాడు. ఇంతలోనే నేను టీ కెటిల్‌తో - ''చాయ్ ఖాబేన్ దాదా'' అంటాను. ''భాలో (మంచిది)'' అంటాడు తను. ఇక అతని ప్రవాస గీతాలు- బెంగాలీ గీతాలు.

ఒక పాట - "వేల యోజనాల దూరాన నీ వూరు. నీ వంశ వృక్షపు వేళ్లు అక్కడే వున్నాయ్. అక్కడే వుగ్గుపాలు తాగావ్. ఆ చెట్ల మధ్య ఆడు కొన్నావ్. నీ పూర్వీకుల అస్థికల్ని అక్కడి మట్టిలోనే కలిపావ్. ఇప్పుడీ యంత్రాల నగరంలో జీవితం. గతమంతా మగత కలేనా? జ్ఞాపకాలన్నీ ఆవలింత లేనా తమ్ముడూ? నీ మది కలత చెందడంలేదా సోదరా? ఈ నగరంలో నువ్వొక సంఖ్యవే గదా!? నీ వ్యక్తిత్వం పారవేసుకొన్నావా మనిషీ?!"

ఇంకో పాట : "ప్రవాసంలో నీతో తెచ్చుకొన్నది స్వల్పం. వెనక విడిచి వచ్చింది అనంతం, అమూల్యం. నీ తాతలు, నాయనమ్మలు, బాబాయిలు, అక్క చెల్లెళ్ళు, చండీమాత వేదిక, చైతన్యమఠం, చెరువులో చేపల వేట, పండగలో కొత్త బట్టలు, బంధుమిత్రుల పరిహాసాలు- మళ్ళీ నాకా జీవితం ప్రసాదించు ప్రభూ!"

తర్వాత చక్మా భక్తి గీతాలు. ఈ చక్మా జాతి ప్రజలు అతి శాంత మూర్తులైన కొండజాతి బౌద్ధ మతస్థులు. పొరుగుదేశంలో అత్యాచారాలకు గురి అయి శరణార్థులుగా వచ్చినవారు. పురాణ యుగాల నుండీ అనుభవించిన జన్మ భూమికి దూరమైనవాళ్లు, దీనులు. సిద్ధార్థుణ్ణి తథాగతుణ్ణి, గౌతమబుద్ధుడిని - తమ అడవుల్నీ, కొండల్నీ, సెలయేళ్లను, పశు సంపదను ఫల పుష్పాల చెట్లనూ— తమకు తిరిగి యిప్పించమని వేడుకొనే గీతాలు వాళ్ళవి. తన్మయుడై ముఖర్జీ ఆలపించేవాడు.

అతని కంఠం రుద్ధమై పోయేది. నా గుండెలు కలతపడేవి. ఇద్దరి నయనాలు అశ్రుజలంతో నిండిపోయేవి. మధ్యాహ్నం యిద్దరం అక్కడే భోజనం మౌనంగా ముగించే వాళ్ళం. అంత మౌనంతోనే హార్మోనీ పెట్టెతో సాయం సంధ్యలో నిష్క్రమించేవాడు. ఆ మధ్యనే అతను తన స్వరాష్ట్రానికి వెళ్లి పోయాడు - నన్ను ఏకాకిని చేసిపోయాడు. కొన్నాళ్ళకు నా కన్నీళ్లూ ఇంకి పోయినవి.

* * *

కాని, ముఖర్జీ బాబు గాదు - నేను వలస వచ్చి జీవితంలో కోల్పోయిన అంశాలను, అనందాలను విశదీకరించిన వాడు ఓబయ్య; మా గ్రామం చేనేత శ్రామికుడు. ఈ కథ అతనిదే. ఒక అమాయకుడిది; ఒక అనామకుడిది.

ఇరవై ఏళ్ళ క్రితం - మద్రాసు ఆర్ట్ స్కూల్లో నా చిత్రలేఖనం చదువు మూన్నాళ్ళ ముచ్చటగా ముగిసింది. ఆ లలితకళ నాకబ్బదని నాలుగు నెలల్లోనే గ్రహించి దిశ మార్చుకొని కాలేజీలో చేరి పట్టా పుచ్చుకొని ఉద్యోగాన్వేషణలో యీ నగరం చేరాను.

కాని, ఇంగువ కట్టిన వస్త్రంలాగా ఆర్టుస్కూలు పాత వాసనలు వదల లేదు - ఇన్నేళ్ళయినా. ఎవరి ప్రోద్బలం వల్ల ఆర్టుస్కూల్లో ప్రవేశించానో ఆ స్నేహ బృందంతో నా సత్సంబంధాలు సడలిపోలేదు, పశ్చాత్తాపమూ విడిపోలేదు. మా పెదనాన్న కూతురు కస్తూరి, ఆమె ప్రేమించి పెళ్ళి చేసుకొన్న మోహన్‌రావు పని మీద బొంబాయి వచ్చినా. నా చిన్నఫ్లాట్‌లో మకాం చేయక మానరు. ఈ యువదంపతులిద్దరూ గురుకులవాసం చేసి చిత్రలేఖనంలో డిప్లొమాలు పుచ్చుకొని కొంత ప్రఖ్యాతులైనారు. విదేశయాత్రలూ చేశారు. ఎగ్జిబిషన్లు పెట్టారు. ఇప్పుడు కాల నర్తకి పద ఘట్టనలో నలిగిపోతున్న ఆంధ్రదేశపు హస్తకళల్ని పునరుజ్జీవనం చేసే యజ్ఞాన్ని చేపట్టిన సోమయాజి, సోమిదేవిగా నాకు ప్రత్యక్షమైనారు.

కస్తూరి తంతివార్తలో - అతిథులతో వస్తున్నాం - అని చదివి, కొంత ఔత్సుకతో బొంబాయి విక్టోరియా టెర్మినల్ స్టేషన్ ఫ్లాట్‌ఫారం మీద ప్రచండ ప్రయాణీక సందోహాన్ని తిలకిస్తూ నిలిచినప్పుడు - ఆ దంపతులతో బండిదిగిన ఒక గ్రామీణుడే ఓబయ్య. మోకాళ్ళదిగీ దిగని ధోవతి, సగం చేతుల గళ్ళచొక్కా, పైన ఒక పాత తువాలు ముఖం మీద చిన్నబిడ్డ నొప్పికి కాల్చినమచ్చ. సర్కస్ డేరాలో తప్పిపోయిన పసిబాలుడిలాగా, బితుకు బితుకు మంటూ మోహన్‌రావును తాకుతూ నిలబడి వున్నాడు. జనసమ్మర్దాన్ని, నన్నూ- మార్చి మార్చి చూస్తున్నాడు.

అట్లా వణికి పోతున్న ఓబయ్యను నా ముందుకు తోసి కస్తూరి అన్నది- "మీ - ఊరే. కలంకారీ పనివాడు. గుర్తుపట్టగలవేమో చూడు."

గుర్తు పట్టలేదు మా గ్రామంలో మగ్గాలవీధి కొంచెం దూరంలో చెరువు గట్టు నానుకొని వుండేది. బాల్యంలో ఒకటి రెండు సార్లు వెళ్ళి వున్నానేమో! వేణుగోపాలస్వామి వసంతోత్సవానికి ఆ వీధినుండే మధుపర్కాలు వచ్చేవి మేళతాళాలతో, చలువ చప్పరం క్రింద పళ్ళేలలో పవిత్రంగా పెట్టుకొని ఉత్సవ

మర్యాదలతో ఊరేగింపుగా ఆలయ సన్నిధిలో ధర్మకర్తకు సమర్పించేవారు. ఆ ధర్మకర్త మా పెద తాతయ్యగారే. తరంగాలు పాడి వేణుగోపాలస్వామి కల్యాణమంటపంలో భక్తుల్ని తన్మయుల్ని చేసే వియ్యన్నగారికి జరీధోవతుల చాపూ ఆ వూరేగింపుతోనే వచ్చేవివి. ధర్మకర్తలు కట్టడి ప్రకారం చేనేత పని వాళ్ళకు కట్నాలు ముట్టజెప్పేవారు.

అంతటితో ఆ వూరేగింపు ముగిసేది. వేణుగోపాలస్వామి రథయాత్ర ప్రారంభమయ్యేది. ఆ జ్ఞాపకాలే చెప్పాను.

అప్పటిదాకా దిగులుగా వున్న ఓబయ్య కళ్లు నా మాటలకు మిల మిల మెరిసినవి. ముఖం నిండా సంతోష కెరటాలతో - 'తమరు కాంతయ్యగారి మనుమలా?" అని నా చేతిని తాకాడు. నేను తలూపాను. "మధుపర్కాలు వేసే ఆనవాయితీ మా వంశానిదేనయ్యా!" అన్నాడు వుత్సాహంతో.

నేనూ ఓబయ్యా అనుక్షణంలోనే బంధువులై పోయాం.

ఉత్తర గుజరాత్ కచ్ హస్తకళలను అభిమానించే "దర్పణ" సమాఖ్య వారు నిర్వహిస్తున్న ప్రదర్శనల పోటీకి ఈ ఓబయ్యను నిలబెడుతున్నది కస్తూరి. నాకు ఆశ్చర్యం వేసింది. ఈ అమాయకుడు ప్రపంచ ప్రఖ్యాతి నార్జించిన కచ్ చేనేత పనివాళ్ళతో సమానంగా నిలవగలడా? రోమన్ సామ్రాజ్య కాలంలోనే భారతావని నుండి ఎగుమతి అయిన తరతరాల ప్రతిభాపాటవాల చేనేత వస్త్రాల రంగులు, రీతులూ, గళ్ళూ, సుళ్ళూ, అద్దాలు యితనెప్పుడైనా చూశాడా? ఏమో! కస్తూరి అతగాణ్ణి నా కప్పగించి, మరునాడే అహ్మదాబాదులో ఏదో సెమినారని వెళ్ళిపోయింది.

* * *

ముఖర్జీబాబు నిర్గమనం తర్వాత మా కంపెనీవాళ్లు నాకు ఒక మోస్తరు పెద్ద ఫ్లాట్ - ఇల్లే యిచ్చారు. మా ఆవిడ పుట్టింట్లో వున్నది. ఆ ఏకాంతంలో నేను, ఓబయ్యా ఎన్నో సంగతులు ముచ్చటించుకొన్నాం. మా వూరు, బంధుకోటీ, క్రొత్తగా అలముకొంటున్న రాజకీయ ముఠా కులద్వేషాలు - అన్నింటి మధ్య చేనేత కార్మికుల భౌతిక ఆర్థిక కల్లోలాలు. మాష్టర్‌వీవర్లకింద చేనేత పనివాళ్ళ యిబ్బందులు- ఆ రెండు వర్గాల మధ్య తరతరాలుగా వస్తూన్న అమూల్య మానవ సంబంధాలు ఈ ఆర్థిక వ్యవస్థలో ఛిన్నాభిన్నంకావటం, నూలుకండెలకూ,

రంగులకూ ధరలు పెరిగినప్పుడల్లా చేనేత పరిశ్రమలో సంక్షోభం, మంచి హృదయం వున్న మాష్టర్‌వీవర్లు కొందరు, పనివాళ్ళను తూనికల్లో కూలీ రేట్లలో మోసగించేవారు కొందరూ, కక్కుర్తిపడి దారిద్ర్యంలో అడ్డదారులు తొక్కే పనివాళ్లూ, తిండి తినకపోయినా నీతి తప్పనివాళ్ళు కొందరూ, చేనేత సహకార సంఘాల పని తీరు, కొందరి అవినీతీ, కొందరి నిబద్ధత, నిలవవుండి పోతూన్న చీరెలు, తరతరాలుగా చేనేత చీరెల్నీ, ధోవతుల్నీ ధరించిన గ్రామ వాసులు గూడా రేషన్ సిల్కు చీరెలకూ పోలిష్టర్ ధోవతులకు మోహపడి పోవటం, ఒక్క చీరె నేతకు యింటిల్లిపాదీ వారం రోజులు కష్టపడితే లభించే కూలి, మగ్గాలు తనఖాకుపోవటం, చేనేత కార్మికులకు అప్పులు లభించని దారుణ పరిస్థితులూ - ఇట్లా ఎన్నో సంగతులు.

కొన్ని చేనేత వృత్తి రహస్యాలు గూడా. కలంకారీ అద్దకాలు యిప్పుడు లభిస్తూన్న రంగుపెట్టెల్తోగాక, ప్రకృతి నుండి లభ్యమయ్యే చెట్ల ఆకుల పసర్లు మూలికలతో తయారైన కణికెలు పూర్వీకు లనుసరించిన పద్ధతుల్తో చేస్తే - అవి రెండు మూడు తరాలుంటాయిట. తన పద్ధతి అదేనట. వాళ్ళింట్లో రంగులన్నీ వాళ్ళ నాయనమ్మ తాతయ్యా నేర్పినవేనట.

నేను నిద్ర లేచేసరికి రెండు గదుల ద్వారాలకు కలంకారీ కర్టెన్లు కట్టి వున్నాయ్. తెల్లవారుఝామునే లేచిన ఓబయ్య నిపుణంగా తను తయారు చేసిన కర్టెన్లను నాకు ప్రదర్శించాడు. ఆంధ్రప్రాంతపు ప్రత్యేకత- నెమలి పింఛాల వరసలో చీరెల పయిటంచులూ, వాటిల్లో హంస పేటంచు, ఆకు పారిజాతం కమలాల అంచులూ. మధ్యలో పొన్నచెట్టు కింద వేణుగోపాలుడు, తనముందు ధేనువూ, నోటిముందు మురళీ. ఇంకొకటి- పురివిప్పుకొని మేఘాలను తిలకించి నృత్యలాస్యంలో వున్న నెమలీ, దాని కాలి గోళ్ళకింద భయపడుతున్న సర్పమూ.

ఆంధ్ర ప్రాంతపు క్రిష్ణుడి తలకట్టూ, కట్టూ బొట్టూ వేరు. రాజస్థాన్ గుజరాత్ ప్రాంతాల క్రిష్ణుని అలంకారాలు వేరు, ఈ ఆంధ్ర వేణుగోపాలుడు ఆ ద్వారకా క్రిష్ణుడితో పోటీపడి రేపు జరగనున్న ప్రదర్శనలో మాతృభూమికి పేరు తెస్తాడా? అన్న నా సందేహాందోళనలు ఓబయ్యకు తెలియనీయలేదు. అతను నిరామయంగా, నిర్మోహుడై బిర్లా హాలులో పోటీ ప్రదర్శనకు వుద్యుక్తుడై నాడు. తన మాతృభాష తప్పితే యింకొక ముక్క మాట్లాడలేదు తన హస

విన్యాసాల్లోనే ప్రదర్శనలో సంభాషించమని ధైర్యంచెప్పి నేను ఆఫీసుకు వెళ్లాను. మరునాడూ అంతే. మూడోనాడు ప్రదర్శన పోటీ అంతిమదినం. నేను హాలు ముందు టాక్సీదిగే సరికి - విప్పారిన ముఖంతో, చేతిలో చెక్కుతో, చుట్టూ అతన్ని అభినందిస్తున్న గుజరాతీ యువకుల మధ్య ఏవేవో కలంకారి రహస్యాలను వివరిస్తూ ఓబయ్య కన్పించాడు.

అతనిది ద్వితీయ బహుమతి!

ఆ రాత్రి యిద్దరం వుడిపి హోటల్లో భోజనం చేశాం. ఇంటికొచ్చి తెలుగు పాటలు చాలా సేపు విన్నాం. తర్వాత మరికొన్ని సంగతులు - ఓబయ్య భార్య క్రితం సంవత్సరం గతించింది. తన బిడ్డలిద్దర్నీ చెల్లెలు పెంచుతున్నది. వాళ్ళదీ లేని సంసారమే. ఈ బహుమతి డబ్బుతో తనఖాలో వున్న మగ్గాన్ని విడిపించుకొంటాడు. పిల్లలకు చెవులకు దిద్దులన్నా చేయించాలి కదా! ఎన్ని అమాయికపు కలలు! మళ్ళీ మా వూరు రారా- అని నాతో ఒక విన్నపం. 'కాంతయ్యగారి లోగిలి ఎంత పెద్దది? ఎన్ని హరికథలు చెప్పించేవారు? ఎన్ని సంతర్పణలు, అన్నదానాలు? ధర్మకర్తల మంచితనాన్ని ఆసరా చూసుకొని, కౌలుదార్లు మక్తాలు చెల్లించటం లేదుగదా. వేణుగోపాలుడికి భోగాలు కొరవడుతున్నై. మళ్ళీ మీ వంటి ధర్మకర్తలు కావాలి.' అవి ఆ రాత్రి కబుర్లు.

* * *

మర్నాడు - "అవును ఓబయ్యా! అప్పుడే ఇంటిమీద దిగులు అంటున్నావు- బొంబాయి నగరం చూడవా?" అన్నాను.

"ఏముందయ్యా?"

"కనీసం జౌళి మిల్లులు, బట్టల కార్ఖానాలు చూడాలనిపించటం లేదా?" అన్న నా మాటలకు ఎంతో వుత్సాహం చూపించాడు. ఆ మధ్యాహ్నం మా స్నేహితుడు పార్శీ పెద్దమనిషి బరూఖా గారి ద్వారా రెండు బ్రహ్మాండమైన అధునాతన జౌళి మిల్లుల్ని చూశాం. కనీసం నాలుగైదువేల పనివాళ్ళక్కడ!

దూదిని శుభ్రపరిచే బ్లోరూమ్, ఏకులు తయారయ్యే కార్డింగ్ సెక్షన్, స్లివర్లను మట్టసంగా హెచ్చు తగ్గులు లేకుండా చేసే డ్రాయింగు యంత్రాలు, బాబిన్ మీద తయారైన దారాన్ని అతివేగంగా చుట్టే సింప్లెక్స్లల్ని, గుండ్రని చట్రపు ఫ్రేముల్ని, కోన్లకు చుట్టే వైండింగ్ యంత్రాలు, డ్రమ్ములకు చుట్టే వార్పింగ్ పద్ధతి, గంజిపెట్టే సైజింగ్ యంత్రాలు, నేతనేసే జపాన్ యంత్రాల్లాంటి అతివేగమైన సున్నిత పనిముట్లూ - అన్నీ చూశాడు.

బయటకు వచ్చి నూతిలో నుంచి వినవస్తున్నట్లుగా గొంతుపెట్టి ప్రశ్నించాడు: 'అయ్యా! గంటకు ఎన్నిగజాలు నేస్తారయ్యా ఇక్కడ?'

"కొన్నివేల గజాలు'' అన్నాను నేను.

* * *

మర్నాడే అతని ప్రయాణం. ఆ రాత్రి అతను చాలా మౌనంగా వున్నాడు. బలవంతాన క్లుప్తంగా భోజనం చేశాడు. నాకు చెబుతానన్న పదిగేరాజుల కథలు, వాళ్ళ పాటలు వినిపింపలేదు. ముడుచుకొనివున్న తాళపత్ర గ్రంథంలాగా వదిగిపోయాడు.

ప్లాట్‌ఫారం మీద నిలిచినప్పుడు ఇంకొక్క ప్రశ్నవేశాడు - 'అయ్యా, యీ జవుళిమిల్లుల్తో - ముందు ముందు మేం తట్టుకోగలమా? మా మగ్గాలు దేనికి పనికొస్తాయయ్యా?'

ఇంతలోనే బండి వచ్చింది. నా సమాధానానికి సమయంలేదు.'మానవుడికి సౌందర్యాభిలాష నిలిచివున్నంత వరకూ, నీ హస్తకళా నైపుణ్యానికి చావుండదు. నువ్వు అధైర్యపడవద్దు' అని చెబుదామనుకొన్నాను. మానవ నాగరికతలో అత్యంత సుందరభాగం చేనేత అని చెబుతామనుకొన్నాను. కాని, బండి కదిలిపోయింది.

* * *

ఎన్నేళ్ల తర్వాతనో మా వూరు వెళ్లగలిగాను.

అప్పటికి చేనేత పరిశ్రమ కొత్త చిక్కుల్లో వుంది. ప్రభుత్వం వాళ్ళను ఆదుకొనే ఎన్నో రాయితీలను ప్రవేశపెట్టింది. ఆ సంధిలో నా ప్రయాణం. ఊళ్లోదిగి ఓబయ్య గురించి విచారించాను.

ఓబయ్య కన్పించలేదు. కొన్నాళ్లుగా ఎవరికీ కన్పించలేదు. ఎక్కడకెళ్లాడో తెలియదు. అతని కూతుర్ని ప్రశ్నించాను. బొంబాయినుంచి వచ్చి కొన్ని అప్పులు తీర్చుకొన్నాడు. రోజూ రాత్రి అక్కడి బ్రహ్మాండమైన జౌళిమిల్లుల సంగతే చెప్పేవాడట.

ఆ మరల ముందు మనం బతుకుతామా అని ఆవేదన పడేవాడట. ఇంకే విద్యా తెలీని చేనేతవాళ్ళ గతేమిటి అని గొణుక్కునేవాడట. ఓబయ్యది మహాప్రస్థానమా? మానవ చైతన్యం సౌందర్యదృష్టి - సూర్యచంద్రులున్నంతవరకూ- చేనేతకళాసృష్టిని పోషిస్తుందనే అభయ్యం నేను యివ్వలేదా? ఓబయ్యను మళ్ళీ నేనెన్నడూ చూడలేదు. మిల్లు యంత్రాలను ఎవరికీ చూపలేదు. *

# పాటుకు తగిన రోలు!

—రావూరి భరద్వాజ

"మీ ఉపశాఖలు వేరు వేరయినా, మీరుభయులూ ఒకే ప్రధాన శాఖకు చెందినవారు. పైగా - పక్క పక్కన ఉంటున్నారుకూడా! ఈ కారణంగా వారి సంగతి మీకూ, మీ సంగతి వారికీ బాగా తెలిసివుంటుందనుకుంటున్నాను. వారిని గురించి మీకు తెలిసిందంతా నేను తెలుసుకొందామన్న ఉద్దేశంతో ఇలా వచ్చాను. దయచేసి, నాకిన్ని వివరాలూ చెప్పండి; గాలికి రాలిపడిన ఈ ఆకును గురించి మీరేమనుకొంటున్నారు?" అన్నాడతను, టోసిపోయిన రెబ్బకు, పక్కగా ఉన్న చివ్వను పట్టుకొని, ఉత్సాహంగా ఊగుతోన్న హరితపత్రంవేపు చూస్తూ.

"నాకన్నా చాలా ముందుగా, ఆ పట్టకంగారు జన్మించారు. నేనేమో, వారి కళ్ళముందు పుట్టాను. అంచాత - నా గురించి వారికి తెలిసినంతబాగా, వారిని గురించి నాకు తెలీదు. అయినా 'విషయగ్రహణ పారీణతకూ, వయస్సుకూ సంబంధంలేదు' అని మీ వంటి పెద్దలు పదే పదే చెబుతూ ఉంటారు. మరి - నాకేమో ఆ పారీణత కూడా లేదు. అయినా, ఎంతో దూరం నుంచి మీరింత దాకా వొచ్చారు గనకా, మిమ్మల్ని నిరాశపరచడం నాకిష్టం లేదు గనకా, నాకు తెలుసుననుకొంటున్న రెండు ముక్కలూ చెబుతాను. నేను చెబుతున్న దాన్లోంచి, మీకవసరమయినవే తీసుకోండి. మిగిలిన వాటిని విసిరేయండి. అసలు మొత్తమే మీకు, అనవసరమనిపించిందనుకోండి; ఏకమొత్తంగా విసిరికొట్టినా, నేనేమీ అనుకోను.... చెప్పనా? ఇప్పటిదాకా జరిగినంత సుఖంగా, ఇకముందు వారికి జరుగుబాటుండదు. ప్రతి జీవికీ తిండి ముఖ్యమని మీకు తెలుసు. తిండి తరువాత ఆత్మరక్షణ ముఖ్యం. ఇప్పటిదాకా ఈ రెండింటినీ చెట్టుగారు చూసుకొనేవారు. ఇప్పుడీపలాశంగారు తరువునుండి విడిపోయారు. కాబట్టి, ఈ రెండింటికీ వారు అవస్థపడక తప్పదు. అటు తిండిలేకా, ఇటు రక్షణలేకా ఈ

పత్రంగారు త్వరలోనే జీర్ణపత్రమయిపోక తప్పదని నేననుకొంటున్నాను" అన్నదా పల్లవం.

అతగాడికి ఇవన్నీ నిజమేననిపించింది!

నిజానికీ సంగతులన్నీ తనకు అంతకుముందే తెలిసినా, ఈ ఆకుగారు చెప్పిందాకా, ఇవేవీ గుర్తురానందుకు తనను తాను శపించుకొన్నాడు హఠాత్తుగా అతనికి మరో విషయం కూడా జ్ఞాపకం వచ్చింది. తనకు ఇలాంటి పరమ సత్యాన్ని గుర్తుచేసిన ఆ హరితపత్రానికి కృతజ్ఞతలు చెప్పడం కూడా మరిచి పోయినందుకు అతను బాధపడ్డాడు.

ఆ మరునాడు - కేవలమూ కృతజ్ఞతలు చెప్పుకోవడం కోసమే అతనా చెట్టు దగ్గరకొచ్చాడు. నిన్న నిలబడిన కొమ్మకిందనే నిలబడ్డాడు. నిన్న తనకు జ్ఞానబోధ చేసిన ఆ దళం కోసం తలెత్తిచూశాడు, అదక్కడలేదు!

"బాబుగారూ! నమస్కారం. నేనిక్కడున్నాను. మళ్ళీ ఎందుకొచ్చారు? ఇంకా ఏమన్నా కొత్త కొత్త అనుమానాలు పుట్టుకొచ్చాయా?" అని కిందినుంచి వినిపించింది.

అతను అటుగా చూశాడు.

నిన్న సాయంకాలం రివటకు వేళ్ళాడుతున్న ఆకుగారు, ఇప్పుడు నేలమీద సాగిలపడి ఉన్నారు!

"ఇదేమిటి? మీరు కూడా నేలకు దిగడమేమిటి?" అన్నాడతను ఆశ్చర్య పోతూ.

"మీరు కాలాన్ని లెక్కలోకి తీసుకోకండి; దాని సాంద్రతను మాత్రమే గమనించండి. నాకూ - నా పొరుగునే ఉన్న ఆకుగారికీ మధ్య ఏర్పడిన ప్రేమాను రాగాల గాఢతను మీరు ముఖ్యంగా గమనించాలి. నిన్న సాయంకాలం మనం మాట్లాడుకొన్నాక మీరలా వెళ్ళిపోయారు గదా! ఆ తరువాత చాలాసేపు నేను మీ గురించీ, మీతో నేను చేసిన సంభాషణను గురించీ ఆలోచించాను. నా ఇరుగు వారూ, పొరుగు వారూ నేలరాలి, నానా కష్టాలు పడుతుండడం చూస్తూ కూడా. నేనింకా చెట్టునే పట్టుకు వేళ్లతుండడం అన్యాయమనిపించింది. అందుకే, అటుగా పోతున్న గాలిగారిని బతిమాలుకొన్నాను; ప్రార్థించాను. గాలిగారు నా విన్న పాన్ని మనించారు. నాకూ, ఆ చెట్టుకూ ఉన్న బంధుత్వాన్ని తుంచివేశారు.

"నేనిప్పుడు స్వేచ్ఛా జీవిని. కొంత కాలపాటు వేరుగావున్నా ఇప్పుడు నా వారితో, నా వర్గంవారితో నేను కలిసిపోయాను. ఇంతకాలంగా, నే ననవసరంగా మోస్తున్న భారాలను దించుకొన్నాను. నన్ను కట్టి పడవేసిన బంధాలను తెంచుకొన్నాను. నన్ను నేను తేలికపరుచుకొన్నాను. ఇప్పుడు ఓ చిన్న గాలి తరగ పిలచినా చాలు; గలగల్లాడుతూ అది పిలిచిన చోటుకు వెళ్ళగలను. బాబుగారూ! మీవంటి అనుభవజ్ఞులకు తెలియనిదేమీలేదు. ఎన్ని సంపదలున్నా, ఎన్ని పదవులున్నా, ఎన్నెన్ని అధికారాలున్నా - స్వేచ్ఛకు మించిన సంపదలేదన్న గొప్ప సత్యాన్ని కొంచెం ఆలస్యంగా గ్రహించగలిగాను. కాబట్టి - మళ్ళీ నా వారి సరసన చేరాను. వారి కష్ట సుఖాల్లో పాలు పంచుకొంటూ, సకల వర్గాల సంక్షేమంకోసం పాటుపడదామనుకొంటున్నాను'' అన్నదా నేల రాలిన ఆకు.

దాని వాగ్ధాటికి అతను దిమ్మరపోయాడు.

ఈ వాదం కూడా అతనికి సబబుగానే తోచింది.

జయాపజయాలను సకారణంగా వొప్పించగలిగిన ప్రజ్ఞా ప్రాభవాలు రాజకీయులకే ఉంటాయని ఇప్పటిదాకా అతననుకొంటున్నాడు. ఇప్పుడా శక్తి చెట్టు చేమలక్కూడా ఉన్నదని రుజువయింది.

''ఈ ఆకుగారు పూర్వజన్మలో గొప్ప రాజనీతిజ్ఞులయి ఉండాలి; లేదా-రానున్న ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని ప్రచారం ప్రారంభించిన వివిధ రాజకీయ పక్షాల వారి ఉపన్యాసాలను లోతుగా అవగాహన చేసుకొనయినా ఉండాలి. కాని పక్షంలో, ఇంత కమ్మని అబద్ధాలను చెప్పడం అందరకూ సాధ్యం కాదు'' అనుకొన్నాడతను.

*

# అ - భయం

—వాకాటి పాండురంగరావు

అదేమిటి?

ఉన్నట్లుండి నీళ్ళు అట్లా పైపైకి వచ్చేస్తున్నాయేమిటి?

పైన, క్రింద, చుట్టూ సర్వం జలమయిపోతున్నదే!

అయ్యో, అయ్యో - తను మునిగి పోతున్నాడు .... తన్ని రక్షించే వారెవరూలేరా?

ఎవరూ లేరా?

—వరూ లే—?

*　　　　*　　　　*

హఠాత్తుగా మేలుకున్నాడు కరుణాకర్.

ఇది తన ఇల్లే - ఇదేదో లోకం కాదు.

ఇది తన పడగ్గదే - పసిఫిక్ సంద్రం కాదు.

పక్కన వున్నది తన వనజే - తిమింగళం కాదు.

పైన ఫ్యాన్ తిరుగుతోంది.

అటుతిరిగి పడుకున్న వనజ పమిట చెల్లాచెదరయి వుంది - తన మనసులాగే....

మనసు అగాధం అంటారు. సముద్రమూ అంతే. సముద్రంలో అలలు ఆగవు. మనసులో భావాలు రేగకుండా వుండవు. భావాలకు బీజం ఎక్కడ? మెదడులోనా - నరాల్లోనా? కాలంలోనా - గతంలోనా? గతం లోని ఒక

అనుభవం భయంగా మారితే, భూతకాలం పెనుభూతమై మదిలో నిలిచితే - కాలమేది, మనసేది?.... కాలం సాలీడు నేసిన పడుగు పేకల దొంతరేనా మన సంటే?....

అగరొత్తి పొగవలె వలయాలుగా లేచిన కమలాకర్ ఆలోచనలు మళ్ళీ అగరొత్తి ఎర్రటి మండే కొసలాటి భయం దగ్గరకే వెనక్కు వచ్చాయి.

—'లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్' - ఇప్పుడు వింటున్నట్టుంది నాన్నగారి కంచుకంఠం. ఆయన నుదుట విభూతిరేఖల మధ్య కుంకుమబొట్టు వెలుగుతున్న అగరొత్తి అగ్రభాగమే! పూజ, పారాయణ, శ్లోకాలు, గంటలు, కర్పూర నీరాజనాలు, కళ్ళద్దుకోడాలు - అవన్నీ ఎన్నేళ్ళు? .... ముప్పైఏడేళ్ళ నాటి జ్ఞాపకాలు....

ఇప్పుడు తనకు నలభై నాలుగు.

అప్పుడు తనకు ఏడేళ్ళు. అమ్మకు లేక లేక పుట్టిన గారాబు పట్టి' నాన్నకు ప్రేమ లేదని కాదు గాని, బయటకు కన్పించనిచ్చేవాడు కాదాయన. ఏదో కంపెనీలో పని. తరచు ఊళ్లు తిరుగుతుండేవాడు. దూరపు బంధువు రాజమ్మ అమ్మకు సాయంగా వుంటుండేది. నాన్న ఊళ్ళో లేకపోతే అమ్మా, రాజమ్మా, తనూ. అప్పుడింక తనదే రాజ్యం! నాన్నవుంటే నోరు తెరవడానికి భయపడే తను ఆయన లేకపోతే చిరుతపులే!!

'అమ్మా! గాలిపటం కావాలి' - కొనిపెట్టేది.

'అమ్మా! ఆ తీగ మిఠాయితో చేతికి గడియారం పెట్టించుకుంటానే!' మణికట్టుమీద తీయని గడియారం నాకుతోంటే ఎంత బాగుండేదో....

'అమ్మా! ఎదురింటి సూర్యం దగ్గరుందే-బంతి, అది కావాలి' - ఎగురుతూ వచ్చేది బంతి.

ఇట్లా నాన్నలేని సమయంలో తాను చక్రవర్తి, అమ్మ బానిస!....

—హఠాత్తుగా ఇటు తిరిగిన వనజ చేయి తనమీద పడింది. వాత్సల్యం ముప్పిరిగొంటుండగా ఆమెనింకా దగ్గరకు తీసుకున్నాడు. అతని గుండె గూడయింది. ఆమె గువ్వయింది -

ఒకసారి నాన్న ఊరెళ్ళినప్పుడు తనకు రెండ్రోజులు జ్వరమొచ్చింది. తగ్గింది. పత్యం పెట్టమన్నాడు డాక్టర్. ఆ సాయంకాలం వీధిలో గణ గణ మని మోగింది గంట. నెమ్మదిగా లేచివెళ్ళి చూచాడు. ఐస్‌క్రీమ్ బండి! పిల్ల లందరూ కొనుక్కుంటున్నారు.

'అమ్మా, ఐస్‌క్రీమ్!' అన్నాడు.

కాని, అమ్మ వెంటనే కొనివ్వలేదు. నాలుగయిదుసార్లు అడిగినా కొన లేదు. కోపం వచ్చింది. క్రిందపడి దొర్లాడు, ఏడిచాడు.

'నీకు జ్వరం యింకా పూర్తిగా పోలేదురా.... ఇప్పుడొద్దురా నాన్నా!' అంటున్న అమ్మమాటలు వినపడ్డంలేదు ఏది ఎప్పుడడిగినా కొనిచ్చే అమ్మ నేడు వీల్లేదంటూంది. ఉక్రోషం వచ్చింది. లేచి దొడ్డివైపు పరుగెత్తసాగాడు.

'ఎక్కడికిరా?' అంటూ వెనకాలే అమ్మ; ఆవెనకే రాజమ్మ....

'నేను బావిలో దూకుతా!' - ఎట్లా వచ్చిందో ఆ ఊహ!

ఇద్దరూ కలిసి పట్టుకున్నారు. అమ్మ నెత్తీ నోరూ బాదుకుంది. చివరకు ఐస్ క్రీమ్ వచ్చింది!

నాటినుండి నాన్నలేని సమయాల్లో బావి బతే ఆయుధమైంది. దేనికన్నా అమ్మకాందచే - 'బావిలో దూకుతా!' అంటే చాలు, కొండమీది కోతి దిగి రాసాగింది.

ఒకరోజు నాన్న ఇంట్లో లేరు. మధ్యాహ్నం మూడయిందేమో! ఏదో అడిగాడు తను. ఒప్పకోలేదు అమ్మ. 'నేను బావిలో దూకుతా! బావిలో దూకుతా!' అంటూ వెళ్ళి పెరటి తలుపు గొళ్లెం తీస్తున్నాడు, అంతకు రెండు నిముషాల క్రితమే వచ్చినట్లున్నాడు - నాన్న!

తన ఈ బెదరింపు మొదటిసారి విన్నాడు; ప్రళయ కాలరుద్రుడే అయ్యాడు.

'ఒరేయ్!' అని ఆయన అరిచిన అరుపు ఇంకా చెవిలో గింగుమంటుంది.

'బావిలో దూకుతావట్రా? వస్తున్నా వుండు' అంటూ అటక ప్రక్కగావున్న పొడుగాటి చాంతాడు తీసి, ఆవేశంతో తన నడుముకు కడుతున్నాడు.

'ఏమండీ! ఏమండీ!' అని అమ్మ కేకలు....వణుకుతూ మూలగా రాజమ్మ. బరబరా బావి దగ్గరకు లాక్కెళ్లి చాంతాడు ముడి నడుము దగ్గరా, చంకల క్రిందా గట్టిగా వుందని రూఢి పరుచుకున్నాక అమాంతం తన్నెత్తి....

'ఏమండీ!' అని గావుకేక పెట్టి అమ్మ పడిపోయింది. రాజమ్మ 'బాబు గారూ! బాబుగారూ!' అంటూ అరుస్తూంది.

అమాంతం తన్నెత్తి బావిలోకి దింపాడు - తాడుని పైన కప్పివున్న ఇనుపదూలానికి అడ్డంగా వేసి - ఆయన సాక్షాత్తు యముడిలా - 'ఒరేయ్! అప్రాచ్యపు వెధవా! బావిలో దూకుతావా? దూకరా - దూకు' అని రెండడుగులు తాడు వదలడం-

'నాన్నోయ్! నేను దూకన్నానో! నీళ్ళల్లో పడిపోతున్నాన్నా!' అని తన దీనారావాలు....

'ఏం? దూకుతానన్నావుగా? దూకూ! నీళ్ళల్లోకి పీకలదాకా దింపుతా, చూడు, బావి ఎట్లావుంటుందో -' అంటూ కొంత తాడు వదిలి, మళ్ళీపైకి లాగా డాయన.

'ఇంకెప్పుడూ అనను నాన్నా! ఎప్పుడూ అన న్నాన్నా!'

'బావిమాట ఎత్తవు కదా?'

'ఎత్తను నాన్నా!'

తన్ను పైకి లాగిన నాన్న ఇవతలికి రాగానే తన్నెత్తుకుని భుజమ్మీద వేసుకున్నాడు.

రాజమ్మ చల్లిననీళ్ళకు అమ్మ లేచింది.

నాన్న చేతులనుంచి విడిపించుకుని వెళ్ళి అమ్మఒడిలో దూరి, ఆమె ఏడ్చిన ఏడ్పుతోబాటుగా తానేడ్చిన ఏడ్పు - ఆ భయం, బాధ, ఉపశమనం - అన్నీ ఏకమై పారిన కన్నీళ్లు....అవి కన్నీళ్ళు కావు- అవి తన మనసును చీకటిలో ముంచేసిన భీకర జలపాతాలు - సాగరాల అగాధాలు - తిమింగలాల తెరచిన నోళ్లు - సర్వం జలమయం కాగా గాలి ఆడని ఊపిరితిత్తులు....

—భయాన్ని చుట్టచుట్టి దూరంగా పారవేసినట్లుగా వనజ పొత్తికడుపులో మొహం దాచుకున్నాడు కరుణాకర్. ఆ కదలికకు మెలుకువ వచ్చింది వనజకు.

'ఏమండీ! నిద్రరాలేదా?'

'ఊఁ!'

'కలేమన్నా వచ్చిందా?'

మాట్లాడలేదు తాను. హఠాత్తుగా లేచి కూచుంది వనజలోని తల్లి. తన కళ్ళలోకి చూచింది.

కళ్ళెంత పార దర్శకాలు! ఆమె వెంటనే పసిగట్టింది.

'మళ్ళీ - అదే, ఆ నీళ్ళల్లో మునిగిపోయే కలొచ్చిందా?' అంటూ ఆ భీతావహ వాతావరణాన్ని తేలికగా కొట్టిపారేసి, చిరు కొంటెస్వరంతో అడిగింది.

కరుణాకర్ మాట్లాడలేదు.

'చూడండి కరుణాకరంగారూ! మనం వున్నది వారానికి మూడు రోజులు మాత్రమే నీరు సరఫరా అయ్యే భాగ్యనగరంలో. మన కాపురమేమో ఆరంతస్తుల భవనంలో మూడో అంతస్తుమీద. ఇక్కడకు టాంకర్‌వస్తే తప్ప కులాయిలో నీటిబొట్టుకూడా రాదు. అంచేత మీరు మునిగిపోయేంత నీరు ఈ శతాబ్దంలో రాదు - పడుకోండి!' అంది చాల లాజికల్‌గా, హేతుబద్ధంగా కరుణాకర్ భయాన్ని తోసిపారేస్తూ.

నవ్వాడు కరుణాకర్. ఓ అరగంట తర్వాత కాబోలు నిద్ర పట్టింది.

అమెరికాలో చదువుకుంటున్న విజయ్‌నుండి ఉత్తరాలు వస్తూనే వున్నాయి. ఇంకో ఏడాదిలో తన చదువు పూర్తి అవుతుందనీ, ఆ తర్వాత ఒకటి రెండు సంవత్సరాలు ఏదన్నా ఉద్యోగంలో అనుభవం సంపాదించి భారతదేశం రావాలి అని వాడి ఆలోచన. వనజేమో ఈలోగా ఏ పెళ్ళికెళ్ళినా తనకు కాబోయే కోడలు ఎవరన్నా వుందా అని వెతుకుతూ వుంది!

'నువ్విట్లాగే వెతుకుతూండు - వాడేమో ఏ ఎలిజబెత్‌నో పెళ్ళాడేసి, జంటగా దిగుతాడు విమానం' అంటుంటాడు కరుణాకరం

'వాడు అట్లా ఎన్నటికీ చేయడు!' అని అతి నమ్మకంతో ఒత్తి పలికేది వనజ. కరుణాకరం ఏమీ మాట్లాడకుండా వుండే తన అంచనాకు ఇంకో సాక్ష్యం సుమా అన్న చందాన 'వాడు నా కొడుకు!' అనేది - అదే ఫైనల్ ఆర్గ్యుమెంట్ అయినట్లు!

—రాజమండ్రిలో కరుణాకర్ బాల్యస్నేహితుడు వెంకటేశం వాళ్లబ్బాయి పెళ్ళివుంటే, అతను రెండు నెలల ముందే ఇంటికి వచ్చి కరుణాకర్, వనజలను తప్పక పెళ్ళికి రావాలి అని చెప్పాడు. ఆ తర్వాత పెళ్ళి పత్రిక వచ్చింది. ఆ వెంటనే విడిగా ఉత్తరం వచ్చింది. అది చాలదన్నట్టు వెంకటేశం ట్రంక్‌కాల్ కూడా చేశాడు. సరే, దంపతులు రాజమండ్రి చేరారు. బడా పారిశ్రామికవేత్త అయిన వెంకటేశం ఇంటి పెళ్ళి అంత ఆర్భాటంగానూ జరిగింది. తన చిన్నప్పటి నేస్తం వచ్చినందుకు వెంకటేశం ఉప్పొంగిపోయాడు.

'ఎటూ ఇంతదూరం వచ్చారు కదా - కోటి అందాల కోనసీమను చూచి వెళ్ళకూడదూ?' అన్చెప్పి వెంకటేశం కరుణాకర్ దంపతులకో కారు కేటా యించాడు. దారిలో అక్కడక్కడ ఒకటి రెండూళ్ళలో వుండడానికి వసతి ఏర్పాటు చేయించాడు. ఆ ప్రాంతమంతా తన అరచేతివలె ఎరిగిన రాజు అన్న మంచి డ్రైవర్‌ను పంపించాడు.

బయలుదేరారు దంపతులు....

రాజమండ్రి వదలగానే ధవళేశ్వరం, కాటన్‌దొర మ్యూజియం చూచారు. దారిలో కారాపి, కడియం పూలతోటలన్నీ తిరిగింది వనజ. పూలమాలలు కొన్నది. మందేశ్వరుడి గుడిలో పూజలు చేశారు. ర్యాలిలో జగన్మోహినీ కేశవ స్వామి రూపం చూచి తన్మయులయ్యారు. ద్రాక్షారామంలో అయ్యవారికీ, అమ్మ వారికీ అర్చనలు చేయించి, ఆశీస్సులు పొందారు. అక్కడొక పూటకూళ్ళిల్లులాంటి ఇంటికి ముందుగా కబురుచేసి పెడితే - పీటలువేసి, అరిటాకులలో వాళ్లు వడ్డించిన ఆ అమృతం ముందు వెధవ అయిదు నక్షత్రాల హోటళ్ళలో అరవైకోర్సుల డిన్నరు దిగదుడుపే!

రాజోలులో రాత్రి వెంకటేశం తమ్ముడింట్లో దిగారు. శుక్లపక్షపు వెన్నెల్లో ఆ డాబామీద నిలబడి, దూరంగా తల్లిలా కనబడుతున్న గోదావరి మిల మిలలనూ - సామవేదపు సోమరసాన్ని మౌనంగా మోసుకొస్తున్న చల్లగాలి జావళీలనూ - ఈ అందమూ ఆనందమూ ఇది మాకే సొంతం అన్నంత అతి శయంతో ఊగుతున్న కొబ్బరిచెట్ల తలలనూ చూచి చూచి తమకంతో అంది వనజ - 'ఇది నిజంగా గంధర్వలోకం!'

అది విన్న వెంకటేశం తమ్ముడు సింహాద్రి నవ్వాడు 'ఔనండీ, అలాగే అనిపిస్తుంది. కాని, గోదావరి కట్టెంబడి నడవలేమండీ! అంతా కంపుచేస్తుంటారు. ఇంత గొప్పనిపించే ఈ ప్రకృతి మధ్య కూడా మనుషులు రాజకీయాలాడుతూనే వుంటారు. పగా - దగా అన్న రెండొడ్ల మధ్యే ఇక్కడి జన జీవితమూ ప్రవహిస్తుంటుంది' అన్నాడు.

అది నిజమే కాని, ఆ క్షణాన అతడామాట అనకపోతే బాగుండేది అనిపించింది కరుణాకరానికి. ప్రకృతి అంటే ఎత్తు; అందం అనేది ఆదర్శం ఎదుగుతూ ఎదుగుతూ విలువల రెక్కలు పొదుగుతూ వాటి సాయంతో ఎగురుతూ ఆ ఆదర్శపు ఎత్తులను చేరడానికోసం ప్రకృతి మనకిచ్చిన నిలబన్నే కదా జీవితం! పరీక్ష ఎగగొట్టిన వాడినీ, పాఠాలు చదవనివాడినీ, కాపీ కొట్టేవాడినీ గణనలోకి తీసుకుని పరీక్షనే కాదంటే ఎట్లా? అనుకొన్నాడు కరుణాకరం. కాని, ఆ ప్రకృతి కడుపులో కూడా ఒక మూల చీకటిలాటి భయం వుందికదా అంది అతని అంతరంగం....

ఈలోగా సింహాద్రి భార్య చెబుతోంది వనజతో - 'రేపు అంతర్వేది వెళతానన్నారు కదా - దారిలో మోరిలో చీరలు బాగుంటాయి, చూడండి!'

రాత్రి హాయిగా నిద్రపోయారు కరుణాకరమూ, వనజా.

పొద్దున్నే స్నానం, అల్పాహారం ముగించి, ఫ్లాస్కునిండా కాఫీ పోసుకున్నారు.

'అంతర్వేది దగ్గర స్నానాలు చేయాలి' అంటూ ఇద్దరికీ వేరే బట్టలు తీసుకుంది వనజ.

కారు బయలుదేరింది.

గతుకుల రోడ్డు....అక్కడక్కడ అసలు తారే లేదు. దారిలో పాలవాళ్ళు, సంతలు, గోవులు గోపాలుడు - వానకు తడిసి, ఎండకు ఎండి, పొగాకు అలవాటున్నవాడి పలువరుసవలె నల్లగా గారపట్టిన గోడలమీద ఏవో ఎన్నికల నినాదాలు - తగరపు రేకులు బడ్డీకొట్లమీద అతికించిన సినిమా కాగితాలు - అక్కడక్కడ బాటవారగా గట్లమీద కూచుని మాట్లాడుకుంటున్న గ్రామస్తులు - ఎదురొస్తూ వెనక్కుపోతూ ఎర్రటి ఆర్టీసీ బస్సులు - మధ్య మధ్య చక్కటి

గోదావరి యాసలో డ్రైవరు రాజు ఏకరువు పెడుతున్న ఊసులు - కారు కేసెట్ నుండి పాటలు - మనకు కనపడకుండా నాట్యం చేస్తున్న గంధర్వుల పాదాల కదలికలను మోస్తున్న వరిపొలాల ఆకుపచ్చని చేలాంచలాలు 'మీరూ రండి, మీరూ రండి' అంటూ ఆకాశంలోని అతిథులకు చేతులెత్తి స్వాగతం పలుకుతున్న కొబ్బరిచెట్లు, హఠాత్తుగా మధ్య ఒక గాయంవలె ఓఎన్ జీసీ వారి నూనె దాహపు మైదానం .... ఇట్లా అడుగడుగునా దృశ్యాలతో, అనుభవాలతో, అందాలతో ఉక్కిరి బిక్కిరి అవుతుండగా ఆ దంపతులకు రాజు 'అదిగో, అదే నండి, జ్వాలా నర్సింహస్వామి ఆలయం....' అనడం వినిపించింది.

అనుకున్న చోటికి రాగానే కలిగే ఆనందంతో ఆ గుడి గోపురంవైపు చూచారు వనజా, కరుణాకరమూ.

'కారాపు మరి....' అంది వనజ.

'స్నానం చేస్తానన్నారు కదండీ?' అన్నాడు రాజు.

'ఔను - ఇక్కడ కాదా?'

'ఇంకా ఎదరకెళ్లాలి' అంటూ మరొక పది నిముషాల తర్వాత తారురోడ్డు ముగిసి మట్టిరోడ్డు మొదలయి, పచ్చటి గడ్డితోబాటు దుబ్బుమొక్కలు మొలిచే చోట - ఒక ప్రక్కగా కారాపాడు రాజు.

దిగారు దంపతులు.

'మీరు గోదారి సంద్రంలో కలిసేకాడికి ఎళ్లాలంటే కొంత నడవాలండి' అని చెప్పి, కారు తలుపు తెరిచి, ఏదో సినిమా పాటల కేసెట్ను ఆన్ చేసి కార్లోనే కూర్చుండి పోయాడు రాజు.

'చెప్పులు యిక్కడే వదిలేద్దాం' అన్నాడు కరుణాకరం.

పట్టుమని పది అడుగులు నడిచారో లేదో - హఠాత్తుగా ప్రత్యక్షమయింది సముద్రం....చూచిన ప్రతిసారీ తెలియని అనుభూతితో తడిపేసే సముద్రం.... రాత్రి చంద్రుడితో, నక్షత్రాలతో - పగలు సూర్యుడితో ఎగిరెగిరి ఆడుకుంటూ, నురగలు వచ్చేలా నవ్వుకుంటూ, తూలుతూ త్రుళ్లుతూ - 'మీరు యిట్లాగే జీవించాలి సుమా!' అని యుగ యుగాలనుండి చెబుతున్న సముద్రం....'నా నీలిరంగు చీరకి కిరణాల జరీ అంచు బాగుందా?' అని ఇసుక రేణువులను అడిగి అలసి

పోతున్న సముద్రం....ప్రపంచ మంతటినీ కలిపే సముద్రం....దేశాలను విడదీసే సముద్రం....

తూర్పుగా నడుస్తుంటే ఎవరో ప్యాంట్, చొక్కా వేసుకున్న మనిషి ఎదురయ్యాడు.

'గోదావరి సముద్రంలో కలిసేది ఎక్కడా?' అని కరుణాకరం అడిగితే-దక్షిణంగా చూపించి; 'అక్కడ లైటవుసుంది - దాని పక్కనే' అని వూళ్లోకి వెళ్ళిపోయాడతడు....

కుడివైపున ఏపుగా పెరిగిన దుబ్బు. ఎడమవైపు సముద్రం. అలలు పెట్టిన ముద్దుల తడిముద్రలు ఆరని ఇసుకమీద ఇద్దరూ నడవసాగారు. వారి పాదాలు చూచిన సాలె పురుగులవంటి పీతలు క్షణంలో బొరియల్లోకి మాయమవు తున్నాయి అలలు వచ్చినప్పుడల్లా వనజా కరుణాకరాలు చిన్న పిల్లలయ్యారు. దూరంగా సముద్రం మీద పడవలు కన్పిస్తున్నాయి. ఒడ్డుమీద నర సంచారం లేదు.

ఇరవై నిముషాల తర్వాత లైట్ హవుస్ కన్పించింది. కాని, సంగమ స్థలం కన్పించలేదు. ఒక గోచీ పెట్టుకున్న అబ్బాయి ప్లాస్టిక్ కాగితాన్ని దొన్నెలాగా చేసి, అలల మధ్యకు వెళ్ళి దాన్ని ముంచి పట్టుకుని, మళ్ళీ వెనక్కు వచ్చి, ఒడ్డుమీద ఆ దుబ్బుమొక్కలవారగా ప్లాస్టిక్ కాగితంలోనే, చుట్టూ ఎత్తుగా ఇసుక పోసిన గట్లమధ్య వుంచిన 'ట్రే' లాంటి దాంట్లోకి - తాను సముద్రం నుంచి తెచ్చిన దానిని పోస్తున్నాడు. కుతూహలంతో వెళ్ళిచూచింది వనజ. ఆ 'ట్రే'లో నీళ్ళు, దాని మధ్య పగిలిన నల్లపూసల్లాంటి రేణువులూ వున్నాయి.

'అబ్బాయ్! గోదావరి ఎక్కడ? అని అడిగిన వనజవైపు తిరిగయినా చూడకుండా ఆ కౌపీనధారి 'ఇంకో కోసెడుంటుంది' అని హడావిడిగా సముద్రం వైపు పరుగెత్తాడు.

'కోసెడు అంటే ఎంత దూరం?' అని అడిగింది వనజ భర్తను.

'నాకు తెలియదు' అన్నాడు కరుణాకరం.

తమ 'అగ్నానాని'కి నవ్వుకుంటూ ముందడుగువేశారు.

పదిమంది బెస్తవాళ్లున్న ఒక కాలనీలాటిది కన్పిస్తే అటు నడవసాగారు.

హఠాత్తుగా ఇసుక మధ్య - అలలకు దూరంగా, నల్లగా బోర్లించిన మూకుడు - అదేమిటి? అదేమిటో?

దగ్గర కెళ్ళి చూశారు.

ఆ చిప్ప బయట కొద్దిగా కన్పిస్తున్న తలను చూచి అరిచాడు కరుణాకరం - 'తాబేలు వనజా!'

కుతూహలం, భయం ఒక్కసారే కలిగిన వనజ చూచింది భయ భయంగా.

ఈలోగా నీళ్ళకేసిపోతున్న ఒక ముసలాయన కన్పిస్తే- 'ఇది తాబేలేనా?' అని అడిగాడు కరుణాకరం.

'ఔనండి!'

'ఎందుకిలా ఒడ్డుమీద కొచ్చింది?'

'గుడ్లెట్టడానికండి! ఆ పనయిపోగానే వెళ్ళోతుందండి! మళ్ళీ పొదిగే టయాని కొస్తాదండి!' అన్నాడా పెద్దాయన - 'ఈపాటి తెలియదా మీకు?' అన్నట్లు చూస్తూ.

'మరి ఆ గుడ్లను కాని, ఈ తాబేలును కాని మీరు తినరా?' అని అడిగింది వనజ.

'బెబ్బే! అలాగెన్నడూ సేయమండి! తాబేలంటే ఎవురండీ? లచ్చిమి నరసిమ్మసామి అవుతోరం గదండి?' అంటూ చెంపలేసుకుని, దండం పెట్టిన ఆ పెద్దాయనలో కరుణాకరానికి ఈ దేశపు వేలాది సంవత్సరాల పర్యావరణ పోషణ సంస్కృతి హఠాత్తుగా కనపడినట్లయింది.

అతడిని అడిగితే - 'అదిగో, అక్కడే గోదారి' అన్నాడు.

ఆ 'అక్కడే' చేరడానికి ఇంకో అర మైలు నడిచారు.

హఠాత్తుగా ఆ అద్భుత దృశ్యం.

కుడివైపునుండి రాజసంగా ప్రవహిస్తున్న పట్టమహిషి గోదావరి - ఎడమ వైపు దర్బారు తీర్చిన చక్రవర్తిలా సాగరుడు!

ఇటు ఆకుపచ్చ, నీలం, మురికి కలిసిన ముదురు రంగు నీరు - అటు స్వచ్ఛంగా నీలంగా అలలు అణిగిన సముద్రం. అక్కడ ఆ కౌగిలింతలో

సముద్రుడే ముందుకు వచ్చాడో లేక గోదావరమ్మే తమకంతో ఒదిగిపోయిందో కాని, సరిహద్దులు తెలియడం లేదు.

'నిను వీక్షించుచు గూరుచుండుటది యింతే చాలునో తల్లి! బం/ధుని కాయంబులు చూడవచ్చినటు మిత్రుల్ జేర యాత్మీయ భా/షణముల్ జేసిన యట్లు, సత్కవుల వాచా మాధురుల్ విన్నయ/ట్లనుభూతుల్ గలిగింతు నీ యెడద నృత్యత్కేతకి - గోదావరీ!' - కవి రామబ్రహ్మం పద్యం గుర్తుకొచ్చింది కరుణాకరానికి.

ఆ నీళ్ళను చూడగానే వనజ కళ్ళింతలయ్యాయి. చిన్న పిల్లలా ఎగిరి గంతేసుకుంటూ పరుగెత్తింది. ఇసుకలో ఒకసారి పడి లేచి నవ్వుతూ, గోదావరి వస్తున్న వైపుగా వెళ్ళింది.

'రండి!' అని కేకేసింది. కరుణాకర్ చేరాడు.

గుడ్డలున్న సంచి భుజంనించి విడిపించి కాస్త దూరంగా ఎత్తుగావున్న చోట వుంచాడు.

బెస్తవాళ్ళిద్దరు మొలలోతు నీటిలో, నదీప్రవాహాని కెదురుగా నీటిమట్టానికి కిందుగా వున్న నావలను చెరో కొసా పట్టుకుని నడిచి వెళ్తున్నారు.

వాళ్ళటు వెళ్ళగానే వనజ నీళ్ళలోకి దిగింది. నీళ్ళను చూస్తే ఆమె మత్స్య కన్యే! కరుణాకరేమో గోదావరి పుష్కరాలకు వెళ్ళినా చెంబుతో ముంచి నెత్తిన పోసుకోవడమే! అతని భయం చూచి ఆమె నవ్వుతుంది. ఎగతాళి చేస్తుంది.

ఆమె వెళ్ళి నడుము లోతు నీళ్ళలో నించుని మళ్ళీ పిలిచింది. చొక్కా విడిచి, పంచెతో నీటిలోకి ప్రవేశించాడు కరుణాకర్.

అతని మోకాళ్ళను పట్టుకుని ఆమె బుడుంగుమని నీటిలో తలను పూర్తిగా ముంచి, క్షణం మాయమయి మళ్ళీ పైకిలేచింది, తల విదిలించుకుంటూ. ఆమె కళ్ళు మిలమిల మెరుస్తున్నాయి. కరుణాకర్ చేతిలోని మగ్‌లోనుండి పసుపు కుంకుమ తీసుకుని, నదీమతల్లికి కొంత అర్పించి, మిగతా దాన్ని మంగళ సూత్రానికి రాసుకుంది; పాపిట్లో పూసుకుంది. మళ్ళీ ఒకసారి మునిగి లేచింది.

ఆ బెస్తవాళ్ళు వలను ఖాళీ చేశారు కాబోలు - ఇసుక మీదుగా వేగంగా నడిచి సముద్రం వైపు వెళ్ళారు.

వాళ్ళు వెళ్ళగానే వనజ హఠాత్తుగా తన్ను చూచి ఆదోలా నవ్వింది. 'మీరు స్నానం చేయరేం?' అంది.

తాను ఎప్పటిలాగే నించునే మగ్‌తో నీరు ముంచి నెత్తిమీద పోసుకున్నాడు. తామున్నది నదే అయినా, సంగమం కారణంగా నీరుప్పగా వుంది.

రెండో మగ్ పోసుకుంటుండగా వనజ ఇటూ అటూ చూచింది. ఎవ్వరూ లేరు. ఎదురుగా దగ్గరగా నిల్చుని కరుణాకర్ భుజాలమీద రెండు చేతులూ ఆనించి అతడిని అమాంతం కౌగలించుకుంటున్నట్టు అదిమి పట్టుకుని అతని తలను నీటిలోకి ముంచింది.

—'నాన్నా! నీళ్ళలో పడిపోతున్నాన్నా!'—

నీరు సుడులు తిరిగి, జడలు విచ్చి, తన్ను కమ్ముకుని కోరల్లోకి చీకట్లోకి లాక్కెళ్ళి పోతూంది. నీళ్ళే భయమై భయమే చీకటియై, చీకటే నీళ్ళై - ఆ ఏడేళ్ళ బాలుడిని మింగేస్తున్నాయి. అరుద్దామంటే మాటలు - నీటి బుడగలవుతున్నాయి - 'నాన్ - నాన్ -'

—వనజతో పాటుగా తలను పైకెత్తి లేచి నిల్చున్నాడు కరుణాకర్.

అరె! అడుగో సూర్యుడు, అల్లదిగో నీలి సముద్రం, ఆ వలను లాక్కుంటూ బెస్తవాళ్ళు వెళ్తున్నారు - తాను మునిగిపోలేదన్నమాట! చాంతాడు తెగలేదన్నమాట! అసలింతకూ బావేదీ - నాన్న లేండే! చెవుల్లోకి నీరు పోయిందేమో - తల విదిలించాడు కరుణాకరం. వనజ ఆశ్చర్యంగా, అమితానందంగా తన్ను చూస్తూంది....

అవును - ఆమెకు తెలుసు, అదిగో ఆమె కళ్ళల్లో - పునర్జన్మ నెత్తిన కొత్త కరుణాకరాన్ని తను చూడగలిగాడు.

ఆకాశం, నీరు, ఎండ, సముద్రం, ఇసుక - వనజ, సర్వప్రకృతీ మనోజ్ఞంగా స్నేహభావంతో పులకరిస్తూంది, పలకరిస్తూంది!

'వనజా!' అంటూ ఆమెను కౌగిలించుకుని అట్లాగే నీళ్ళలోకి మునిగి లేచాడు కరుణాకరం.

'బావుంది కదండీ?'

జుత్తుమీదనుండి నీటి బొట్లు కారుతుండగా తలవూచాడు కరుణాకర్.

—ఆ ప్రక్కనే స్నానం నిమిత్తం అప్పుడే వచ్చిన ఒక వృద్ధుడు ఒక మునక వేసి లేచినట్లున్నాడు.

దంపతులు కొంత దూరదూరంగా జరిగారు.

ఆయనేవో శ్లోకాలు చదువుతున్నాడు ఉచ్చైస్వరంతో-

'లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబమ్!'

ఆవెంటనే అనుకున్నాడు- 'ముప్పైఏడేళ్ళు పట్టిందా స్వామీ, నా చేతులు అందుకోడానికి; నన్ను భయంనుండి ఆ'భయం'లోకి లాగిపడేయడానికి?!'

'ఇంకోసారి మునుగుదామండీ?' అంది వనజ.

మునిగారు - లేచారు.

గోదావరి ప్రవహిస్తూనే వుంది. సముద్రం చేతులు చాచే వున్నాయి.

భయమంతా పోగా తాబేలు తలను బయటపెట్టి నెమ్మదిగా సముద్రం వైపు నడవసాగింది.

నీటిఒడ్డునుంచి ఏదో పక్షి హాయిగా, ఎత్తుగా, ఆకాశంలో ఎగిరేనిమిత్తం పైకి - పైపైకి లేచింది.

*

# తను - అతను

—మంజుశ్రీ

ఆమె గుడికి వెళుతుంది. సినిమాకు పోతుంది. వీధిలో ఎవరైనా పేరంటానికి పిలిస్తే ఉత్సాహంగా ముందుగానే తయారవుతుంది. వారపత్రిక ఇంటికి రాగానే గబగబ చదివేస్తుంది. ఊళ్ళో సంగీత కచేరీ లేవైనా జరిగితే అక్కడకు హాజరవుతుంది. ఎక్కడో ఎవరో స్వాములవారు బాబాజీ, యోగినీమాత ఉపన్యాసం చెపుతున్నారంటే అక్కడకు వెళుతుంది. స్వేచ్ఛకేమీ ఆటంకాలు లేవు. ఒకరకంగా ఇందుకుకూడా ఆమె బాధపడుతుంది. అతడు దేనినీ పట్టించుకోడు. తనతో కలిసిరాడు. తననేమీ అడగడు - తనకేం కావాలి అనికానీ, నాకిది కావాలి అని కానీ.

ఆమె మనసులో ఏమిటో లోటు. అసంతృప్తి. వెలితి. పొందవలసింది ఏమిటో పొందలేకపోతున్నాను, పొందలేకపోయినాను, పొందలేను అన్న నైరాశ్యం, దిగులు, నిరుత్సాహం. చిన్నతనంలో ఆమె జీవితాన్ని గురించి ఎన్నెన్నో కలలు కన్నది. ఎంతో ఆశించింది. ఎన్నో ఊహించింది. కాని ఎందుకో ఏమిటో చప్పగా నిస్సారంగా ఉద్వేగాలు, ఉద్రేకాలు, ఉత్సాహాలు లేకుండా కాలం గడవటం, గడపటం మనసుకి కష్టమనిపిస్తున్నది. అప్పుడప్పుడు నిస్పృహ కలుగుతుంది. అసలు ఊహించటం, ఆశించటం, కలలు కనటం చాలా తప్పేమో!

మంచి మాటా, మృదువైన ఆలోచనా, సుతారమైన పలకరింపూ, సున్నితమైన భావప్రకటనం, ఆప్యాయతతో కూడిన స్పర్శా ఆమె కన్నిటికన్నా ఎక్కువ ఇష్టం. చిన్నప్పుడు అవీ ఇవీ పుస్తకాలు చదివీ వాళ్ళను వీళ్ళనూ మనుషులనుచూసీ ఇట్లా ఇట్లా జరుగబోతుంది తన జీవితంలో అని ఊహించుకున్నది.

అద్దంలో చూసుకుంటూ తనకుతాను బాగా అందంగానే ఉన్నాననుకుంటూ ఉండేది. అపురూపమైన అందగత్తె అని ఎవరూ అనకపోయినా తాననుకోక పోయినా ఏ వంకలూ లేవు కదా తనకు అనుకునేది. ఆ రోజులే అలాటివి. ఆ రోజుల ఆ తలపోతలే అలాటివి. తన భావావేశంలో బాహ్యాకర్షణలు, బాహ్య ప్రపంచపు కోరికలు, యథార్థ జీవితపు సర్దుబాట్లు, యాంత్రిక జీవిత సమస్యలు ఆమె ఆలోచనలోకి వచ్చేవికావు.

ఆమె పేరు హేమ.

చిన్నతనంలో బళ్ళో చదివేప్పుడు తోటివాళ్లూ మేష్టర్లు నీ పేరు బావుంది అంటే అదేదో పారవశ్యంలాంటిది అనుభవించేది. బంధువుల కుటుంబాలలోనూ తెలిసినవాళ్ళ ఇళ్లలోనూ ఏవో పొరపొచ్చాలు, కష్టాలు, పంతాలు, పట్టుదలలు వస్తే ఎంతో బాధపడిపోయేది.

మళ్ళీ అందమైన సాయంకాలాలు, ఆకాశంలో మబ్బులు, ఉదయకాలపు చల్లని వెచ్చదనం, సాయంకాలపు వెచ్చని చల్లదనం, తమ్ముళ్లూ చెల్లెళ్లూ, జీవితం లోని అనురాగభావనలు, రాగభావనల మధ్య మనసులోని బాధ మరిచిపోయేది.

చలికాలం వస్తే ఉల్లం పల్లవించేది. ఎండాకాలం వస్తే మనసు ఉత్సాహంతో ఉప్పొంగి పోయేది. వానాకాలం వస్తే వానావానా వల్లప్పా ఆడాలని పించేది. వెన్నెలకాలం వస్తే డాబామీద ఒంటరిగా కలల్లో కదిలిపొయ్యేది. మొట్టమొదటిసారిగా మల్లెపువ్వుల్ని ఆ సంవత్సరం చూసినప్పుడు, మాల కట్టి నప్పుడు, జడలో ముడుచుకున్నప్పుడు చిన్నపిల్లల కథల్లో వస్తారే - రాజకుమారుడూ, రాజకుమారీ, చంద్రశాలలూ, ఉద్యానవన విహారాలు-అలా అలా అందమైన ప్రపంచంలోకి వెళ్ళిపొయ్యేది. శ్రావణమాసం రాగానే చామంతి పూలు ఏమి టేమిటో రహస్యాలు చెప్పేవి. మనసుకు శీతకాలపు చల్లని గాలి గుళ్ళో ధ్వజ స్తంభపు కార్తీకదీపమూ ఎత్తయిన పున్నాగ చెట్టునిండా గుత్తుల గుత్తుల పూలూ ఊరంతా మాటు మణిగి నిశ్శబ్దంగా నిద్రిస్తున్నప్పుడెప్పుడో బాండు మేళంతో పెళ్ళి ఊరేగింపు, రైలు ప్రయాణంలో కొత్త పెళ్ళికూతురు పెళ్ళికొడుకు తారసపడటం, దర్జీ అతను తెచ్చిన కొత్త బట్టలూ మనసునంతా ఆనందంతో నింపేవి. బంధువు లిళ్ళలో పెళ్ళిళ్ళకు వేడుకలకు వెళ్ళినప్పుడు మామిడాకుల తోరణాలు కొబ్బరాకుల స్తంభాలు కూడా హేమ చెవుల్లో ఏవో సంగీతం విని పింపజేసేవి

అయితే మరి ఇప్పుడేమైంది?

ప్రకాశరావు కోర్టుకి వెళ్ళిపోతాడు. వరండాలో కూచుని బయటి ఆవరణ లోకి చూస్తుంది హేమ. ఇంటిముందు కాంపౌండు గోడకు అనుకున్న దడిమీద అల్లుకున్న కాశీరత్నం పూలను ఒక్కొక్కటీ కొరుకుతూ ఉడుత గంతులేస్తుంది. ఉడుతలు ఒకదానివెనుక ఒకటి పరుగులు తీస్తాయి. ఎక్కడో కొత్త పువ్వు కనపడుతుంది. కొత్తపిందె బయటపడుతుంది.

రోజూ అవే దృశ్యాలు.

పొద్దుపోవటానికి వాకిలి తెరిచే ఉంచుతుంది.

ఫలాని బళ్ళో పనిచేసే పంతులమ్మ సరిగ్గా అదే సమయానికి అదే దారిన అట్లానే నడుస్తూ వస్తుంది. ఐస్‌క్రీమ్ బండిని తోసుకుంటూ అదే పిల్లవాడు వస్తాడు. ఇత్తడి సామానులు తోపుడుబండిమీద అమ్ముకునే మనిషి వస్తాడు. ఎదురింటి వాళ్ళబ్బాయి స్కూలు నుంచి వస్తాడు. రేడియోలో వార్తలు వస్తాయి. అవి తనకు కొత్త అనిపించవు. ఒకేవిధంగా ఉంటాయి. పిల్లా పాపా అన్నా ఉంటే కాలం అదొక కొత్తగా నన్నా ఉండేదేమో!

ఇవాళైనా ఆయనతో గట్టిగా చెప్పాలి. పది రోజుల నుంచీ చెపుతూనే ఉంది. అయినా ప్రతిదీ ఆయన హాస్యంగా తోసేస్తుంటే, అపహాస్యంగాతీ సేస్తుంటే తన మనస్సు చివుక్కుమంటుంది. తాను అసాధ్యమైనవీ, కోరరానివీ కోరికలేమీ కోరటం లేదు. ఆయనకు తీరిక లేదనుకోవటానికి వీలేలేదు.

ఆ రామారావుగారు రాగానే ఈయనా ఆయనా పనికిమాలిన విషయాలన్నిటినీ గూర్చి గంటల తరబడి మాట్లాడతారు. మూడు సార్లు కాఫీ తాగుతారు. తన కిప్పుడిక గత్యంతరం లేదు కనక, తప్పనిసరి కనక అలవాటైంది. కాని, వాళ్ళు సిగరెట్లు అంతు లేకుండా తగలేస్తుంటే విసుగొచ్చేది.

ఆ రామారావు కాలేజీ లెక్చరర్. అవతలి వీధిలో ఉంటారు. ఈయన ఆయనా స్కూలులోనే కాక కాలేజీలో కూడా కలిసి చదువుకున్నారుట. రోజూ ఆయన వచ్చి కాలేజీలో చదివే ఆడపిల్లల చందాలు, అందాలు వాళ్ళ కుటుంబాలలో లోట్లు, వాళ్ళు పడే పాట్లు ఒకటే వాగుతాడు. ఈయన చెవులు దోరబెట్టుకొని అమృతపానం చేస్తున్నంత తన్మయత్వంతో వింటారు. అలా గంటలు గంటలు మాట్లాడతారు. వాడు వీడికాళ్ళు పట్టుకొన్నాడనీ, వీడు వాడికంట్లో

కారం చల్లాదనీ చెప్పుకొని పీళ్ళకేదో వొరిగినట్లు సంతోషిస్తారు. వాళ్ళు చెప్పుకొని ఆనందించేవాటిలో అంత ఆనందం ఏముందా అని హేమకు ఆశ్చర్యం కలుగుతుంది. ఆమె భర్తని ఎన్నోమాట్లు అడిగింది కూడా. నీకు తెలీదు అనే వాడతను.

దేవాలయంలో ఒకాయన ఎవరో పది రోజుల నుంచీ పురాణం చెపుతున్నాడు. ఆయనేమో చాలా గొప్పవాడనీ చిన్నతనంలోనే ఆయనకు వైరాగ్యం కలిగిందనీ ఆయన దగ్గరకు వెళ్ళినవాళ్ళకు జబ్బులు నయమవుతున్నాయనీ పీళ్ళూ వాళ్ళూ చెప్పుకుంటూ వుంటే తానూ వెళ్ళి చూసింది. తన మనసులోనూ ఏదో ఆశ మెరిసింది. అందులో తప్పేమున్నది?

ప్రకాశరావు కోర్టు నుంచి ఇంటికి వచ్చి కాఫీతాగి క్లబ్బుకి వెళ్ళి ఒక్కోరోజు రాత్రి రెండూ మూడూదాకా ఇంటికే వచ్చేవాడుకాడు. లేదా ఏ స్నేహితుడో బలవంతం చేశాడు-సినిమాకు వెళ్ళేను అనేవాడు. తానంటుందీ, మనసులో ఎంతగానో అనుకొంటుందీ - తనకన్నా ఎక్కువైన స్నేహితుడు, తనకన్నా ఎక్కువగా ఆకర్షించే విషయాలూ ఆయన కుండకూడదు కదా! అంటే-తమ ఇద్దరిలో ఎక్కడో ఎవరిలోనో ఏదో లోపం ఉదన్నమాట! ఆ మాట అనుకోవటానికి ఆమెకు భయమవుతుంది. విచారం కలుగుతుంది.

ప్రకాశరావు త్వరగా ఇంటికి వస్తే తానుకూడా కలసి అతణ్ణి బయలుదేర దీయాలనుకున్నది, కాని అతడు ఆలస్యంగానే వచ్చాడు. ఆమె మనసు చాలా గాయపడింది. అతడితో మాట్లాడలేదు. తమ మధ్య ఏమీ పరిచయం లేనట్లుగానే ఉండిపోయింది.

ప్రకాశరావుకి ఆలయానికి వెళ్ళటానికేమీ అభ్యంతరం లేదు. కాని, బిడియం, సిగ్గు. తెలిసిన వాళ్ళంతా ఏమనుకుంటారో! వీపువెనుక ఏమని వ్యాఖ్యానిస్తారో! లేక పైకి అనకపోయినా మనసులోనైనా ఇతడు ఇందు కోసం వచ్చాడు అనుకుంటారో ఏమో - అని వెనకా ముందాడాడు. రేపు గట్టిగా వెళదామని ఆమెకొక రోజు భరోసా ఇచ్చాడు.

జీవితంలో అనేకమైన చిక్కులెదురవుతాయి. ఎవరికీ తప్పవు ఎప్పుడో ఒకప్పుడు అసంతృప్తులు అందరికీ ఎదురవుతాయి. అవి ఎవరికీ తప్పవు. సామాన్యంగా ఇతరులు తమకన్నా బాగున్నట్లునిపిస్తుంది. వాళ్ళతో పీళ్ళతో పోల్చుకుని - వాళ్ళకేం వాళ్ళు బాగానే ఉన్నారు. అనుకుంటూ తమ మనసులో

ఇంకా అసంతృప్తి నిరాశానిస్పృహలూ పెంచుకుంటూ ఉంటారు. ఇది మానవ స్వభావం కావచ్చు. అసలు ఈ సంఘం లేకపోతే పోల్చుకోకపోతే ఎవరి జీవితం వాళ్ళది. ఎవరి అదృష్టం వాళ్ళది.

హేమ కొందరి దృష్టిలో చాలా అదృష్టవంతురాలు. ఆరడి పెట్టేవాళ్ళు లేరు అత్తామామా ఉన్నా ఎక్కడో దూరంగా ఉంటారు. ఆస్తిపాస్తులున్నాయి స్వతంత్రురాలు-అంతకన్నా కావల్సిందేముంది? అని.

కాని హేమకు మనసున్న మనుషులు కావాలి. వాళ్ళ అభిమానపు మాటలు కావాలి. కలలు కావాలి. కలవరింతలు అక్కర్లేదు, మర్రోజు పొద్దున తన అభిమానమంతా అవతలకు నెట్టి ఎంతో ఆప్యాయంగా చెప్పింది అతడికి. 'ఇవాళ సాయంకాలం త్వరగా ఇంటికి వస్తే కలిసేపోదాం లేదా కనీసం మీరొక్కరైనా వెళ్ళిరండి 'అని,ఒకవేళ అతను తనతో రావడానికి సంకోచిస్తాడేమోనని.

సాయంకాలం రోజులాగే క్లబ్బుకు రమ్మని తోటివాళ్ళు ఆ రోజుకూడా అతణ్ణి ప్రోత్సహించారు. ఇంటి దగ్గర అర్జంటుపని ఉంది అన్నాడు ప్రకాశరావు. వాళ్ళు వ్యంగ్యంగా నవ్వారు. ప్రకాశరావు ఇంటికి వెళ్ళలేదు.

ఆ దారిన నడుస్తుంటే చిన్నప్పటి రోజులెన్నో గుర్తు వచ్చాయి. మామూలుగా ఆ వేవులకు అతడురాడు, దారిలో తెలిసినవాళ్ళు పలకరిస్తుంటే సిగ్గుపడ్డాడు. వాళ్ళంతా తనను చిన్నప్పటి నుంచీ ఎరిగినవాళ్ళు ఆ వీధుల్లో తాను ఎగిరాడు. గెంతాడు. పడ్డాడు. దులుపుకొన్నాడు. ఇరవై పాతిక సంవత్సరాలలోనే ఆ వీధుల రూపురేఖలు మారిపోయినై. వ్యభిచార గృహాలు, సారా దుకాణాలు పుట్టుకొచ్చాయి. ఆ వైవుల రెండు సినిమాహాళ్ళుకూడా వచ్చాయి.

సాయంకాలం ముదిరి సంజచీకట్లు ముసురుతున్నాయి. కార్తీకమాసం లాగుంది. పాతకాలపు చాదస్తాల మనుషులు వీధివాకిలి పక్కగోడలపై కార్తీక దీపాలు పెట్టారు. దేవాలయానికి వెళ్ళాలంటే చెరువుకట్ట కిందివీధి దగ్గరితోవ చిన్నతనంలో ఆ ప్రాంతాలంతా ఎన్నెన్ని సార్లో తిరిగాడుతాను. చెరువు కట్టపైని ఎర్రని పూలచెట్లు రెండుండేవి. వాటిపైన దయ్యాలున్నాయని, వాటిని తాము చూశామని తనకన్నా పెద్దలు కోతలు కోస్తుండేవాళ్ళు.

ప్రకాశరావు అంతరాత్మ వెక్కిరించింది. ఏమిటీమార్పు అంది. 'నేనేం మారలేదు సంసారమన్న తర్వాత సర్దుబాట్లుండాలికదా! ఆవిడకోసం ఈ వేషం'

అని సమర్థించుకున్నాడు. దేవాలయంలో అడుగుపెడుతుండగానే సీనియర్ లాయర్ వెంకటప్పయ్యగారు తన వైపు ఆశ్చర్యంగానూ, అప్యాయంగానూ చూశారు. అక్కడి వాతావరణం వింతగా ఉంది. నమ్మీనమ్మకపోనీ నమ్మకాలతో సత్యాసత్యాలకు నిమిత్తంలేదు. కాని. నమ్మినవాళ్ళకేదో శాంతి లభించేట్లుగానే ఉన్నది అనిపించింది ప్రకాశరావుకు క్లబ్బులో కొందరికి ఆనందం లభించేట్లుగా గుళ్ళో కొందరికి సంతృప్తి లభించవచ్చునేమోననుకున్నాడు ప్రకాశరావు

స్వామి చూడబోతే చిన్నవాడే అనుకున్నాడు. అతడి మనసులో ఏదో మెరుపు మెరిసినట్లయింది. ఈయన ముఖ కవళికలన్నీ తనకుబాగా పరిచితాలు అరూపరేఖలన్నీ తానిదివరలో సన్నిహితంగా ఎరిగినట్లనిపిస్తున్నది. అయితే అందీ అందనట్లు తెలిసీ తెలియనట్లు పల్చటి పొరఏదో మధ్య వేలాడుతున్నట్లు అస్పష్టంగా ఎవరిదో మూర్తి, పేరూ నోట్లో ఆడుతూ పైకిరాకుండా ఉద్విగ్నపరుస్తున్నది మనస్సును దగ్గరగా వెళ్ళిచూస్తే ఆ తెర తొలగిపోను! ఎట్లా? ఆయన గారిముందంతా కిక్కిరిసి మనుషులు కూచునివున్నారు. ప్రకాశరావు దూరంగా మంటపంలో ఒక స్తంభానికి అనుకుని కూచున్నాడు. స్వామివారి ముఖం ప్రశాంతంగా ఉంది. గంభీరంగా ఉంది. ఎవరెవరో ఏమిటేమిటో తమ గోడు చెప్పుకుంటున్నారు. తమ సందేహాలు వెల్లడిస్తున్నారు. ఆయన నిర్లిప్తంగా ఆలకిస్తున్నాడు. ప్రకాశరావు మనసులో ఉత్కంఠ ఎక్కువైంది, అలా అతను చాలా సేపు కూచున్నాడు పోనీ గుళ్ళోకి వెళ్ళివద్దామని లోపలకు వెళ్ళాడు. చిన్నతనంలో చూసినట్లుగానే ఉన్నాయి విగ్రహాలు ఏమీ మార్పు కనపడలేదు. ఏ అనుభూతీ తనకు కలగటం లేదు. చిన్నతనంలోనే నయం గంట కొట్టటం మీదనో నంది మీది వొరిగినంది కొమ్ముల్లోంచి వేళ్ళసందునుంచి దేవుడి విగ్రహాన్ని చూడటంలోనో, కనీసం తీర్థంపట్లనో ప్రసాదంపట్లనో ఆసక్తి ఉండేది. లోపల నుంచి మళ్ళీ మంటపంలోకివస్తే అక్కడ అప్పటిదాకా కూచున్న వాళ్ళందరూ ఒక్కొక్కరే లేచి వెళ్ళిపోతూ ఉండటం కన్పించింది. స్వామి ఇదివరలో కూచున్నచోట లేరు. ఆయన ధ్యానానికి లోపలికి వెళ్ళారు అని చెప్పారు అక్కడివాళ్ళు మళ్ళీ ఓ గంట తరవాత ఇవతలకు వస్తారుట ఒక్కసారి దర్శనం చేసుకుని వెళతాను అని బతిమాలుతూ అడిగాడు ప్రకాశరావు, సరే. కనుక్కొని వస్తానని ఆయన శిష్యుడు కాబోలు లోపలకు వెళ్ళాడు.

ప్రకాశరావు లోపల అడుగుబెడుతూ అయన తనకేసి చూడగానే పోల్చు కున్నాడు తనతో సెకండ్ ఫారంవరకూ కలిసి చదివిన సత్యనారాయణ. ఇంట్లోంచి ఎక్కడికో వెళ్ళిపోయినాడని అంతా అగుబ్బుగా చెప్పుకున్నారు. స్వామి గుర్తించానన్నట్లు ప్రశాంతంగా చూశారు. అప్పుడు అంటే స్కూలు చదువుల రోజుల్లో సత్యనారాయణతో ఒక రోజు స్కూలు ఆట స్థలంలో ఇసుకలో చెడుగుడు ఆడుతూ అతడు తనకళ్ళలో మట్టిపోశాడని ఆ సత్యనారా యణ బుగ్గమీద తాను కొరకటం జ్ఞాపకం వచ్చింది ప్రకాశరావుకు. అది తమ ఇళ్ళ ఇరుగు పొరుగుల మధ్య పెద్దజగడమైంది.

ప్రకాశరావుకి అతణ్ణి పాతికేళ్ళ తర్వాత చూడటం చాలా ఆనందమైంది. తీర్థం తీసుకున్నాడు.నేను మీతో చాలా మాట్లాడాలి అన్నాడు. ఆయన చిరునవ్వు నవ్వుతూ తల ఊపాడు. శిష్యుడు వచ్చి ఏ రోజైనా ఉదయం పూట రండి అన్నాడు.

ప్రకాశరావు బయటపడ్డాడు. అతడి మనసునిండా ఎన్నెన్నో ఆలోచనలు గడచిపోయిన కాలం తాలూకు దృశ్యాలు. చెరువుకట్ట వీధిదాకా వచ్చింతర్వాత మలుపు తిరుగుతుండగా పెద్ద సన్నాహంతో మేళతాళాలతో ఓ శవాన్ని తీసుకొని పోతున్నారెవరో.

ప్రకాశరావు మనస్సు చివుక్కుమంది. దుఃఖస్పర్శ ఏదో గుండెను తాకింది. ఆ స్వామి చిన్నప్పటి తన బాల్యస్నేహితుడనీ తమకేదో మేలు జరగ వచ్చునని హేమకు చెపితే హేమ సంతోషిస్తుందనీ అతడికి ఆశగా ఉత్సాహంగా ఉల్లాసంగా ఉంది. తనకూ ఆయనకూ ఎంత అంతరం!

ఆ వీధి మలుపులో సినిమాహాలు పక్కసందులో తననెవరో పిలిచార అతడి గుండె గతుక్కుమన్నది. అవును. ఆ గడపతొక్కి తానింటి దగ్గర ఏ అబద్ధాలు చెప్పలేదు! ఎప్పుడూలేంది కళ్ళు చెమర్చి గబగబా అడుగు ముంద వేశాడు ప్రకాశరావు.

# అమ్మ !

— పోతుకూచి సాంబశివరావు

డాక్టరు లక్ష్మి ఆలోచనలో పడింది.

'ఎలా వుందో చిన్ని?' ఒక వేడి నిట్టూర్పు వెలువడింది.

పది సంవత్సరాలు వెనక్కి తిరిగాయి.

ఓ పెళ్లికాని పిల్ల - గర్భవతిగా వచ్చింది.

ఆమెకు పెళ్ళి కావాలి -

గర్భం తీసేయమని - ఆమె తల్లి ప్రార్థన.

ఇటువంటి కేసులు తన వృత్తికాలంలో ఎన్నో వచ్చేయి.

అలాగే అని ఆమె గర్భం నుంచి ఎదిగీ ఎదగని ఎనిమిది నెలల పసి ను బయటకు తీసింది డాక్టరు లక్ష్మి. పసిగుడ్డును వదిలేసి తల్లి, ఆ తల్లి ల్ల కూడా నిశ్చింతంగా వెళ్ళిపోయారు.

పసిగుడ్డు జీవంతో చైతన్యంతో కదిలి కులకులలాడింది తన దగ్గర ఆయా సాయంతో పది రోజులు పెంచింది. ఎంతో మంది వచ్చి తన్ను పసిపిల్లలను పెంపకానికి యిమ్మన్న రోజులు, తాను అలాంటి పసిగుడ్డులను యిచ్చిన రోజులూ వున్నాయి.

అలాగే ఓ వ్యాపారి డా॥ లక్ష్మిని కలిశాడు. పిల్లను చూసి తన భార్య వద్దన్నా పెంపకానికి తీసుకుంటానన్నాడు. పాపను తీసుకువెళ్ళాడు. కాని, మర్నాడే ఆ పాపను తీసుకువచ్చేశాడు.

'ఏం సేటూ! ఏమయింది?' అంది డా॥ లక్ష్మి.

"ఈ పిల్ల జాతకం మంచిది కాదటమ్మా! ఆయుర్దాయం లేదట!" అన్నాడు

సేట్. తాను ఆస్పత్రిలో పదిమంది చుట్టూ వున్నప్పుడు ఆ మాటలు సేట్ అన్నాడు. అందరూ విన్నారు.

డా॥ లక్ష్మి చాలా బాధపడింది.

ఆ మాట ఆ నోటా ఆ నోటా పాకుతుంది. 'ఇంక ఎవరు చిన్నిని ఆదరి సారు?' అనుకుంది డా॥ లక్ష్మి.

సేటు వదిలేసి వెళ్ళిపోయాడు ఆ బిడ్డను. 'మగపిల్లవాడు ఉంటే కబురు పంపమ్మా, తీసుకు వెడతాము' అంది సేటు భార్య. డా॥ లక్ష్మికి అర్థమయింది సేటు ఎందుకు చిన్నిని వదిలేశాడో!

డా॥ లక్ష్మి దిగాలుపడింది. ఆ పాపను ఆయాతో తీసుకువెళ్ళి లాయరు రావును కలిసింది. ఆయన డా॥ లక్ష్మికి దూరపు బంధువు. ఆమె ఆస్తి వ్యవహారాలు చూసే ఆత్మీయుడు. పైగా జాతకాలు చెప్పగల సమర్థుడు.

రావు తన టేబుల్ వద్ద తీరికలేని పనుల్లో సిబ్బంది మధ్య పని చేసు కుంటున్నాడు.

'ఏమండీ రావుగారూ!' అంది డాక్టరు. లక్ష్మి 'ఒక చిన్న సలహా యిస్తారా?' అని అడిగింది ఆవిడ.

లాయరు రావు ఆశ్చర్యపోయాడు. చంటి పిల్లను వెంట తీసుకువచ్చి సలహా యిమ్మంటుంది ఏమిటని ఆశ్చర్యపోయాడు రావు.

'అదే యీ పిల్ల జాతకం చూసి - అంటే చెయ్యి చూసి ఎంత ఆయు ర్దాయమో చెప్పగలరా?' అంది డాక్టరు లక్ష్మి.

'ఎవరో అనాథ పిల్లను గురించి యీ డాక్టరుకు యింత బాధ దేనికి?' అనుకున్నాడు రావు. 'చిన్నపిల్ల చెయ్యిచూస్తే ఫలితాలు సరిగా ఉండవు - రేఖలు పూర్తిగా స్పష్టంగా ఉండాలి కదా!" అన్నాడు రావు.

'పరవాలేదు' చూసి మీ సలహా యివ్వండి' అంది డాక్టరు లక్ష్మి.

ఆ పసికందు - ముడుచుకుపోతున్న లేతచేతులు చాచి ఆయుర్దాయం రేఖ చూశాడు రావు. 'పరవాలేదండీ! చాలాకాలం బతుకుతుంది' అన్నాడు రావు.

డాక్టరు లక్ష్మికి ధైర్యం వచ్చింది.

ఆ పసికందును మరో పది రోజులు ఆయా సాయంతో సాకింది డాక్టరు లక్ష్మి,

ఎవరూ ఆ పాపను కావాలి అన్నవారు లేరు. అప్పుడే ప్రచారమైపోయింది. ఆ పాపకు ఆయుర్దాయం లేదట. అని నెల దాటింది.

డాక్టరు లక్ష్మి ఆలోచనలో పడింది.

డాక్టరు లక్ష్మి కూతురు శైలజకు 15 ఏండ్లు. 'ఆ పాపను ఉంచమ్మా మనమే పెంచుకుందాం' అంది. డాక్టరు లక్ష్మి గుండె దడదడలాడింది.

తానా భర్తలేనిది - ఈ పాప ఎవరిది అని ప్రశ్నిస్తే పెళ్ళి కావలసిన తన కూతురు భవిష్యత్తు ఏమౌతుంది? రకరకాల ఆలోచనలు దొర్లాయి డాక్టరు లక్ష్మి మనసులో

డాక్టరు లక్ష్మి కొడుకు చందూ కూడా అన్నాడు - పెంచుకుందాం అమ్మా అని. పిల్లలు- వాళ్ళకు జీవితం గురించి ఏం తెలుసూ? అనుకుంది డాక్టరు లక్ష్మి. లాయరు రావు సలహా అడిగింది - 'ఈ పాపను పెంచుకోమంటారా?' అని.

'మీ యిష్టం' అన్నాడు రావు.

'అదికాదు - యీ పిల్లకు పేరు పెట్టాలిగా?' మా యింటి పేరు యిస్తే - పెళ్ళిళ్ళకు ఎదిగిన నా పిల్లల భవిష్యత్తు ఎలా వుంటుందో?' అంది డాక్టరు లక్ష్మి.

'పోనీ, మా యింటి పేరు యివ్వండి!' అన్నాడు రావు నవ్వుతూ.

'అయితే - నేనే పెంచుతాను - కాని మీ పాప అని చెబితే అభ్యంతరం లేదుగా?'

'నేను మొండి ఘటాన్ని - నాకే భయంలేదు - అలాగే చెప్పండి' అన్నాడు రావు.

రావుకు ఇదివరలో వివాహమయింది. కాని భార్య ప్రసవిస్తూ చనిపోయింది. అప్పటినుంచీ పెళ్ళి చేసుకోలేదు - తన ఒంటరి జీవితంతో ప్రజా సేవ చేస్తూ కాలం గడిపేస్తున్నాడు రావు - అందుకే నిర్భయంగా అన్నాడు - తన యింటి పేరు ఆ పిల్లకు యిమ్మని - తన పిల్లే అని అందరూ అనుకున్నా భయం లేదు రావుకు. డాక్టరు లక్ష్మి సంతోషించింది - చిన్నిని పెంచుకుంది - మధ్యలో అనేక రోగాలు వచ్చాయి - డాక్టరు కాబట్టి జాగ్రత్తగా చూసుకుంది ఓ రోజు చిన్నికి విరోచనాలు ఎక్కువై చనిపోయే పరిస్థితి ఏర్పడింది - గ్లూకోజు ఎక్కించి డాక్టరు లక్ష్మి నిద్రాహారాలు లేకుండా పాపకు సేవ చేసింది - దైవం అనుగ్రహించినట్లు బతికింది - అని డాక్టరు లక్ష్మి చాలా ఆనందించింది - ఎవరికైనా పెంపకానికి చిన్నిని యిచ్చేద్దామన్న ఆలోచన డాక్టరు లక్ష్మి విరమించుకుంది. చిన్ని ఎదిగింది - గలగలా నవ్వు - చెంగు చెంగున గంతులు - అల్లరి - చక్కటి పలుకులు - మంచి తెలివి తేటలు - చదువులో చురుకు....డాక్టరు లక్ష్మి కళ్ళముందే ఏడు సంవత్సరాలు గడిచిపోయాయి.

చిన్ని సాన్నిహిత్యంలో డాక్టరు లక్ష్మికి ఏదో వినూత్న ఆనందం లభించింది.

కూతురు శైలజ వివాహం అయింది - పెద్దవ్యాపారి అల్లుడుగా దొరికాడు. కొడుకు పెండ్లి అటుంచి - భార్యను తీసుకుని బొంబాయి వెళ్ళిపోయాడు. డాక్టరు లక్ష్మి ఒంటరిదై పోయింది- ఆరోగ్యం చెడింది. చిన్నికి సేవ చేయడం కష్టమైపోయింది.

చిన్ని అల్లరి చేస్తే కేక లేసేది- 'నిన్ను హాస్టల్‌లో చేర్పిస్తా' అని. ఆ మాటలు విన్న చిన్ని బాధపడింది. 'తనకు అమ్మ లేదా' తోటి స్నేహితులు తనకి అమ్మా నాన్న లేరని గేలిచేస్తే చిన్ని బాధపడేది.

పెళ్ళయి దర్జాగా వున్న శైలజ కారుల్లో తిరిగేది. 'నిన్ను చిన్నప్పటి నుంచీ నేనే పెంచేనే!' అంది శైలజ. నిజమనుకుంది చిన్ని.

'నేను నీ దగ్గరకి వచ్చేస్తానక్కా' అంది చిన్ని.

అప్పటికే ఇద్దరు చిన్న పిల్లలు కల శైలజ తలలో ఏదో మెరుపు మెరి సింది 'అలాగే' అంది. మెల్లిగా తల్లి డాక్టరు లక్ష్మికి నచ్చచెప్పింది. తనవెంట తీసుకువెళ్ళిపోయింది చిన్నిని.

చిన్ని వెళ్ళి ఏడాది దాటింది.

'ఎలా వుందో చిన్ని?' అనే ఆలోచనలో పడిపోయింది డాక్టరు లక్ష్మి తనకు ఇద్దరు పిల్లలున్నా చిన్ని అంటే ఎందుకో అమితమైన ప్రేమ. చిన్ని లేకపోవడంతో ఆమెకు బెంగ ఎక్కువయింది.

'రావుగారూ! మీరు మా శైలజ వూరు వెడతారా? ఓసారి చిన్నిని చూసి రండి!' అంది డాక్టరు లక్ష్మి.

రావు ఒప్పుకున్నాడు - వృత్తి పనిమీద త్వరలో ఆ వూరు వెడుతున్నా నని, చిన్నిని చూసి వస్తానని అన్నాడు. గత ఆరు సంవత్సరాలలో రావు కూడా చిన్నికి చాలా దగ్గరయ్యాడు - 'అంకుల్' అంటూ చిన్ని రావు ప్రేమ చూర గొంది. ఒక్కొక్కసారి 'డాడీ' అని పిలిచేది - తనకు 'డాడీ' లేడా అని బాధ పడేది చిన్ని. అయితే రావును చూస్తే ఎంతో దూరంనుంచి కూడా పరుగెత్తుకుని వచ్చి ఎగిరి రావును ముద్దెట్టుకుని అతని ఒళ్ళో కూర్చునేది - గుర్రంలా తన్ను ఎక్కించుకుని త్రిప్పమని మారాము చేసేది. రావు కూడా చిన్నిని చాలా ప్రేమగా చూస్తూ ఆనందించేవాడు. అందువల్ల రావుకు కూడా చిన్నిని చూడాలనిపించింది.

శైలజ యింటికి రావు రావడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది - కాని, అన్ని రకాల మర్యాదలు రావుకు శైలజ చేయించింది. అయితే చిన్ని ఏదీ? వచ్చి గంటయినా చిన్ని కనిపించలేదు. ఎక్కడో కాంపౌండులో మూల కూర్చుంది - బయట చలి గజగజలాడిస్తోంది.

'చిన్ని ఏదీ?' అన్నాడు రావు.

'చదువుకుంటుంది' అంది శైలజ.

'అయినా ఎంత చెప్పినా చదువు రావటం లేదు చిన్నికి' అని శైలజ అదోలా నవ్వింది.

'సెలవులకైనా చిన్నిని మీ అమ్మ దగ్గర వుంచవలసింది. ఆమెకు చిన్నిని చూడాలని బెంగగా వుంది' అన్నాడు రావు.

'రానంటుంది అంకుల్! ఇక్కడే బాగుందట' అంది శైలజ.

నిజమనుకొన్నాడు రావు

తరువాత పిలవగా పిలవగా చిన్ని కనిపించింది. గత ఏడాదికన్నా చిన్ని బాగా చిక్కిపోయింది. ఎదిగింది కానీ అనారోగ్యంగా వున్నట్లు కనిపించింది. ఆ చలాకీతనం, గలగల నవ్వూ మాయమైయ్యాయి. రావుకు ఆశ్చర్యం వేసింది.

చిన్ని భోజనం చేస్తూంది. రావు పరిశీలించాడు పప్పుచారు అన్నం తింది. తనకు వేపుడు కూర, పెరుగు, పచ్చళ్ళు, అప్పడాలు - యింకా ఎన్నో పెట్టారు - మరి చిన్ని భోజనం అంతేనా!

పదిగంటలు రాత్రి దాటకుండానే చిన్ని మాయమయింది. శైలజ రావుతో కబుర్లు చెబుతూనేవుంది. 'భోజనం చేయగానే అది నిద్రపోతుంది' అన్ని చిన్ని గురించి శైలజ నవ్వుతూ చెప్పింది.

ఎక్కడ పడుకుంది చిన్ని? శైలజ గదిలో నేలమీద దుప్పటివేసుకుంది. రాత్రి శైలజ పాప ఏడుస్తూంటే, లేచి ఆడించింది. ప్రొద్దున్నే చద్దన్నం తిని స్కూలుకు వెళ్ళిపోయింది. చిన్ని మానసిక తత్వం అర్థం చేసుకున్న రావు చాలా బాధపడ్డాడు. బహుశా చిన్ని ఇక్కడ సుఖంగా లేదు కాబోలు అనుకున్నాడు రావు.

మర్నాడు వచ్చి డాక్టరు లక్ష్మిని కలిసి విషయం చెప్పాడు రావు. చిన్నిని వాళ్ళింట్లో వుంచడం అంత మంచిది కాదేమో అన్నాడు రావు. ఆమె జాతకం ప్రకారం ఆ పిల్ల చాలా గొప్ప పిల్ల ఔతుంది అన్నాడు రావు.

డాక్టరు లక్ష్మి గుండెల్లో ఏదో త్రిప్పు. తల తిరిగిపోయింది 'చిన్ని సుఖంగా లేదా?' బాధపడింది లక్ష్మి. శైలజకు టెలిఫోన్ చేసి, తక్షణం చిన్నిని పంపించేయమంది డాక్టరు లక్ష్మి.

శైలజ గతుక్కుమంది. అసలు దత్తత చేసుకుందామా చిన్నిని అని అనుకుని తర్వాత మానేసింది. ఎదుగుతున్న తన పిల్లలకు నమ్మకమైన యింటి పనిమనిషిలా చిన్నిని తన దగ్గర వుంచుకోవచ్చు ననుకుంది. అందుకే చదువు సరిగా చెప్పించక, పనిపిల్లలా భోజనం పెట్టి హీనంగా చూసింది చిన్నిని శైలజ.

చిన్నిని పంపేయమంటే, తన పిల్లల్ని చూసేవారెవరూ అంత నమ్మకంగా పనిపిల్లను కుదుర్చుకోవాలంటే ఎంతో ఖర్చు.

శైలజ చిన్నిని పంపడం ఆలస్యం చేసింది. అయినా, ఇంక తప్పనిసరిగా చిన్నిని పంపించేసింది డాక్టరు లక్ష్మి పట్టువల్ల.

ఒంటినిండా పుళ్ళు. పళ్ళు ఊడిపోయాయి. తల జుట్టు పూర్తిగా తరిగి పోయింది. కళ్ళు గుంటల్లా తయారయ్యాయి. నవ్వు పేలవంగా వుంది. శైలజ నుంచి వచ్చినరోజు ప్రొద్దున్న తిన్న టిఫినుతప్ప రాత్రిదాకా ఏం తినలేదు చిన్ని. డాక్టరు లక్ష్మి గుండె కరిగిపోయింది. ఎన్నిసార్లు కౌగిలించుకుందో, ముద్దుపెట్టుకుందో చిన్నిని - ఆమెకే తెలియదు,

ఒక నెల గడిచింది - మెల్లిగా చిన్ని ఆరోగ్యం సరిచేసింది డాక్టరు లక్ష్మి. చిన్ని ఆరోగ్యం పుంజుకుని కళకళలాడుతూ కనిపించింది. చదువులో మొదటి ర్యాంకు తెచ్చుకుంది. డాక్టరు లక్ష్మి, చిన్ని విడిపోలేని తల్లీకూతుళ్ళల్లా ఎంతో ఆనందంగా వుంటున్నారు.

కాలక్రమంలో చిన్నిద్వారా అసలు విషయాలు తెలిసాయి. చలిలో చన్నీళ్ళు, పప్పుచారు నిత్యభోజనం. యిష్టమైనవేవీ పెట్టకపోవడం. పిల్లలు పారేసిన ఎంగిలి చాక్లెట్లు పెట్టడం, పిల్లలకు తుడిచే తువ్వాళ్ళ కిట్టు మోయడం, స్కూలు వేసి ఓ ప్రైవేటు టీచరు వద్దకు చదువుకు పంపడం, ఇంట్లో అందరూ దిక్కుమాలిన పిల్లా అని తిట్టడం, పాడైపోయినవి బలవంతంగా తినమనడం - యివి చిన్ని ఓ సంవత్సరం అనుభవించిన బాధలు. రాత్రి భయమేసి 'అమ్మా' డా॥ లక్ష్మిని తలచుకుని ఒంటరిగా ఏడ్వడం - ఇటువంటి చిన్ని జీవితం తెలుసున్న డా॥ లక్ష్మి హృదయం ద్రవించి పోయింది.

'అనాధ పిల్ల దైవ ప్రసాదం. నా కన్న బిడ్డకంటె ఎక్కువ' అనుకుంది డా॥ లక్ష్మి.

ఓ రోజు చిన్ని అడిగింది -

'మా అమ్మా నాన్నా ఎవరు?' అని.

'నేనేనమ్మా నీ అమ్మను!' అంది డాక్టరు లక్ష్మి.

'కాదటగా? నన్ను ఎక్కణ్ణుంచో తెచ్చుకున్నారటగా? అమ్మా! నువ్వంటే నాకిష్టం. నువ్వులేనిదే ఉండలేనమ్మా! నువ్వు నాకు కావాలి' అని ఓ రోజు ఏడ్చింది చిన్ని. డాక్టరు లక్ష్మి కూడా ప్రేమతో కన్నీరు పెట్టుకుంది.

కన్నకూతురు శైలజ ప్రవర్తన కన్న కొడుకు భార్య ఎత్తిపొడుపులు 'మీరు చిన్నిని పెంచడం గ్రేట్' అన్న మాటలు డాక్టరు లక్ష్మి చెవులలో మారుమ్రోగాయి.

తన తర్వాత చిన్నిని వాళ్ళెవరూ ప్రేమగా చూడరని నిర్ణయించుకుంది డా॥ లక్ష్మి. కాని, చిన్నిని ఆనందంగా, ఆరోగ్యంగా, భద్రంగా వుంచాలి - నేనేం చెయ్యాలి అనుకుంది డాక్టరు లక్ష్మి.

'రావుగారూ! చిన్నిని నేను దత్తత తీసుకుంటాను - కాగితాలు రాయండి- చిన్ని నా స్వంత కూతురు కావాలి' అంది డాక్టరు లక్ష్మి. తన కన్నబిడ్డలు తనకు అన్నివిధాల దూరమైన వాతావరణం వెలిసినట్లు అనుభూతులు సంపాదించింది డాక్టరు లక్ష్మి. కొడుకు కోడలు తన్ను నిర్లక్ష్యం చేస్తున్నారు. కూతురు సంపదల మత్తులో తన్ను మరిచిపోయింది. చిన్ని సాన్నిహిత్యం ఆమెకు సేద కలిగించింది. 'ఇకనుంచి నువ్వు నా స్వంత కూతురివమ్మా చిన్నీ!' అంది డాక్టర్ లక్ష్మి. 'అమ్మా!' అంటూ చిన్ని డాక్టరు లక్ష్మిని కౌగిలించుకుని ఆనందంగా ముద్దుల వర్షంతో నింపేసింది. *



